# చదువు

• నవల •

కొడవటిగంటి కుటుంబరావు

సంపాదకుడు

కేతు విశ్వనాథరెడ్డి



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,

హైదరాబాద్ - 500 001. ఆం.ప్ర.

CHADUVU by *Kodavatiganti Kutumba Rao*

ప్రచురణ నెం. : 2350/2111 R

ప్రతులు : 1000

గత ముద్రణలు : 1982, 1986, 1990, 1992, 1998

ఆరవ ముద్రణ జూన్, 2004.



ముఖచిత్రం: డాక్టర్ బాపు

**వెల: రూ.75-00**

ప్రతులకు : **విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,**
విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాద్-500 001.
E-mail: visalaandhraph@yahoo.com
**విశాలాంధ్ర బుక్ హౌస్,**
(అబిడ్స్, సుల్తాన్‌బజార్) హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం, కాకినాడ.



ముద్రణ: **శ్రీకళాంజలి గ్రాఫిక్స్**, హిమాయత్‌నగర్, హైదరాబాదు.

# భూమిక

"విద్య అంటే జ్ఞానం సంపాదించటం. జ్ఞానం రెండు విధాలు. పుస్తక జ్ఞానమూ, అనుభవ జ్ఞానమూ. ఈ రెండు రకాల జ్ఞానమూ విద్యద్వారా లభ్యం కావాలి."

**కె.కె. 'విద్యావిధానాలు' ఉపాధ్యాయ్లు,**
**ఫిబ్రవరి 1974.**

నవలా రచనలో సంఘ జీవితానికీ, సంఘ చరిత్రకూ, వాస్తవికతకూ ప్రాముఖ్యమిచ్చిన తెలుగు నవలా రచయితల్లో కొడవటిగంటి కుటుంబరావు అగ్రగణ్యులు. ఆయన రాసిన నవలలూ నవలికలూ: కులంలేని మనిషి(1942), మారుపేర్లు(1943), అరుణోదయం(1946), చదువు(1952), ప్రేమించిన మనిషి, పంచ కళ్యాణి(1957), బెదిరిన మనుషులు(1959), గడ్డురోజులు, వారసత్వం, సరితాదేవి డైరీ, జీవితం(1962), ఎండ మావులు, తార, కొత్త కోడలు, కొత్త అల్లుడు(1962), బ్రతుకు భయం(1964), అనామిక(1966). తిమింగలంవేట, ఐశ్వర్యం(1967), అనుభవం(1970). యీ యిరవైకాక నవలికలుగా పరిగణింప దగిన పెద్ద కథల జాబితాలోనివి; నీకేం కావాలి?, ఆడజన్మ, సవతితల్లి, మారిన జీవితం, కురూపి.

వీటిలో మనదేశ చరిత్రలో అత్యంత కీలకమైన యీ శతాబ్ది తొలియాభై యేళ్ళ సామాజిక చరిత్రను ప్రధానంగా చిత్రించిన నవలలు అరుణోదయం, చదువు, గడ్డురోజులు, అనుభవం. అరుణోదయంలో 1920-1945 మధ్య కాలంలోని యిరవై ఐదేళ్ళ సామాజిక చరిత్రనూ, చదువులో 1915-1935 దశలోని యిరవైయేళ్ళ సంఘ చరిత్రనూ, గడ్డు రోజులలో ఆర్థిక కాటకం, 1929-1934 రోజుల సామాజిక జీవితాన్నీ, అనుభవంలో 1900-1950 దశకు చెందిన యాభై యేళ్ళ సామాజిక వాతావరణాన్నీ కుటుంబరావు చిత్రించారు.

ఈ నవలల్లో కథాకాలం పునరుక్తమైనట్లు "ఒక నవలలోని కథాకాలం ఇంకొక దాని కథాకాలంలోకి పొర్లి" పోయినట్లు కన్పించడం నిజమే. ఇది కేవలం కథాకాలానికి సంబంధించిన సమస్య మాత్రమే. వీటిలో యితివృత్తం పునరుక్తం కాలేదు. పలురకాలైన పాత్రల అనుభవాలనుంచీ పాత్రల కుటుంబ సామాజిక సంబంధాలనుంచీ యాభైయేళ్ళ తెలుగు సామాజిక చరిత్ర యీ నవలల్లో బహుముఖంగా, వైవిధ్య సంపన్నంగా కన్పిస్తుంది. యీ యాభై యేళ్ళలో చారిత్రక

శక్తులు వివిధ వర్గాలపై, ఒకే వర్గంలోని విరుద్ధ స్వభావాలుగల వ్యక్తుల పై చూపిన ప్రభావం వీటిలో కన్పిస్తుంది. కాబట్టి యీ యితివృత్త వైవిధ్యంవల్ల ఆనాటి జీవితాన్ని మరింత విస్తారంగా, మరింత గాఢంగా అర్థం చేసుకోవడానికి వీలుంటుంది. అంతేకాదు, కుటుంబరావు యీ నవలల్లో తెలియజేసిన చరిత్ర అంతా 'తనకు పరిచయమైన' చరిత్ర, తన అనుభవంలోకి వచ్చిన చరిత్ర, తన ఎరుకలోని చరిత్ర. (ఈ నవలలో చీరాల పేరాల సత్యాగ్రహం, పుల్లరి సత్యాగ్రహం, అల్లూరి సీతారామారాజు మన్యం తిరుగుబాటు ప్రస్తావన లేకపోవడం ఆశ్చర్యం.)

ఆయన రాసిన నవలల్లో 'చదువు' పరిమాణంలో అన్ని నవలలకన్నా పెద్దది. నవల అంతా ఒక్కసారిగా రాయకపోవడం, నెలకు రెండు సెషన్లు (చక్రపాణి సంపాదకత్వంలోని ఆంధ్రజ్యోతి మాసపత్రికలో) సీరియల్ కోసం రాస్తూపోవటం నవల పెరిగిపోవటానికి కారణమని రచయితే స్వయంగా చెప్పుకున్నారు. (కొడవటిగంటి కుటుంబరావుతో ఇంటర్వ్యూ. సృజన, నవంబరు 1969) నిజానికి కుటుంబరావు తీసుకున్న యితివృత్తమూ వాతావరణ చిత్రణే యీ నవల పెరిగిపోవటానికి ప్రధాన కారణంగా కన్పిస్తుంది. యీ నవలలోని ప్రధాన పాత్ర సుందరం హైస్కూలు చదువు గురించి చిత్రణ చేసినంత విస్తారంగా కాలేజీ, యూనివర్శిటీ జీవితాన్ని గురించి చేసినట్లయితే నవల మరింత పెరిగివుండేది కూడా. అయితే పరిమాణమే యీ నవల గొప్పదనానికి, తెలుగు నవలల్లో విశిష్టతకూ కారణంకాదు. 'చదువు' గొప్పదనం, విశిష్టతా తెలుగు వాతావరణ చిత్రణలో వున్నాయి; సజీవ పాత్ర నిర్మాణంలో వున్నాయి; చారిత్రిక వాస్తవికత వున్నాయి; విద్యాప్రస్థానంలో సమాజ స్వరూపాన్ని గురించిన జ్ఞానం - సమస్త చారిత్రక వైరుధ్యాలతో పాత్రల అంతర్వైరుధ్యాలతో - ఏవిధంగా అభివృద్ధి చెందుతుందో చిత్రించడంలో వున్నాయి. కథన శిల్పం, శైలి వగైరా నవలా లక్షణాలు సరేసరి.

చదువు నవలలో 1915-1935 చారిత్రక కాలంలోని రాజకీయ, ఆర్థిక, సామాజిక. సాంస్కృతిక పరిస్థితుల నేపథ్యంలో ప్రధానంగా గుంటూరు జిల్లాకు చెందిన మధ్యతరగతి కుటుంబాలు, వాటిలోని రెండు తరాల చరిత్ర కన్పిస్తుంది.

మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభమయ్యే ముందు యీ నవలా కాలం మొదలవుతుంది. అప్పటికి వందేమాతరం ఉద్యమదశ గడిచింది. మరి కొన్నాళ్లకి పంజాబ్‌లో రౌలట్ చట్టం అమలులోనికి వచ్చింది; జలియన్ వాలాబాగ్ హత్యాకాండ విషయం తెలుగు గడ్డను కుదిపింది. జాతీయోద్యమంలో మితవాద దశ అనంతరం వచ్చిన తీవ్రవాద దశ నాయకుడు బాలగంగాధర తిలక్ మరణించాడు. తీవ్రవాద జాతీయోద్యమ దశ మళ్ళీ మారింది. తిలక్ మహాశయుని చావు గురించి జనం మరిచారో లేదో గాంధీ ముందుకు వచ్చి సహాయనిరాకరణోద్యమం ప్రారంభించాడు. ఎవరినోట విన్నా గాంధీ పేరే. సత్యాగ్రహ మన్నమాటే. కలకత్తా కాంగ్రెసు (1920 సెప్టెంబరు 4) ప్రత్యేక సమావేశంలో గాంధీజీ సూచించిన అహింసాత్మక సహాయ నిరాకరణోద్యమ తీర్మానం అమలులోకి వచ్చింది. స్వదేశీ ఉద్యమం, విదేశ వస్తు బహిష్కారం, గ్రామసీమల్లో కూడా మంత్రమైంది. విద్యార్థులు విద్యాలయాలను

వదిలివేయడం, ప్రభుత్వోద్యోగులు ప్రభుత్వోద్యోగాలను మానివేయడం, న్యాయవాదులు బ్రిటీషు కోర్టులను త్యజించడం, జాతీయ విద్యాలయాలు నెలకొల్పడం, విదేశీ వస్త్ర దహనం చేయడం గాంధీ నాయకత్వంలో జరుగుతున్న జాతీయోద్యమ కార్యక్రమాలు. ఖద్దరుధారణ దేశభక్తి చిహ్నమైంది. మామూలు యిళ్ళలో కూడా రాట్నాలు తిరుగుతున్నాయి. జైలుకెళ్ళడం, సాహస కృత్యమైంది. 'మా కొద్దీ తెల్లదొరతనం' పాటతోపాటు 'మా కొద్దీ నల్లదొరతనం' అనే పాట కూడా కాంగ్రెసు సభాప్రాంగణంలో విన్పిస్తోంది. కాంగ్రెసు మీద గాంధీజీ ఆధిపత్యం రోజురోజుకూ బలపడుతోంది. ఉప్పు సత్యాగ్రహంతో మరింత బలపడింది. గాంధీజీ అహింసాత్మక జాతీయోద్యమ ధోరణి ప్రజాబాహుళ్యంలోకి చొచ్చుకొని పోతున్నప్పటికీ 1920 ప్రాంతాలనాటి చిత్తశుద్ధి పూర్వకమైన ఉద్యమదీక్ష సన్నగిల్లడం వల్లనైతేనేమి, సత్యాగ్రహాలు, అరెస్టులు, ఒక 'తంతు' కావడం వల్లనైతేనేమి, బ్రిటీషు ప్రభుత్వంతో మామూలు బెదిరింపులు, రాజీలు ప్రయోజనం లేదని భావించడం వల్లనైతేనేమి, వృద్ధనాయకత్వంపై యువతరానికి కలిగిన అసంతృప్తి వల్లనైతేనేమి, అంతర్జాతీయ ప్రభావాల వల్లనైతేనేమి మార్గాంతరాల కోసం అన్వేషణ ఆరంభమైంది. జాతీయోద్యమంలో హింసాత్మక ఉగ్రవాద రాజకీయ ధోరణి ముందుకంటె కూడా ప్రజ్వరిల్లింది. వైస్రాయిపై హత్యాప్రయత్నం జరిగింది. భగత్‌సింగ్, దత్తుపేర్లు దేశంలో కాక పుట్టించాయి ఈ మధ్యలో రాజకీయాల్లో ప్రవేశించిన హిందూ మత విలోమ చైతన్యం కూడా అప్పుడప్పుడు తన గొంతు విన్పిస్తూనేవుంది. గణేశ్ దామోదర సావర్కార్ వంటివారు అపర హిందూ రాష్ట్ర నిర్మాతలుగా ముందుకు వస్తున్నారు. సామ్యవాద సిద్ధాంతాలు ప్రాచుర్యం పొందాయి. జాతీయోద్యమంలో అంతర్వాహినిగా ఉన్నా, కమ్యూనిస్టు ఉద్యమం రూపొందింది. ఈ విధంగా జాతీయోద్యమంలో ప్రధానంగా నాలుగు పెద్దా చిన్నా పాయలు కన్పిస్తున్నాయి, అవి గాంధేయ ఆదర్శవాదం, సామ్యవాదం, జాతీయవిప్లవవాదం (టెర్రరిస్టు కార్యక్రమాలకు ప్రధానంగా పరిమితం, హిందూరాజ్యవాదం. గాంధేయ ఆదర్శవాదంలోని మరోపాయ నెహ్రూవంటి నాయకుల ఆచరణాత్మక ఆదర్శవాద జాతీయోద్యమ ధోరణి.

"ప్రపంచంలో యుద్ధానంతరం సంక్షోభం ఎట్లా ఉన్నది తెలిసే అవకాశం లేక తెలిసినా అది తమ జీవితాలను ఏవిధంగా స్పృశించేదీ అర్థంకాని పీడిత భారత ప్రజలలో చాలా తరగతులకు అవి మంచిరోజులు. జీవితం చాలారోజులు మంచానపడి తిరిగి కోలుకొన్నట్లుగా ఉన్నది. అదివరకులేని కొత్తరకం వస్తువులు, బట్టలు వచ్చాయి. జీవితంలో కొత్తచైతన్యం కన్పించింది." (చదువు 12వ అధ్యాయ ప్రారంభం) ఆర్థికంగా, గ్రామసీమల్లోని వ్యవసాయిక సమాజం నుంచీ మధ్యతరగతి వర్గం ఉద్భవించింది. "ఈ మధ్యతరగతి వర్గం పాశ్చాత్య విద్యవైపూ, పాశ్చాత్య భావాలవైపూ, ఆకర్షింపబడటానికి అవకాశాలు ఏర్పడినాయి. పాశ్చాత్య విద్యకు ప్రభుత్వ నౌకరి తప్ప పరమలక్ష్యం మరొకటి ఉండే అవకాశంలేదు." పట్టాణాభివృద్ధి సాగుతోంది. వ్యవసాయం అంతో యింతో ఉండి వృత్తి ఉద్యోగాలు చేసుకొనే

మధ్యతరగతి వర్గ ఆర్థిక జీవితం నానాటికి దిగజారిపోతున్నది. ఈ స్థితి 1929-34 మధ్య వచ్చిన ప్రపంచ వ్యాప్త ఆర్థిక మాంద్యంతో పరాకాష్ఠకు చేరుకొంది. ఇంట్లో ఉన్న వస్తువులను అమ్మి తినవలసిన పరిస్థితి కూడా ఏర్పడింది. ఒక పరిమిత సంసారానికి అవసరమైన ఇరవై రూపాయల సంపాదనే డిగ్రీ పొందిన యువకుడికి కూడాలేని దుస్థితి దాపురించింది.

సామాజిక పరిస్థితులను గమనించినట్లయితే కులధర్మాల పట్టుసడలుతున్నప్పటికీ సంప్రదాయం యొక్క బలం చావలేదు. వీరేశలింగం పంతులు, వున్నవ వంటివారు సాగించిన సంస్కరణోద్యమ ప్రభావం సమాజపు కూకటివేళ్ళలోకి చొచ్చుకుపోలేదు. స్త్రీ పునర్వివాహాలు చెయ్యడానికి చదువుకున్న వాళ్ళు కూడా భయపడే స్థితి వుంది. వితంతువుల వివాహాలు అతి గోప్యంగా జరుగుతున్నాయి. జరిగిన వివాహాలకు సంస్కారం పునాదిగా లేకపోవడంవల్ల ఫలప్రదం కావడం లేదు. శారదాచట్టాన్ని జాతీయోద్యమవీరులే అమలు పరచలేని స్థితిలో వున్నారు. కట్నాల సమస్య మధ్యతరగతి కుటుంబాలను ఆర్థికంగా కృంగదీస్తోంది. అస్పృస్యతా సమస్య సరేసరి.

సాంస్కృతికంగా తెలుగుదేశంలో కన్పించే మార్పులు: సర్కసులూ బయస్కోప్‌లూ, గ్రామఫోన్లూ, స్టేజీ నాటకాలు, పద్యాలూ, పాటలూ, మూకీ చలన చిత్రాలూ, అమెరికన్ స్టంటు చిత్రాలూ, సులభంగా అందుబాటులోని ఆధునిక తెలుగు సాహిత్యమూ, పాశ్చాత్య సాహిత్యమూ విద్యారంగంలో ప్రాథమిక విద్య యింకా అక్షరాభ్యాస ఆచారాల నుంచీ, వీథిబళ్ళ చదువులనుంచీ, వాటి అమానుష విద్యా శిక్షణ పద్ధతులనుంచీ, విముక్తం కాలేదు. హైస్కూలు నుంచి యూనివర్శిటీ స్థాయివరకు బ్రిటిషు వలసవాద విద్యావిధానమే అమలులోవుంది. మధ్యలో కొంత కాలం 'స్వరాజ్యం బడులు వెలసినా వాటిగతి మూణ్ణాళ్ళ ముచ్చటే. దేశీయ విద్య ఆరోజుల్లో వీథి బడుల్లో వల్లెవేసే విద్య. పాశ్చాత్య విద్యా విధానంలో వృత్తి విద్యకు ప్రాధాన్యంలేదు. లోకజ్ఞాన ప్రాధాన్యంలేదు. అది ప్రధానంగా ఉద్యోగాల విద్య, వ్యక్తివాదాన్ని పెంచే విద్య, జాతీయోద్యమ లక్ష్యాల్లో ఒకటైన జాతీయ విద్యకు ఒక దృఢమైన ఆర్థిక పునాదిలేదు. మొత్తం మీద విద్య ప్రజా జీవితానికి అనుగుణంగా లేదు. పుస్తక జ్ఞానం దారి పుస్తక జ్ఞానానిదే. అనుభవ జ్ఞానం దారి అనుభవ జ్ఞానానిదే. 'చదువు' నవలలో రచయిత పరామర్శించిన రాజకీయ, ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక వాతావరణం స్థూలంగా యిది.

ఈ పరిస్థితులలో ప్రచలితంగా వున్న భావాలు - ఒకవైపు భూస్వామ్య భావాలూ, మరొకవైపు ధనస్వామ్య భావాలూ, ఇంకొకవైపు ధనస్వామ్య భావగర్భంలోంచే పుడుతున్న సామ్యవాద భావాలు. అయితే ఈ దశలో ప్రధాన భావ వైషమ్యం, ప్రధాన భావ సంఘర్షణ భూస్వామ్య, ధనస్వామ్యాల మధ్యనే. యీ ఘర్షణ ప్రభావం అన్ని రంగాలమీద పడింది. యీ పరిస్థితులే, యీ భావాలే సన్నివేశ కల్పనలో పాత్ర చిత్రణలో నిర్ణాయక పాత్ర వహించాయి.

ఈ నవలలలో ప్రధానంగా కన్పించే కుటుంబాలు; సీతమ్మ, శ్రీమన్నారాయణ కుటుంబం, సుబ్బమ్మ కుటుంబం, ఆదినారాయణ కుటుంబం, శేషగిరి కుటుంబం, పార్వతీశం కుటుంబం, శ్యామల కుటుంబం. ఈ కుటుంబాల్లో ఒక్క శ్యామల కుటుంబమే మద్రాసు నగర జీవితంలోని బడాయి మధ్యతరగతి కుటుంబం. మిగతా కుటుంబాలన్నీ గ్రామీణ, వ్యవసాయ సమాజంలో పేర్లున్న పట్టణ మధ్యతరగతి కుటుంబాలు. వీళ్ళ జీవితాల్లోనే కాకుండా నవలలో కన్పించే ఉపాధ్యాయులూ, మరికొందరు యువతీ యువకుల భావధోరణులు యీ నవలలో కన్పిస్తాయి. నవలలో కింది వర్గానికి చెందిన కుటుంబాల ప్రస్తావన ఒకటి రెండు చోట్ల లీలగా మాత్రమే కన్పిస్తుంది. (మేదరి, గొల్ల పిల్లలు). ప్రధాన భావ సంఘర్షణను యీ కుటుంబ జీవితాలూ, వీటితో సామాజిక సంబంధమున్న యితర వ్యక్తుల ద్వారా కుటుంబరావు చిత్రించారు. ఈ నవలలో భూస్వామ్య ధర్మాలకు ప్రతినిధులు సుబ్బమ్మ, రాఘవయ్య, మార్కండేయులు. విద్య విషయంలో మాత్రమే భూస్వామ్య ధర్మాల నుంచి విముక్తమైన పాత్ర సీతమ్మ. భూస్వామ్య లక్షణాలు కొన్ని వుండినా ధనస్వామ్య ధర్మాలే అధికంగావున్న ద్వంద్వ మనస్తత్వపాత్ర శేషగిరి. ధనస్వామ్యం నుంచి సామ్యవాద దశకు వెళ్ళే సంధి దశలో క్రియాశీలమైన పాత్రలు శాస్త్రి, రంగారావు. అంతర్ముఖత్వమున్న బుద్ధిజీవి సుందరం: నాగేశ్వరరావు పరిమితమైన యింగ్లీషు చదువుద్వారా ఉద్యోగం పరమావధిగా యెంచుకున్న 'వేతన శర్మ', కళ వ్యాపారంగా మారేదశలో పుట్టుకొచ్చిన కొత్తరకం వృత్తి కళాకారుడు నరుసు. ఈ వైవిధ్యపూరితమైన కుటుంబ జీవిత చిత్రణలో, సామాజిక జీవిత చిత్రణలో, పాత్ర చిత్రణలో కుటుంబరావు తన దృష్టిని కేంద్రీకరించింది ప్రధానంగా సుందరం కుటుంబంమీద. ఆ కుటుంబంలోని తల్లీబిడ్డలైన సీతమ్మ సుందరంమీద. తల్లి సీతమ్మ పాత తరానికి ప్రతినిధి. సుందరం కొత్త తరానికి ప్రతినిధి. 'చదువు' మొదటి భాగంలో పాతతరానికి చెందిన సీతమ్మ ప్రాముఖ్యం కన్పిస్తుంది. రానురాను సుందరం పాత్ర ప్రాముఖ్యానికి వస్తుంది. నవలాంతంలో ఆర్థిక మాంద్యపు రోజుల్లో అక్షరాలు నేర్చుకొనే మూడోతరం ప్రతినిధి సుందరం కొడుకు కనిపిస్తాడు. తరాల మధ్య యీ అంతరం, కొత్తతరం ఆవిర్భావం - నవలలో కన్పించే భిన్నతరాల వ్యక్తుల ద్వారా కుటుంబరావు సూచించారు. సాంఘిక పరిణామ చరిత్రలో ఈ అంతరాలమధ్య అగాధాలూ, సంఘర్షణలూ, నూతన తరం ఆవిర్భావం అనివార్యం అనే అంశాన్ని ఆయన నిరూపించారు. ఈ నిరూపణలో పుస్తక జ్ఞానానికీ, అనుభవ జ్ఞానానికీ వైరుధ్యంగల పాత్రను ఆయన చిత్రించారు. వాటి సమన్వయం లేకపోయినప్పుడు అవాస్తవిక దృక్పథం అలవడుతుందని సూచించారు.

ఈ నవలలో 'సుందరం' కీలకపాత్ర - ఇతివృత్తంలోని ప్రధాన సంఘటనలన్నీ సుందరం విద్యాప్రస్థానంతో, ఆత్మవికాసంతో ముడిపడివున్నాయి. కాబట్టి సుందరంపాత్ర మూలంగా జ్ఞానం సమాజం నుంచి ఏవిధంగా అలవడుతుందో, అది సామాజిక చరిత్రలో అంతర్భాగంగా ఏ విధంగా

పరిణమిస్తుందో కుటుంబరావు 'చదువు' నవలలో తెలియచేశారు. స్పందనశక్తీ, సున్నిత హృదయమూ, సంవేదనా, జ్ఞాన దాహమూ వున్న మధ్యతరగతి బుద్ధిజీవి అయిన యువకుని వ్యక్తిత్వం రూపొందిన క్రమాన్ని యీ నవలలో చిత్రించారు. భావాలు ఏవిధంగా అలవడుతాయో, ఆ భావాలలోని వైరుధ్యాలు యేమిటో, అవి వ్యక్తిత్వ వికాసంలో ఎలాటి పాత్ర వహిస్తాయో యీ నవలలో నిరూపించారు.

సుందరానికి అయిదో యేడు నుండి ఇరవై అయిదోయేడు దాకా సమకూడిన భావ సంచయం మొదట్లో తల్లి నుంచి సమకూరింది. తర్వాత యిరుగుపొరుగువారి నుంచీ, సహవిద్యార్థులనుంచీ, ఉపాధ్యాయులనుంచీ, చదివే ఫార్మల్ విద్యకు సంబంధించిన పాఠ్యగ్రంథాల నుంచీ, సొంత అభిరుచితో చదివే ఆధునిక సాహిత్య గ్రంథాలనుంచీ, చూసే కళాప్రదర్శనల నుంచీ, తాను ప్రత్యక్షంగా పొందే అనుభవాలనుంచీ, పరోక్షంగా గ్రహించే సామాజిక అనుభవాలనుంచీ ఏర్పడింది. ఈ క్రమంలో వివిధ చైతన్యాలు - ఆర్థిక, రాజకీయ, సాంఘిక, నైతిక తాత్త్విక కళాచైతన్యాలు - వ్యక్తి చైతన్యంలో భాగంగా ఏవిధంగా లభిస్తాయో, ఆ లభించిన రకరకాల చైతన్యం మూర్తివంతమైన మధ్యతరగతి రచయిత చైతన్యంగా ఏ విధంగా రూపొందుతుందో సుందరం పాత్ర నిరూపిస్తుంది.

ఒక నిర్దిష్ట సమాజంలో, స్థలకాలాలకి పరిమితమై అభివృద్ధి చెందిన భావజాలం పిల్లలకి పెద్దల ద్వారా అలవడుతుంది. బడుల్లో పద్ధతి ప్రకారం పాఠ్యాంశాలకు లోబడియిచ్చే శిక్షణకు ముందు పిల్లలు 'యత్నదోష పద్ధతి' (trial and error method) లోనే చదువు నేర్చుకుంటారు. యీ అప్రయత్న పూర్వక జ్ఞానార్జన, బడుల్లో ప్రవేశిస్తూనే ప్రయత్నపూర్వక జ్ఞానార్జనగా మారుతుంది. వ్యక్తిలో అతి సున్నితమైన మానసిక పరిణామాలను కలుగజేస్తుంది. ఈ దశలో వ్యక్తి ఎదుగుదల జరుగుతుంది. ఇటువంటి ఎదుగుదల సమాంతర రేఖల్లో సాగదు. అది తదితర సామాజిక ప్రభావాలచేత గతితార్కిక పద్ధతిలో సాగుతుంది. అంటే మనిషికీ, సామాజిక పరిసరాలకూ మధ్య నిరంతరం పరస్పర సంబంధం వుంటుంది. సమాజం మనిషినీ, మనిషి సమాజాన్నీ ప్రభావితం చేస్తుంటారు. సామాజిక మార్పువల్ల మనిషి మారుతాడు. మనిషి చైతన్యంలో వచ్చిన మార్పు వల్ల సమాజం మార్పుబడుతుంది. (ఈ మొత్తం పరివర్తనాక్రమం, విద్యార్థుల జ్ఞానార్జనా పరిధిని ప్రభావితం చేస్తుంది. విద్యార్థి యొక్క భావుకత ఎంత ఎక్కువగా వుంటే, ఈ ప్రభావం కూడా అంత అధికంగా వుంటుంది.) ఈ గతితార్కిక క్రమాన్ని కుటుంబరావు యీ నవలలో చక్కగా చిత్రించారు.

తన అక్షరాభ్యాసం మొదలుకొని తన కొడుకు అక్షరాభ్యాసంతో ముగిసే ఇరవై సంవత్సరాల వ్యక్తి జీవిత కథాఘటనల మధ్య కాలంలో జరిగిన సుందరం బౌద్ధిక జీవిత పరిణామాన్ని యీ పద్ధతిలోనే కుటుంబరావు చిత్రించారు.

ఈ బౌద్ధిక జీవిత పరిణామం ఒక పీరియడ్ నవలలో* జరిగినట్లు జరుగుతుంది.

పీరియడ్ నవల చారిత్రక నవలే. కొన్ని విశిష్ట లక్షణాలుండే ఒక ప్రత్యేక కాలదశలోని ఒక వ్యక్తి జీవితాన్నీ, చారిత్రక స్థితిగతులనో చిత్రించే ప్రయత్నం పీరియడ్ నవల చేస్తుంది కాబట్టి, చారిత్రక నవలకు ఉండవలసిన చారిత్రకతా, దేశకాల నిర్దిష్టతా, చారిత్రక శక్తుల చిత్రణా, చారిత్రక వాతావరణ చిత్రణా నవలలో చిత్రితమైన చరిత్ర తన గతచరిత్రే అన్న స్పృహను కలుగజేసే లక్షణమూ 'చదువు' నవలలో వున్నాయి.

ఈ నవలలో Apprentice నవలా లక్షణాలు సయితం లేకపోలేదు. Aprrentice నవల అంటే ``The Bildungsroman; Or Novel about upbringing and education, seems to have its begininigs in Goethe's work. Wilhem Meisters Lehryahre (1796) which is about the process by which a sensitive soul discovers its identity and its role in the big world. A story of the emergence of a personality and a talent, with its implicit motifs of struggle conflict, suffering and success, has an invetible appeal for the novelist. Many first novels are autobiographical and attempt to generalize the author's own adolescent experiences into a kind of universal symbol of the growing and learning processes" డికెన్స్ 'డేవిడ్ కాఫర్ ఫీల్డ్', 'గ్రేట్ ఎక్స్‌పెక్టేషన్స్' లాగా, హెచ్. జి. వెల్స్ 'ది డ్రీమ్' లాగా, జేమ్స్ జాయిస్ 'ది పోర్ట్రెట్ ఆఫ్ ది ఆర్టిస్ట్ యాజ్ ఎ యంగ్‌మేన్ 'లాగా, విలియం గోల్డింగ్ 'లార్డ్ ఆఫ్ ది ఫ్లయిస్' లాగా, అయితే 'చదువు' నవలలోని పాత్ర చిత్రణ భిన్న చారిత్రక శక్తులకు ప్రాతినిధ్యం వహించే పాత్ర చిత్రణే కానీ కేవలం ఏకపాత్ర నిర్దిష్టమైన పాత్రచిత్రణకాదు. సుందరం

'చదువు'ను సంఘ చారిత్రాత్మక నవలగా, ఆత్మ చరిత్ర నవలగా శ్రీ కె.వి. రమణారెడ్డిగారు భావించారు. (చూ. నవలాకుటుంబం, శ్రీ కొడవటిగంటి నవలలు – ఒక పరిశీలన, భారతి, ఫిబ్రవరి, 1966, పుట. 19)

'చదువు'ను కుటుంబరావు నవలలన్నింటికి ఒక ముఖ్యమైన ప్రతినిధి నవలగా తీసుకోవచ్చు, అనీ 'చదువు' ను కుటుంబరావు ఆత్మకథా నవల (Autobiographical novel) అనవచ్చుననీ శ్రీ నవీన్ అభిప్రాయపడ్డారు. (చూ. కొడవటిగంటి కుటుంబరావు నవలలు – ఒక పరిశీలన. వేకువ, జూలై – సెప్టెంబరు 1971 పుట. 9)

'చదువును'ను కొడవటిగంటి కుటుంబరావు ప్రాతినిధ్య నవల అని కాత్యాయని విద్మహే (చూ. సృజన, 1980 నవంబర్, పుట. 42).

'చదువు'లో రచయిత స్వీయ అనుభవాలు ఉన్నాయని అభిప్రాయపడుతూ దాన్ని సంఘచారిత్రాత్మక నవలగా, ఆత్మచరిత నవలగా, ప్రాతినిధ్య నవలగా శ్రీ టి.జి.ఆర్. ప్రసాద్ భావించారు. (చూడు – చదువు ఒక పరామర్శ, ఎస్. వి. యు, ఎం. ఫిల్. పట్టా పొందిన లఘుసిద్ధాంత వ్యాసం. అముద్రితం).

ఈ లక్షణాల వివరణకు చూడండి – రా.రా. కొల్లాయి గట్టితేనేమి?, సారస్వత వివేచన, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 1976 పుట. 15.18.

కీలకపాత్ర అయినప్పటికీ సుందరమే నవలకు పరమావధి కాదు. నవల ఆద్యంతాలూ యీ విషయాన్ని స్పష్టం చేస్తాయి.

ఈ నవలలో భూస్వామ్య, ధనస్వామ్య వ్యవస్థలకు ప్రాతినిధ్యం వహించే పాత్రల మధ్య భావాల మధ్య ఘర్షణను కుటుంబరావు అత్యంత తీవ్రరూపంలో చిత్రించలేదు. ఎందుకంటే మధ్యతరగతిలో ఘర్షణ సాధారణంగా అత్యంత తీవ్రరూపంలో ఉండదు. అత్యంత తీవ్రరూపంలో లేకపోయినా ఆ ఘర్షణ వాస్తవికంగానూ, విశ్వసనీయంగానూ పాఠకులకు అనుభూతం చెయ్యడానికి పాత్రల సామాజిక సంబంధాలను, ప్రవర్తనలోని సంకీర్ణతనూ, మార్పునూ కుటుంబరావు చిత్రించారు.

సుందరం పెళ్ళి సందర్భంలో గానీ, సుందరం మేనమామ శేషగిరి కుమార్తె పెళ్ళి సందర్భంలో గానీ, శేషగిరి తన గ్రామంలో స్వరాజ్యం బడిలో అస్పృశ్యులను చేర్చుకోవాలన్నప్పుడుగానీ తీవ్రమైన ఘర్షణ మనకు కనిపించదు. సుందరం కట్నంతో బాల్య వివాహం చేసుకుంటాడు. మేనమామ శేషగిరి కూతురికి బాల్య వివాహం చేశాడు. "కాకులు పొడిచినట్టు పొడుస్తుంటే ఏం చెయ్యను? చెబితే వినరాయె. ఈ బాల్య వివాహాలూ, దిక్కుమాలిన ఆచారాలూ మానలేకపోతే మనకు స్వరాజ్యం ఎందుకంట! ఛీ! ఛీ! మన గతి యింతే. గాంధీ మహాత్ముడింత ఉద్యమం నడపటమేమిటి? ఈ పేద సుద్దలు ఉన్నచోటే ఉంటామనటం ఏమిటి? అని వాపోతూ మార్పుకోసం కృషిచేసే శక్తి గుర్తించి కూడా కూతురికి బాల్య వివాహం చేస్తాడు. జాతీయ పాఠశాలలో అస్పృశ్యుల పిల్లల్ని చేర్చుకుందామన్నందుకు వెలివేసినంత పనిచేస్తే రాజీపడిపోతాడు.

ఈ ద్వంద్వాత్మక వైఖరి జాతీయోద్యమంలో జైళ్ళకు వెళ్ళే వ్యక్తుల సామూహిక ప్రవర్తనలో కూడా వెల్లడవుతుంది. శాస్త్రి, రంగారావులు మాత్రమే కొంతవరకు ఈ వైఖరికి అతీతంగా కన్పిస్తారు.

ఘర్షణ తీవ్రంగా లేనప్పటికీ, అంతర్వైరుధ్యాలతోకూడిన పాత్రల అంతరగింక ఘర్షణ ప్రాధాన్యం వహించినప్పటికీ యిది చారిత్రకంగా 'చదువు' ద్వారా సాగే అనివార్యమైన ఘర్షణ, భూస్వామ్య సంస్కారాన్నేగాక, ధనస్వామ్య సంస్కారాన్ని కూడా అధిగమించి వెళ్ళే ఘర్షణ అన్న స్పృహను పాత్రలు కలుగజేస్తాయి. ఈ స్పృహే యీ నవలను తెలుగు నవలా సాహిత్యంలో చారిత్రక వాస్తవికత వున్న ఒక అత్యుత్తమ నవలగా తీర్చిదిద్దింది.

**కేతు విశ్వనాథ రెడ్డి**
సంపాదకుడు

# జీవిత రేఖలు

కొడవటిగంటి కుటుంబరావు 1909 అక్టోబరు 28వ తేదీన గుంటూరు జిల్లా తెనాలిలో జన్మించారు

స్కూలు ఫైనలు వరకు తెనాలిలో చదువుకున్నారు.

1914లో తండ్రీ, 1920లో తల్లీ చనిపోయారు. పెత్తండ్రి సంరక్షణతో బాల్యం గడించింది.

ప్రముఖ కవి, కథకుడు, సాహితి సమితి ముఖ్యుడు, తన అన్నగారైన వెంకట సుబ్బయ్యగారు 1921లో ఇల్లు విడిచి లోకం మీదికి వెళ్ళిపోయారు. వారి సాహితీ మిత్రులతోటి ఏర్పడిన సన్నిహిత పరిచయాలు కుటుంబరావులో సాహిత్యంపట్ల ఆసక్తినీ, సృజనకు సంబంధించిన జిజ్ఞాసనీ రేకెత్తించాయి.

1925 స్కూలు ఫైనలు పరీక్షల సమయంలో మెట్టా పద్మావతితో విజయవాడలో సంప్రదాయ బాల్య వివాహం జరిగింది.

1925-27 మధ్య గుంటూరు ఎ.సి. కాలేజీలో ఇంటరు, 1927-29 మధ్య విజయనగరం మహారాజా కాలేజీలో బి.ఎ. ఫిజిక్సు చదివారు.

అంతర్జాతీయ సాహిత్యంతో విశేష పరిచయాన్ని కల్గి వుండటంతో సమకాలీన తెలుగు కథా వాఙ్మయం పట్ల అసంతృప్తిచెంది మంచి కథలు రాయాలన్న పట్టుదలతో సృజనాత్మక సాహిత్య సాధన చేశారు.

1929లో కాశీ హిందూ విశ్వవిద్యాలయంలో ఎం.ఎస్‌సి. ఫిజిక్సులో చేరారు. ఆ కాలంలో శాసనోల్లంఘనోద్యమంకన్న టెర్రరిస్టు ఉద్యమంవల్ల ఎక్కువ ఆకర్షితులయ్యారు.

1930లో కుటుంబరావు తొలిరచన 'సినిమా' ఓరియంటల్ వీక్లీలో ప్రచురితమైంది. మొదటికథ 'ప్రాణాధికం' 1931లో గృహలక్ష్మి మాసపత్రికలో అగ్రస్థానం పొందింది.

అంతర్జాతీయంగా అలుముకున్న ఆర్థిక సంక్షోభం తాడికిడో ఎం.ఎస్.సి. రెండో సంవత్సరం చదువు ఆగిపోయింది.

1931లో కొంతకాలం పాటు వరంగల్‌లో వుండి ట్యూషన్లు చెప్పారు.

చక్రపాణి, పిల్లలమర్రి బాలకృష్ణశాస్త్రి, పిల్లలమర్రి సాంబశివరావులతో కలిసి యువప్రెస్‌ని స్థాపించి, యువపత్రికను ప్రారంభించారు.

ఆయన మొదటి కథాసంపుటాలు 'కారుణ్యం' (1937). 'ఇల్లరికం - (1937), స్వగతం (1939) వచ్చాయి.

1939లో భార్య పద్మావతి మరణించింది.

1940-42ల్లో జరుక్‌శాస్త్రితో కలిసి ఆంధ్రపత్రికలో పనిచేశారు. 1942లో నాలుగు నెలలపాటు బొంబాయిలోని ఒక మెటల్ ఫ్యాక్టరీలో పనిచేశారు. జూలై 1942, జనవరి 1943 మధ్య సిమ్లాలో నేషనల్ వార్ క్రియేటివ్ పబ్లిసిటీ యూనిట్‌లో కాపీరైటరు ఉద్యోగం చేశారు. 1944లో జయపూర్‌లోని ఇన్‌స్పెక్టరేట్ ఆఫ్ మెటల్ అండ్ స్టీల్‌లో ఆరునెల్లపాటు ఫోర్మన్‌గా ఉన్నారు.

విజయనగరం అర్.డి.వో. అవసరాల జగన్నాధరావు కుమార్తెతో రెండవ పెళ్ళి, రెణ్ణెళ్ళ కాపరం తర్వాత తిరిగి భార్యావియోగం సంభవించాయి.

1945 నవంబరు 30వ తేదీన వరూధినితో రిజిష్టరు వివాహం జరిగింది.

1942లో మార్క్స్ "కాపిటల్" చదివారు.

బొంబాయి ఎయిర్ ఇండియా కార్యాలయంలో అకౌంట్సుక్లర్క్‌గా 1948లో మూడు నెలలు ఉద్యోగం చేశారు. అక్టోబరు 1948లో ఆంధ్రపత్రిక దినపత్రికలో చేరారు. 1950-51 ప్రాంతాల్లో వారపత్రిక సంపాదకత్వ బాధ్యతనుపొంది, ఆంధ్రపత్రికని ఒక సాహిత్య పత్రికగా తీర్చిదిద్దారు. 1951లో 'కినిమా' మాసపత్రిక సంపాదకత్వ బాధ్యతను కొన్నాళ్ళు నిర్వహించారు.

1952 జనవరి మొదటి తేదీనుండి చనిపోయే వరకు (మరణం 1980 17 సాయంత్రం 7-15 గం) చందమామలో పనిచేశారు.

1935-42 వరకు నవ్య సాహిత్య పరిషత్తులోనూ, 1943-70 వరకు అభ్యుదయ రచయితల సంఘంలోనూ, 1970 నుంచి చనిపోయేవరకు విప్లవ రచయితల సంఘంలోనూ సభ్యులుగా ఉన్నారు.

తెలుగునాట ప్రగతిశీల మేధావిగా, మహారచయితగా, సాహిత్యోద్యమశీలిగా. తెలుగువాళ్ళ అధునిక సంస్కృతీ పురోగమనానికి జీవిత పర్యంతం కృషి చేసిన కొడవటిగంటి కుటుంబరావు దాదాపు యాభైయేళ్ళ కాలంలో పదిపన్నెండువేల పేజీలకు మించిన సాహిత్యం రాశారు. నాలుగువందలకుపైగా కథలు, దాదాపు ఎనభై గల్పికలు - దాని రూపాంతరాలైన అల్పిక, బుల్లికథ, అభూతకల్పనలూ, యిరవై నవలలూ, వందదాకా రేడియో నాటికలు, రెండు, మూడు సినిమా స్క్రిప్టులు రాశారు. ఆరేడు వందలకు పైగా సాహిత్య, సాంస్కృతిక, వైజ్ఞానిక వ్యాసాలు, ఫీచర్లు, పుస్తక సమీక్షలు, పుస్తక పరిచయాలు రాశారు. ఎన్నిరకాల సాహిత్యం రాశారో ఆ రకాలన్నీ అనువదించారు.



# తన రచనల గురించి...

"ఒక కాలానికి చెందిన నవలల్ని చదివేస్తే ఆ కాలపు సాంఘిక చరిత్ర చాలావరకు తెలిసిపోతుంది. ఈ చరిత్ర ఏ ఒక నవల్లో ఉండటానికి వీల్లేదు. ఎందుచేతనంటే, నవలాకారుడు తనకు పరిచయం అయిన వాతావరణాన్ని, జీవితాన్ని, పాత్రలని మాత్రమే సృష్టించగలడు. ఉదాహరణకు 'చదువు' అన్న నవలలో డిప్రెషన్‌కు ముందు ఇరవై సంవత్సరాల సాంఘిక వాతావరణాన్ని చిత్రించ ప్రయత్నించాను. అదే కాలాన్ని తీసుకొని మరి యిరవై మంది యిరవై నవలలు రాయవచ్చు.

**'చిన్న నవలలు' కళాకేళి, అక్టోబరు 1969.**

"చదువు నవల నా ఆత్మకథా నవల కాదు. ఆ పాత్ర సెంటర్ కారక్టర్‌కి అంత ప్రాధాన్యత లేదు. సోషియల్ హిస్టరీకే ప్రాధాన్యం. ఎక్స్‌పీరియన్స్‌లు నావికావు. కానీ మిగిలిన చిత్రణ అంతా నేను చూసిందే."

"అభ్యుదయ సాహిత్యానికి సహాయంగా చదువు రాశాను. చదువు ఉద్యమ నవల కాదు."

**– టి.జి.ఆర్. ప్రసాద్, కొడవటిగంటితో చివరి ఇంటర్వ్యూ, ప్రజాసాహితి అక్టోబరు 1980.**

# చదువు

మధ్యాన్నం ఒంటిగంట నుంచి దాదాపు నాలుగు గంటలదాకా సీతమ్మకు విశ్రాంతి. నలుగురు అమ్మలక్కలు చేరి లోకాభిరామాయణం మాట్లాడడానికి అదే సమయం. ఈ లోకాభిరామాయణం అందరాడవాళ్ళకూ అవసరమేగాని, కొందరు దీని కోసం ఇతరుల దగ్గరికి వెళ్ళనవసరం లేకుండా సీతమ్మలాగా తమ దగ్గరికే ఇతరులను రప్పించుకోగలరు, మరికొందరు అమాయక స్త్రీలు సుబ్బమ్మలాగా రోజూ ఎవరో ఒకరియింట అటెండెన్సు వేయించుకోవలసిందే.

సుబ్బమ్మంటే సీతమ్మగారింట్లో పడమటి భాగంలో కాపరం ఉంటున్న లావుపాటి, నల్లటి ఆవిడ. ఇంకెవ్వరూ రాకపోయినా సుబ్బమ్మమటుకు రెండు గంటల లోపలే హాజరయేది. పూర్తిగా రెండు గంటలసేపు లోకాభిరామాయణం నడిచేది.

ఆడవాళ్ళ ముచ్చట్లను మగవాళ్ళెన్నటికీ పూర్తిగా అర్థం చేసుకోలేరు. నూటికీ, కోటికీ గాని ఇల్లు దాటిపోని సీతమ్మలూ, సుబ్బమ్మలూ, మాచమ్మలూ, కూచమ్మలూ రోజూ అంతంతసేపు ఏం మాట్లాడుకుంటారు? ఎంతో ఆప్యాయత గల స్నేహితులన్నా వుంటే పోనీ అనుకోవచ్చు. కాని ఈ ఆడవాళ్ళలో అవీ కనిపించవు. వాళ్ళు పెద్ద స్నేహాలు చెయ్యకుండానే రోజూ ఒకరికొకరు అంతులేని. విషయాలు చెప్పుకుంటారు.

ఏమిటీ విషయాలు? ఇవి తమకూ, తమవారికీ సంబంధించినవి కావచ్చు. ఇతరులకు సంబంధించినవి కావచ్చు. ఈ ఆడవాళ్ళు ఇళ్ళు దాటకపోయినా పై వాళ్ళు ఇంటికి వస్తారు. వాళ్ళు ఏవేవో వార్తలు తెస్తారు. ఎప్పుడైనా ఒక ఉత్తరం ఎక్కడి నుంచైనా రావచ్చు. వీటిని గురించి ఎన్నాళ్ళయినా మాట్లాడుకోవచ్చు. కాలక్షేపానికి నిత్యమూ కొత్త విషయాలుండాలని కూడా లేదు. చెప్పుకున్న విషయాలే మళ్ళీ మళ్ళీ చెప్పుకోవచ్చు.

ఈ చెప్పుకోవటం ఆడవాళ్ళ జీవితాలకూ, వ్యక్తిత్వాలకూ ఎంతో ముఖ్యం. ఇది వాళ్ళ చదువు. వాళ్ళ సాహిత్యం, వాళ్ళ తత్వజ్ఞానం, వాళ్ళ తపస్సు. నాలుగు

రోజులపాటు ఆడవాళ్ళను కలపకుండా చేస్తే, తాము ఎటువంటి బానిసత్వంలో ఉన్నదీ, కూపస్థమండూకాల్లాగా ఎట్లా జీవిస్తున్నదీ వాళ్ళకు తెలిసివస్తుంది.

❀ ❀ ❀ ❀

పక్క భాగంలో ఉండే సుబ్బమ్మ ఇవాళ ఇంట్లోలేదు. ఎవరో బంధువులింట్లో పిల్లవాడికి అక్షరాభ్యాసమైతే వాళ్ళంతా భోజనానికి వెళ్ళారు.

"సుబ్బమ్మగారూ, లక్ష్మీవాళ్ళంతా ఎక్కడికమ్మా పోతున్నారూ?" అని పొద్దున సుందరం తల్లిని అడిగాడు.

"వాళ్ళ బంధువులబ్బాయి నీవంటివాడే ఉన్నాట్ట. వాణ్ణి బళ్ళో వేస్తున్నారుట. అందుకని భోజనానికి పోతున్నారు" అన్నది సీతమ్మ.

సుందరం ఉత్సాహంతో "అమ్మా, నా అక్షరాభ్యాసానికి కూడా అందరూ భోజనానికొస్తారా?" అన్నాడు.

"ఎందుకు రార్రా? మనవాళ్ళంతా వస్తారు" అన్నది తల్లి.

సుందరం కాసేపు ఆలోచించి. "అయితే, అమ్మా, నా అక్షరాభ్యాసం ఎప్పుడూ?" అన్నాడు.

ఈ ప్రశ్న వస్తుందని సీతమ్మకు తెలుసు. ఎందుకంటే ఆవిడ చాలా మాసాలనుంచీ సుందరానికి చదువుమీద అంతులేని ఆసక్తి కలిగిస్తున్నది. తన ప్రయత్నం ఫలించి, సుందరం చదువంటే ఎప్పుడా ఎప్పుడా అని తహతహలాడటం కూడా ఆవిడ చూస్తున్నది. అయినప్పటికీ ఏ క్షణాన ఎవరు తన కొడుక్కు చదువంటే భయం కలిగేట్టూ, అసహ్యం పుట్టేట్టూ చేస్తారో అని ఆవిడ గుండెలు పీచుపీచు మంటూనే ఉన్నాయి.

ఎందుకంటే సీతమ్మ చూసినంతలో చాలా మందికి, పిల్లల్ని చదువంటే బెదర గొట్టటం చాతయినంతబాగా వాళ్ళకి చదువుమీద ఇష్టం కలిగించటం చాతకాదు. పిల్లలు చేసే అల్లరితో వేగలేక అనేకమంది తల్లులు, 'వెధవా, బళ్ళోవేస్తేగాని నీ పొగరణగదు.' అని పిల్లల్ని భయపెట్టటం ఆవిడ ఎరుగును. ఎంతో దూరం పోనవసరం లేదు. సీతమ్మ ఆడబడుచు కొడుకు బళ్ళోకి పోవటానికి కానీ, అర్ధణా లంచామిస్తుంది.

చదువు గురించి ఎవరుగాని అగౌరవంగా మాట్లాడినా, పిల్లలకి చదువుమీద భయమో, అనుమానమో, అలక్ష్యమో కలిగించినా సీతమ్మ భరించలేక పోయేది. ఆవిడకి చాలా చిన్నతనంలోనే చదువుమీద ఎక్కడలేని అభిమానమూ కలిగించారు. అవిడకు తల్లిదండ్రులు చదువు చెప్పించలేదు. అన్నలు చదువుకునే పుస్తకాల సహాయంతో తానే చదవటమూ, రాయటమూ నేర్చుకున్నది. ఆవిడ బంధువులందరూ ఆవిడ నీ విషయంలో చాలా మెచ్చుకునేవారు.

సీతమ్మ కాపురానికి వచ్చిన కాలంలో అత్తవారింట విశేషం పుస్తకాలుండేవి కావు. అవిడ మామగారి తాలూకు భాగవతం ఉండేది. వీలుదొరికినప్పుడల్లా ఆవిడ ఆ భాగవతం తీసి చదువుతూ ఉండేది. అందులో అనేక మాటలకు అర్థాలు

తెలియకపోయినా ఆవిడ నిరుత్సాహ పడకుండా చదివేది. పుస్తకాలు చదవటంలో సీతమ్మకున్న ఆసక్తిని అత్తవారివేపు వారు శ్లాఘించకపోగా ఎద్దేవకూడా చేసేవారు. కానీ ఆ భాగవతంలోనే ప్రహ్లాద చరిత్రలో ఉన్న "చదువని వాడజ్ఞుండగు"[1] అనే పద్యం సీతమ్మకు ఎంతో బలం చేకూరుస్తూ ఉండేది. ఒక్క సద్గుణమైనాలేని హిరణ్య కశిపుడికి చదువుమీద అంత గురి ఉన్నందుకు ఆవిడ ఆశ్చర్యపడేది.

"ఒక్కరోజు సుబ్బమ్మ లేకపోతే బొత్తిగా సందడిలేదు" అనుకున్నది సీతమ్మ. కాస్సేపు కన్ను మూద్దామని ప్రయత్నించింది. కాని పగటి నిద్ర, అలవాటులేని కారణంచేత పట్టలేదు. ఏంపని కల్పించుకుందామా అని ఆవిడ ఆలోచిస్తుండగా దొడ్లో కాలయాపన చేస్తున్న సుందరం పరిగెత్తుకుంటూవచ్చి, "అమ్మా! ఇంకో కొబ్బరిమట్ట పడింది. ఈనెలు తీద్దామా?" అన్నాడు.

సుందరం, తల్లి కూరిమి పిల్లవాడు. సీతమ్మ కొడుకును ఎక్కువ గారాబంచెయ్యకుండానే, వాడి అవసరాలను గురించి అందరికన్న ఎక్కువ శ్రద్ధ కనబరచి వాడి అభిమానం సంపాదించింది. తల్లుల్ని ఆరాధించే ఇతర పిల్లలల్లేనే సుందరం కూడా తనతల్లి ఏంచేసినా అందంగా ఉన్నట్టూహించుకునేవాడు. ఆవిడ ఏపనిచేసినా వాడికి చూడబుద్ధి అయ్యేది. ముఖ్యంగా తాపీగా కూర్చుని చేసేపనులంటే వాడికి మరీ యిష్టం. ఆవిడ కూరలు తరుగుతున్నా, లాంతర్లు తుడిచి నూనెపోస్తున్నా, దీపాలు వెలిగిస్తున్నా, పొయ్యిదగ్గర కూర్చుని వంటచేస్తున్నా ఏదో గొప్పదృశ్యం చూచినట్టు చూసేవాడు సుందరం. ఆ పనులన్నీ వాడికి కూడా చెయ్యాలని వుండేది. అటువంటి పనుల్లో తానుకూడా భాగం పంచుకోగలిగితే వాడి కంతకన్న ఏమీ అక్కర్లేదు. వాళ్ళమ్మ పుస్తకం చదువుతుంటే చూసి ఆనందించటంవల్లనే వాడికి చదువంటే ఇష్టం ఏర్పడి ఉండవచ్చు.

సుందరం తల్లికి సహాయపడగల పనులెన్ని ఉంటయి కనకా? కూరలు అందించటమూ, పొయ్యి విసిరిపెట్టటమూ అదయినా బొగ్గులపొయ్యి అయితేనే! కొబ్బరి ఈనెలు తీయటం అటువంటి పనుల్లో ఒకటి. ఇది అన్నప్పుడల్లా పడే పనికాదు. మూడు నాలుగు నెలల కొకసారిగాని ఈ అవకాశంరాదు. అందులో ఇవాళ తనతల్లి ఖాళీగా వుంది కూడాను.

"ఏమమ్మా, కొబ్బరీనెలు తియ్యొద్దూ?" అన్నాడు సుందరం తల్లిని తొందర చేస్తూ.

1. హిరణ్యకశ్యపుడు ప్రహ్లాదునికి చదువుపై గురి యేర్పరిచేవుద్దేశ్యంతో చెప్పిన విషయం. (హిరణ్యకశ్యపుడి దృష్టిలో చదువంటే తన విధానం అమలు జరిపే, చండామార్కుల చదువే)

చదువని వాడజ్ఞుండగుఁ
జదివిన సదసద్వివేక చతురత గలుగున్
జదువగ వలయును జనులకుఁ
జదివించెద నార్యులొద్ద చదువుము తండ్రి

(బమ్మెర పోతన, శ్రీ మదాంధ్ర మహాభాగవతము; సప్తమ స్కంధము 130వ పద్యం)

సగం సుందరం ముచ్చట తీర్చటానికని సీతమ్మ వప్పుకుంది. సుందరం కొబ్బరి మట్టలు ఈడ్చుకురావటానికి పరిగెత్తాడు.

తల్లీ కొడుకు కలసి కొబ్బరీనెలు తీస్తుండగా, పెళపెళలాడే పట్టుచీరతో, మొహాన ఇంత పెద్ద కుంకుంబొట్టు పెట్టుకుని మెడనిండా గంధం రాచుకుని భుక్తాయాసం ఇంకా తీరనిదానల్లే సుబ్బమ్మ 'చంటివాణ్ణి చంకనేసుకొని, లక్ష్మిని రెక్కపట్టుకొని వచ్చి అరుగుమీద చతికిలపడింది.

"ఇదేనుటమ్మా రావటం?" అన్నది సీతమ్మ.

"అవునమ్మా! ఇంకా తలుపు కూడా తెరవలా... చాలా హైరానయింది బాబూ" అన్నదీ సుబ్బమ్మ.

"రెండుమట్టలు, ఈసారి పెద్దచీపురవుతుంది" అన్నది సీతమ్మ తానుతీస్తున్న కొబ్బరీనెలగురించి మాట్లాడుతూ.

"మా తల్లి రెండు కట్టలుతీసి నాకొకటిద్దూ" అన్నది సుబ్బమ్మ.

ఆవిడకు చూచినదల్లా అడిగేస్వభావం ఉన్నది. సీతమ్మ సంభాషణమారుస్తూ, "అయితే పిల్లాణ్ని బళ్ళోవేశారా?" అన్నది.

"ఆహా, వేశారు - ఎట్లయితేనేం యజ్ఞం చేసినంత పనయింది... పోనిద్దూ. ఎందుకొచ్చిన చదువులూ, నే చెప్పా - ఏదో మొక్కు తీర్చేశారు. సరిపోయింది. ఇంకో ఏడాదిపాటు పాపం, వాణ్ణి బడికి పంపకండర్రా అని" అన్నది సుబ్బమ్మ.

"ఏం? పాపం, బాగా ఏడిచాడా?" అని అడిగింది సీతమ్మ.

"ఏడుపా?" అన్నది సుబ్బమ్మ అత్యాశ్చర్యంతో "ఏడుపేమిటి: ఏడుపుతో పిల్లాడు మెలికలు తిరిగిపోయి ప్రాణం కడబట్టితేను!"

సీతమ్మ తన కొడుకువంకచూసి సంభాషణ మార్చటం మేలనుకున్నది. సుందరం కొబ్బరాకు చేత్తో పట్టుకుని సుబ్బమ్మకేసి నోరు తెరుచుకు చూస్తున్నాడు. కాని వాడి మనస్సులో సుబ్బమ్మ మాటలకు భయంకలుగలేదు. ఆశ్చర్యం కలుగుతున్నది. బడికిపోయి చదువుకోటానికి ఎవరన్నా ఏడుస్తారా, ఏడిచేవాళ్ళని ఎక్కడన్నా పెద్దవాళ్ళు పాపం తలుస్తారా అని సుందరం ఆశ్చర్యపడుతున్నాడు.

కాని సీతమ్మకది తెలీదు. "సరేకాని. ఒరే సుందరం, ఒసే లక్ష్మి, మీరిద్దరూ వెళ్ళి ఆడుకోండి" అన్నదావిడ.

సుబ్బమ్మ అదొకరకం మనిషి. అనేక విషయాల్లో ఆవిడ అమాయకురాలు. సీతమ్మ తన కొడుకును ఎందుకు ఆడుకోవటానికి పంపిందీ ఆవిడ గ్రహించలేదు. అసలా సంగతే ప్రత్యేకంగా గమనించలేదు. ఆనాడు అక్షరాభ్యాసం జరిగిన కుర్రవాడు ఎట్లా ఏడిచాడో, పదిమందీ కలిసి వాణ్ణి ఎట్లా పట్టుకోలేకపోయినారో వాడు వాళ్ళ ముసలమ్మను ఎట్ల వాటేసుకున్నాడో, పిల్లవాణ్ణి తల్లి కాస్త సముదాయించటానికి ప్రయత్నం చేస్తుంటే, తండ్రి ఆవిణ్ణి ఎట్లా తిట్టిపోశాడో సుబ్బమ్మ చాలాసేపు వర్ణించి చెప్పింది. ఆ చెప్పటంలోనే, పిల్లల్ని చదవెయ్యటమంటే తనకెంత అయిష్టమోకూడా బయట పెట్టింది. పాపం, సుబ్బమ్మకు ఎవరు ఏమాత్రం

బాధపడటం ఇష్టంలేదు. బాధ కలిగించే పనులు ఎవరూచెయ్యకుండా వుంటే జీవితం చాలా ఆనందంగా వుంటుందని ఆవిడ వుద్దేశ్యం. ఎటువంటి బాధ అకారణమైనది, ఎటువంటి బాధ తప్పనిసరి అయినది అన్న విషయం ఆవిడ కే అభిప్రాయాలూ లేవు. పిల్లలు బళ్ళోకి వెళ్ళటానికి ఏడుస్తారు. కనుక అక్షరాభ్యాసం చెయ్యరాదు. శోభనపు పెళ్ళి కూతుళ్ళు గర్భాదానపు గదిలోకి పోవటానికి బెదురుతారు. కనుక గర్భాదానాలు చెయ్యరాదు. ఆడవాళ్ళు పిల్లల్ని కనటానికి హింసపడతారు. కనుక పిల్లల్ని కనరాదు. ఆవిడ తాత్వికదృష్టి అంత సంకుచితమైనది. ప్రపంచం తన దృష్టి ప్రకారం నడిస్తే ఆవిడకు ఒక్కనాటికి సంతృప్తికలుగదు. కాని ఆవిడకు కావలసింది ప్రపంచాన్ని తన అభిప్రాయాలకు అనుగుణంగా మార్చటంకాదు - వున్న ప్రపంచాన్ని తప్పు పట్టటంమాత్రమే.

## 2

సుందరానికి అయిదోఏడు వెళ్ళుతుందనగా పుట్టు వెంట్రుకలు తీసి అక్షరాభ్యాసం చెయ్యటానికి మంచిరోజు నిర్ణయించారు. దీనికి చాలామంది బంధువులు వచ్చారు. వీరిలో ఎక్కువమంది పల్లెటూళ్ళకు చెందినవాళ్ళు. ఆరోజుల్లో బస్సులులేవు. కనుక వీళ్ళు ఎడ్ల బళ్ళమీదా, కాలినడకనా వచ్చారు. సుందరం వారిలో చాలామందిని ఎరగడు. సుందరం తండ్రి శ్రీమన్నారాయణ అన్నప్పుడల్లా ఇల్లుకదిలే రకంకాదు. సుందరం బారసాల తరవాత శ్రీమన్నారాయణ ఇంట అక్కర జరిగి నలుగుర్నీ పిలవడం మళ్ళీ ఇప్పుడే.

సుందరం వాళ్ళ నెరక్కపోయినా బంధువులు సుందరాన్నెరుగుదురు. కనక అక్షరాభ్యాసం విషయమై వాణ్ణి ఏడిపించటానికి ప్రయత్నం చేశారు.

"ఏమిరోయ్, రేపణ్నుంచీ ముక్కుకు తాడుపోస్తార్రా" అని ఒకాయన అన్నాడు.

"ఇన్నాళ్ళూ పాపం అడిగేవాళ్ళు లేకుండా హాయిగా తిరిగాడు" అన్న దొకావిడ.

"చదువు సరిగా చదువుకోకపోతివా పంతులు చిరతవేస్తాడు జాగ్రత్త" అని మరెవరో అన్నారు.

వాళ్ళీ ధోరణిలో మాట్లాడటం సీతమ్మకెంత బాధకలిగించిందో సుందరానికి అంత అసహ్యం కలిగించింది. వాళ్ళంతా తనను అపార్థం చేసుకుంటున్నారనీ, తాను ఎటువంటివాడయిందీ ముందు ముందు తెలుసుకుంటారనీ సుందరం అనుకున్నాడు.

సీతమ్మ ఇటువంటి సంభాషణ అయినా సహించకలిగింది గాని మరోరకం సంభాషణ బొత్తిగా సహించలేక పోయింది.

"అయ్యో అదేమిటర్రా? ఇంత పసివెధవను ఇప్పుడే బళ్ళో వేస్తారుటర్రా? ఇంకా రెండేళ్ళు పోనీరాదూ?"

వాళ్ళంతా అతిథులు కాబట్టే సరిపోయింది. కాని, సీతమ్మకు వాళ్ళను నాలుగూ పెట్టబుద్ధయింది. అప్పటికీ ఆవిడ సమయోచితంగా, "వాడికి చదువుకోవటమంటే ఇష్టమే" "ఇప్పుడు బడికి పోకపోతే ఇంకో రెండేళ్ళకు అసలు వెళ్ళడేమో" అనీ సమాధానాలు చెబుతూవచ్చింది. నిజానికి సుందరం చదువుకుంటాడా లేదా, వాడికి చదువు వస్తుందా రాదా అన్న విషయాలను గురించి వచ్చిన చుట్టాలలో ఎవరికీ విచారంలేదు. ఎవళ్ళ సంస్కారాన్ని బట్టి వారు అనవలసిన మాటలని అంతటితో ఊరుకున్నారు.

❀ ❀ ❀ ❀

సుందరానికి శాస్త్రోక్తంగా పుట్టువెంట్రుకలు తీసి, అక్షరాభాస్యం చేయించారు. రాఘవయ్య పంతులు వచ్చి సుందరంవేలు పట్టుకుని బియ్యంలో "ఓ నమః శి వాయః" అని రాయించాడు. "ఓన మాహా, శీవా యహా" అని నోటితో అనిపించాడు.

వచ్చిన బంధువుల్లో ఒక విమర్శకాగ్రేసరుడున్నాడు - ప్రతి బంధువర్గంలోనూ అటువంటివాడంటూ ఉంటాడు. నలుగురూ చేరిన చోటల్లా తానెంత తెలివిగలవాడో, ఎవరికీ తెలీని విషయాలు తనకెంత బాగా తెలుసునో ప్రదర్శించడమే ఆయన పని.

"మన చదువులిందుకే ఇట్లా తగలడుతున్నాయ్" అన్నాడాయన. ఒకవంక అక్షరాభ్యాసం జరుగుతుండగా.

పక్కనున్న వాళ్ళు ప్రశ్నార్థకంగా చూశారు.

"అడుగులోనే హంసపాదు. ఓ నా మహా ఏమిటి? శీ వా యహా ఏమిటి? అసలుమాట ఓం నమశ్శివాయః"

తాను కనిపెట్టిన ఈ పరమసత్యానికి అందరూ ఆశ్చర్యచకితులయినారో లేదో తెలుసుకోవటానికని ఆయన చుట్టూ కలయజూశాడు.

"అట్లా అనటానికి వీల్లేదులే" అన్నాడింకొక పెద్దమనిషి.

"ఓం నమశ్శివాయ అయితే ఎవడిక్కావాలి? ఓం నమోనారాయణాయ అయితే ఎవడిక్కావాలి? ఓనా మహా శివాయహా అనకపోతే అది అక్షరాభ్యాసమే కాదు."

దీనికి చాలామంది ఒప్పుకున్నారు.

శ్రీమన్నారాయణ రాఘవయ్య పంతులుకు ధోవతులచాపూ, తాంబూలంలో దక్షిణా ఇచ్చాడు. రాఘవయ్య పంతులు బడి పిల్లలందరికీ పప్పుబెల్లాలు ముట్టినై.

చంకన పలకా చేతిలో బలపమూ పట్టుకుని సుందరం ఆడుకోవటానికి వెళ్ళే వాడల్లా మిగిలిన పిల్లలవెంట బడికి బయలుదేరాడు.

వాడెందుకు వెక్కివెక్కి ఏడవటంలేదో చాలామందికి అర్థంకాలేదు. కొంత మంది వాణ్ణి మెచ్చుకున్నారు. మరికొందరన్నారు - "పిల్ల కాక్కేం తెలుసు ఉండేలు దెబ్బ?" అన్నారు. ఈరోజుకోసం సుందరం ఎంతకాలంనుంచి యెదురు చూస్తున్నదీ యెవరికీ తెలియదు.

❀ ❀ ❀ ❀

పిల్లలంతా పప్పుబెల్లాలు తిని ఆటవిడుపు ధోరణిలో వున్నారు. రాఘవయ్య పంతులు ఒక్కసారిగా ఉరిమినట్టు "ఎవరి పాఠాలు వాళ్ళు చదువుకోండి" అనేసరికి పిల్లలు సర్దుమణిగారు.

పంతులు సుందరం కొత్తపలకమీద "అ ఆ" అనే రెండు అక్షరాలు పెద్దవిగా రాసి రెండు మూడుసార్లు సుందరం చెయ్యిపట్టుకుని దిద్దబెట్టి అట్లాగే దిద్దుతూ ఉండమన్నాడు.

మిగిలిన పిల్లలను గదమాయించినట్టు పంతులు తనను గదమాయించకపోవటం చూసి పంతులుకు తనమీద ఇష్టమనుకున్నాడు సుందరం. పంతులు రాసిన అక్షరాలు వాడి కళ్ళకు చాలా అందంగా తోచినై. చదువుమీద అభిమానంకొద్దీ వాడు తనకు ఎంత స్వల్ప విషయాలు బాగా కనిపించినా వాటితో సంతృప్తిచెందటానికి సిద్ధంగా వున్నాడు.

బలపం పట్టుకోవటం సుందరానికి సరిగా చాతకాలేదు. అది పలక మీద దాని ఇష్టం వచ్చినట్లు నడుస్తుందిగాని అక్షరం మీదిగా నడవదు. బలపం పట్టుకోవటంతోనూ దాన్ని అక్షరంమీదిగా నడిపించటంతోనూ, సుందరం వేళ్ళు చెప్పశక్యం కాకుండా నొప్పిపెట్టసాగినై. కాని సుందరం ఈ బాధను పాటించకుండా పళ్ళ బిగువున దిద్దసాగాడు.

"ఒరే గుండూ!"

పంతులు తననే పిలిచాడని సుందరం చప్పున గ్రహించలేదు. గ్రహించిన తరవాత వాడికెంతో అభిమానం కలిగింది. తల ఎత్తి పంతులుకేసి పిచ్చిచూపు చూశాడు – పంతులు తనను నలుగురిలోనూ ఎందు కవమానపరిచిందీ అర్థంకాక.

"నీకు నోరు లేదుట్రా అక్షరం దిద్దేటప్పుడు పైకి అనలేవూ,"

పంతు లేమడుగుతున్నదీ ఇంకా సుందరానికి అర్థంకాలేదు. పంతులు చెయ్యి సుందరం ఎడమచెవి మీదికి పోయింది. లేత చెవి చుర్రుమన్నది.

"ఇదేమిటి?" అన్నాడు పంతులు.

"అ" అన్నాడు సుందరం దుఃఖం పొంగివస్తూ.

"ఇది"

"ఆ"

"ఇంకేం, పైకి అనూ."

చెవికి విమోచనం కలిగిందిగాని బాధపోలేదు. దిద్దే అక్షరాన్ని పైకి ఉచ్చరిస్తూ సుందరం దిద్దసాగాడు. కాని ఇది చాలా నిరర్థకమైన పనిగా కనిపించింది. ఇది చదువులో ఒక భాగంగా వాడికి తోచలేదు.

క్షణక్షణానికి వేళ్ళతీపు హెచ్చిపోతున్నది. పంతులు రాసిన అక్షరం అంతకంతకూ లావెక్కి మెలికలు కలిసిపోతున్నై. దీనికి తగ్గట్టుగా అరిచేతులు చెమట పట్టి ప్రవాహాలు కడుతున్నయ్. సుందరం బలపాన్ని కిందపెట్టి అరిచెయ్యి లాగుకు తుడుచుకుని చూచుకున్నాడు. చూపుడు వేలి మొనా, మధ్య వేలి మధ్య కణుపు పక్క భాగమూ, బొటన వేలి మొనా ఎర్రగా కందినయ్.

"దిద్దూ"

ఈ పెడబొబ్బకు సుందరం హడలిపోయినాడు. మళ్ళీ అక్షరాలు దిద్దసాగాడు.

ఎంతసేపు దిద్దాడో తెలియదు. చెయ్యి అక్షరం దిద్దుతూనేవుంది. నోరు అక్షరాలను ఉచ్చరిస్తూనే వుంది. కాని సుందరం మనస్సు ఎక్కడో వుంది. వాడికి వాళ్ళమ్మ జ్ఞాపకం వచ్చింది. సుబ్బమ్మ కూతురు లక్ష్మి జ్ఞాపకం వచ్చింది. కిందటేడు వాళ్ళ బంధువులింట్లో జరిగిన పెళ్ళి జ్ఞాపకం వచ్చింది. పందిళ్ళ వాసన జ్ఞాపకం వచ్చింది. ఆ పెళ్ళి అయిపోయిన తరవాత కొన్ని మాసాలకు శ్రీమన్నారాయణ తమ వాకిలిముందు చిన్న తాటాకుల పందిరి వేయించాడు. ఆ తాటాకులవాసన తగలగానే తను అమ్మా మనపందిరి పెళ్ళి వాసన' అన్నాడు. ఆ మాటకు తల్లి తనను ముద్దు పెట్టుకుంది.

రాఘవయ్య పంతులు బళ్ళో కూచుని అక్షరాలు దిద్దుకునే సుందరం మొహాన కొద్దిపాటి ఆనందరేఖ కనిపించింది. అది మరెవరికీ కాదు. రాఘవయ్యకే కనిపించింది. మరుక్షణం ఠపీమని సుందరం నెత్తిన మొట్టికాయ పడింది.

"వెధవా. అక్షరాలన్నీ చెరిపేస్తావా?" అన్నాడు పంతులు. వాడి చేతి చెమటకు అక్షరాలు చాలా భాగం చెరిగిపోయినై.

రాఘవయ్యపంతులు పలక చెరిపి మళ్ళీ అక్షరాలు రాసి దిద్దమన్నాడు.

రాఘవయ్య పంతులు బడి వీధిబడి కాదు. ఆయన తన సొంత యింటి ఆవరణలోనే ఒక పక్కన పెంకులు కప్పిన వసారా ఒకటివేయించి అందులో బడి పెట్టేవాడు. అందులో కాస్తమంచి తరగతికి చెందిన కుటుంబాల పిల్లలు చదువుకునేవాళ్ళు. వీధిబడికి పిల్లల్ని పంపటం నామోషిగా భావించేవాళ్ళు రాఘవయ్యకు ప్రోత్సాహం యిచ్చేవాళ్ళు. ఈ బడిమీద రాఘవయ్యకు నెలకు ఏ పది పన్నెండు రూపాయలో గిట్టేవి.

రాఘవయ్య బాగా చెప్పగలవాడని ప్రతీతి ఉండేదిగాని నిజంగా ఆయన పిల్లలకు శ్రద్ధగా చదువు చెప్పేవాడు కాదు. ఎక్కువకాలం పిల్లలతో గడిపేవాడుకాదు. పిల్లల దగ్గిర కూర్చున్నంతసేపూ వాళ్ళను హింసించేవాడు. ఆయన బాగా పిల్లలను శిక్షిస్తాడనేమాటను పిల్లల తల్లిదండ్రులు మంచిశిక్షణ ఇస్తాడని అర్థం చేసుకునేవారు.

సుందరం "అ ఆ" దిద్దుతూండగా రాఘవయ్య వెళ్ళిపోయినాడు. ఆయన మొదట ఇంట్లోకివెళ్ళి, తరవాత బయటికి వెళ్ళాడు. ఆయన బయటికి వెళ్ళగానే ఒక కుర్రవాడు, పొడుగాటి పళ్ళవాడు వచ్చి సుందరం పక్కన కూచుని, "ఏం రా, గుండూ సరిగా దిద్దు" అన్నాడు.

సుందరం తప్ప అందరూ చదువు మానేసి కబుర్లలో పడ్డారు. సుందరం కూడా చేతికి కాస్త విశ్రాంతి ఇచ్చాడు. వాడికి యీ కుర్రాణ్ని చూస్తే ఎందుకో పంతుల్ని చూసినదానికన్న ఎక్కువ భయంవేసింది. అందుకని వాడు మళ్ళీ బలపంపట్టుకుని దిద్దసాగాడు.

కాని సుందరం మనస్సులో ఏదో ఆవేదన బయలు దేరింది. చదువుకోవటమంటే వాడూహించినదానికీ, దీనికీ ఏమీ సంబంధంలేదు. తన జన్మంతా ఈ "అ ఆ" దిద్దటంతోనే సరిపోయేటట్టు కనిపించింది.

పంతులు తిరిగి వచ్చేసరికి ఎవరి పాఠాలు వాళ్ళు మళ్ళీ చదవసాగారు. ఒక్క కుర్రవాడు మాత్రం గోడకానుకుని తలరొమ్ముమీదికి వాల్చుకుని నిద్రపోతున్నాడు. పంతులు లోపలికి వస్తూనే చూరులోంచి పేంబెత్తం తీసి వాణ్ణి కసిగా నెత్తినా, భుజాలమీదా, కాళ్ళమీదా దబ దబా కొట్టాడు. వాడు మొదటి దెబ్బకే "చచ్చానో" అని కేక పెట్టాడు. దెబ్బ, దెబ్బకూ ఆ కుర్రాడు "అమ్మో! బాబో! నాయనోయ్! అయ్యో!" అని కేకలు పెడుతుంటే సుందరం గుండెలు అవిసిపోయినై.

రాఘవయ్యను చూస్తే ఆ క్షణాన సుందరానికి భయంతోబాటు భయాన్నిమించిన కోపంకూడా వచ్చింది. తన మనస్సులో సుందరం ఆ రాఘవయ్యను పెద్దకట్టెపెట్టి ఒళ్ళంతా పచ్చడి అయ్యేటట్టు కొట్టాడు.

సుందరానికిప్పుడు వేళ్ళతీపు కూడా అంత బాధించటంలేదు. ఎప్పుడు బడి అయిపోతుందా ఎప్పుడు యింటికి పోదామా అనే చింత వాణ్ణి తీవ్రంగా బాధించసాగింది.

చివరకు రాఘవయ్య పంతులు బడి విడిచే సమయానికి సుందరానికి పెద్దచెరవదలినట్టయింది.

సుందరాన్ని యింటిదగ్గర దిగవిడవమని పంతులు ఇద్దరు పిల్లల్ని వెంట పంపాడు. వాళ్ళలో ఒకరు పేంబెత్తం దెబ్బ తిన్నవాడు.

దారిలో ముగ్గురూ ఏవో మాట్లాడుకుంటూ వచ్చారు.

"సరే కాని, పంతులు కొడితే నీకు బాగా నెప్పెత్తిందా?" అని సుందరం దెబ్బలుతిన్న కుర్రాణ్ని అడిగాడు.

"నాకేం నెప్పి లేదు" అన్నాడు కుర్రాడు.

సుందరానికి ఆమాట బడాయిగా కనిపించింది.

"అంత గట్టిగా ఏడిచావే?" అన్నాడు సుందరం.

"దెబ్బల నెప్పికన్నా ఎక్కువ ఏడిస్తే నెప్పి ఉండదు. నీకు తెలీదా" అన్నాడు ఆ కుర్రాడు.

ఇది సుందరానికి వింతగా తోచింది. వాడు దెబ్బల అనుభవం ఉన్న వాడు కాడు.

"మా నాన్న కూడా నన్ను చచ్చేటట్టు కొడతాడు. గొంతుచించు కేదుస్తాను. ఏమీ నెప్పి ఉండదు" అన్నాడా కుర్రాడు. సుందరాన్ని నమ్మించేటట్టు చెబుతూ.

# 3

"నేను బడికి పోనమ్మా" అన్నాడు సుందరం.

అందరు పిల్లలనోటా తరుచుగా వచ్చే ఈ మాట తన కొడుకు నోట రావటం విన్న సీతమ్మ మనస్సు తల్లడిల్లింది. సుందరం బడికి వెళ్ళి రావటం అది రెండోరోజే

"ఎందుకురా?" అన్న దావిడ.

"పంతులు ఇవాళకూడా 'అ ఆ' లే దిద్దబెట్టాడు."

"అవి వచ్చినయని చెప్పమంటినిగా?"

"చెప్పా. ఏడిచావులే అన్నాడు. పంతులు ఊరికేనే కొడతాడమ్మా. రూళ్ళ కర్రపెట్టి కణుపులమీద కొట్టాడు."

సుందరానికి దుఃఖం పొంగి వచ్చింది.

"ఎందుకూ?" అన్నది సీతమ్మ బాధపడుతూ.

"ఏమో నేనేం చెయ్యలేదు. అందర్నీ కొడతాడు."

సీతమ్మ కొడుకు విషయం భర్తతో చెప్పింది.

"పోనీ బడిమానమను. బళ్ళోకి పోకపోతే బడితెలాగా తయారవుతాడేమోననిగాని, యిప్పుడు వాడి చదువేం మునిగిపోయింది?" అన్నాడు శ్రీమన్నారాయణ.

ఆయన ఏదో మంచిసలహా చెబుతాడనుకుంటే సీతమ్మకు నిరాశ అయింది. కొడుకును బలవంతాన బడికి పంపించి బడిమీద వాడికి మరింత ఏవగింపు కలగనివ్వటమా? లేక బడిమానిపించి చదువు ధ్యాస పోగొట్టటమా? సీతమ్మకు ఏదీ యిష్టంలేదు. ఆకస్మికంగా ఆవిడ కొక ఆలోచన తట్టింది.

"అక్షరాలు నేను దిద్దబెడతాలేరా" అన్న దావిడ. ఈమాట అనేసిన తరవాత సీతమ్మకేదో జంకు కలిగింది. పిల్లవాణ్ని బడి మాన్పించి తాను చదువు చెప్పటం మొదలు పెడితే నలుగురూ నవ్వుతారేమో. కాని ఈ ఆలోచన మార్చుకునేటందుకు సుందరం అవకాశం ఇవ్వలేదు. వాడు ఆనందంతో ఒక్కగంతువేసి "నిజంగా నువుదిద్దబెడతావా అమ్మా?" అంటూ వెళ్ళి పలకా బలపమూ తెచ్చి ఆవిడ ముందు పెట్టాడు.

"ఇప్పుడేనుట్రా? నేను వంట చేసుకోటానికి వెళ్ళాలి. రేపు దిద్దబెడతాలే" అన్నది సీతమ్మ.

కాని సుందరం వినలేదు. వాడు చిన్నబుచ్చుకున్న వాలకంతో "దిద్దబెట్టి వంటచేసుకో కూడదేం?" అన్నాడు.

సీతమ్మ మారుమాటాడక పలక తుడిచి, బలపంతో "ఇ ఈ" అనే రెండక్షరాలూ రాసింది. మూడు నాలుగు సార్లు రాసి తుడిచిన తరవాతగాని ఆవిడికా

అక్షరాలు సరిగా కుదరలేదు. ఆవిడపాట్లు చూసి సుందరం నవ్వాడు. కాని ఆ నవ్వులో వెటకారం లేదు.

తల్లి చేతినుంచి పలక తీసుకుంటూనే సుందరం కిరసనాయిలుబుడ్డి దీపం దగ్గిర కూచుని అక్షరాలు దిద్దసాగాడు.

మరో అరగంటకు సీతమ్మ వంటింట్లో అన్నం వార్చుతూండగా సుందరం వచ్చి తనకు అక్షరాలు వచ్చినయ్యని చెప్పాడు.

"అప్పుడే?" అన్న దావిడ.

"రాసి చూపిస్తా చూడు" అంటూ సుందరం పలక వెనుకవేపున రెండక్షరాలూ వంకరటింకరగా రాసి చూపించాడు.

"అవును. అక్షరాలు వచ్చినై. ఇవాల్టికి చాల్లే" అన్నది సీతమ్మ.

ఇంకా రెండక్షరాలు రాసిపెట్టమని సుందరం పేచీ పెట్టాడు.

"ఏ పిచ్చిపడితే ఆపిచ్చేనట్రా?" అన్నదావిడ. కాని మరుక్షణమే ఆ మాట అన్నందుకు పశ్చాత్తాప పడింది. ఏక్షణాన ఎవరు సుందరానికి చదవుమీద వున్న ఆసక్తికి అడ్డుపుల్లలు వేస్తారో అని భయపడుతూ వచ్చిన తానుకూడా ఆపనే చెయ్యటమేమిటి?

సీతమ్మ చేతులు కడుక్కునివచ్చి పలకమీద "ఉ ఊ" అనే అక్షరాలు రాసిచ్చింది.

సుందరానికి ఈ అక్షరాలు చాల అందంగా కనిపించినై. అదివరకు దిద్దిన నాలుగు అక్షరాలకన్న ఇవి వాడికి చాలా సులభంగాకూడా తోచినై. పలక పట్టుకుపోయి సుందరం చాలాసేపు ఆ అక్షరాల స్వరూపాన్ని మనసుకు పట్టించుకుంటూ కూచున్నాడు. ఒకసారో రెండుసార్లో అక్షరాలు దిద్దగానే వాడికా అక్షరాలు తనంతట రాయబుద్ధయింది. పలకతిప్పి తడువుకోకుండా రెండక్షరాలూ రాసేశాడు. వాడు రాసిన అక్షరాలు వాడికే అందంగా కనబడినై.

"అమ్మా. నాకీ అక్షరాలు వచ్చేసినై, ఇదిగో చూసుకో" అని తాను రాసిన అక్షరాలు చూపించాడు. సుందరం.

ఈసారి నిజంగా సీతమ్మకు భయం వేసింది. సుందరం చదువులో చురుకుకావటం ఆవిడ కానందమేగాని అయిదు నిమిషాలకొక అక్షరం చొప్పున నేర్చుకునే చురుకు నిలవదేమో అనిపించింది. 'సులభంగా వచ్చిన విద్య సులభంగానే పోతుంది' అని తన తండ్రి ఏనాడో అన్న మాటలు ఆవిడకు జ్ఞాపకం వచ్చినై.

"వెనక చూసి రాశావా?" అన్నది సీతమ్మ.

తన తల్లి ఇట్లా మాట్లాడటం సుందరానికి నిరుత్సాహం కలిగించకపోగా ఉత్సాహం కలిగించింది. అకారణంగా చేతిమెటికలు విరగగొట్టే మేస్టరుని చూచి, తన స్థాయికి దిగటానికి సిద్ధంగావున్న తల్లిని చూసేసరికి సుందరానికి చదువంటే ఇట్లా వుండాలనిపించింది.

వాడు గబగబా వెళ్ళి పలక రెండు వేపులా నీళ్ళు పెట్టి కడిగి తుడిచి తెచ్చి తల్లిదగ్గరకి వచ్చాడు.

"బిందెలో చెయ్యి ముంచావట్రా? ఏం పనుర్రా?" అన్నది సీతమ్మ.

కాని సుందరం వినిపించుకోలేదు. వాడు పలకమీద 'ఉ ఊ' రాసి చూపించాడు.

"కొత్తవి నేర్చుకుంటూ పాతవి మరిచిపోవటం లేదు కదా?" అన్నది సీతమ్మ.

సుందరం వరసగా 'అ ఆ ఇ ఈ ఉ ఊ' రాసి తల్లికి చూపించాడు.

"చాల్లే, నువు వెళ్ళి నాన్నను కాళ్ళు కడుక్కోమను. నువ్వుకూడా కాళ్ళుకడుక్కురా, అన్నం పెడతా" అన్నది సీతమ్మ.

"అన్నం తిన్న తరువాత మళ్ళీ రెండక్షరాలు రాసిస్తావా?" అన్నాడు సుందరం.

"అట్లాగేలే."

అన్నం తిన్న తరువాత సీతమ్మ "ఋ ౠ" రాసి ఇచ్చింది.

ఆ అక్షరాలు సుందరాని కంత రుచించలేదు. "అరు, అరూ" అని వాటిని అనాలని తల్లి చెప్పింది. తల్లి నిజం చెబుతున్నట్టు వాడికి తోచలేదు. వాటిని దిద్దుతూనే యెప్పుడు నిద్రపోయినాడో సుందరం దీపం దగ్గరే పడుకుని నిద్రపోయినాడు.

వాడి చేతినుంచి మెల్లిగా పలక విడిపించి, తన అక్షరాలమీదుగా కొడుకు దిద్దిన గీతలు చూచుకుని చాలా మురిసింది.

❀ ❀ ❀ ❀

సుందరం తల్లి సహాయంతో అక్షరాలు నేర్చుకోవటం సుందరాని కెంత విచిత్రానుభవమయిందో, సీతమ్మకూ అంత విచిత్రానుభవమయింది. తానేమిటి, కొడుక్కు చదువు చెప్పటమేమిటి అన్న సందేహం మళ్ళీ సీతమ్మ మనస్సులో తల ఎత్తలేదు. ఇది చాలా మంచి ఆలోచన అన్నది మొదటి గంటలోనే రుజువయింది. రెండోరోజు సుందరం పన్నెండు అక్షరాలు ఆడుతూ, పాడుతూ నేర్చుకుంటున్నట్లు నేర్చుకున్నాడు. నిజానికి వాడిబుద్ధి ఆ నేర్చుకునే అక్షరాలకు అంటుకుపోయి తిండిమీదా, ఆటలమీదా కూడా ధ్యాసలేకుండా చేసింది. అది వాడికి ఒకవిధమైన వ్యసనమల్లే అయిపోయింది. వాడి మనస్సు ఎట్లా పనిచేస్తున్నదీ కళ్ళతో చూస్తున్నట్టుగా కనిపెడుతున్న సీతమ్మకు తన కొడుకు అమితదీక్షతో అతివేగంగా అక్షరాలు నేర్చుకుంటున్నాడన్న ఆనందంతో బాటు ఇంత చాదస్తం పనికి రాదేమోనన్న అనుమానం కూడా బాధించింది.

రెండోరోజు ప్రొద్దున వాడు తల్లితోపోట్లాడి నాలుగక్షరాలు దిద్దబెట్టమన్నాడు. ఋ ౠ ఌ ౡ దిద్దబెట్టించుకున్నాడు. కాని వాటిని దిద్దలేదు. అవి చూడకుండా వచ్చేదాకా చూసి రాశాడు. ఆ తరువాత ఇంకా నాలుగక్షరాలు కావాలన్నాడు. తల్లి ఎ ఏ ఐ మాత్రమే రాసి యిచ్చింది. అవి నిజంగా రెండే అక్షరాలని వాడు పోట్లాడాడు. ఎ ఏ లు ఒకే అక్షరం కింద వాడు స్వీకరించాడు. అయినా అవి రాసి చూపించేదాకా

సీతమ్మ ఒ ఓ ఔ దిద్దబెట్టలేదు. ఒ అనే అక్షరం సుందరానికి ఋ అనే అక్షరంలో ఒక భాగంగా కనబడింది. దాన్ని వాడు వెంటనే రాసేశాడు.

రాఘవయ్య పంతులు బడిలో చదివిన రెండు రోజులలోనూ సుందరానికి చదువు తప్ప అన్నీ కనిపించినై. అసలైన చదువు ఇప్పుడే వాడికి అనుభవంలోకి వచ్చింది. వాడు కన్నకలలకు ప్రత్యక్ష స్వరూపమల్లే వున్నది ఇదే. ఆ రాఘవయ్య బడి ఏదో చిన్ననాటి అనుభవమల్లే అయిపోయింది. అప్పుడే దాని తాలూకు జ్ఞాపకం మాయసాగింది.

తల్లి నేర్పుతుంటే తాను నేర్చుకునే అక్షరాలు తనకేదో మేలుచేస్తయని మాత్రమే సుందరం ఎరుగునుగాని, అక్షరాలు నేర్చుకోవటంలోనే తనలో పరిణామం, ఒక పెద్ద పరివర్తన – కలుగుతున్నదని వాడెరుగడు. అయినా ఈ పరిణామం దాగలేదు. తాను నేర్చుకునే ప్రతి అక్షరమూ తనకు తెలిసిన పదజాలాన్ని నిర్మించే సాధనాలలో ఒకటని వాడు గుర్తిస్తూనే వచ్చాడు. ఐతే ఈ అక్షరాలకూ తనకు తెలిసిన మాటలకూ మధ్య ఇంకా ఏదో అడ్డుండడం తెలిసి బాధకలిగేది. ఇంట్లోవున్న భాగవతం తీస్తే అందులో తాను నేర్చుకునే అక్షరాలు ఎక్కడోగాని కనిపించేవికావు.

"అమ్మా ఇంకా ఎన్ని అక్షరాలు నేర్చుకోవాలి? ఎన్నాళ్ళు పడుతుంది?" అని వాడు తల్లిని అడిగేవాడు.

"కాస్త వోపిక పట్టు" అనేది తల్లి.

సుందరానికి ప్రతి అక్షరమూ సజీవంగా తోచటమేకాక, వాడా అక్షరాలమధ్యగల సంబంధాలన్నింటినీ పరీక్షగా గమనించాడు. కొన్నిటికి శబ్ద సంబంధముంటే మరి కొన్నింటికి స్వరూప సంబంధమున్నది. అనేక అక్షరాలు త్వరగా నేర్చుకోవటానికి సుందరం ఈ సంబంధాలను పూర్తిగా వినియోగించుకున్నాడు. ఉ, ద అనే రెండక్షరాలకూ దగ్గిర సంబంధమున్నది. ఈ మాట సుందరం తనలో తాను అనుకుంటుండగా "ఊ ద" అనే మాటలో రెండక్షరాలూ తనకు వచ్చునని వాడికి స్ఫురించింది. తరవాత "ద డ"లకు సంబంధం వుండటంకూడా గమనించాడు.

అక్షరాలు వాడి బుద్ధిని ఎక్కడెక్కడికో తీసుకుపోయేవి. వాడి తలకాయలో చిన్నచిన్న రెండక్షరాల మాటలూ, మాటలలో భాగాలు ప్రతిధ్వనించేవి అన్ని అక్షరాలూ వాడికి సమంగా కనిపించేవికావు. కొన్ని భయపెట్టేవి, అనుమానం కలిగించేవి. అరు, అరూ, అలు, అలూ, ఇంజ్ఞా, ఇణీ – ఈ అక్షరాలు చూస్తే సుందరానికి చాలా అనుమానం. "ఙ" అనే అక్షరాన్ని "ఇంఙ" అనీ "ఞ" అనే అక్షరాన్ని "ఇణీ" అనీ అనాలని వాళ్ళమ్మ చెప్పింది. బుద్ధిమంతుడల్లే సుందరం ఒప్పుకున్నాడు. కాని ఏమూలో వాడికి శంక వుండనేవుంది. ఇవేమక్షరాలు? వీటిని చూస్తే ఏమాటా ఎందుకు జ్ఞాపకంరాదు?

సీతమ్మ తాను ఎప్పటల్లే ఇంటి పనులన్నీ చేస్తూనే వున్నది. కాని ఆవిడ ధ్యాసంతా కొడుకు చదువుమీదే వుండటంవల్ల, ఆవిడ మనస్సులో తాను ఇంటిపనులన్నీ ఎగవేసి కొడుక్కు చదువుమాత్రమే చెబుతున్న భావం కలిగింది. తాను

కొత్తగా అక్షరాలు నేర్చుకుంటున్నట్టే వుంది ఆవిడకు. తాను రాసిన అక్షరాలే అయినా వాటిని తన కొడుకు కళ్ళతో చూసేది.

ఆవిడ తత్వానికి గొప్ప చెప్పుకోవటం సరిపడదు. తనను గురించి చెప్పుకోవటం ఆవిడ కెంత కష్టంగా వుండేదో తన కొడుకు గురించి చెప్పుకోవటమన్నా అంత కష్టంగానే ఉండేది.

సుందరం చురుకుగా అక్షరాలు నేర్చుకుంటున్నాడన్న సంగతి ఆవిడ తనభర్తకే నేరుగా చెప్పలేకపోయింది.

"ఏమండీ! పాపం వాడికి నా చదువెన్నాళ్ళనీ?" అన్నదామె ఒకనాడు భర్తతో.

"ఏదో చదువుతున్నట్టున్నాడే?" అన్నాడు శ్రీమన్నారాయణ.

"రేపో ఎల్లుండో వాడికి అక్షరాలన్నీ వచ్చేస్తయ్. ఆ తరువాత నేనేం చెయ్యనూ!"

శ్రీమన్నానారాయణ నవ్వి. "వాడి మొహం. నీ మొహం" అన్నాడు.

"వాడి మొహమేమిటి? వచ్చిన అక్షరాలు రాసి చూపించమనండి" అన్నదావిడ.

"ఒరే సుందరం, పలకా బలపం పట్టుకురా" అన్నాడు శ్రీమన్నారాయణ.

సుందరం వచ్చాడు.

"అట్లా కూచుని నీకు వచ్చిన అక్షరాలన్నీ రాయి"

సుందరం మోకాళ్ళు ముడుచుకు కూర్చుని కాళ్లమీద ఏటవాలుగా పలక పెట్టుకుని బలపంపెట్టి రాయబోతూండగా తండ్రి "పలక అట్లాగేనుట్రా పట్టుకునేది?" అన్నాడు. సుందరం బిత్తరపోయినాడు. పలక మొహానికి ఎదురుగా వుండేటట్టు పట్టుకోవటం ఎట్లాగో శ్రీమన్నారాయణ కొడుక్కు చూపించాడు. మోకాళ్ళు ముడుచుకు కూర్చోరాదు. బాసిపెట్టు వేసుకోవాలి. పలక నిలువుగా రెండుకాళ్ళమీదా ఆనించి ఎడంచేత్తో కొద్దిగా ఎత్తిపట్టుకోవాలి.

సుందరం తండ్రి చెప్పినట్టే చేశాడు. కాని యిట్లా రాయటం వాడికి అలవాటు లేదు. అయినా రాయసాగాడు. సుందరం రాయటం మొదలుపెట్టగానే శ్రీమన్నారాయణ ఇంకేదో పనిలో నిమగ్నుడైనాడు. సుందరానికెందుకో గాని తన తండ్రికి తన చదువుమీద ఆసక్తిలేదని అనుమానం కలిగింది. తాను అక్షరాలు సరిగా రాస్తాడన్న నమ్మకంగాని, రాయడేమోనన్న భయంగాని తండ్రికి లేదని వాడికి ఎవరో చెప్పినట్లుగా తెలుసును. అసలు తన చదువే ఆయనకు పట్టలేదు. తన తల్లికూడా అక్షరాలు రాసిచ్చి తన పని తాను చూసుకునేది. కాని ఆవిడకు తన చదువు గురించిన ఆలోచన ఏమూలో వున్నట్టు సుందరానికి గట్టినమ్మకం. తండ్రి విషయంలో ఈ నమ్మకం కలుగలేదు.

మరి కాసేపటికి సుందరం పలకమీద ముప్ఫయి అక్షరాలకుపైగా రాసి తండ్రి ఎదటే పెట్టాడు. "ఎబ్బెబ్బే! ఇవేం అక్షరాలురా. నీ తలకాయ అక్షరాలూ? ఒకటి చిన్నదీ, ఒకటి పెద్దదీ! ఒకటి కిందా, ఒకటి మీదా! ఈ పంక్తులేమిటి? ఇంత

ఎగుడు దిగుడుగానా? సూటిగా రాయాలి. అన్ని అక్షరాలు సమంగా వుండాలి. యింత చిన్న అక్షరం రాసి అంత పెద్ద తలకట్టిస్తారా! అక్షరాలు అందంగా ఉండాలి..."

తండ్రి యేం చెబుతున్నదీ సుందరానికి అర్థమే కాలేదు. కాని నోరు తెరుచుకు విన్నాడు. శ్రీమన్నారాయణ కొడుక్కు చాల మంచి సలహా యావత్తూ ఇచ్చాననుకున్నాడు కాని కొడుక్కు ప్రోత్సాహమివ్వాలని ఆయనకు తట్టలేదు. మూడు రోజుల్లో ఇన్ని అక్షరాలు వాడికెట్లా వచ్చినయ్యని ఆయన ఆలోచించలేదు. అన్ని అక్షరాలూ వాడు ఒక తప్పు లేకుండా రాశాడనికూడా ఆయన గమనించలేదు.

❀ ❀ ❀ ❀

మామూలు ప్రకారం సుబ్బమ్మ మధ్యాహ్నం దాటగానే, 'రాచకార్యాలకు' వచ్చింది.

"ఏమమ్మా, అప్పుడు మీ బంధువుల పిల్లవాణ్ని బళ్ళో వేశారే, వాడు చక్కగా చదువుకుంటున్నాడా?" అన్నది సీతమ్మ.

"అఁ. వాడికెక్కడ చదువొస్తుంది? వొట్టి తిప్పకాయ వెధవ. ఎప్పుడన్నా బడికిపోతేగా? ఇంట్లో వుంటే చెట్లూ చామలూ ఎక్కి చేతులూ, కాళ్ళూ విరుచుకుంటాడని వాళ్ళమ్మ కానీ అర్ధణా లంచంపెట్టి బడికి పంపిస్తుంది. అది పెట్టి కొనుక్కుతిని ఎక్కడో నలుగురు పిల్లల్ని చేర్చి గోలికాయలూ, గోటిబిళ్ళా ఆడి ఇంటికి చక్కావస్తాడు! అయినా వాడికి చదువు లేకపోతే ఏంలే. ఏదో యింత తినటానికి భగవంతుడిచ్చాడూ! నాలుక్కాలాలపాటు బతికి బట్టకడితే చాలు. ఉద్యోగాలు చేసి ఊళ్ళేలక్కర్లేదు" అన్నది సుబ్బమ్మ.

"నువ్వుపోయి లక్ష్మితో ఆడుకోరాదుట్రా!" అన్నది సీతమ్మ, సుబ్బమ్మ చెప్పే మాటలను నోరు తెరుచుకు వింటున్న కొడుకుతో.

సుందరం లేచి బయటికి వెళ్ళాడు.

"మీవాడెట్లాగైనా నయం. శ్రద్ధగా చదువుతాడు. చూస్తున్నాగా వాడికి అల్లరీ ఆటలూ అక్కర్లేదు. అదృష్టం."

"ఇదెన్నాళ్ళో? బళ్ళో వాడికి చదువురాలా. కాకపోయినా బడి పంతుళ్ళు శ్రద్ధగా చెప్పరు. నేనెన్నాళ్ళు చెప్పగలను చెప్పమ్మా? ఇవాళతో అయిదు బళ్ళూ చెప్పా. గుడింతాలూ, వత్తులూ చెప్పాలి. వాడికో బాలశిక్ష తెచ్చి పెట్టమన్నా, ఏం తెస్తారో? ఆయనకు వక్కరవ్వ పట్టదు " అన్నది సీతమ్మ.

"కాకపోయినా మనం చెబితే పిల్లలకు చదువెక్కడ వస్తుందమ్మా? నేను మహాలక్ష్మిని రెండక్షరాలు దిద్దుకోవే అని మూడురోజుల్నించీ పోరుతున్నా ఠలాయిస్తుంది. నన్ను ఎదురు ఆటల్లో పెడుతుంది. గురువంటూ ఉంటేగాని పిల్లలు భయ భక్తులతో చదువుకోరు" అన్నది సుబ్బమ్మ.

సుబ్బమ్మ కే మాత్రమైనా ఆలోచనా, జ్ఞానమూ ఉంటే ఈమాట అనదు. నాలుగైదు రోజుల్లో తల్లి దగ్గర సుందరం అక్షరాలన్నీ నేర్చుకున్న సంగతి ఆవిడకు

తెలుసు. సుందరం ఈపనిచేయటానికి కారణం భయభక్తులుకావు. శ్రద్ధ. ఆ సంగతి సుబ్బమ్మ జన్మలో అర్థం చేసుకోలేదు.

సీతమ్మ మాత్రం "అవును నిజమే" అని ఆ విషయం అంతటితో పోనిచ్చింది.

"మావాళ్ళక్కూడా అదే సలహా చెప్పా. ఎందుకుగ్రావాణ్ణి బడికి పొమ్మంటే పోనప్పుడు. మేస్టర్ని ఇంటికి పిలిపించి ప్రయివేటు చెప్పించండి అన్నా" అన్నది సుబ్బమ్మ.

సీతమ్మ ఆలోచించింది. తాను కొడుక్కు చెప్పే చదువు అయిపోవచ్చింది. ఎవరన్నా మేస్టర్ని పెడితే, పై సంవత్సరం కాకపోతే ఆ పై సంవత్సరమైనా హైస్కూలులో చేర్పిస్తాడు. ఈ విషయం భర్తకు చెప్పటానికి ఆవిడ నిశ్చయించింది.

ఆ రాత్రి సుందరం తల్లికి 'శ ష స హ ళ క్ష' రాసి చూపించాడు.

"అమ్మా. నాకిప్పుడన్ని అక్షరాలూ వచ్చినయ్యా?" అన్నాడు వాడు.

అవునన్నది తల్లి.

"అయితే అన్ని మాటలూ రాయొచ్చా?"

"అప్పుడేనా?" అన్నది తల్లి.

"ఏమమ్మా ఇంకేంకావాలీ? అన్ని అక్షరాలూ వచ్చినయ్యన్నావే?"

"గుడింతం రావద్దూ?"

"అంటే"

"నీకు క రాయటం వచ్చు. కా, కీ, కూ ఎట్లా రాస్తావు? అదీ గుడింతమంటే."

"అది వస్తే అన్నీ రాస్తానా?"

" ఆ తరవాత వత్తులు రావాలి."

"అంటే?"

"కావత్తూ, చావత్తూ, నావత్తూ, మావత్తూ–"

"ఎందుకవీ?"

"'అబ్బ' అని రాయాలంటే ఎట్లా? అ బ రాసి 'బ'కు బావత్తివ్వాలి."

"ఆ తరవాత అన్ని మాటలూ రాయగలనా?"

"ఓ, రాయగలవు."

సుందరం కాస్త ఆలోచించి, "అమ్మా, నీపేరు రాయనా?" అన్నాడు కాస్త బిడియంగా.

"వత్తులు రాందే ఎట్లా రాస్తావు?" సుందరం పలకమీద "అమ" అని రాసి చూపించాడు.

"అమ అని రాశావు. అమ్మ ఎట్లా అవుతుంది?... నువ్వు అక్షరాలన్నీ పలకమీద రెండు వేపులా రాసివుంచు, నాన్న చూస్తారు. నాన్నను బాలశిక్ష కొనుక్కురమ్మన్నా, సరేనా? నేను వంటకు పోతున్నా."

సీతమ్మ వంటపనిలో వుండగా సుందరం పలక పట్టుకుని చాటంతమొహంతో వచ్చి "అమ్మా, నీ పేరు రాయలేనంటివే రాశా చూసుకో!" అని పలక చూపించాడు.

పలకమీద వాడు రాసినది చూసి ఒక్కక్షణం సీతమ్మ నిర్ఘాంతపోయి కొడుకును దగ్గిరికి తీసుకొని రెండు చెంపలూ ముద్దుపెట్టుకున్నది.

సుందరం పలకమీద "అంమ" అని రాశాడు.

## 4

"అమ్మా, నీకు ఉత్తరం వచ్చింది" అన్నాడు సుందరం.

"చెయ్యి విడిగా లేదు. అట్లా గడప మీద పెట్టు" అన్నది తల్లి వంటింట్లో నుంచి.

సుందరం కాస్సేపు కార్డు అటూ ఇటూ తిప్పాడు. వాడికిప్పటి వరకు చేతి వ్రాత చదవటం అలవాటు కాలేదు. అందుచేత వెంటనే వాడికి ఉత్తరం చదవాలనే ఆలోచన తట్టలేదు. కాని పోస్టు జవాను ఉత్తరం చూసి తన తల్లి పేరు చదవటం సుందరానికి స్ఫురణకు వచ్చింది. అందుచేత ఆ పేరు ఎక్కడ ఉన్నదీ వెతకసాగాడు. మొట్టమొదట అసలు అర్థమే కాదనిపించిన వ్రాత కొంచెం శ్రమపడితే చదవటానికి వీలుగానే వున్నది. చిరునామాలో సుందరం తన తల్లి పేరు పోల్చుకున్నాడు. కార్డు అవతలి వేపు తిప్పి శ్రద్ధగా ఓపిగ్గా ఒక్కొక్క అక్షరమే చదవసాగాడు. యెంత కష్టపడినా సుందరానికి కొన్ని అక్షరాల పోలిక తెలియనే లేదు.

ఇంతలో సీతమ్మ వంటింట్లో నుంచి, "ఉత్తరమేదిరా, సుందరం" అని కేక పెట్టింది.
పెట్టింది.

"శేషగిరి మామయ్య రాశాడమ్మా" అంటూ సుందరం వంటింటి వాకిలి దగ్గరికి వచ్చాడు.

"నీ కెట్లా తెలుసూ?"

"మామయ్యా, అత్తయ్యా, నరుసూ, కిష్ణవేణీ వస్తున్నారుట. నే చదివా" అన్నాడు సుందరం.

"ఓరి వెధవా! ఏదీ చదువూ" అన్నది తల్లి.

తడువుకుంటూ అక్షరాలు కూడా బలుక్కుంటూ, మధ్య మధ్య కొన్ని అక్షరాలు తల్లి ఊహకు వదులుతూ, అక్కడక్కడ మాటలు తప్పుగా విరుస్తూ సుందరం ఉత్తరమంతా చదివాడు. సుందరం అసలే గుర్తించలేక పోయినవి అంకెలు, అవి వాడికి రావు.

తన అన్న శేషగిరి కుటుంబం ఆ సాయంకాలమే వస్తున్నారని సీతమ్మకు స్వయంగా కార్డు చూసుకుంటేగాని తెలియలేదు. శేషగిరి తాము వస్తున్నవారం రాయలేదు. తేదీ మాత్రమే రాశాడు.

"ఇంకా నయం. అదన్నా రాశాడు" అనుకున్నది సీతమ్మ. తన అన్న మతి మరుపు ఆవిడకు బాగా తెలుసు. ఒక ఉత్తరంలో పిల్లలకో, పెళ్ళానికో జబ్బుగా వున్నట్టు రాసి నాలుగురోజుల తరవాత రాస్తే ఉత్తరంలో ఆ విషయమే రాయడు.

సుందరాన్ని ఎవరన్నా, "అంతా మేనమామే" అంటే సీతమ్మ తన కొడుక్కు శేషగిరి చురుకుమాత్రమే రావాలనీ పరధ్యానం రాగూడదనీ కోరుకునేది. "శేషగిరి చదువుకునే రోజుల్లో చాలా మంచి మార్కులు సంపాదించుకునేవాడు. ఆయన ఒకసారి ఏదన్నా చదివితే ఎన్నటికీ మరవని ఏకసంతగ్రాహి అని ఇప్పటికీ పేరున్నది కాని, ఈ ఏకసంతగ్రాహి బజారుకువెళ్ళి కొనదలచినది మరిచిపోయివస్తాడు. రాయదలచినది రాయటమూ, చెప్పదలచినది చెప్పటమూ మరిచిపోతాడు.

సుందరానికి తన మేనమామనుచూస్తే చాలా అభిమానం. చదువులో తాను 'శేషగిరి మామయ్యంతవాడు కావా'లని వాడికుండేది. ఏడాదికి రెండు మూడుసార్లు శేషగిరి చెల్లెలిని చూసిపోతూ ఉండేవాడు. ఎప్పుడన్నా భార్యనూ పిల్లల్నీ తెచ్చేవాడు గాని, సామాన్యంగా ఒంటరిగానే వచ్చేవాడు.

అందుచేత ఈసారి అందరూ వస్తున్నారంటే సుందరానికి చాలా ఆనందం కలిగింది. వాడికి నరుసు జ్ఞాపకం ఉన్నాడుగాని కిష్టవేణి సరిగా జ్ఞాపకంలేదు. కిష్టవేణికి నాలుగోఏడు వచ్చింది. సుందరంకన్నా ఎనిమిది నెలలు చిన్నది. దానికీ సుందరానికి పెళ్ళి అవుతుందని సగం నవ్వులకూ, సగం నిజానికీ, నలుగురూ అంటుండేవాళ్లు. అందుచేత సుందరం దానితో అట్టే స్నేహంచెయ్యటానికి ప్రయత్నించలేదు.

నరుసు సుందరంకంటె రెండేళ్ళకు తక్కువగా పెద్ద. వాణ్ణి కిందటేడే బళ్ళోవేశారు. తన చదువు చూసి శేషగిరి మామయ్యా, నరుసూ వాళ్ళు నిర్ఘాంతపోతారని సుందరం రూఢి చేసుకున్నాడు. వాళ్ళ రాకకోసం సుందరం తహతహ లాడటానికి కొంతవరకదే కారణం.

అనుకున్న ప్రకారం శేషగిరి భార్యా పిల్లలతో దిగాడు. కాస్సేపు ఇల్లంతా చాలా సందడిగాఉంది. గడిచిన ఏడాది సంగతులూ, మళ్ళీ ఇంకో ఏడాదికి సరిపోయే సంగతులూ మాట్లాడుకున్నారు.

మాటల సందర్భంలో సీతమ్మ తన అన్నతో "అన్నట్టు నీ ఉత్తరం సుందరం నాకు చదివి వినిపించాడు తెలుసా?" అన్నది.

శేషగిరి భార్య కామేశ్వరి, "ఓరీ!" అన్నది. సుందరానికి అక్షరాభ్యాసం చేయించిన రోజు లెక్క చూశాడు. దానికి శేషగిరి కుటుంబం రాలేదు. "కిష్ట"కు తడపరపోసింది. ఈ సంభాషణంతా సుందరానికి చాలాసంతోషంగా ఉన్న సమయంలో శేషగిరి అకస్మాత్తుగా, "సుందరం సంగతి చెబుతావేమిటి సీతా? కిష్ట పుస్తకాలు చదివేస్తుంది. దానికెవ్వరూ అక్షరాలు చెప్పలేదు. దానికి ఇప్పటికీ అక్షరాల వరస తెలీదు తెలుసా? అ ఆ ఇ ఈ ఉ ఊ అని వరుసగా చెప్పమంటే చెప్పలేదు. నరుసు చదివేదంతా విని ఆ మాటలు పట్టుకుని పుస్తకంలో గుర్తుపట్టి అక్షరాలూ, వత్తులూ అన్నీ నేర్చుకుంది" అన్నాడు.

ఒక్కసారిగా సుందరానికి మేనమామమీద పట్టరానికోపమూ, కిష్ణ మీద భరించరాని అసూయ కలిగింది.

కిష్ణ పుస్తకాలు చదవలగదన్న విషయం అప్పటికప్పుడు పరీక్ష పెట్టారు. కిష్ణ అప్పుడప్పుడూ తప్పు చదివినా చాలా వేగంగా చదివింది.

ఆ తరువాత సుందరాన్ని చదవమన్నారు.

సుందరం చదవ నిరాకరించాడు. ఎవరు చెప్పినా వినలేదు.

"వాడు పుస్తకం చదివితే వినాలని వాళ్ళ నాన్న ఎన్నోసార్లు ప్రయత్నించారు. వాడుమటుకు పైకి చదవడు. తనలో తాను చదువుకుంటాడు" అని సీతమ్మ చెప్పింది.

చదువులో నరుసు అట్టే చురుకుకాదని శేషగిరి అన్నాడు కాని, తీరా విచారిస్తే వాడికప్పుడే ఎక్కాలు వచ్చుననీ, కూడికలూ, తీసివేతలూ, హెచ్చవేతలూ, భాగాహారాలూ వచ్చుననీ, ఇంగ్లీషు అక్షరాలు నేర్చుకోబోతున్నాడనీ తెలిసింది.

సుందరానికి కాస్త గర్వం ఏదన్నా ఏర్పడి ఉంటే అది కాస్తా దెబ్బతిన్నది.

❀ ❀ ❀ ❀

వీధిలో బాండుమోతవిని సుందరమూ, నరుసూ, కిష్ణా బయటకి వచ్చారు బండి వెనక భాగంలో ఎవరో కూర్చుని చిన్న చిన్న కాగితాలు పంచి పెడుతున్నారు. ముగ్గురూ బండి వెంటబడి చాలాదూరం వెళ్ళారు. కాని వాళ్ళకు బండిలోవాడు కాగితం ఇవ్వలేదు. చివరకు ఎవరికీ పట్టుబడక నేలమీద పడిన కాగితం నరుసుకు దొరికింది.

దాన్ని ముగ్గురూ ఒక్కసారి చదవాలని ప్రయత్నించి రెండు ముక్కలుగాచించారు. ఆ తరవాత రాజీపడి ముక్కలు దగ్గిరగా పెట్టి చదివారు. నరుసూ కిష్ణవేణి గబగబా చదివారు. సుందరం వాళ్ళతోపాటు చదవ లేకపోయినాడు.

ఇంతకూ అది తారాబాయి సర్కసు. తారాబాయి జుట్టుకు బండ కట్టుకుని ఎత్తుతుందనీ, ఛాతీమీద రాయి పెట్టుకుని సమ్మెటలతో కొట్టించుకుంటుందనీ, బండిని నొసటతో తోస్తుందనీ, ఇంకేమేమో చేస్తుందనీ ఆ కాగితంలో ఉంది. ఆవిడచేసే ఫీట్ల బొమ్మలు గోడలమీద కూడా అంటించి ఉన్నాయి.

"నాన్నా, మనం సర్కసుకు పోవద్దూ!" అని శేషగిరిని పిల్లలు అడిగారు.

"ఏముందర్రా ఈ సర్కసులో? పులులూ, సింహాలూ, ఏనుగులూ ఉండవు, చూస్తే కార్లేకర్ సర్కసు చూడాలి." అన్నాడు శేషగిరి.

కాని సర్కసు చూస్తేగాని వీల్లేదని పిల్లలు పట్టుపట్టారు. శేషగిరి ఒప్పుకున్నాడు. సుందరం ఎన్నడూ సర్కసు చూడలేదు. అందుచేత వాడికి సర్కసు చూడటంలో ఏమి ఆనందం ఉండేదీ తెలియదు. కాని శేషగిరి రకరకాల సర్కసులను గురించి వింత వింత కథలు చెప్పాడు. ఒకసారి బెజవాడలో కార్లేకర్ సర్కసు జరుగుతూంటే సింహం ఒకటి తప్పించుకు పారిపోయింది. మర్నాడు అది మార్వాడీ

సత్రం దగ్గర కూర్చుని ఉన్నది. జనం హడలిపోయినారు. కాని అది ఎవర్నీ ఏమీ చెయ్యలేదు. కార్లేకర్ వచ్చి దాని మెడకు తాడువేసి పట్టుకు పోయినాట్ట.

కోడిరామమూర్తి[2] ఎవరూ చెయ్యలేని ఫీట్లు చేస్తాట్ట. గుండెలమీద ఏనుగును ఎక్కించుకుంటాట్ట, రెండు చేతులతో రెండు మోటారుకార్లు ఆపుతాట్ట.

ఇటువంటి కబుర్లు ఎన్నో శేషగిరి అనంతంగా చెప్పాడు. ఇవన్నీ వింటుంటే సుందరానికి ప్రపంచ చిత్రాలన్నీ తెలుసుకుంటున్నట్టూ, ఇప్పుడే తనకు ప్రపంచంతో సంబంధం ఏర్పడుతున్నట్టూ తోచింది. ఈ ప్రపంచంలో చదువు అంటే పెద్ద విషయంగా కనిపించలేదు. ఇందులో రాక్షసులను జ్ఞాపకం చేసే హేమాహేమీలున్నారు. గుండెలమీద ఏనుగునెక్కించుకుని, రెండు చేతులతోనూ రెండు మోటారుకార్లను నిలిపేవాళ్ళున్నారు.

"కోడి రామ్మూర్తిని నువ్వు చూశావా మామయ్యా?" అన్నాడు సుందరం.

"చూశా, ఏనుగును ఎక్కించుకోవటం కన్న కూడా కార్లు ఆపటం చూడటానికి అద్భుతంగా ఉంటుంది. మధ్య చేతులు కట్టుకు నిలబడతాడు. రెండు కార్లూ మోకులతో జబ్బలకు కట్టుకుంటాడు రెండుకార్లూ ఒక్కసారిగా స్టార్టు చేస్తారు. ఇంజన్లు కుంయోమని గోలెత్తుత్తె, కాని ఒక్కకారూ ముందుకుపోలేదు."

సుందరం సాయంకాలం ఎప్పుడవుతుందా అని కూచున్నాడు. శేషగిరి పిల్లలు రాత్రికి చూసే సర్కసును గురించి ఇప్పటినుంచే ఆనందిస్తూ, బిగ్గరిగా మాట్లాడ సాగారు. సుందరం పైకి విశేషం మాట్లాడలేదు. వాళ్ళ మాదిరిగా ఉత్సాహం చూపటం చాతకాక పోవటమే దానికి కారణం. కాని ఈ విచిత్రమైన అనుభవం కోసం సుందరం హృదయం కొట్టుకుపోతూనే వుంది.

పొద్దుకూకి దీపాలు పెట్టిన కాస్సేపటికల్లా పిల్లలకు అన్నాలు పెట్టింది సీతమ్మ. ఆ రోజల్లా సుందరం చదువు సంగతి ఎత్తకపోవటం ఆవిడ గమనించింది.

"చిన్న వెధవకు రెండు రోజులు ఆటవిడుపు" అనుకున్నదావిడ.

సుందరానికి ఆ హడావిడిలో అన్నం కూడా సరిగా సయించలేదు.

రాత్రి రెండో ఆటకు అందరూ తాళంపెట్టి వెళ్ళారు. సర్కసు దేరా, చుట్టూ గ్యాసులైట్లు. బాండూ, దేరాకు కట్టిన తాళ్ళూ, లోపల గాలరీ అంతా ఇంకేదో లోకమల్లె ఉంది సుందరానికి.

ఏదన్నా వింత అనుభవాలు పొందుతున్నప్పుడు జ్ఞానేంద్రియాలు మామూలుగా పనిచేసిన దానికన్నా చాలా రెట్లు చురుకుగా పనిచేస్తాయి. అందుచేత

2. కోడిరామమూర్తి (1885-1938) మంచి వస్తాదు. 1903లో సర్కస్ ప్రారంభించి యావత్ దేశ ఖ్యాతి గడించారు విదేశాలలో వివిధ రీతుల్లో భుజబల ప్రదర్శన చేసి కీర్తి గడించిన వ్యక్తి. ఒకేసారి $3\frac{1}{2}$ టన్నుల బరువును భరించగల బలశాలి. జర్మన్ వస్తాదు యూజెన్‌శాండో 1907 లో భారతదేశానికి వచ్చి రామమూర్తితో తలపడలేక వెనుతిరిగి వెళ్ళారు.

బిరుదులు: కలియుగ భీముడు, మల్లయుద్ధ మార్తాండుడు, జయవీరహనుమాన్, ఇండియన్ హెర్క్యులెస్.

ఈ సర్కసు అనుభవాన్ని సుందరం అచ్చగా కళ్ళతోనేకాక, చెవులతోనూ ముక్కుతోను, చర్మంతోనూ కూడా తనివితీర పొందాడు.

ప్రదర్శన సంగతి వేరే చెప్పక్కర్లేదు. తారాబాయి తెల్లని గౌను ఒకటి వేసుకొని వచ్చింది. పెద్ద బండరాతిని తాళ్ళతో జుట్టుకు కట్టుకొని మోకాళ్ళమీద చేతులానించి దాదాపు జానెడెత్తు పైకెత్తింది. ప్రేక్షకులంతా చాలా సేపు చప్పట్లు కొట్టారు. శేషగిరి పిల్లలు కూడా గాలరీలో కూచుని చప్పట్లు కొట్టారు.

తారాబాయి ఇంకా చాలా ఫీట్లు చేసింది. రొమ్ముమీద రాయి పెట్టుకొని సమ్మెటలతో కొట్టించుకున్నది. ఒక బండిలో పదిహేను మందిని ఎక్కించి దాని పోలును నుదుటికి పెట్టుకుని తోసింది. కత్తులమీద పడుకున్నది.

మధ్య మధ్య ఇతర ఫీట్లు కూడా చేశారు. కాని అన్నిటిలోకీ తీగెమీద నడిచిన పిల్ల సుందరాన్ని ప్రబలంగా ఆకర్షించింది. ఆ అమ్మాయి వేసుకున్న నీలం గౌనూ, **చేతిలో** పట్టుకొన్న అందమైన గొడుగూ, తీగమీద నుంచి పడకుండా ఆ పిల్లచేసిన ఫీట్లూ, వాడికి అత్యద్భుతంగా తోచినై. ఆ పిల్ల ఫీట్లు చేసినంతసేపూ ఒక పెద్దవాడు ఆమెకేసే చూస్తూ కింద నిలబడి ఆమె ఎటుపోతే తానూ అటు పోతున్నాడు. అమె పొరపాటున కాలుజారి పడితే పట్టుకొనడానికి ఆ మనిషి ఉన్నాడని శేషగిరి పిల్లలకు చెప్పాడు.

ఆ పిల్లమీద తనకెంత అభిమానంగా ఉన్నదో, ఆ కిందవున్న మనిషికికూడా అంత అభిమానం ఉండి ఉంటుందని సుందరం నమ్మాడు.

ఆ రాత్రి నిద్రపట్టబోయ్యే ముందు కూడా సుందరం ఆ సర్కసు పిల్లను గురించే ఆలోచిస్తున్నాడు. ప్రపంచంలో వున్న చదువుకున్న వాళ్ళందరికన్నా, ఉద్యోగస్తులందరికన్నా ఆ పిల్ల ఒక్కతే నిజంగా ధన్యురాలని సుందరానికి గట్టి నమ్మకం కలిగింది.

## 5

సుందరం తల్లి దగ్గిర నేర్చుకున్న చదువుతో హైస్కూల్లో ప్రవేశించటానికివీల్లేదు.

“వాడికింకా ఎక్కాలు రావాలి, లెక్కలు రావాలి. ఇదంతా నీవల్ల ఎట్లా అవుతుంది? ఎవరినన్నా మేష్టర్ని పెట్టాలి” అన్నాడు శ్రీమన్నారాయణ సీతమ్మతో.

“ఏదో ఒకటి దబ్బున చూడండి. నెలరోజుల్నుంచి వాడికి చదువూ సంధ్యాలేదు. మళ్ళీ అలవాటు తప్పితే, మొండిపడిపోతాడేమో” అన్నది సీతమ్మ.

“చూద్దాం.... సుబ్రహ్మణ్యాన్ని పెడదామని ఉంది. శ్రద్ధగా చెబుతాడు” అన్నాడు శ్రీమన్నారాయణ.

“ఏదో ఒక గంటసేపు చెప్పానంటే చెప్పి పోతే కాదు. మూడు నాలుగు గంటలన్నా కూర్చుని నిలకడగా చదువుచెప్పే మేష్టర్ని చూడండి” అన్నది.

“మేష్టర్ని ఇంటికి పిలిపిద్దామనా?” అన్నాడు శ్రీమన్నారాయణ.

“మరెట్లా?” అన్నది సీతమ్మ ఆదుర్దాగా.

"ఇంకానయం; యింటికొస్తే జాస్తి దబ్బుదుగుతారు. అదీకాక ఎక్కువసేపు చెప్పరు. వాడికా చదువంటదు. సుందరం బడికి పోవలసిందే. రోజుకు అయిదారు గంటలసేపు పిల్లలతో కలిసి చదువుకుంటే వాడికేదన్నా అంటుతుంది. పిల్లలు ఒంటరిగా ఎన్నడూ చదువుకోరాదు. తెలిసిందా?" అన్నాడు శ్రీమన్నారాయణ.

ఇందులో నిజం సీతమ్మ గ్రహించలేకపోయింది.

"వాడికి బడి అచ్చిరాదండీ. కిందటిసారి రాఘవయ్య బడి చూడలా? ఒంటిగా నా దగ్గిర చదువుకుంటేనే వాడికి చదువు బాగా అంటింది. మిగిలిన పిల్లలతోచేరి వాడు చెడిపోతాడుగాని చదువుకోడు" అన్నది సీతమ్మ.

శ్రీమన్నారాయణ భార్యకు గట్టి ఉపన్యాసం ఇచ్చాడు.

"నీ చాదస్తం కొంత మార్చుకోవాలి. చెబుదామని చాలా రోజుల్నుంచి అనుకుంటున్నా. కాని అశ్రద్ధ అయిపోతున్నది. కొన్ని విషయాల్లో సుందరాన్ని నువు పాడు చేస్తున్నావు. వాడు చూడూ, అందరి పిల్లలల్లే ఆడుకోడేం? అది చాలా తప్పు. ఎప్పుడన్నా సుబ్బమ్మగారమ్మాయి లక్ష్మీతో పోచుకోలు కబుర్లు చెప్పటం తప్పిస్తే వాడెన్నడూ సాటి పిల్లలతో ఆడుకోగా నేను చూడలా. అది వాడికి మంచిది కాదు. నా అనుభవాన్ని బట్టి చెబుతున్నా విను. పిల్లలు మేస్టరు దగ్గిర, పుస్తకాల్లోనూ నేర్చుకునేదానికన్నా తోటి పిల్లల దగ్గిర ఎక్కువ నేర్చుకుంటారు. వాళ్లతో చేరి నీ కొడుకు చెడిపోతాడేమో అని వాణ్ణి ఎన్నాళ్ళు మీదు గడతావ్? రేపు హైస్కూల్లో చేరితే?... వాడు పిల్లలతో కలిసి తిరగాలి. చదువుకున్నప్పుడు చదువుకుని, ఆడుకున్నప్పుడు ఆడుకోవాలి."

ఈ మాటలు విని సీతమ్మ వూరుకున్నదే గాని వీటిలో ఆవిడకు విశ్వాసం కుదరలేదు. సుందరం తన దగ్గిర అక్షరాలు నేర్చుకుంటున్న రోజుల్లో వాడి చదువు విషయం తన భర్త అభిప్రాయాలకన్న తన అభిప్రాయాలే సరిగా పనిచెయ్యటం ఆవిడ చూసి ఉన్నది. కనుక యిప్పుడు ఆయన చెప్పే మాటల్లో కొంత నిజం ఉండవచ్చునన్న అనుమానం ఆవిడకు తగల్లేదు. పైగా పిల్లల్లో చదువుకునేవాళ్ళు ఆటలు మరగరనీ, ఆటలు మరిగినవాళ్ళు చదవరనీ ఆవిడకు గట్టి నమ్మకం. సుందరం ఏ ఆటలకూ పోకపోవటం చూసి ఆవిడ గర్వపడేది. వాడికి చదువు బాగా వస్తుందనుకోవటానికి ఆవిడ ఇదే ఆధారంగా చెప్పేది.

శ్రీమన్నారాయణ చెప్పిన అన్ని మాటలకన్నా. యింటికి మేస్టర్ని పిలిపిస్తే ఎక్కువ ఖర్చన్నమాటా, ఇంటికొచ్చే మేస్టరు ఎక్కువసేపు చదువు చెప్పడన్నమాటా ఆవిడకు బాగా నచ్చాయి.

తరువాత కొద్ది రోజులకే సుందరం సుబ్రహ్మణ్యం బళ్ళో చేరాడు.

అది వీధిబడి. కోమట్ల అరుగుమీద పొద్దునా, సాయంత్రమూ నడిచేది. అందులో దాదాపు ఇరవైమంది పిల్లలుండేవాళ్ళు. వీళ్ళంతా నెల జీతాలు, పావలా, అర్ధా యిచ్చి చదువుకునేవాళ్ళు. నిజానికి సుందరానికి వీళ్ళతో సంబంధం లేదు. సుందరం చదువు వేరు. సుబ్రహ్మణ్యం శ్రీమన్నారాయణ దగ్గర ఇరవై రూపాయలు తీసుకుని ఈ ఏడాదల్లా సుందరానికి తెలుగూ, ఇంగ్లీషూ, లెక్కలూ చెప్పి వేసవి

శలవల అవతల వాడ్ని హైస్కూల్లో మూడో క్లాసులో ప్రవేశపెట్టటానికి ఒప్పుకున్నాడు.

సుందరానికి మొదటి వాచకమూ, ఎక్కాల పుస్తకమూ, సుమతీ శతకమూ కొనిపెట్టారు. వాడు వాచక పుస్తకంలోనుంచి రోజూ "చూచివ్రాత" రాయాలి. రోజు కొక ఎక్కం అప్పగించాలి. సుమతీ శతకంలో పద్యం ఒకటి కంఠతా పట్టాలి. ఇంతే వాడి చదువు మిగిలిన పిల్లలు క్లాసులవారీగా అక్షరాల గుణింతాలు అందరూ కలిసి చదవటమూ, ఎక్కాలు చదవటమూ, పంతులు చెప్పే మాటలు "డిక్టేషను" రాయటమూ చేసేవాళ్ళు. ఆ తరువాత అల్లరి చెయ్యకుండా వుండటం తప్ప వాళ్ళకేమీ పనివుండేది కాదు.

సుబ్రహ్మణ్యం పంతులు పిల్లల్ని కొట్టేవాడేగాని కొట్టటం పనిగా పెట్టుకునే వాడుకాడు. ఆయన యెప్పుడూ నవ్వేవాడుకాడు. అమితంగా మాటాడేవాడుకాడు. అందుచేత ఆయనంటే పిల్లలకు భయంగా వుండేది. అంతేకాక ఆయన పిల్లలకు చదువు చెప్పేవాడు. ఎవరికి ఎంత చదువు అంటుతున్నదీ కనిపెట్టేవాడు.

ఈ బళ్ళో పిల్లలు సుందరాన్ని కాస్త ఎక్కువగా చూసేవాళ్ళు. దానికి కారణమేమిటంటే వాడు వచ్చే ఏడు హైస్కూలులో చేరబోతున్నాడని అందరికీ తెలిసింది. బళ్ళో చేరిన కొద్ది రోజుల్లోనే సుందరం యిద్దరు ముగ్గురు స్నేహితులను సంపాదించాడు. అందులో ఒకడు వెంకటప్పయ్యని గొల్లవాళ్ళ కుర్రాడు. పిల్లలందరిలోకి వాడే పెద్ద. పంతులు లేనప్పుడు పిల్లలను కనిపెట్టి ఉండేవాడు. వాడు మూడేళ్ళనుంచీ ఈ బళ్ళోనే చదువుతూ, యిప్పుడు మూడో క్లాసులో ఉన్నాడు. కాని ఇంగ్లీషు నేర్చుకోవటంలేదు.

వెంకటప్పయ్య సాధారణంగా నోరు తెరిచి మాట్లాడేవాడుకాడు. పంతులు వాడ్ని బజారుకు పంపించి ఏమన్నా తెప్పించేవాడు. అంగడి సామాను దగ్గర్నుంచి, ప్రతిదీ చక్కగా బేరంచేసి, మంచి సరుకుగా తెచ్చేవాడు వెంకటప్పయ్య. వాడికన్న మంచివాడూ, తెలివిగలవాడూ, అనుభవం గలవాడూ ప్రపంచంలో లేడని సుందరం నమ్మాడు.

లక్ష్మయ్య అని కుమ్మరివాళ్ళ కుర్రాడొకడుండేవాడు. వీడు బీదవాడని చూస్తేనే తెలిసిపొయ్యేది. నీరకావి రంగు ముతక చొక్కా వేసుకునేవాడు. దానికి గుండీలుండేవి కావు. వాడికి లాగుండేదికాదు. గోచీ పెట్టుకునేవాడు. జుట్టుకు ఏ జన్మానా నూనె ఉండేది కాదు. లక్ష్మయ్య పగిలిపోయిన పలక ముక్కతో బడికి వచ్చేవాడు. వాడు జేబులో పచ్చిమిరపకాయలు గుప్పెడు వేసుకొచ్చి ఒకనాడు "యెవరైనా బలపం ముక్క ఇస్తే పచ్చి మిరపకాయ తింటా" నన్నాడు. ఎవరో ఒక బలపం ముక్క ఇచ్చారు. లక్ష్మయ్య అమాంతంపచ్చి మిరపకాయ కరకరా నమిలేసి మింగేశాడు. రోజ లేదు. రొప్పలేదు. దాహం తాగలేదు.

ఇంకొకరెవరో ఇంకో బలపం ముక్క ఇస్తాం ఇంకో మిరపకాయ తినమన్నారు. లక్ష్మయ్య తినబోతుండగా సుందరం, "వద్దు, వద్దు, తినకు కావలిస్తే నా బలపం ఊరికే తీసుకో?" అన్నాడు. లక్ష్మయ్య ఒక్కసారిగా రెండు మిరపకాయలు తీసి రెంటినీ నమిలి రెండు బలపం ముక్కలూ పుచ్చుకున్నాడు.

సుబ్బులు అని మరో కుర్రవాడుండేవాడు. వీడు బ్రాహ్మడు. 'పొట్టిగిత్తా' అని పంతులు వాణ్ణి పిలిచేవాడు ఉన్న పిల్లలందరిలోకీ వాడే పొట్టివాడు. నడిచినా మాట్లాడినా రైళ్ళు పరిగెత్తుతున్నట్టుండేది. అసలే పొట్టేమో అందరి దృష్టి ఆకర్షించడానికి గట్టిగా అరచి మాట్లాడేవాడు. వాడి మొహాన కనుబొమ్మల మధ్య కాల్చిన మచ్చ చూసి సుందరం వాణ్ని అదేమిటని అడిగాడు.

"చిన్నప్పుడు కాల్చారు" అన్నాడు సుబ్బులు నిర్లక్ష్యంగా.

"ఎవరు కాల్చారు? ఎందుకు కాల్చారు? నువేం అల్లరి చేశావ్?" అన్నాడు సుందరం ఆదుర్దాగా.

"ఓరీ వెర్రిమొగమా, అల్లరి చెయ్యటమేమిటి? చిన్నబిడ్డగుణం వస్తే కాలుస్తారు. కాల్చకపోతే అప్పుడు హరహరా అయిపోయ్యేవాణ్ని. ఏమనుకున్నావో!"

"చిన్నబిడ్డ గుణమంటే?"

"అది కొంతమంది కొస్తుంది... ఇదిగో చూసుకో" అంటూ సుబ్బులు పొట్టమీద వాతలు చూపించాడు. "ఒకసారా? నాలుగుసార్లు, నాసామిరంగా, నాలుగుసార్లూ చచ్చేవాణ్నే వాతలు వెయ్యకపోతే!"

అందుకు సుబ్బులు ఏమని గర్వపడుతున్నాడో సుందరానికి అర్థం కాలేదు.

"ఏం పెట్టి కాలుస్తారోయ్?" అన్నాడు సుందరం. సుబ్బులు దగ్గిర తెలుసుకోవలసిన విషయాలు చాలా ఉన్నాయని గ్రహించి.

"ఈ పొట్టమీద వాతలు సూదికాల్చి వేశారు. మొహాన చుట్టకాల్చి వేశారు."

సుందరం నిర్ఘాంతపోయాడు. మనుష్యుల్ని యిట్లా కాల్చటం ఏమిటో వాడికి అర్థంకాలేదు. చచ్చిపోవటం ఎక్కువ బాధా? వాతలు వేయించుకోవటం ఎక్కువ బాధా? అని వాడు ఆలోచించసాగాడు.

❀ ❀ ❀ ❀

"సీతమ్మ తల్లీ, పిల్ల అన్నం అఘోరిస్తున్నది. దానికి ఏం కావాలో కాస్త కనుక్కోమ్మా" అని సుబ్బమ్మగారు అవతలినుంచి కేక పెట్టింది.

"నెలగామాలు" అన్నది సీతమ్మ.

ఆ సమయానికే సుందరం కూడా అన్నం తింటున్నాడు. తల్లి లేవటంచూసి "ఎక్కడికమ్మా?" అన్నాడు.

"లక్ష్మి అన్నం తింటున్నది. దానికేం కావాలో కనుక్కొస్తా. సుబ్బమ్మగారు ముట్టయిందట" అన్నది సీతమ్మ.

ఆవిడ మళ్ళా తిరిగొచ్చేలోపుగా సుందరం ప్రశ్న సిద్ధంచేసి అట్టే పెట్టాడు.

"అమ్మా, నువు ముట్టుకావటం లేదే?"

సీతమ్మ నవ్వి "వెధవకు అన్ని ఆరాలు కావాలి... నా పొట్టలో తమ్ముడున్నాడు. అందుకని ముట్టు కావటంలా" అన్నది.

ఈమాట విని సుందరం చాలా సంతోషించాడు.

"నిజంగానా అమ్మా? తమ్ముడెప్పుడు బయటికొస్తాడూ?"

"నువు హైస్కూల్లో చేరేలోపల వస్తాడులే."

ఆరోజు చాలా ఉత్సాహంతో బడికి వెళ్ళాడు సుందరం. సుబ్బులు రాగానే వాడితో రహస్యంగా, "ఒరే, నాకు తమ్ముడు పుడతాడు" అన్నాడు.

"ఏం? మీ అమ్మ కడుపుతో ఉందా?"

ఆ మాట సుందరం చెవులకు ఎబ్బెట్టుగా తోచింది.

"కడుపుతో వుండడమేమిటి? మా అమ్మ పొట్టలో తమ్ముడున్నాడు" అన్నాడు సుందరం.

"అదేరా వెర్రినాయనా, కడుపుతో ఉండడమంటే. ఈ ఆడవాళ్ళకేం పనిలేదు ఎప్పుడూ కడుపుతో ఉంటారు" అన్నాడు సుబ్బులు. తన తండ్రి తరుచు అనేమాట వల్లెవేస్తూ, "మీ అమ్మ కడుపులో మగపిల్లవాడున్నాడని నువ్వేమన్నా చూశావా ఆడపిల్ల వుండకూడదూ!"

"మా అమ్మ చెబితేనే!"

"పుట్టేదాకా ఎవరికీ తెలీదులే."

నుళ్ళీ ఎవరితోనూ చెప్పనని సుందరంచేత 'పరమ ప్రమాణ పూర్తిగా' ఒట్టు వేయించుకుని సుబ్బులు ఆడవాళ్ళకు కడుపు ఎట్లా అవుతుందో చెప్పాడు. తనకు ఇతరత్రా తెలిసిన మటుకు, చెప్పటం వాతనయిన మటుకు.

సుబ్బులు చెప్పినది ఒక్క ముక్కగూడా నమ్మలేకపోయినాడు. ఎవరో "అసహ్యమైన" మనుషులు చేసేపని అందరూ చేస్తారా అని – ముఖ్యంగా తన తల్లీ తండ్రీ చేస్తారా అని – సుందరానికి అనుమానం కలిగింది. కాని సుబ్బులు మాటల్లో కొంత నమ్మకమూ కుదిరింది.

ఈ కొద్ది వాటి విజ్ఞానం సుందరం ఆత్మని ఎంతో సంక్షోభ పెట్టింది. అయితే సుబ్బులు మాటల సందర్భంలో ఇంకో విషయం చెప్పాడు. దాంతో సుందరం మనస్సు పిల్లలు పుట్టడం మీదినుంచి మరోవైపుకు పూర్తిగా మళ్ళింది.

ఇంగ్లీషువాళ్ళూ, జర్మనీవాళ్ళూ యుద్ధం చేస్తున్న సంగతి[3] సుబ్బులు చూసినట్టుగా చెప్పాడు. రాములవారు ఎప్పుడో రావణాసురుడితో యుద్ధం చేసినట్టు

3. ఇది 1914–18 సంవత్సరాల మధ్య జరిగిన మొదటి ప్రపంచయుద్ధ ప్రస్తావన. ఈ యుద్ధానికి తక్షణ కారణం బాల్కన్లలో తలయెత్తిన జాతీయవాదం. సర్బియన్ జాతీయ వాదులు ఆస్ట్రో హంగేరియన్ సింహాసనానికి వారసుడైన ఆర్చిడ్యూక్ని చంపడంతో యీ యుద్ధానికి బీజాలు పడ్డాయి. మొదట్లో యూరప్ రాజ్యాలే పాల్గొన్నా, ఆ తర్వాత ప్రపంచయుద్ధంగా మారింది. 1918 నవంబరు 11వ తేదీన జర్మన్ లొంగుబాటుతో కాంపియాన్ యుద్ధ విరమణ ఒడంబడిక జరిగింది. భారత ప్రజల అభిప్రాయంతో నిమిత్తంలేకుండా బ్రిటిష్ ప్రభుత్వం యీ యుద్ధంలోకి భారతదేశాన్ని కూడా నెట్టింది. 10 లక్షలకు పైగా భారతీయులను వివిధ రంగాలకు బ్రిటన్ పంపించింది. దాదాపు లక్షమంది భారతీయులు యీ యుద్ధంలో మరణించారు. భారత జాతీయరుణం ముప్పయిశాతం పెరిగింది. భారతీయ బూర్జువా వర్గం, ధనికతెగ, పెద్ద రైతులు బాగుపడ్డారు. "యుద్ధానంతర సంక్షోభం" ఎట్లా ఉన్నదీ తెలిసే అవకాశంలేక, తెలిసినా అది తమ జీవితాలను ఏ విధంగా స్పృశించేది అర్థంకాని భారత ప్రజలలో చాలా తరగతులకు రాని మంచిరోజులుగా నవలలో వర్ణితం. చూ. 12వ అధ్యాయం మొదటి పేరా.

మాత్రం సుందరానికి తెలుసు. ఇప్పుడుకూడా యుద్ధాలు జరుగుతాయని సుందరానికి తట్టలేదు.

"జర్మనీవాళ్ళు భలే ముండాకొడుకుల్లే. ఇంగిలీషు వాళ్ళ దగ్గిర ఒక బంగారం కొండ వుంది" – అన్నాడు సుబ్బులు.

"కొండంతా బంగారమే?" అన్నాడు సుందరం.

"ఆ అందులోనించి రాళ్ళు తెచ్చి మనం మురుగులు చేసుకోవచ్చు. ఆ కొండ ఎట్లాగైనా సంపాదించుదామని జర్మనీవాడు – ఇద్దరూ యుద్ధం చేస్తున్నారు. ఎవళ్ళ గెలిస్తే బంగారంకొండ వాళ్ళకు వస్తుంది. ఇంగిలీషువాళ్ళు ఓడిపోతే మనకు పీడ వదుల్తుందని మానాన్న చెప్పాడు" అన్నాడు సుబ్బులు. వాళ్ళ నాన్న చెప్పినదానికి తభావతుండటానికి వీలులేనట్టు.

"ఇంగిలీషువాళ్ళు ఓడిపోతారా?" అన్నాడు సుందరం.

"ఓడిపోక యేం చేస్తార్రా? జర్మనీవాడేం చేశాడో తెసుసా? ఒక కోడిని తయారుచేశాడు. అది ఏట్లా ఉంటుందీ? అచ్చుగా నిజమైన కోడిలాగే ఉంటుంది. నిజమైన కోడిలాగే! కొక్కొరొకో అంటుంది. ఆ కోడిని ఇంగిలీషు వాళ్ళదగ్గిరికి పంపించాడు. అది నిజంగా కోడే అనుకొని ఇంగిలీషువాళ్ళు దాన్ని పట్టుకునేప్పటికి అదికాస్తా ఢాంమని బద్దలై ఇంగిలీషువాళ్ళంతా చచ్చారు" అన్నాడు సుబ్బులు చేతులు తిప్పుతూ, అభినయిస్తూ.

"ఇంగిలీషువాళ్లు ఓడిపోయినారా?"

"అప్పుడేనా? ఓడిపోతే యుద్ధం అయిపొయ్యేదేగా?" అన్నాడు సుబ్బులు.

"ఇదంతా, చక్కగా నీ కెవరు చెబుతార్రా?" అన్నాడు సుందరం అసూయగా.

"మా నాన్న అప్పుడప్పుడూ పత్రిక చూస్తాడుగా?" అన్నాడు సుబ్బులు నిర్లక్ష్యంగా. ఇంతలో ఇతర పిల్లలు కూడా వచ్చారు. ఇంకేవో విషయాలు మాట్లాడటం మొదలెట్టారు.

సుబ్రహ్మణ్యం బడిలో హింస పడక పోయినా వీధిబడి నరకం కళ్ళారా చూడటానికి సుందరానికి మంచి అవకాశం లభించింది. ఎందుచేతనంటే సుబ్రహ్మణ్యం బడికి కొంచెం ఎగువన, వీధి అవతలిపక్కగా, మరో ఇంటి అరుగుమీద మార్కండేయులు పంతులు బడి ఉండేది. అందులో ముప్పై, నలభైమంది పిల్లలుండేవాళ్లు. ఆ వీధిలోవున్న అసలు వీధిబడి అదే. ఎవరన్నా "వీధిబడి ఎక్కడ?" అని అడిగితే, వీధిలోవాళ్లు మార్కండేయులు పంతులుబడే చూపించేవాళ్ళు.

మార్కండేయులు అచ్చుగా యమకింకరుడే. పిల్లల్ని హత్య చెయ్యటం మినహాగా మిగిలినదంతా చేసేవాడు. ప్రతి మనిషికీ అంతో ఇంతో కల్పనాశక్తి ఉంటుంది. తనకు భగవంతుడిచ్చిన కల్పనాశక్తి యావత్తూ మార్కండేయులు పిల్లల్ని హింసించటంలో కొత్త పద్ధతులు సృష్టించటానికి వినియోగించేవాడు.

మార్కండేయులుకు చాలా పేరుండేది. సుబ్రహ్మణ్యం పంతులు బళ్లో చదువుకునే పిల్లల్లో కూడా కొంతమంది మార్కండేయులు చాలా గొప్పగా చదువు

చెబుతాడని నమ్మేవాళ్ళు. అయితే మార్కండేయులు చదువు చెప్పేవాడుకాదు. ఆయన బళ్ళో పిల్లలు పొద్దునా సాయంత్రమూ నెలల తరబడి "కా, కాకు దీర్ఘమిస్తే కా, కాకు గుడిస్తే కి, కీకు పొల్లిస్తే కీ, కాకు కొమ్మిస్తేకూ..." అని.

'రెణ్ణాల్లెండీ, రెండయిదుల్పాదీ, రెండార్లు పన్నెండూ, రెండేళ్ళ పధ్నాలుగూ..." అని కేకలు పెడుతూ ఉండేవాళ్ళు.

కాని మార్కండేయులు పిల్లలకిచ్చే శిక్షణలో ఇది ముఖ్యభాగం కానేకాదు. పిల్లలు ఇంటిదగ్గర పెద్దవాళ్ళమాట విననందుకూ, బళ్ళో కూచున్న సమయంలో పిల్లలు స్వాభావికంగా చేసేపనులు చేసినందుకూ, మార్కండేయులు పిల్లల్ని చెండుకు తినేవాడు. పిల్లలు స్వతహాగా దుర్మార్గులనీ వాళ్ళకు తనపై భయం కలిగిస్తే చెడు యావత్తూ వదిలిపోయి బాగుపడతారనీ మార్కండేయులు విశ్వాసమై ఉంటుంది.

మార్కండేయులు పిల్లల్ని శిక్షిస్తుంటే చూసేవారికి ఆయనకు పిల్లలమీద ఏదో పగవున్నదా అనిపించేది. ఆయన పిల్లలను మంచివాళ్ళను చేసే పద్ధతులలో తల గోడకేసి కొట్టటమూ, పిల్లల్ని డొక్కల్లోతన్ని అరుగు ఒకమూల నుంచి ఇంకోమూలకు విసరటమూ, వాళ్ళ చేతులు మెలిపెట్టటమూ, వాళ్ళను జుట్టు పట్టుకుని పైకెత్తటమూ మొదలయిన నాజూకు లుండేవి. ఎన్నో సార్లు మార్కండేయులు స్కూల్లో పిల్లలు పంతులు దెబ్బలకు లాగుల్లో ఉచ్చలు పోసుకునేవాళ్ళు. దొడ్డికిూచునేవాళ్ళు.

ఒకరోజు మార్కండేయులు డొక్కలో తన్నిన తన్నుకు ఒక కుర్రవాడు అరుగుమీదినుంచి వీధిలోపడి ప్రాణం కడబట్టి చచ్చినట్టుగా పడిపోయినాడు. నలుగురూ చేరారు. మొహాన నీళ్ళుచల్లి వాణ్ణి బతికించారు. ఒక్కరు కూడా మార్కండేయులు పంతుల్ని, "ఇదేమిటి? నువు మనిషివా గొడ్డువా" అని అడగలేదు. ప్రాణాలు కడబట్టిన పిల్లవాణ్ణి తెప్పరించటానికి ఆయన సహాయపడలేదుకూడా. సహాయపడితే మిగిలిన విద్యార్థులకు లోకువవుతాడు?

ఇదంతా ప్రత్యక్షంగా చూస్తున్న సుందరానికి ఆ క్షణానే వెళ్ళి మార్కండేయుల్ని గొంతుపిసికి చంపెయ్యాలన్నంత కోపం వచ్చింది. ఇంతవరకూ సుందరానికి ఎవరిమీదా అంతకోపంవచ్చి వుండలేదు. ఇది వాడికి తొలి అనుభవం.

చచ్చినంతపనై మళ్ళీ ప్రాణంవచ్చిన కుర్రాణ్ణి ఎవరో యింటికి చేర్చారు. మరుక్షణమే మార్కండేయులు తన "శిక్ష" ప్రారంభించాడు. నలుగురు పిల్లల్ని గోడకుర్చీ వేయించాడు. ఇద్దరిచేత గుంజీలు తీయించాడు.

మార్కండేయులు గుంజీలు తీయించటం ఒక కవాతు. పాదాలు రెండూ కలిపి పెట్టాలి. కుడిచేత్తో ఎడమ చెవీ ఎడమ చేత్తో కుడిచేవీ పట్టుకోవాలి. ముందు మోకాళ్ళమీద పడాలి. తరువాత మోచేతులమీద పడాలి. యాభయ్యో, వందో గుంజీలు తీస్తున్నంతసేపూ పాదాలు ఎడమైనా, చెవికి చెయ్యి ఎడమైనా వీపు పేలిపోతుంది. యాభై గుంజీలు ఈ విధంగా తీసేసరికి పిల్లల మోకాలిమీది లాగూ, మోచేతిమీది చొక్కా రక్తం మరకలయేవి.

ఒకరోజు ఒక కుర్రాడు మోకాళ్ళకూ మోచేతులకూ గుడ్డలుచుట్టుకు వచ్చాట్ట.

యాభై గుంజీలు తీసినా లాగుగాని చొక్కాగాని రక్తం మరకలు కాలా. కారణం తెలుసుకొని మార్కండేయులు పేంబెత్తంతో వీపు వాయకొట్టాడు.

వీధిబడి జీవితంలో సుందరం చూసిన వాటన్నింటిలోకీ వాడికి భయంకరంగా కనిపించి, ఎంతో కాలంపాటు జ్ఞాపకం వచ్చినప్పుడల్లా చెప్పరాని ఆవేదన కలిగించినది బండకొయ్య. అంతకు పూర్వం బండకొయ్య గురించి విననన్నా వినకుండా ఆకస్మికంగా చూసేటప్పటికి సుందరానికి జీవితాన్ని గురించిన భయంకరమైన ఒక కొత్త సత్యం తనమీద భారంగా విరుచుకుపడ్డట్టు అయింది.

బండకొయ్య మోస్తూ సుందరం కంటపడిన కుర్రవాడికి ఏ పన్నెండేళ్ళో ఉంటాయి. వాడికి చొక్కాలేదు. చాలీచాలని లాగు బూడిద రంగుది తొడుక్కున్నాడు. వాడి మొహాన మనిషికుండవలసిన భావాలేవీలేవు. అచ్చగా జంతువల్లే ఉన్నాడు. వాడికంట తడిగాని, మొహాన బాధగాని, విచారంగాని, రోషంగాని, పౌరుషంగాని ఉంటే సుందరం హృదయం వాడికి దగ్గిరగా వెళ్ళటానికి ప్రయత్నించి ఉండేది. కాని వాడిలో ఇవేవీ లేవు. బండకొయ్య రెండు చేతులమీదా అడ్డంగా పెట్టుకొని మోస్తున్నాడు. బండకొయ్యను కొంచెం జాగ్రత్తగా పరిశీలిస్తే దాన్ని ఎవరో పనిపెట్టుకొని ఒక పద్ధతి ప్రకారం తయారు చేశారని సుందరానికి అర్థమయింది. పిల్లల్ని కొట్టడానికని బెత్తాలు తయారు చేస్తారన్నమాట మనస్సుకు తోస్తేనే సుందరానికి మనస్సులో ఏదో వికారంగా ఉంటుంది. ఇటువంటి బండకొయ్యలు తయారుచేస్తారంటే కలిగిన వికారాన్ని సుందరం బొత్తిగా భరించలేక పోయాడు.

బండకొయ్యకొక ఇనప గొలుసు తాపటం చేసివుంది. ఆ గొలుసే బండకొయ్య మోసేవాడి కాళ్ళకు రెంటికీ కట్టివుంది. వాడు కావాలన్నా పెద్ద అంగలు వెయ్యలేడు. గొలుసు పట్టుకుంటుంది. బండకొయ్య క్రిందపడేసి పారిపోవటానికి వీల్లేదు. గొలుసు బరువు కావటం చేతనో ఏమిటో ఆ కుర్రాడు చిన్న అంగలైనా కాలు ఎత్తివెయ్యక, కాళ్ళు నేలమీదనే రాస్తూ ముందుకు పోతున్నాడు. వాడు కదిలినప్పుడల్లా గొలుసు పెద్ద చప్పుడు చేస్తున్నట్టు. సుందరం బుద్ధికి తోచింది. ఈ గొలుసు చప్పుడు ఎన్నో రోజులు సుందరాన్ని వెంటాడి, నిద్రలో కూడా వినిపిస్తూ ఉండేది.

ఈ బండకొయ్య వేసే కుర్రాణ్ణి మరొక పెద్దాయన వెంటబెట్టుకొని సుబ్రహ్మణ్యం బడిపక్కగా మార్కండేయులు బడికి తీసుకు వెళ్ళాడు.

"చదువూ సంధ్యా లేకుండా పూర్తిగా చెడిపోయి దొంగతనాలూ అవీ మరిగిన వాళ్ళకి బండకొయ్య వేస్తారు" అన్నాడు సుందరంతోపాటు బండకొయ్య వేసిన కుర్రవాణ్ణి చూస్తూవుండిన మరో కుర్రవాడు.

తనకన్న తక్కువ చలించినవాడితో మాట్లాడటం సుందరానికి లాభించింది.

"వాడు బాగా చెడిపోయినాడా?" అన్నాడు సుందరం. అయిదేళ్ళ వాడిక్కూడా జీవితాన్నీ, మానవుల్నీ విశ్వసించాలనే ఉంటుంది మరి.

"చెడిపోవటంలో అట్టా ఇట్టాగా? వాణ్ని కొట్టు, చంపు, ఎవరి మాటా వినడు. కొంచెం సందు చిక్కిందో అందకుండా పారిపోతాడు" అన్నాడు ఆ కుర్రవాడు.

అదంతా బాగానేవుంది. కాని వాణ్ణి బడికి తీసుకురావటం దేనికి? వాడికింకా చదువొస్తుందా? తన అనుభవాన్నిబట్టి సుందరం బుద్ధిపూర్వకంగా, పూర్తి యిష్టంతో చదివేదే చదువని నమ్మాడు. తనచుట్టూ ఉన్న వాళ్ళలోనే ఎంతమందికి బలవంతాన చదువు అంటగట్టబడుతున్నదీ సుందరానికి తెలియనే తెలియదు. అందుచేత ఆ బండకొయ్యకు చదువుకూ మధ్య ఏదో పెద్ద అఘాతం ఉన్నట్టు సుందరం నమ్మాడు.

"ఇటువంటి మొద్దు వెధనలంతా మార్కండేయులు బళ్ళోవచ్చి పడతారు" అన్నాడు సుందరం పక్కనున్న కుర్రవాడు.

"మార్కండేయులు పిల్లల్ని చావగొడతాడు. నా కటువంటివాళ్ళంటే అసహ్యం. రాఘవయ్య పంతులు కొడతాడనే ఆయన బళ్ళో మానేశా" అన్నాడు సుందరం.

"మార్కండేయులు కొట్టటం కొట్టటమా? పొట్టిపంతులేంచేస్తాడో తెలుసా?" అన్నాడు రెండో కుర్రవాడు.

"నాకు తెలీదు" అన్నాడు సుందరం తెలుసుకోవాలనే కుతూహలం కనబరుస్తూ.

"పిల్లల్ని కోదండం వేయిస్తారు."

"అంటే?" అన్నాడు సుందరం.

"దూలానికి తాడుకట్టి దానికి వేళ్ళాడతీస్తాడు."

"ఎంతసేపు వేళ్ళాడతీస్తాడూ?"

"ఇష్టమొచ్చినంతసేపు."

"చేతులు నెప్పెట్టవూ?"

"వదిలి పెడితే కిందపడి కాళ్ళు విరుగుతైగా!"

"తరువాత కాళ్ళు విరగనీ, చేతులు నెప్పెట్టితే ఒదిలెయ్యమూ?" అన్నాడు సుందరం తనకే కోదండం వేస్తున్నట్టు ఊహించుకుంటూ.

"అట్లా ఒదిలిపెట్టకుండా పొట్టిపంతు లింకో తమాషా చేస్తాడుగా."

"ఏమిటా తమాషా?".

"కింద మంట పెడతాడు."

సుందరం తన స్నేహితుడికేసి వెర్రిగా చూశాడు...

## 6

సుందరం బుర్ర లెక్కల్లో బాగా పనిచేసేది. వాడికి ఇరవై ఎక్కాలూ వచ్చిన తరువాత పంతులు కూడికలూ, తీసివేతలూ నేర్పాడు. సుబ్రహ్మణ్యం ఒక్క తెలివైన పని చేశాడు. చిన్న అంకెల కూడికకు వేళ్ళు ఉపయోగించే దురభ్యాసం అయినా ప్రోత్సహించలేదు. అందుచేత ఒంటి అంకెల కూడికలూ, తీసివేతలూ తలలోనే చేసే అలవాటు సుందరానికీ పట్టుబడింది. వాడింకో సంగతి కూడా తనంతట తానే

కనిపెట్టాడు. ఎక్కాలన్నీ కూడికలే! వరసగా నాలుగు మూళ్ళు వేసి కూడితే పన్నెండు వస్తుంది. ఆరు మూళ్ళు కలిపి కూడితే పద్దెనిమిది వస్తుంది. ఈ సంగతి కనిపెట్టినపుడు సుందరానికి చాలా ఆనందం కలిగింది. కూడికలూ, తీసివేతలూ నేర్చుకున్నాక, సుందరం హెచ్చవేతలూ, భాగారాలు నేర్చుకున్నాడు.

దసరా పండగ దగ్గర పడుతున్నదనగా వీధి బళ్ళలో చదువు మానేసి పిల్లలకు పాటలు నేర్పటం మొదలుపెట్టారు పంతుళ్ళు.

"శ్రీహరి కరుణాకటాక్షా - వీక్షణాలంకారా! అర్థిజన కుముద చంద్రోదయా! ఆశ్రిత విద్వజ్జనాధారా! దాన రాధేయా! సంగ్రామ ధనంజయా! సాహస విక్రమార్కా!" మొదలైన భట్రాజు పొగడ్తలతోనూ, "ధర సింహాసనమై, నభంబు గొడుగై" వగైరా పద్యాలతోనూ, "అర్ధరూపాయిస్తే అంటేదిలేదూ. ముప్పావలా అయితే ముట్టేదిలేదూ, అయ్యవారికి చాలు అయిదు వరహాలూ, పిల్లవాళ్ళకు చాలు పప్పుబెల్లాలూ" అన్న గేయాలతోనూ వీధి మారుమ్రోగింది.

"ఒరేయ్, రేపు మీరంతా మంచి మంచి బట్టలు వేసుకొని, చద్ది అన్నాలు తిని, దసరా బొమ్మలతో సహా తెల్లవారుతోనే ఇక్కడికి వచ్చెయ్యండి. ఊరంతా తిరగాలి" అని సప్తమినాడు పంతులు పిల్లలకు చెప్పాడు.

దసరా తిరుగుళ్ళను గురించి సుందరానికి ఏమీ అనుభవం లేదు. అందుచేత వెంకటప్పయ్య నడిగి తెలుసుకొన్నాడు. అంతా విన్న తరువాత సుందరానికి చాలా ఉత్సాహం వచ్చింది. పాటలు పాడుకుంటూ మూడు రోజులుపాటు ఇల్లిల్లూతిరగటం భలే బాగుంటుందనిపించింది సుందరానికి. ఆ సాయంకాలం వాడు తండ్రి వెంట బజారుకు పోయి కోతిబొమ్మ కొనుక్కున్నాడు. తలవని తలంపుగా సుందరానికి కొత్త చొక్కా, కొత్తలాగూకూడా వచ్చాయి. తన తండ్రి యివి కుట్టిస్తున్నట్టు సుందరానికి తెలియదు, చొక్కా ట్విల్లు చొక్కా, సుందరం కళ్ళకది మల్లెపువ్వులకన్న తెల్లగా మెరిసిపోతున్నట్టు కనపడింది. లాగుకూడా ఎంతో బాగుంది. తెల్లగీర గల నల్లలాగు, తను అంత మంచిగుడ్డలెన్నడూ వేసుకోలేదనుకున్నాడు సుందరం.

ఆ రాత్రి చాలాసేపు సుందరానికి నిద్రపట్టలేదు. రేపు గురించి ఎంత ఊహించుకున్నా వాడికి తనివి తీరలేదు. ఆఖరుకు ఏ అర్ధరాత్రివేళో కన్నుమూసి ఒక్క క్షణమైనా నిద్రపోయినట్టులేదు. ఇంతలో తల్లి "లేవరా సుందరం" అని లేపేసింది.

లేచిన క్షణం నుంచీ ప్రతిదీ సుందరానికి మామూలుకన్న బాగా ఉన్నట్లు తోచింది. మొహం కడుక్కొనటానికి బయటికి వచ్చాడు. చలిచలిగా వుంది. ఆ చలి వాడికి బాగున్నట్టు తోచింది. అప్పుడే కొద్దికొద్దిగా విచ్చుకుంటున్న చీకట్లుకూడా వాడికెంతో ఆనందం కలిగించాయి.

సుందరం మొహం కడుక్కొని, అన్నం తిని కొత్త బట్టలు వేసుకొని కోతి బొమ్మ చేతపట్టుకొని నిర్మానుష్యంగా ఉన్న వీధులవెంట బడికి బయలుదేరాడు. సగందారిలో ఎవరో వెనకనుంచి "సుందరం" అని పిలిచారు సుందరం సుబ్బులు గొంతు గుర్తుపట్టాడు.

“నువు కొత్తబట్టలు వేసుకోలేదే?” అన్నాడు సుందరం ఆశ్చర్యంతో

“ఆ!” అన్నాడు సుబ్బులు నిర్లక్ష్యంగా.

“బొమ్మ కూడా కొనుక్కోలేదా?”

“బొమ్మాలేదూ, గిమ్మాలేదూ!”

సుబ్బులు నిర్లిప్తత చూసిన తరువాత సుందరానికి తన ఉత్సాహం మీద ఉత్సాహం తగ్గింది.

“నీవంటివాళ్ళనే దసరాబుల్లోడంటారు” అన్నాడు సుబ్బులు.

సుబ్బులు తనకన్న ఒక ఏడాది ఏమైనా పెద్దేమో, అంతకంటె ఉండదు. అయినా తనకన్న ఎంతో పెద్దవాడల్లే ఎందుకు కనిపిస్తాడో, తనకు తెలియని విషయాలు వాడికెందుకు తెలుసో సుందరానికి అర్థమయేదికాదు.

ఇద్దరూ బడికి చేరేసరికి ఇంకా బాగా వెలుతురొచ్చింది. ఎండ వచ్చేదాకా పంతులు రానేలేదు.

పంతులు ఒకడే రాలేదు. ఆయనవెంట ఇంకో పంతులూ, ఆ పంతులువెంట ఇంకోఇరవై మంది పిల్లలూ వచ్చారు. పిల్లలందరూ కలిసి కాస్సేపు పాటలు పాడారు. తరవాత మంద బయలుదేరింది. రెండో పంతులు పిల్లలందర్నీ సైజువారీగా జతలుగా విడిగొట్టి, ఈ జతలన్నిటినీ ఒక వరసలో నిలబెట్టాడు. పిల్లల్లో చాలామంది దగ్గిర కోతులున్నాయి. కొంతమంది దగ్గిర విల్లంబులున్నాయి. వాళ్ళు వాటితో గులాం కొట్టారు. గులాం ఎర్రని పొగలాగా గాలిలోకి లేచింది. కొందరు పిల్లలు వెదురు పుల్లకు రంగుకాగితాలతో జెండాలు తయారుచేసి అవి పట్టుకున్నారు. నీలం, ఎరుపు, పసుపు జెండాలు గాలిలోకి లేచాయి.

“జయాభిజైభవా దిగ్విజైభవా!” అని అరిచి పిల్లలు కదిలారు. పంతుళ్ళిద్దరూ ముందు నడిచారు. ఆ పూట ఏ పేటకు వెళ్ళాలో, ఎవరెవరిళ్ళకు ముందువెళ్ళాలో పంతుళ్ళ మధ్య అదివరకే నిర్ణయమయింది.

❀ ❀ ❀ ❀

ఇల్లిల్లూ తిరగటం సుందరానికి మంచి అనుభవమయింది. బళ్ళో పిల్లల్లో చాలామంది ఇళ్ళను వాడు ఇదే మొదటిసారి చూడటం. ఒక ఇల్లున్నట్టు యింకో ఇల్లు లేదు. వెంకటప్పయ్య ఇల్లు చాలా పెద్దది. “లంకంత” ఇల్లు. ఇంటిచుట్టూ గొడ్లూ, ఆవులూ బోలెడు కట్టివున్నాయి. ఇటువంటి ఇళ్ళు ఒకటి రెండు తప్పిస్తే మిగిలిన ఇళ్ళు సుందరం ఇంటివంటివే.

పంతులు కొందరిళ్ళకు పోనేలేదు. సుందరం సులభంగానే కారణం ఊహించాడు. కొందరు పిల్లలు నివసించేవి ఇళ్ళనటానికి వీల్లేదు. వెంకటప్పయ్యగారి గొడ్లపాకలాంటి ఇళ్ళల్లో నివసిస్తున్న వాళ్ళున్నారు. ఇటువంటి యిళ్ళను సుందరం దూరాన్నుంచి మాత్రమే చూశాడు.

ఒకచోట పిల్లలు కొన్ని గుడిసెలపక్కగా పోతుండగా, చేతిలో పేడ ఎత్తుకుని ఒకమనిషి కనిపించింది. ఆమె బొత్తిగా అంట్లుతోమేదానల్లే వుంది. ఇంతమంది

పిల్లల మధ్య తన కొడుకునుచూసి ఆనందిస్తూ ఆమె ఒక పక్కగా నిలబడింది. ఆమె కొడుకు అందరి దగ్గరికి వచ్చి. "అదుగో మా అమ్మ" అని చూపసాగాడు.

వాడి తల్లి తన తల్లిలాగా లేనందుకు సుందరం నొచ్చుకున్నాడు. అయితే వాడు కూడా చదువుకుంటున్నాడు. కనక పెద్దవాడై ఉద్యోగంచేసి డబ్బు సంపాదిస్తాడనీ. అప్పుడు ఈ మనిషికూడా తన తల్లిలాగే ఉంటుందనీ, సుందరం పూర్తిగా నమ్మాడు. చదువుకోదలిచిన వారంతా ఎంతకాలమన్నా చదువుకోవచ్చుననీ, చదువుకున్న వాళ్ళందరికీ చదువుకుతగ్గ ఉద్యోగాలు వస్తాయనీ సుందరం నమ్మకం.

సుందరం ఇంకా చాలా విషయాలు గమనించాడు. పిల్లలు తమ ఇళ్ళకు వెళ్ళినప్పుడు తాము పాడరు. కొన్ని ఇళ్ళకు పోగానే పంతులుకూ, పిల్లలకూ యిచ్చేదేదో ఇచ్చేస్తారు. మరి కొన్ని ఇళ్ళల్లో ఎంతసేపటికీ తేలదు. కొందరు తరవాత చూసి మెల్లిగా ఇస్తాం లెమ్మంటారు. కొన్ని ఇళ్ళల్లో పప్పుబెల్లాలు ఎక్కువిస్తారు. కొన్ని ఇళ్ళల్లో తక్కువిస్తారు. కొందరు పంతుల్ని మర్యాదగా "ఏమండి" అంటే, మరికొందరు "ఏమయ్యా పంతులూ" అంటారు.

ఒక ఇంట్లో ఎవరో ఆయన సుబ్రహ్మణ్యాన్ని. "ఏమండి, మేష్టరుగారూ జయాభిజైభవా అంటే ఏమిటర్థం? దిగ్విజైభవా ఏమిటి?" అని అడిగాడు.

పంతులు నవ్వి ఊరుకున్నాడేగాని సమాధానం చెప్పలేదు. రెండో ఆయన వదల్లేదు.

"జయ విజయీభవా దిగ్విజయీభవా అన్న ముక్కను ఇట్లా అపభ్రంశం చేస్తున్నారు. మన చదువులిట్లా అఘోరిస్తూన్నాయ్" అన్నాడు.

ఆ ఇంట్లోనుంచి బయటికి వస్తూనే పిల్లలు "జయాభిజైభవా! దిగ్విజైభవా" అని కేకవేశారు. తప్పొప్పులెవరిక్కావాలి? సంస్కృతికన్న సంప్రదాయం బలమైనది. అర్థంకంటే నినాదం బలమైనది.

❀ ❀ ❀ ❀

ఇవి సుందరానికి చాలా ఉల్లాసపు రోజులు. దసరా వెళ్ళినట్టేలేదు. దీపావళి వచ్చింది. రేపు దీపావళి అనగా నరకచతుర్దశినాడు సాయంకాలం తలవని తలంపుగా సుబ్బులు సుందరం ఇంటికి వచ్చాడు.

"ఇవాళ నరకాసురవధ నాటకం వుంది. మనం ఊరికే పోవచ్చు వస్తావోయ్?" అన్నాడు సుబ్బులు.

సుందరం ఎన్నడూ నాటకం చూడలేదు. "మా అమ్మ నడగాలోయ్" అన్నాడు సుందరం. ఆవిడ ఒప్పుకుంటుందని ఆశలేకుండా.

హాడనుకున్నట్టే ఆవిడ, "ఎందుకురా నాటకాలూ, నిద్ర దండగా!" అన్నది. "ఊరికే వస్తుంటే పోవటాని కేమమ్మా!" అన్నాడు సుందరం తల్లి డబ్బుకు లోభిస్తున్నట్టు.

సీతమ్మ చాలా అభ్యంతరాలు చెప్పింది. సుందరం మధ్యలో నిద్రపోతాడు. అర్ధరాత్రివేళ ఎవరు ఇంటికి చేరుస్తారు?

సుందరం మాట్లాడలేదు. కాని ఆశాభంగం అయినట్టు ఆవిడ తెలుసుకున్నది. "నీదిప్పటినుంచే నాటకాలు మరిగితే చదువురాదు" అనుకున్న దావిడ.

తన నిర్ణయంమీద పూర్తివిశ్వాసం లేకనో ఏమో ఆవిడ నాటకంమాట శ్రీమన్నారాయణ దగ్గర యెత్తింది. ఆయన అందర్నీ నాటకానికి బయలుదేర తీశాడు.

నాటకం హాలు దగ్గర దీపాలూ, కేకలూ, మేళాలూ, జనం – సందడిగా వుంది. సీతమ్మనూ, సుందరాన్నీ, ఆడవాళ్ళలో కూచోబెట్టి శ్రీమన్నారాయణ ఎనిమిదణాల టిక్కెట్టులో కూచున్నాడు.

హాలులోపల తెరలూ అవీ చూసి సుందరం చాలా సంతోషించాడు. ఆ తెర లేస్తుందనీ, మనుషులు వేషాలు వేసుకొచ్చి నాటకం ఆడతారనీ, సీతమ్మ కొడుక్కి చెప్పింది. తెర యెట్లా లేస్తుందో వాడూహించలేక పోయినాడు.

సుందరం జనం మధ్య నిలబడి చూస్తుంటే ఎక్కణ్ణుంచో చూసి సుబ్బులు గుర్తుపట్టాడు. వాడుకూడా ఆడవాళ్ళలోకి వచ్చి, "అరె, నువ్వు వచ్చావే? రా, మా నాన్నను చూపిస్తా" అని సుందరాన్ని పట్టుకెళ్ళాడు.

ఇద్దరూకలిసి స్టేజిలోకి వెళ్ళారు. అక్కడ వేషాలు వేసుకుంటున్నవాళ్ళూ, వేసుకున్న వాళ్ళూ కనిపించారు. వాళ్ళకేసి సుందరం మతిపోయినట్టు చూశాడు. ఒక పక్కగా ఒకావిడ బీడీ కాలుస్తూ ఎవరితోనో మాట్లాడటం కనిపించింది. 'ఆవిడ' మగవాడేనని సుందరం ఊహించలేదు.

"ఇదుగో నాన్నా, సుందరం, వాళ్ళమ్మా, నాన్నాకూడా వచ్చారు నాటకానికి" అన్నాడు సుబ్బులు.

సుబ్బులు మాట్లాడుతున్నది 'ఆవిడ'తోనే అని సుందరం కల్లోకూడా అనుకోలేదు.

"అట్లాగా?" అన్నా 'డావిడ', నోట్లోనుంచి బీడీతీసి.

"చూడు సుబ్బులూ, శేషాచలాన్ని పిలిచి ఈ అబ్బాయినీ, వాళ్ళ నాన్నగారినీ రిజర్వుడులో కూచోబెట్టించు."

"అట్లాగే నాన్నా... రారా సుందరం!"

మిగిలిన పనంతా సుబ్బులు తనంతట తనే నిర్వహించాడు. మొదట శ్రీమన్నారాయణ "ఎందుకులెండి? ఇక్కడ బాగానే వున్నది" అన్నాడుగాని. ఆ శేషాచలమన్న మనిషి విడిచిపెట్టలేదు.

సుబ్బులుకు తెలిసిన విషయాలలో తనకు సహస్రాంశం తెలీదని సుందరానికి అనిపించింది.

"చూడు, సుబ్బులూ! నువు ఆ లోపల మాట్లాడావే – మీ నాన్నా?" అన్నాడు సుందరం.

సుబ్బులు నవ్వి. "అవును. ఆడదానల్లే ఎట్లా వున్నాడో!" అన్నాడు

నాటకం మొదలయేసరికి సుబ్బులూ, సుందరం కూడా శ్రీమన్నారాయణ పక్కన చేరారు.

ప్రార్థనా, తెర ఎత్తుకోవటం దగ్గర్నుంచీ నాటకం ప్రతి క్షణమూ ఎంతో అద్భుతంగా తోచింది సుందరానికి. అన్ని వేషాలలోకీ కృష్ణుడి వేషమూ, సత్యభామ వేషమూ వాడికి చాలా అద్భుతంగా ఉన్నాయి. సత్యభామ వేషం వేసింది సుబ్బులు నాన్నే.

ఇంటికి తిరిగొచ్చేటప్పుడు శ్రీమన్నారాయణా, ఆయనకన్న ఎక్కువగా సీతమ్మా నాటాకాన్ని గురించి మాట్లాడుతున్నారు.

"ఏం జరిగిందనుకున్నారూ? సత్యభామ వేషం వేసినాయన పెళ్ళాం మా పక్కనే కూచుంది. ఆ వేషం వచ్చినప్పుడల్లా ఆవిడ కళ్లు మూసుక్కూచుంది. పాపం మొగుడు ఆడవేషంవేస్తే పెళ్ళాం చూడరాదు" అన్నది సీతమ్మ.

"ఎందుకు చూడరాదో? చూస్తే ఏమవుతుందో?" అనుకున్నాడు సుందరం. తల్లి మాట్లాడుతున్నది సుబ్బులు తల్లిని గురించి అయివుండాలని ఎంతో సేపటికిగాని సుందరానికి తట్టలేదు.

దీపావళి పండుగ సరదాగా వెళ్ళిపోయింది. శ్రీమన్నారాయణ బందరుతోటాలు దొరికితే కొని కాల్చాడు. ఆయన అవి కాలుస్తున్నంతసేపూ సీతమ్మ "ఎందుకు తెచ్చారండీ? భద్రమండీ?" అంటూనే ఉన్నది.

సుందరం పువ్వొత్తులూ, పగలొత్తులూ, చిటపటాలూ కాల్చాడు. రంగు నిప్పెట్టెలుకూడా కాల్చాడు.

దీపావళి వెళ్ళిన పది పదిహేను రోజులకు సీతమ్మ ఆడపిల్లను కన్నది.

తల్లి పురిటింటిలో ఉన్న పదిరోజులూ సుందరానికి పిచ్చిపిచ్చిగా వున్నది ఆ తరువాత మళ్ళా జీవితం యధాప్రకార మయింది.

❀ ❀ ❀ ❀

సుందరం ఇంగ్లీషు అక్షరాలు నేర్చుకుంటున్నాడు. వాడు తన దగ్గిరికిరాకుండా తన సహాయం లేకుండా. 'ఏ, బీ, సీ, డీ' అంటూ అక్షరాలు దిద్దుకుంటూంటే సీతమ్మకు ఎందుకో కష్టం వేసింది. అప్పుడే వాడు తనకు అలివిగాని చదువులోపడ్డాడు. వాడు తనచేత అక్షరాలు రాయించుకుని దిద్దిన రోజులు జ్ఞాపకం చేసుకుంటే, ఎంతో కాలమైనట్టుగా తోచిందావిడకు. వాడితోపాటు తానుకూడా ఇంగ్లీషు నేర్చుకుందామన్న ఆలోచనకూడా కలిగింది సీతమ్మకు. కాని సగం పిల్లలతో తీరికా, సగం ఎవరన్నా నవ్వుతారన్న బిడియంచేతా ఆ పని చేయలేదావిడ. ఎప్పుడన్నా వాడు దిద్దే అక్షరాలకేసి చూసేది. వాడు అక్షరాల పేర్లు పైకి అంటుంటే వినేది, అంతే.

హైస్కూళ్ళకు వేసవి శలవులిచ్చే సమయానికి సుందరం ఇంగ్లీషు రీడరు పూర్తి చేశాడు.

అప్పటికే శ్రీమన్నారాయణకు అస్వస్థత ప్రారంభమయింది. ఆయన ఉద్యోగానికి శలవుపెట్టి ఇంట్లోనే ఉండి, మందు పుచ్చుకుంటున్నాడుగాని ఏమీ **ఫలితం** కనుపించలేదు. నాటువైద్యులు రక్తహీనత అన్నారు 'అపాతికరీ' కూడా

ఒకే మనిషి అని వాడికి తెలియలేదు. "అమ్మా సుబ్బమ్మత్తయ్యకి మల్లే ఇంకో ఆవిడ ఉండేదే? జుట్టుండేది, బొట్టు పెట్టుకునేది; ఆవిడ కనపడదేం!" అని తల్లిని రెండు మూడుసార్లు అడిగాడు సుందరం, కానీ సీతమ్మకు వాడేమడుగుతున్నదీ కూడా అర్థంకాలేదు. ఆవిడ వాడి సంశయాన్ని తీర్చలేదు. తన తల్లికి జుట్టుతీసి విధవావతారం కలిగించేసరికి సుందరం కడుపులో చెప్పరానిమంట ప్రవేశించింది. ఆపని చేసిన వాళ్ళని చంపేద్దామనిపించింది. కానీ ఎవరు చేసింది వాడికి అర్థంకాలేదు.

పదమూడు రోజులూ అయిపోయి, సొంతిల్లు పాడుపెట్టి శంకరం గారింటికి మారిన తరువాత సుందరం తల్లిని తప్పించుకు తిరగసాగాడు. ఆవిడకూడా ఒక గదిలో పడి ఉండేది. కొత్తవాళ్ళు చూడరావటమూ, ఏడుపులూ ఉండేవి కనక సుందరాన్ని ఇష్టంవచ్చినట్లు తిరగనిచ్చింది.

తన స్వాతంత్ర్యం హెచ్చుటం ఏ ప్రాణి గుర్తించదు. తాడు విప్పగానే లేగదూడలాటిది చెంగు చెంగున పరమానందంతో ఎగురుతుంది కదా; సుందరం తాడు విప్పిన లేగ దూడలాగా ప్రవర్తించాడు. వాడికి ప్రస్తుతం బడికూడా లేదు. చుట్టుపక్కల ఎన్నో ఇళ్ళ పిల్లలతో వాడు కొత్తగా సావాసం చేశాడు. ఇటీవలనే వాడి తండ్రి పోవటంచేత ఆ పిల్లలకు వాడిలో ఏదో కొత్త ఆకర్షణ కనబడినట్టయింది.

చిన్నపిల్లల స్నేహాలు బీరకాయపీచులాంటివి. అవి అతి విచిత్రంగా ఒక వీధి నుండి ఇంకో వీధికి, ఒక పేట నుండి ఇంకో పేటకూ విస్తరిస్తాయి. ఒక్కసారిగా పది పన్నెండుమంది పిల్లలతో సంబంధం ఏర్పడేటప్పటికి సుందరానికి కొత్త జీవితం ఏర్పడినట్టయింది. మామూలు పిల్లలు ఏ ఆటలాడుతారో, ఎటువంటి అల్లరి చేస్తారో సుందరం యిప్పటిదాకా యెరుగడు. వీధిబడి పిల్లల దారివేరు. ఈ పిల్లల దారివేరు వీళ్లు పెద్దబడికి పోతారు. సాయంకాలంపూట ఎక్కడెక్కడికో పోతారు. ఏవేవో ఆటలాడుతారు.

ఇతర పిల్లలతో కలిసి తిరుగుతున్నాకూడా సుందరానికి, వాళ్ళంతా ఒకటి అని, తను ఒక్కడూ వాళ్ళలో వేరని అనిపించేది ·జీవించటం వాళ్ళకు తెలిసినట్లు తనకు తెలియదనిపించేది. వాళ్లు గోలీలాడేవాళ్ళు. గోలీలాటలో ఎన్నిరకాలున్నాయో, ఒంటిబిద్దీ ఆటేమిటో, రెండు బిద్దీలాటేమిటో, పందెం ఆటేమిటో, దేకుళ్ళేమిటో, ఎన్నిసార్లు కాయను కొట్టిన తరువాత గుంటలోపడాలో తెలుసుకోటానికి సుందరానికి చాలా రోజులుపట్టింది. సుందరానికి గోలీలాట వచ్చేదికాదు. జానెడు దూరంలో ఉన్న గోలీ గుంటలో వెయ్యటం చాతనయేదీకాదు. గోలీని గురిగా కొట్టలేకపోయేవాడు. కొందరు పిల్లలు అంతదూరాన ఉన్న గోలీని ఠపీమని వేసేవాళ్లు. మరీ రాఘువాయి అఖండుడు. వాడు గొంతుకూచుని, చేతులు రుద్దుకొని దూరానఉన్న గోలీని కాకి చూసినట్టు తల పక్కకి ఒరగేసి చూసి, నాలిక మొనపళ్ళ మధ్య బిగించి, తన గోలీని కుడిచేతి చూపుడువేలుకు సంధించి, ఆవేలును ఎడమచేతి వేళ్ళతో విల్లు వంచినట్లు వెనక్కి వంచి గోలీ వదిలేవాడు. ఎంత దూరాన ఉన్న కాయనుగానీ అవలీలగా కొట్టేవాడు. పందాలఆట అయితే ఎటువంటివాళ్ళ గోలీలూ కాజేసేవాడు. (మూడు

తెల్ల గోళీలు ఒక బిళ్ళేరు గోలీకి సమానం.) దేవుళ్ళాటయితే అందరిచేతా దేవుళ్లు పెట్టించేవాడు.

రాఘవాయికి సుందరం అంటే ఏదోఅభిమానం. అందుచేత వాడు సుందరాన్ని ప్రోత్సహించేవాడు. సుందరం పండేటట్టుగా వాడికి గుంట వదిలేవాడు. లేదా కొట్టటానికి తన గోలీ అందించేవాడు. అప్పటికీ ఒక్కొక్కసారి సుందరం గెలవలేక దేకుళ్ళు పెట్టేవాడు.

రాఘవాయి ఒక్క గోలీల్లోనేకాక బచ్చాలాటలో కూడా గట్టివాడే. వాడే స్వయంగా పెంకు ముక్కలు గుండ్రంగాకొట్టి ఒకదానికంటే ఒకటి చిన్నదిగా 'బిళ్ళలు' తయారుచేసేవాడు. మంచి నాపరాయి ఒకటి గుండ్రంగా చెక్కి దాన్ని బచ్చాగా ఉపయోగించేవాడు. అందరూ లైనులో నిలబడి 'బిళ్ళల' మీదికి బచ్చాలు విసిరేటప్పుడు రాఘవాయి రాగానే పిల్లలంతా "ఉండండర్రా, విష్ణుచక్రం, విష్ణుచక్రం?" అని అరిచేవాళ్ళు. పిల్లలు తన ప్రభావాన్ని ఇట్లా గుర్తించటం రాఘవాయికి చాలా యిష్టంగా ఉండేది. బచ్చా ప్రయోగించేటప్పుడుకూడా వాడు నాలిక మొన బయట పెట్టేవాడు. బచ్చాలాటలో వాడు అడిగినవాళ్ళకు వరాలిచ్చేవాడు. అందరికన్నా వాడు తన బచ్చా దూరం విసిరివేసి బిళ్ళలు కొట్టేచాన్సు మొదట తీసుకునేవాడు. ఆ తరువాత వాడు ఎవర్ని గెలిపించాలంటే వాళ్ళకు అందుబాటులో వచ్చిందాకా బిళ్ళలు కొట్టేవాడు. ఈ ఆటలోకూడా రాఘవాయి సుందరానికి అభిమానం చూపేవాడు. రాఘవాయి ఆడుతుంటే వీధిలో పెద్దవాళ్లు కూడా చూసేవాళ్లు. గోలీలాట ఎవరి దొడ్లో అయినా ఆడవచ్చుగానీ, బచ్చాలాడాలంటే వీధిలోకి పోక తప్పదు.

కర్రాబిళ్ళా (బిళ్ళంగోడు) ఆటకూడా పిల్లలు వీధుల్లో ఆడేవాళ్ళు. ఏ కారణంచేతో సుందరానికి ఈ ఆట కాస్తబాగానే వచ్చేది. ఇందులో వాడు 'అవుటు' కాకుండా తప్పించుకునేవాడు.

రాఘవాయిని గురించి సుందరానికి ఆటవిషయంలో చాలాగొప్ప అభిప్రాయం ఉండేది. కాని చదువు విషయంలో వాడు వట్టిమొద్దని తెలుసుకుని ఆశ్చర్యపడ్డాడు.

"నాకు చదువురాదు. పాఠం చదువుతా. అంతా వప్పజెప్పుతా. వప్పజెప్పిన తరువాత ఒక్కమాట జ్ఞాపకం ఉండదు.... నాకసలు చదువక్కర్లా... ఏమోయ్? ఏం చదవకపోతే?" అనేవాడు రాఘవాయి, చదువు రానందుకు గర్వించేవాడల్లే. వాడికి చదువు రాకపోవటమూ, రానందుకు వాడు విచారించకపోవటమూ కూడా సుందరానికి విడ్డూరంగానే కనిపించేది. కాని, ఈ చదువురాని రాఘవాయి పక్కన ఉంటే సుందరానికి ఎంతో ధైర్యంగా ఉండేది. ఎక్కడికైనా ఏ ఆటకైనా ఉపక్రమించేవాడు సుందరం – రాఘవాయి అండ చూసుకుని.

సుందరం అప్పుడప్పుడూ తన కొత్తస్నేహితులతోకలసి రైలుకట్టకు షికారు వెళ్ళేవాడు. దారిలో మామిడి పిందెలు దొంగతనం చేసేవాళ్ళు. సుందరానికది తప్పల్లే తోచేదికాదు. అల్లర్లలోనూ, సరదాగానూ ఉండేది. రైలు వచ్చే సమయానికి పట్టాలమీద చిన్న చిన్న కంకరరాళ్ళూ అవీ పెట్టేవాళ్ళు. ఒకసారి ఒకడు కానీ కూడా

పెట్టాడు. కంకరరాళ్ళు రైలుకింద నలిగి మెత్తగా, తెల్లనిపిండి అయేవి. "విభూది" అని దాన్ని నలుగురూ మొహాలకు రాసుకునేవాళ్ళు. పొద్దుకి చీకటిపడి సుందరం ఇంటికొచ్చేవాడు.

❀ ❀ ❀ ❀

సీతమ్మ మహాసముద్రంలో ఉన్నది. ఒకపంక మొగుడుపోయిన చింతా, వైధవ్యం మూలంగా ఎవరికీ మొహం కనిపించరాని పరిస్థితీ, చంటిపిల్లా, ఇతర ఆడతోడు లేకపోవటమూ, ఆవిడకు చాలా మనస్తాపం కలిగించాయి. పిల్లల చదువులు చెడతాయని శేషగిరి భార్య వెళ్ళిపోయింది. శేషగిరి మాత్రం మూడు నెల్లు శెలవు పెట్టి ఉండిపోయినాడు.

సీతమ్మకు రాగల కాలం గురించి అనేక దిగుళ్ళు. ఈ ఇద్దరు పిల్లలూ తన చేతిమీదుగా పెద్దవాళ్ళయి వాళ్ళ రెక్కలమీద వాళ్ళు ఆధారపడేరోజు గావాలి. శ్రీమన్నారాయణ మరణం మూలంగా కుటుంబం ఆర్థికంగా దెబ్బతిన్నది. ఆయన సంపాదన మూలంగానే ఇంతకాలమూ బెట్టుగా జరిగింది. పొలం ఉన్నదిగాని అది ఏ అయిదారెకరాలో ఉన్నది. దానిమీద రెండుమూడు వందలు మాత్రం వస్తుంది. ఉండటానికి ఇల్లున్నది.

"ఇకముందు ఈ సంసారం ఎట్లా ఈదుతాను? అన్ని ఖర్చులూ తగ్గించాలి. పిల్లలిద్దరూ అమాయకులుకావటంచూసి ఆడముండ డబ్బు అలామూలూ, పలమూలూ చేసిందంటారు. ఆ మాట పడకుండా ఎట్లా నెగ్గుకొస్తానో" అన్నదావిడ శేషగిరితో.

"ఏం ఫరవాలేదు. పొట్టిపుణ్యానికి కంగారుపడకు. మీ ఇల్లు పెద్ద భాగం అద్దెకిచ్చి చిన్న భాగంలో ఉండండి. ఎనిమిది పదిరూపాయలు అద్దెరావచ్చు. తూర్పు పక్క ఖాళీస్థలంలో చిన్న పాకా వేయిద్దాం. బోలెడంత చోటవుతుంది. బావపేర బాంకులోఉన్న మూడొందల్లో ఉన్నబాకీలు తీర్చటానికి ఒక వంద తీద్దాం. మిగిలింది నీ పేర ఉండనీ. ఎప్పటికైనా అవసరానికి అక్కరకొస్తుంది. ఏ నగలుచేసినా, నాణాలు చేసినా ఆ చంటిముండకే కదా. అది పెద్దదయేనాటికి చూసుకోవచ్చు. నన్నడిగితే నీ నగలన్నీ అమ్మేసి, అదికూడా డబ్బుచేసి బాంకులో వేసుకో. లేదా ఎవరికైనా వడ్డీకిచ్చుకో. నన్ను ఇవ్వమంటే ఇచ్చేస్తాను. కళ్ళకద్దుకు తీసుకునేవాళ్ళున్నారు" అన్నాడు శేషగిరి.

"ఆయన ఎంత దర్జాగాబతికి, మమ్మల్ని ఎటువంటి స్థితిలో పెట్టిపోయినారో చూడు" అని సీతమ్మ ఏడిచింది.

శ్రీమన్నారాయణ బాగా ఖర్చుచేసి బాగా బతికినవాడు. నేతిగిన్నెలో గరిటె ఉండరాదు. చిన్న విస్తట్లో అన్నం తినరాదు. పొట్టి పంచెలు కట్టరాదు. "విస్తరిహీనం, వస్త్రహీనం పనికిరాదు" అనేవాడాయన అందుకనే ఆయన సంపాదించిన సంపాదనకు తగ్గట్టుగా డబ్బు మిగలలేదు. అదే మరొకరయితే హాయిగా యింకో యిల్లు కట్టించి ఉందురు.

సీతమ్మ విచారాలలో సుందరాన్ని గురించిన విచారం ఒకటి అయింది. వాడు ఎక్కడెక్కడ తిరిగేదీ, ఏం చేసేది ఆవిడకు తెలీదు. అన్నం తినటానికిమాత్రం ఇంటికొచ్చేవాడు. ఒక్కోరాత్రి ఏడు, ఎనిమిదిన్నర దాటిన తరవాత వచ్చేవాడు. ఆవిడ లెక్కప్రకారం ఇవి చెడిపోయే లక్షణాలు. ఒకరోజు సుందరం రైలుకట్టకు షికారువెళ్ళి రాత్రి ఏడున్నరకు ఇంటికొచ్చాడు. సీతమ్మ వాడ్ని గట్టిగా చీవాట్లు పెట్టింది.

"నన్ను చాతగాని ముండనుచేసి నువ్వు ఏం తిరుగుళ్ళు తిరుగుతున్నావురా? పొద్దుకి ఇప్పుడు ఇంటికొస్తున్నావా!" అన్నదావిడ.

సుందరం తల్లి మాటలకూ, ధోరణికీ బిత్తరపోయినాడు. ఆవిడ ఆకారంతో బాటు మాటలూ, మనస్సూ కూడా మారినట్లు వాడికి తోచింది.

"రైలుకట్టకు షికారెళ్ళానమ్మా!" అన్నాడు వాడు.

సీతమ్మ అంతరాత్మ చివుక్కుమన్నది. సుందరం ఇంట్లో ఎక్కువ సేపు వుండకపోయినా వాడిలో వెనుక ఎన్నడూలేని ఉత్సాహమూ, పెరుగుదలా చూస్తున్నది సీతమ్మ. సుందరం యిప్పుడు వెనకటంత అమాయకుడుగా అర్భకుడుగా లేడు. ఈ కొద్ది రోజుల్లోనే వాడిలో ఇంత మార్పు వచ్చింది. చచ్చిన తనభర్త అన్నమాటలు ఇప్పుడామెకు జ్ఞాపకంవచ్చాయి. "వాడికి చదువుతప్ప ఇంకేమీలేకుండా చేస్తున్నావు భద్రం. వాడు ఎందుకూ పనికిరాకుండా వాజమ్మ అయిపోతాడు ఆడది తిరిగి చెడిందట. మగవాడు తిరక్క చెడ్డాట్ట! వాణ్ని యితర పిల్లలతో కలిసి తిరగనీ! ఆడుకోనీ. కొంగున కట్టేసుకోకు వాడికి నీమీద ఆపేక్షవుంటే అది కొంగుకు కట్టేసుకు దక్కించలేవు. పెద్దవాడవుతున్న కొద్దీ వాడు మారుతాడు. ఆ మార్పు అర్థం చేసుకుంటుంటే నీకూ, వాడికీ వుండే సంబంధం చెడకుండా ఉంటుంది" అని ఆయన తనతో అనేవాడు.

"నేను దిక్కుమాలిన దాన్నికానే అయినాను. పాపం, వాడన్నా ఉల్లాసంగా ఎందుకుండరాదు?" అనుకున్నది సీతమ్మ. అయితే వాడికి బడిలేకుండా అచ్చగా ఆటలే అయినాయే అని ఆమె విచారపడ్డది.

ఆ రాత్రి అన్నంపెట్టి సుందరాన్ని ఆవిడ తన దగ్గిరే పడుకోబెట్టుకుని వాడికి వాళ్ళ నాన్నగురించి ఏవేవో చెప్పింది. సుందరం తాను ఎన్నడూ వినని విషయాలన్నీ శ్రద్ధగావింటూ, ఎప్పుడోనిద్రపోయినాడు. సీతమ్మ చాలాసేపు నిద్రపోలేదు. ఆవిడ తాను భర్తతో గడిపిన మంచిరోజులూ, పొందిన ఆనందమూ జ్ఞాపకం చేసుకోవడానికి ప్రయత్నించింది. కాని ఎంతసేపూ బాధకలిగించే విషయాలే జ్ఞాపకం వచ్చాయి.

'ఆయన ఎప్పుడు ఏం మాట్లాడినా, రేపీ విషయం దీనికి చెప్పేవాళ్ళుండరేమో అన్నట్టుగా చెప్పేవాడు. చిత్రమైన మనిషి. ఇన్నాళ్ళు కాపరం చేశాగాని నాకామనిషి ఇంతవరకు పూర్తిగా అర్థంకాలేదు. మనిషిని మనిషి అర్థంచేసుకోవటం మాటలా? నేనింకా నూరేళ్ళు బ్రతికినా ఏవోకొత్త విషయాలు ఆయన్ను గురించి అర్థమవుతూనే వుంటాయి. మనుషుల్ని తెలుసుకోవాలంటే తెలివితేటలు చాలవు. అనుభవంకూడా కావాలి... వీడు ఈ సుందరం – వెనక ఏమనుకుంటున్నాడో, ఎట్లా ఆలోచిస్తున్నాడో

నాకు తెలిసినట్టే ఉండేది. ఇప్పుడట్లా ఉండటంలేదు. ఏముంది? పిల్లలిట్లాగే పెద్దవాళ్ళవుతారు. ఈ చిన్నముండ ఎట్లా తయారవుతుందో!' అనుకుంటూ సీతమ్మ చాలా పొద్దుపోయి కన్నుమూసింది.

❀ ❀ ❀ ❀

వీధిబడి పంతులు సుబ్రహ్మణ్యం చూడటానికి వచ్చాడు. శ్రీమన్నారాయణగారి వంటి పెద్దమనుషులు చాలా అరుదన్నాడు. సుందరం ఈ ఎండల్లో బడికి రాకపోయినా ఇబ్బందిలేదనీ, వాడికి వచ్చిన చదువుతో హైస్కూల్లో చేర్చుకుంటారనీ అన్నాడు. కావలిస్తే తాను ప్రతిరాత్రీ ఇంటికొచ్చి ఒక గంటసేపు చదివిస్తానన్నాడు. శేషగిరి ఈ ఏర్పాటుకు ఒప్పుకున్నాడు

తీరా వెళ్ళబోతూ సుబ్రహ్మణ్యం సంగతి మర్నాడు సాయంకాలం మంచి బట్టలు వేసుకుని రైలుస్టేషను దగ్గిరికి రమ్మన్నాడు. ఎందుకో ఆయనకూ తెలీదు. బడిపిల్లల్ని మంచి దుస్తులతో తీసుకురమ్మని బడిపంతుళ్ళకు కబురొచ్చిందట.

మర్నాడు సాయంకాలం నాలుగింటికి సుందరం తనకున్న మంచి చొక్కా లాగూ వేసుకుని స్టేషను దగ్గిర గ్రాండుట్రంకురోడ్డుమీద హాజరైనాడు. అక్కడ వందలేసి పిల్లలు చేరారు. చాలామంది చేతుల్లో రంగు కాగితాల జెండాలున్నాయి. కొందరు చమ్కీటోపీలు, మఖ్మల్ కోట్లూ కూడా వేసుకున్నారు.

గ్రాండుట్రంకు రోడ్డుమీద పిల్లలందరూ ఒక పక్కగా ఎన్నో గంటలు నిలబడ్డారు. సుందరానికి దాహమయింది. కాళ్ళు తీపుపెట్టాయి చీకటిపడింది. మేష్టర్లు వచ్చి పిల్లల్ని యిళ్ళకు పొమ్మనీ, మర్నాడు పొద్దున మళ్ళీ రమ్మని అన్నారు.

మర్నాడుదయం సుందరం మళ్ళా స్టేషను దగ్గిర హాజరైనాడు. వాడికిదంతా చూస్తూంటే దసరా జ్ఞాపకం వచ్చింది.

పొద్దెక్కింది. ఎండ తీక్షణ మవుతూంది. చెట్లనీడ ఉన్నప్పటికి పిల్లలకు ముచ్చెమటలు పోస్తున్నాయి. తొమ్మిది గంటల వేళ పిల్లల్లో సంచలనం బయల్దేరింది. "వస్తున్నారు వస్తున్నారు!" ఎవరా వచ్చేది? ఎవరికీ తెలీదు. ఒక అరగంటదాకా ఏమీ జరగలేదు. పటపటమంటూ మోటారు సైకిలు ఒకటి పోయింది. దానిమీద ఒక మీసాల దొర బొమ్మలాగా నిశ్చలంగా కూచుని ఉన్నాడు.

సుందరం పక్కన ఎవడో కుర్రాడు హాస్యగాడు చేరాడు.

"వాడి మీసాలు చూశావ్రా? మొక్కజొన్న కండె పీచల్లే ఎల్లా వుందో!" అన్నాడు. ఎవ్వరూ నవ్వలేదు. సుందరానికి ఒక్కడికి నవ్వటానికి ధైర్యం చాలలేదు.

మరికొంతసేపుదాకా ఏమీ జరగలేదు. ఈసారి యింకో పెద్ద చప్పుడయ్యింది. ఇంకో మోటారు సైకిలూ, దానికి కాస్త వెనుకగా కారూ పోయింది. అందులో ఆడవాళ్ళూ, మగవాళ్ళూ - అంతా దొరలే - బొమ్మల్లాగ రంగు రంగుల దుస్తులు వేసుకొని ఎటూ చూడకుండా ఎదురుగా చూస్తూ కూచుని ఉన్నారు. ఆకస్మికంగా కనిపించిన యీ దృశ్యానికి ఆశ్చర్యపడి, పిల్లలు దాన్ని గురించి మాట్లాడుకునే లోపల యింకో కారు వెళ్ళింది. మొదటికారే మళ్ళీ వెళ్ళిందనుకున్నాడు సుందరం.

మొదటి కారులో ఎక్కడెక్కడ ఏయే మనుషులు కూచుని ఉన్నారో, ఏయే దుస్తులు వేసుకున్నారో రెండోదానిలో కూడా అటువంటివాళ్ళే, అదే విధంగా, అవే దుస్తులతో కూచుని ఉన్నారు. మరి కాస్సేపటికి పిల్లలకు యిళ్ళకు వెళ్ళటానికి అనుమతి దొరికింది. ఆవెళ్ళిన రెండు కార్లలో ఎందులోనో 'వైస్రాయి' వున్నాడని సుందరం ఇంటికొస్తూ తెలుసుకున్నాడు.

ఈ వృత్తాంతాన్ని వినగానే శేషగిరి "అసలే యుద్ధం. అందులోనూ వందేమాతరం తరువాత యింగ్లీషువాళ్ళు చాలా జాగ్రత్తగా ఉంటున్నారు... వైస్రాయి ఊటీ వెళుతున్నాడు గామాలు... ఈ యుద్ధం త్వరగా అయిపోతే బాగుణ్ణు. ధరలు మండిపోతున్నాయి. కిరసనాయిలూ అవీ దొరక్క నానా యిబ్బందీ అవుతున్నది." అన్నాడు.

సుందరం యుద్ధాన్ని గూర్చి వినటం యిది రెండవసారి.

సుబ్రహ్మణ్యం పంతులు రోజూ పొద్దుటకమాట్ల వచ్చి సుందరాన్ని చదివించసాగాడు. సీతమ్మ పూర్తిగా పొరపాటు పడలేదు. సుందరానికి చదువుమీద ఉండిన ఆసక్తి ఎట్లాగైనా కాస్త మందగించింది. వాడు బాగా ఆటలూ, తిరుగుళ్ళూ మరిగాడు అయితే వాడిలో ఇప్పుడు వెనకలేని ఆత్మవిశ్వాసం ఉన్నది. "ఈ పాఠం ఆరుసార్లు చదివి అప్పగిస్తా" అనేవాడు. అప్పగించేవాడు కూడాను.

## 8

ఒళ్ళు పగిలే రోహిణి గడిచి మృగశిర బిందించి ముసలెద్దు రంకె వేసింది. ఆయేడు ఎండలూ, వానలూ కూడా విపరీతంగానే ఉన్నాయి. శంకరంగారిది ఎండ కిల్లుగాని వానకిల్లుగాదు. ఇల్లంతా జలాజంత్రం. ఇదికూడా తన కష్టాలకు తగ్గట్టే వచ్చిందనుకున్నది సీతమ్మ. అయితే అదృష్టవశాత్తూ సొంత ఇంటికి మారటానికింకా పదిహేను రోజులే ఉన్నది.

ఒకనాడు వానకురిసి వెలిసిన తరువాత శేషగిరి పాడుపెట్టిన ఇల్లు చూడడానికి బయలుదేరాడు. శేషగిరి వెంట సుందరం కూడా బయలుదేరాడు. ఆ ఇంట్లో ఏ దయ్యాలో భూతాలో వుండి తనను భయపెడతాయని సుందరానికి ఏమూలో అనుమానం. తీరా తలవాకిలి తలుపు తాళంతీసి ఆవరణలోకి వెళ్ళేసరికి సుందరానికి నిజంగానే భయంవేసింది కాని ఏ దయ్యాన్నీ. భూతాన్నీ చూసికాదు –

4. వందేమాతరం (1905–1911): ముస్లింలనూ, హిందువులనూ వేరుచేసి జాతీయోద్యమ ఐక్యతను విచ్ఛిన్నం చేసే దురుద్దేశంతో వైస్రాయి కర్జన్ బెంగాల్ రాష్ట్రాన్ని రెండు రాష్ట్రాలుగా చీల్చాడు. బెంగాల్ పునరేకీకరణ జరిగిన 1911 వరకూ నడిచిన ఉద్యమమే వందేమాతరం ఉద్యమం. బంకించంద్రుని వందేమాతరం గీతం దీనికి స్ఫూర్తి నిచ్చింది. ఈ ఉద్యమ ఫలితంగా ఆంధ్రాలో రాజకీయ పరిజ్ఞానం, 'స్వదేశీ' ఉద్యమం పట్ల అభిమానం పెరిగాయి.

ఇంటిచుట్టూఉన్న ఆవరణం కీకారణ్యంలాగా అయింది. ఎక్కడపడితే అక్కడ గడ్డిమొలిచి సుందరం ఎత్తునా పెరిగింది సుందరం ఎన్నడూ కనీవినీ ఎరగని పిచ్చిపిచ్చి మొక్కలన్నీ ఎక్కణ్ణుంచి వచ్చాయో, ఏపుగా పెరిగాయి.

సుందరం ఇదంతా చూసి ఎందుకో దడుచుకున్నాడు. దొడ్డి ఈవిధంగా ఉండటానికీ తన తండ్రి చచ్చిపోవడానికి ఏదో సంబంధం ఉందనుకున్నాడు. ఈ ఇంట్లో మళ్ళీ వచ్చి ఎట్లా వుంటాం? అనుకున్నాడు వాడు.

కాని మరి పదిహేనురోజుల అనంతరం ఇంటికి పుణ్యాహవాచనం చేసి మళ్ళీ ప్రవేశించేనాటికి దొడ్డి ఎప్పటిలాగే శుభ్రంగా ఉంది. ఎవరు వచ్చి దొడ్డి బాగుచేసిందీ సుందరం ఎరగకపోవటంచేత వాడికి తాను చూసిన కీకారణ్యంలాంటి దొడ్డి ఒక కలగా జ్ఞాపకం ఉండిపోయింది.

అయినా సుందరానికి ఈసారి జీవితం కొత్తగానే ఉన్నది. ఈసారి సీతమ్మగారు తన ఇద్దరు పిల్లలతో చిన్న భాగంలో ప్రవేశించింది.

తరువాత కొద్దిరోజులకే ఆదినారాయణ అనే ఆయన తన భార్యతోనూ, అత్తగారితోనూ, ఇద్దరు కుమాళ్ళతోనూ వచ్చి పెద్ద భాగంలో ప్రవేశించాడు. వాళ్ళు చాలా మర్యాదస్తులు. బాగా ఉన్నవాళ్ళు. ఆదినారాయణగారికి ఉద్యోగమేమీ లేదు. ఆయన కేవలం పిల్లల చదువు కోసం బస్తీ చేరాడు. ఆయన కిద్దరు ఆడపిల్లలున్నారు. వాళ్ళు కాపరాలు చేస్తున్నారు. అయినా తరుచు పుట్టింటికి వచ్చి నెలల తరబడి ఉండిపోతారు.

ఆదినారాయణ భార్య పేరు భ్రమరాంబ. ఆ పేరు సుందరం చెవికి చాలా అందంగా వినపడింది. ఆవిడ నల్లనిదైనా మొహాన కళఉన్నదని తల్లి అనగా సుందరం విన్నాడు. సుబ్బమ్మలాగా భ్రమరాంబగారు కబుర్లు చెప్పటానికి వచ్చేదికాదు. దాన్నిబట్టి సుందరానికి సుబ్బమ్మమీదలేని గౌరవం భ్రమరాంబగారిమీద ఏర్పడింది. అయితే వాడికి ఒక్కందుకు కోపం వచ్చేది. భ్రమరాంబ తన తల్లిని "అక్కగారూ" అని పిలిచేది.

"అమ్మా, నువు పిన్నిగారికన్న పెద్దదానివా?" అని అడిగాడు సుందరం.

సీతమ్మ నవ్వి, "కాదు, ఏం?" అన్నది.

"నిన్ను అక్కగారని పిలుస్తుందేం?"

"చెల్లెలుగారని పిలవమన్నావా?" అన్నది తల్లి. ఈ మాటకు సుందరానిక్కూడా నవ్వొచ్చింది.

భ్రమరాంబ కొడుకులు ఒకడు రామ్మూర్తీ, ఇంకోడు క్రిష్ణమూర్తీనీ. ఇద్దరూ ముచ్చటముళ్ళు వేసుకొని "పొట్లెం"గా ఉండేవాళ్ళు. అంత సుకుమారి పిల్లల్ని - అందులోనూ మగపిల్లల్ని సుందరం ఎన్నడూ చూడలేదు. వాళ్ళు ఎప్పుడూ సిల్కు చొక్కాలు, వలవచేసినవి తొడుక్కుని ఎక్కడ మాసిపోతాయో అన్నట్లుండేవాళ్ళు వాళ్ళు. ఏ ఆటలకూ వచ్చేవాళ్ళు కారు. క్రిష్ణమూర్తిని సుందరం "గోలీలాడదాం వస్తా వుటోయ్?" అంటే, "బట్టలు మాస్తాయోయ్" అన్నాడు. సుందరం ఎప్పుడో తప్ప

ఇంట్లో ఉతికిన బట్టలు వేసుకునేవాడు. క్రిష్ణమూర్తి రాత్రిపూట పడుకోబోయేటప్పుడు తప్ప ఇస్త్రీ బట్టలే వేసుకునేవాడు.

"అమ్మా, పిన్నిగారబ్బాయిలు ఎప్పుడూ ఇస్త్రీ బట్టలేసుకుంటారే. నాకు వెయ్యవేం?" అని సుందరం తల్లి నడిగాడు.

"వాళ్ళు నాలుగురోజులూ అయిదురోజులూ అదే బట్టలు వేసుకుంటారు. అవి మాయకుండా ఉండటానికి ఉత్స విగ్రహాలల్లే కుర్చీలెక్కి కూచుంటారు. అదేం నయంరా? నువు రోజూ ఉతికిన బట్టలు వేసుకుంటున్నావు. అది శుభ్రంగా ఉండదూ?" అన్నది తల్లి. సుందరం పూర్తిగా ఈ వాదాన్ని ఒప్పుకోలేదుగాని, పై కేమీ అనలేదు.

రామ్మూర్తి స్కూలు తెరవగానే ఫస్టుఫారంలో చేరబోతున్నాడు. క్రిష్ణమూర్తి సుందరంలాగే మూడోక్లాసులో చేరబోతున్నాడు. అందువేత సుందరం వాడితో మంచి స్నేహం చెయ్యటానికి ప్రయత్నించాడు. అయితే క్రిష్ణమూర్తి ఇంకొకరికి మనసిచ్చి స్నేహం చెయ్యటం చాతనయినవాడు కాడు. ఇంకొకరి మనస్సు తీసుకోనూలేడు.

కాని క్రిష్ణమూర్తికి పెద్దవాళ్లు కొన్ని మర్యాదలూ అవీ నేర్పారు. అందుచేత మొదట చూడగానే ఎటువంటి వాళ్ళకికూడా "ఆహా, ఎంతబుద్ధిమంతుడు!" అనిపించేది. వాడుబుద్ధిమంతుడు కాదని కాదు. కాని ఆ బుద్ధిమంతనంలో ఏ విశిష్టతా లేదు. వాడు అమిత పిరికివాడు. ఎక్కడ నలిగిపోతాడో అన్నట్టు పెంచటంవల్ల సుకుమారం జాస్తయి బొత్తిగా జిడ్డిమనిషిగా తయారైనాడు. చలికాలం వస్తే తెల్లారి జాముపొద్దెక్కేదాకా ఫ్లానల్ చొక్కా తొడుక్కుని, నెత్తికి వూలుకుళాయి పెట్టుకుని, దాన్ని చెవులమీదికి లాక్కుని, కుర్చీలో కూర్చుని ఉండచుట్టుకుని వణుకుతూ వుండేవాడు. వానలుకురిస్తే అరికాలికి చుక్కతడి తగలనిచ్చేవాడుకాడు. ఇటువంటి సంగతులన్నీ సుందరం క్రిష్ణమూర్తినోటా, భ్రమరాంబనోటా, ఆదినారాయణనోటా, రామ్మూర్తినోటా విన్నాడు. కాని వాడికిదంతా నచ్చలేదు. సుందరం అనుభవంలో చలికి వణుకుతుంటే సరదాగా ఉంటుంది. ధనుర్మాసంలో సీతమ్మగారు తెల్లవారు జామున లేచి లాంతరు దగ్గిర పెట్టుకుని ఇంటిముందు పెద్ద పెద్ద ముగ్గులు వేస్తుంటే సుందరం చలికి కొంత గజ గజలాడుతూ, కావాలని మరింతగా పళ్లు టకటక లాడించేవాడు. తల్లి ఎంతచెప్పినా లోపలికి వెళ్ళేవాడుకాడు. పోనీ శాలువా అన్నా తెచ్చి కప్పుకునేవాడు కాదు. ముగ్గుసాంతం అయిన తరువాత వీధిలోకి వెళ్ళి నాయుళ్ళింటిముందు భోగిమంట దగ్గిర కూర్చుని చలికాచుకునేవాడు. క్రిష్ణమూర్తికి ఇది తలవటానిక్కూడా వీల్లేని కార్యక్రమం. వాడెన్నడూ సూర్యోదయానికి ముందు లేచి ఎరుగడు.

"అమ్మా, వాళ్ళ క్రిష్ణమూర్తి మంచివాడంటావే వాడు రోజూ పొద్దెక్కి లేస్తాడు. పక్కలో ఉచ్చబోస్తాడు. ఎవరన్నా తోడురాందే, రాత్రిపూట వెన్నెలగా ఉన్నా బయటికి రాలేడు" అన్నాడు సుందరం తల్లితో.

"బాగుంది. ఒక్కొక్కరికి ఒక్కొక్క లోపం ఉంటుంది. పెద్ద వాళ్ళు కాస్త గారాబంగా చూస్తే పిల్లలు అట్లాగే అవుతారు. అయినా క్రిష్ణమూర్తి బుద్ధిమంతుడే.

ఒక పోరువూ పొచ్చెమూ అక్కర్లేనివాడు. చీకట్లో బయటికి పోగలనుగదా అని గర్వపడడు. నీకన్న కొన్ని విషయాల్లో క్రిష్ణమూర్తి చాలా మంచివాడు." అన్నది సీతమ్మగారు.

సుందరం కాస్త ఆలోచించి, "నేనుకూడా సిల్కు చొక్కాలు తొడుక్కుని, ముచ్చటముడి, జులపాలూ పెట్టుకుంటే అందరూ మంచివాణ్ణే అనుకుంటారు" అన్నాడు.

"ఛీ, వెధవా! వాళ్ళు వింటే ఏమనుకుంటారు?" అని తల్లి కోప్పడింది. కాని కొడుకు చురుకుతనానికి సంతోషం ఆగక పైకి నవ్వేసింది.

❀ ❀ ❀

తండ్రిపోయిన ఈ మూడునెలల కాలంలో సుందరంలో కలిగిన మార్పు చూసి సీతమ్మగారు ఎందుకో జాలిపడేది. "చిన్న వెధవ, ఈడుకుమించి పెద్దవాడవు తున్నాడు" అని ఆవిడ అనుకునేది. ఇది కేవలం పరిస్థితులవల్ల కలిగినమార్పు.

సుందరం పొద్దునలేచి మొహం కడుక్కుని చద్దన్నం తిన్నది మొదలు తల్లివెంటే ఉండి ఆవిడకి అన్నిపనుల్లోనూ సహాయం చేస్తాడు. ముఖ్యంగా చంటిపిల్లకు ఉగ్గుపోస్తున్నా, పాలిస్తున్నా, నీళ్ళుపోస్తున్నా, వాడు దగ్గిర ఉండితీరాలిసిందే. చెల్లెలంటే వాడికి అపరిమితమైన ఆపేక్ష. అది ఏంచేసినా వాడికి వింతగానే ఉండేది. "అమ్మా, చెల్లెలు నన్ను చూసి నవ్వుతున్నది... నా మొహంమీద చెయ్యి పెట్టుతున్నది... ఆ - అని పాడుతున్నది" అని సంతోషంగా పొలికేకలు పెట్టేవాడు.

ఇంటి కెవరన్నావస్తే సీతమ్మగారు చప్పున అవతలకి తప్పుకునేది. వాళ్ళను పలకరించి పరామర్శించటం సుందరం మెల్లిమెల్లిగా నేర్చుకుంటున్నాడు. వాడు కోమటి కొట్టుకుపోయి చిల్లర వెచ్చాలు తీసుకురావటం నేర్చుకుంటున్నాడు. ముఖ్యమైన సామాన్లు పెద్దమొత్తాలలో శేషగిరి ఏర్పాటుచేసి మరీ వెళ్ళాడు.

సొంతయింటికి తిరిగి వచ్చిన తరువాత సుందరం ఆటలు మళ్లా తగ్గాయి. వాడు పొద్దాకి రావటానికి తల్లి ఒప్పుకోలేదు. సావాసం కావాలంటే ఇంట్లో రామ్మూర్తీ, క్రిష్ణమూర్తీ ఉన్నారుగదా అని కొంత పక్కనున్న ఆదినారాయణగారి పిల్లలు "బుద్ధిమంతనంగా" ఏ ఆటలకూ పోకుండావుంటే తనకొడుకు బడి విడవగానే నేరుగా ఇంటికిరాక ఆటలకు పోవటమెందుకని కొంతా, వాడు లేకపోతే ఇల్లు బిక్కు బిక్కుమంటుందన్న భావం కొంతా చేరి సీతమ్మగారు కొడుకు ఆటలు మానిపించింది. సుందరం ఎక్కువ అభ్యంతరం చెప్పలేదు. ఇప్పటికీ వాడికి తల్లిచేసే ఇంటిపనులు చూస్తూ కూచోటం పరమానందమే.

రేపో ఎల్లుండో సుందరమూ, క్రిష్ణమూర్తీ కూడా బడిలో చేరుతారనగా ఆదినారాయణగారు ఇద్దరినీ కలిపి పరీక్షచేశాడు. పరీక్ష అయిపోయిన తరువాత ఆయనేమీ అనలేదుగాని క్రిష్ణమూర్తికన్నా తనకే చదువు బాగా వచ్చునని సుందరం సులభంగా అర్థం చేసుకున్నాడు.

ఆదినారాయణ అననిమాట హైస్కూలు మూడోక్లాసు మేష్టరన్నాడు ఆది నారాయణగారే ఇద్దర్నీ స్కూలుకు తీసుకు వెళ్ళాడు చేర్పించడానికి. మేష్టరు ఇద్దరికీ లెక్కలిచ్చాడు. క్రిష్ణమూర్తి నిజంగా మొద్దుకాకపోయినా కంగారువల్ల మొద్దల్లే కనిపించాడు. తెలుగు చదవటంలోకూడా సుందరంకంటె ఎక్కువగా తడువుకున్నాడు. నిజానికి సుందరం ఏమీ తడువుకోలేదు. ఇంగ్లీషులో ఇద్దరూ దాదాపు ఒక స్టాండర్డులోనే ఉన్నారు.

"ఈ అబ్బాయికి కాస్త ఇంగ్లీషు వచ్చిఉంటే నాలుగో క్లాసులో వేయించి ఉందును. ఇప్పటికైనా మించిపోలేదు. ట్యూషన్ చెప్పిస్తే..." అన్నాడు మేష్టరు.

ఆదినారాయణ రానినవ్వు తెచ్చుకుని, "ఆ పిల్లవాడికి ఈడు చాలదులెండి" అన్నాడు.

ఇద్దరూ మూడోక్లాసులో చేరారు కాని క్రిష్ట మూర్తి బీసెక్షన్‌లో పడ్డాడు. సుందరాన్ని పరీక్షించిన మేష్టరు తన సెక్షన్‌లోనే వుంచుకున్నాడు స్వార్థంకొద్దీ.

వీధిబడికీ హైస్కూలుకు ఏమీ సంబంధం లేదనిపించింది సుందరానికి. ఈ హైస్కూల్లో ఎన్నో క్లాసులు, ఒక్కొక్క క్లాసుకూ నాలుగేసి డివిజనులు. ఏ డివిజనుకా క్లాసుమేష్టరు. ఇంకా ఇతర మేష్టర్లుంటారు. మూడోక్లాసుకు ఒక్క డ్రాయింగు మేష్టరు మాత్రమే కొత్తగా వస్తాడు. కాని రామ్మూర్తి క్లాసుకు లెక్కల మేష్టరు వేరు, తెలుగు మేష్టరు వేరు, హిస్టరీ మేష్టరూ, జాగ్రఫీ మేష్టరూ, డ్రాయింగు మేష్టరూ వేరు వేరు. పొద్దున సరిగా పదికి గంటకొట్టి క్లాసులు ప్రారంభిస్తారు. ప్రతి పీరియడుకూ రెండేసి బెల్లులు కొడతారు. పీరియడు మారగానే పాఠాలు మారతాయి. టైమ్ టేబిల్ ప్రకారం పాఠాలు చెబుతారు.

మేష్టరు క్లాసులోకి రాగానే పిల్లలంతా లేచి నిలబడతారు. మొట్టమొదటి పీరియడు ప్రార్థనతో ఆరంభమవుతుంది. తరువాత అటెండెన్సు. స్కూలుబయట వీధిలో మేష్టరు కనబడినా పిల్లలు నమస్కారాలు చెయ్యాలి.

స్కూలుకంతకూ హెడ్మాష్టరుంటాడు. ఆయన వస్తుంటే మేష్టరు పిల్లలు కూడా ఎంతో భయంగా ఉంటారు.

"వెధవ వీధిబడి; ఒకటే కొట్టడం. ఈ హైస్కూల్లో అటువంటివేమీ వుండవు. హైస్కూల్లో ప్రవేశించటం ఎంత అదృష్టం" అనుకున్నాడు సుందరం. చదువుమీద సుందరానికున్న ఆదరాన్ని, హైస్కూలు వాతావరణం రెట్టింపుచేసింది. కాని ఈ అభిప్రాయం ఇంకా ఏర్పడుతుండగానే సుందరం వీధిబడిని మరిపించే దృశ్యం చూశాడు. హెడ్మాష్టరు తన గదిలో ఒక విద్యార్థిని పేముబెత్తముతో కొడుతూ ఉండటం సుందరం కంటబడింది. హెడ్మాష్టరు పొట్టివాడైనా మంచి వర్చస్వీ, స్ఫురద్రూపీ. ఆయన తలపాగా దగ్గిర్నుంచి కాలికి తొడిగిన చెప్పులవరకూ ఎంతో నాజూకుగానూ, సరికొత్తగానూ, గౌరవనీయంగానూ ఉండేవి. ఆయన బెత్తం తీసుకుని ఎవర్నిగాని కొడతాడని ఎవరూ అనుకోరు. ఆయనచేత తన్నులుతినే విద్యార్థి హెడ్మాష్టరు కెదురుగా నిలబడి చెయ్యి అడ్డంగా చాచి పెట్టాడు. చెయ్యి

కొంచెంగా వాలినట్టు కనబడగా హెడ్మాస్టరు పేంబెత్తంతోనే చేతిని కొద్దిగా పైకెత్తి విసురుగా అరిచేతిమీద కొట్టాడు. విద్యార్థి నోట ఏ శబ్దమూ రాలేదు. దెబ్బకు వాడి శరీరమంతా కొద్దిగా బిగుసుకున్నట్టు కనబడింది. హెడ్మాస్టరు విద్యార్థి కుడిచేతిమీద మూడు దెబ్బలూ, ఎడంచేతిమీద మూడు దెబ్బలూ వేసి, "గో" అన్నాడు.

దెబ్బలబాధ అటుంచి, అంత గొప్పవాడిచేత దెబ్బలు తినటంలో చాలా అవమానం ఉంటుందని సుందరం ఊహించాడు. హెడ్మాస్టరుపైన సుందరానికి గౌరవంతోబాటు భయంకూడా కలిగింది.

ఈ హెడ్మాస్టరు కిందటేడే వచ్చాడు. అంతకు పూర్వం ఉండిన హెడ్మాస్టరు పిల్లల్ని భయపెట్టటంలో చాలా అఖండుడు. ఆయన ఎవరినీ సాధారణంగా కొట్టేవాడుకాడట. అయినా ఎందుకో ఆయనంటే పిల్లలకు సింహస్వప్నంగా ఉండేది. ఒక్క పిల్లలకేకాక ఎంతటి వాళ్ళయినా సరే ఆయన దగ్గిరికి వచ్చేసరికల్లా పిల్లులయేవాళ్ళని కొత్త హెడ్మాస్టరు విన్నాడు. అటువంటివాడి తరువాత ఆ పనిలోకి రావటం ఆయనకు పెద్ద చిక్కయింది. అందుచేత ఈ హెడ్మాస్టరు స్వతహాగా మంచివాడై ఉండికూడా లేని కాఠిన్యం తెచ్చి పెట్టుకున్నాడు. అయినప్పటికీ ఆయనకు కావలసిన ఫలితాలు రావటంలేదు.

అదివరకు కుక్కిన పేనుల్లాగా ఉండిన ఫిఫ్తుఫారం, స్కూలు ఫైనలు విద్యార్థులలో రౌడీజట్టువాళ్ళు ఈ హెడ్మాస్టరుమీద తిరగబడే ధోరణి చూపించారు. అది తన తప్పుకాదనీ, అంకుశం తీసిన తరవాత ఏనుగు కొంతదూరం పరుగెత్తి తీరుతుందనీ ఆయన గ్రహించక, హెడ్మాస్టరు రౌడీ పిల్లకాయల్ని శిక్షించడానికి పూనుకొన్నాడు.

## 9

హైస్కూలులో ప్రవేశించిన మొదటి నెలలో క్లాసులో సుందరంది ఇరవైఎనిమిదో "ప్లేసు", క్రిష్ణమూర్తిది తొమ్మిదో ప్లేసు. తెలివిగలవాళ్ళు ఎక్కువస్థానాల్లో ఉంటారనీ, తెలివితక్కువవాళ్ళు తక్కువస్థానాలలో వుంటారనీ సుందరానికి తెలుసుగాని, హరిఓం అంటూనే తన తెలివితేటలకూ క్రిష్ణమూర్తి తెలివితేటలకు ఇంత వ్యత్యాసం ఎట్లా వచ్చిందో సుందరం ఊహించలేకపోయినాడు. అటెండెన్సు రిజిష్టరులో పేర్లు అక్షరక్రమాన్ని బట్టి రాస్తారని వాడికి తెలీదు. ఆ సంగతి వాడికెవరూ చెప్పలేదు.

తనకేదో గొప్ప అన్యాయం జరిగినట్టు సుందరం ఈ విషయం తల్లితోకూడా చెప్పుకున్నాడు. కాని ఆవిడకూ నిజం తెలియకపోవటంచేత, లోపల నొచ్చుకుని కూడా పైకి "నే చెప్పలా! వాడు తెలివిగలవాడే. నువు కూడా బాగా చదివితే పైకి రావచ్చు" అన్నదావిడ, కాని ఈ చదవటం దగ్గిరకూడా సుందరానికి క్రిష్ణమూర్తి పక్కలో బల్లెం అయినాడు. వాడు సాయంకాలం దీపం పెట్టగానే కూర్చుని పైకి

చదవటం ప్రారంభించేవాడు. అట్లా అన్నం తినేదాకా చదివేవాడు. అన్నం తిన్న తరవాత పడుకుని నిద్రపోయ్యేవాడు. సుందరానికి పైకి చదవటం అసహ్యం. వాడు చదువుతున్నప్పుడు లోపలే చదువుకునేవాడు. సుందరాని కింకో దురభ్యాసం కూడా ఉంది. వాడు క్రిష్ణమూర్తిలాగా గిరిగీసినట్టు క్లాసులోచెప్పినంతవరకే చదవక పుస్తకం తీసి తనకు చదవబుద్ధిపుట్టినదల్లా చదివేవాడు. పాఠాలు ప్రారంభించి నెల తిరగకముందే తెలుగు పుస్తకాలన్నీ చదివేశాడు. ఇంగ్లీషుపుస్తకంతో చిక్కొచ్చేది. ఇంగ్లీషుపాఠంలో తనకు తెలియనిమాట వచ్చేసరికి వాడికి గొంతుకేదో అడ్డంపడ్డట్టుగా ఉండేది. క్లాసు పుస్తకాలనేకాదు, ఏ ఇంగ్లీషు అచ్చు కనిపించినా చదవటానికి ప్రయత్నించేవాడు. అందులో తనకు తెలిసిన మాటలు చాలావుంటే సంతోషించేవాడు. కొద్దిగానే ఉంటే "ఇంత ఇంగ్లీషు నా కెప్పటికి వస్తుంది?" అని లోపల దిగులుపడేవాడు.

"బుద్ధిమంతుడు" లాగా క్రిష్ణమూర్తి క్లాసులో మేష్టరు చెప్పిన పాఠమే రెండు మూడుసార్లు చదవటం వినిపిస్తుంటే సుందరానికి పట్టరాని కోపం వచ్చేది.

తెలుగులోగాని ఇంగ్లీషులోగాని పద్యాలు కంఠతా పట్టవలసి వచ్చిన రోజున క్రిష్ణమూర్తి చిన్న యజ్ఞం చేసినంత పని చేసేవాడు. గొంతు హెచ్చించేవాడు. ఇరవై, ముప్పైసార్లు చదివేవాడు. క్రిష్ణమూర్తి చదువుతూంటే సుందరం తడిక ఇవతలనుంచి ఆలకిస్తూ కూర్చునేవాడు. పద్యం కంఠస్థంచేసే ఆఖరుదశలో క్రిష్ణమూర్తి పుస్తకాన్ని ఒళ్ళో బోర్లా పెట్టుకుని వచ్చినంతవరకు కళ్ళు మూసుకుని ఏకరువు పెడుతూ, "బ్రేక్" పడ్డచోట మళ్ళా పుస్తకంతీసి చూసి, మళ్ళా కళ్ళు మూసుకుని చతదువుతూండే సమయానికి సుందరానికి పద్యం పూర్తిగా వచ్చి ఉండేది తరవాత మర్నాడు క్లాసులో పద్యం వప్పగించవలసి వచ్చినప్పుడు సుందరం, ప్రాంప్టింగ్ ఒక చెవితోవింటూ నటించే నటుడులాగా, క్రిష్ణమూర్తి కంఠస్వరాన్ని జ్ఞాపకం తెచ్చుకుంటూ పద్యమంతా తడువుకోకుండా ఏకరువు పెట్టేవాడు. ఇంకా ఒక్కొక్కసారి క్రిష్ణమూర్తే మధ్యలో నట్టుపడి మేష్టరో, పక్కపిల్లవాడో అందించే దాకా ముందుకు కదలలేక పొయ్యేవాడు!

నెల ఆఖరై కొత్త రిజిష్టరు ఆరంభమయేసరికి సుందరానికి జరగదగిన న్యాయం జరిగింది. వాడు ఐదో "ప్లేసు"కు వచ్చేశాడు. క్రిష్ణమూర్తి ఒక్క ప్లేసు పైకివచ్చి ఎనిమిదోవాడైనాడు.

సుందరం ఆనందానికి మేరలేదు. "ఇప్పుడేమంటావు?" అని క్రిష్ణమూర్తితో అనటానికి అవకాశంవుంటే బాగుండుననిపించింది సుందరానికి. కాని క్రిష్టమూర్తి అటువంటి అవకాశం ఇవ్వనేలేదు వాడు మొదటినుంచీ చాలా "పెద్దమనిషి" తరహాగా ఉన్నాడు.

క్రిందటినెల ఎవరన్నా క్రిష్టమూర్తిని, "క్లాసులో నీదెన్నోప్లేసురా" అని అడిగితే, "నాది తొమ్మిదోప్లేసు" అని చెప్పేవాడు. "ఈ అబ్బాయిదో" అని సుందరాన్ని గురించి అడిగితే "అతని దెంతయితే ఏం?" అని త్రోసిపుచ్చడానికి ప్రయత్నించేవాడు. అట్లా

అనటంలో క్రిష్ణమూర్తి తనది చాలా తక్కువ ప్లేసని వాళ్ళకి తెలియజేస్తున్నాడని సుందరానికి యెట్లాగో తెలుసు.

కొత్తనెల ఆరంభమయిన తరవాత క్రిష్ణమూర్తి కొత్తపద్ధతి అవలంబించాడు. తనది ఎనిమిదోప్లేసని చెప్పేవాళ్ళతో తన పక్కనున్న సుందరానిది అయిదో ప్లేసని విధిగా చెప్పేవాడు. వాడు లోపల "ఏడుచు"కుంటున్నాడని కూడా సుందరానికి ఎట్లాగో తెలుసు. కాని ఏమిటి చెయ్యటం?

అయితే సుందరానికి మొదటినుంచీ తెలియని విషయం క్రిష్ణమూర్తికి తెలుసు. మొదటినెల ప్లేసులు పేర్ల మొదటి అక్షరాలనుబట్టి వచ్చినపని.

❀ ❀ ❀

న్వదే–శవహ–తనీ–షదా–రవిం–దనుల్–సదా–మదిన్–భజిం–చెదన్–ముదంబుగూ–ర్చుమా"–

ఈ పాట ఆరోజు ఉదయంనుంచీ సుందరం తలకాయలో మారుమ్రోగుతూనే వున్నది. అప్రయత్నంగా యెన్నిసార్లో నోటంటకూడా వచ్చేసింది. రోడ్డుమీద నడిచేటప్పుడు కూడా సుందరం ఆ పాటకు దరువువేస్తునే నడిచాడు.

ఆ రోజు ఉదయం కొంతమంది ఆ పాటపాడుతూ వీధివెంట వెళ్లారు. స్కూలుకుపోతూ సుందరం చాలా దూరం వాళ్ళవెంటే వెళ్ళాడు. ఆ పాట వింటూ – ఒక రోడ్డు కలయికలో నిలబడి వాళ్ళు "వందేమాతరం" అని కూడా కేక పెట్టారు. రెండోరోడ్డు కలయికలో సుందరంకూడా "వందే మాతరం' – అని కేకపెట్టి చాలా గొప్పపనిచేసినవాడల్లే తృప్తిచెంది వాడు నేరుగా స్కూలుకు వెళ్ళాడు. ఆ తరవాత ఆ పాటపాడేవాళ్ళు ఎటువెళ్ళారో వాడికి తెలియదు.

సుందరానికి ఏ పాటలైనా ఆసక్తే. వాళ్ళమ్మ పాడే పాటలన్నీ వాడికి వచ్చు. ఎప్పుడైనా భజనలు జరిగితే వెళ్ళి అక్కడవాళ్ళు పాడే తరంగాల్లో ముక్కలు విని పట్టుకునేవాడు.

సుందరంతోబాటు చదివే కుర్రాళ్ళల్లో ఒకడు రోజూ ప్రార్థన చదివేవాడు. వాడు "ఒక సూర్యుండు" "శ్రీ మద్భాను" "ఎవ్వనిచే జనించు" అనే మూడు పద్యాల్లో కనీసం ఏ రెండో రోజూపాడేవాడు. క్లాసుమేష్టరు ఒక్కొక్కరోజున వాడి చేత ఇంకా ఒకటి రెండు పద్యాలుకూడా పాడించుకుని వినేవాడు. ఈ కుర్రాడిపేరు ప్రకాశం. వాడు ఇతరత్రా పెద్ద తెలివిగలవాడు కాదుగాని సుందరం ప్రాణానికి వాడి సంగీతంలో చెప్పరాని ఆకర్షణ వుండేది. ఈ ఆకర్షణకొద్దీ సుందరం ప్రకాశంతో మంచి సావాసం చేశాడు. ప్రకాశానికి ఏమీ గర్వం లేకపోవటం చూసి సుందరానికి మరింత ఆనందంగా ఉండేది. వాడి సంగీతం చూసి మిగిలినవాళ్ళంతా యెందుకు ముగ్ధులుకారో సుందరానికి అర్థమయేదికాదు.

సుందరం క్లాసులో శివయ్య అని ఒక మేదరవాళ్ళబ్బాయి వుండేవాడు. ఆ అబ్బాయి చాలా బీదవాడనీ, జీతం కట్టడనీ తెలిసినప్పుడు సుందరానికి వాడిమీద చాలా జాలి కలిగింది. అయినా శివయ్య ఎటువంటి ఇంట్లో వుంటాడో, వాళ్ళనాన్న,

అమ్మా ఎట్లా వుంటారో సుందరం కలలో కూడా ఊహించగలిగి ఉండేవాడు కాదు.

ఒక శనివారంనాడు సీతమ్మగారు సుందరాన్ని ఆదినారాయణగారి వెంట పంపింది. ఆదినారాయణగారు మార్కెట్టుకు పోతున్నాడు. దారిలో మేదరవాళ్ళిళ్ళదగ్గిర చాటకొని ఇప్పించమని సీతమ్మగారు సుందరాన్ని ఆదినారాయణగారి వెంట పంపింది. మేదర ఇళ్ళమాట వచ్చినప్పుడు సుందరానికి శివయ్య జ్ఞాపకమే రాలేదు.

మేదర ఇళ్లన్నీ పూరిగుడిసెలు, అందులోనూ చాలా చిన్నవి. పిల్లలు పరవాలేదుగాని, ఆదినారాయణగారంటి పెద్దవాళ్ళు లోపలికి పోవాలంటే బాగా వొంగిపోవాలి. ఈ గుడిసెల బయట మేదరవాళ్ళు - ఎక్కువగా ఆడవాళ్ళు - కూచుని మేదరపని చేస్తున్నారు. ఆడవాళ్ళే గడలు చీలుస్తున్నారు. బద్దలు తీస్తున్నారు. వాళ్లు అవలీలగా గడలను చీల్చటమూ, పలచగా బద్దలు తీయటమూ చూస్తే సుందరానికి ఎంతసేపయినా చూడబుద్ధి అయింది. ఒక ముసలాడు పళ్ళిక అల్లుతున్నాడు. చిన్న చిన్న పిల్లలు కూడా విసనకర్రలూ, గంపలూ అల్లుతున్నారు. అక్కడక్కడా తడికలు పేర్చి ఉన్నాయి. కొత్త తడికల వాసన అంతటా చుట్టేసింది.

ఆదినారాయణ ఒక ఆడమనిషి దగ్గిరికివెళ్ళి, "చాట ఒకటి కావాలే" అన్నాడు. ఆ ఆడమనిషి ఎవర్నో కేకేసింది. "చిన్నోడో" అని. శివయ్య ఇంట్లోనుంచి బయటికి వచ్చాడు.

శివయ్యను చూసి సుందరం ఎక్కువ తెల్లబోయినాడో, సుందరాన్ని చూసి శివయ్య ఎక్కువ తెల్లబోయినాడో చెప్పడం సాధ్యంకాదు. శివయ్యను గురించి తెలియగూడని. రహస్యం సుందరానికి తెలిసిపోయినట్టు ఇద్దరూ బాధపడ్డారు. ఈ బాధనుండి శివయ్య త్వరగా కోలుకున్నా సుందరం ఎప్పటికీ పూర్తిగా కోలుకోలేదు.

"చాటలు పట్టుకురారా" అన్నది శివయ్య తల్లి.

అంతదాకా రెప్పవాల్చకుండా సుందరాన్ని చూస్తూ నోటంట ఏమీ అనలేకుండా వున్న శివయ్య లోపలికెళ్ళి నాలుగు చాటలు, ఒకదానిలో ఒకటి పెట్టి తెచ్చాడు. ఆదినారాయణ కాస్త బేరంచేసి, నాలుగు చాటలనూ జామున్నరసేపు పరీక్షించి అయిదోచాట లేదని రూఢి చేసుకుని ఒకటికొని సుందరంచేత డబ్బులు ఇప్పించి, "ఏం రా, అబ్బాయ్? నువ్వింటికి పోతావా! నావెంట వస్తావా?" అని సుందరాన్ని అడిగాడు.

"నే నింటికిపోతా" అన్నాడు సుందరం చాట తీసుకుని.

ఆదినారాయణ వీపు తిప్పగానే శివయ్య ముందుకు వచ్చి, సుందరం చేతిలో చాట తీసుకోటానికి ప్రయత్నిస్తూ "నేను మీ యింటికి తెచ్చిపెడతా" అన్నాడు.

"వద్దోయ్" అన్నాడు సుందరం.

"కొంచెందూరం తెచ్చి పెడతా" అన్నాడు శివయ్య దాదాపు చాటలాక్కుంటూ.

ఎందుకో సుందరానికి శివయ్యమీద అదివరకుగల జాలి గౌరవంగా మారింది. అటువంటి ఇంట్లో ఉంటున్నవాడు తనతో చదువుకుంటున్నందుకు జాలి చాలదు. శివయ్య క్లాసులో ఇప్పుడు పదోవాడు.

ఇద్దరూ కొంతదూరం మౌనంగా నడిచారు.

"ఆవిడ మీ అమ్మా?" అన్నాడు సుందరం.

"ఔను" అన్నాడు శివయ్య.

మరికొంతదూరం నడిచారు. సుందరం ఆగాడు.

"ఏం చేస్తున్నావు? చదువుతున్నావా?"

"ఔను"

"హోంవర్కు చేశావా?"

"నిన్న సాయంత్రమే చేశా"

కాస్సేపు మౌనం.

"రాత్రి చాలా సేపు చదవుతావా?"

"రాత్రిళ్ళు దీపాలు పెట్టుకోవటంలేదు. కిరసనాయిలు మండిపోతున్నది. ఒక సీసా ఇస్తారు."

"నే పోతానోయ్"

"పదండి"

"నన్ను ఏమండీ అనోద్దు. నాకు బాగుండదు" అన్నాడు సుందరం. తరవాత ఇంకోటి జ్ఞాపకం వచ్చింది వాడికి. "చాట ఇచ్చెయ్యి."

"నేను కూడా మీ యింటిదాకా వస్తాగా?"

"ఎందుకూ?"

"రాగూడదా?" శివయ్య పిరికిగా నవ్వాడు.

"ఎందుకు రాగూడదూ? చాట నా కియ్యి."

"నే పట్టుకొస్తాగా?"

"నేను కూలి యివ్వనబ్బాయ్. తరవాత నీ యిష్టం?" అన్నాడు సుందరం. వాడి ప్రాణానికది చాలా పెద్ద హాస్యంగా తోచింది.

శివయ్య ఈమాటకు నవ్వాలేదు. జవాబు చెప్పాలేదు. చాట మరింత భద్రంగా చంకన పెట్టి సుందరంతోబాటు నడవసాగాడు.

ఇంటికి పోయిన తరవాత శివయ్యను సుందరం తన తల్లికి చూపించి, ఈ అబ్బాయి నాతో చదువుతున్నాడమ్మా! అని చెప్పాడు. ఆ అబ్బాయి కులం ఏమిటో వాడు తల్లికి చెప్పలేదు. వాడికి చెప్పటానికి మనసు రాలేదు.

"పాపం, బజారికెళ్ళి చాట పట్టుకొచ్చావు. అప్పడం కాల్చాను ఇవ్వనుట్రా?" అన్నది సీతమ్మ కొడుకుతో.

ఆవిడ యిద్దరికీ చెరొక అప్పడమూ యిచ్చింది. తల్లి తనకిచ్చిన అప్పడంకన్న శివయ్య కిచ్చిన అప్పడం కొద్దిగా మాడివుండటం చూసి సుందరం లోలోపల చాలా సిగ్గుపడ్డాడు కాని ఏమీ చెయ్యలేకపోయినాడు.

సుందరం తన అప్పడం వెంటనే తినసాగాడు. కాని శివయ్య తినటానికి మొహమాటపడ్డాడు.

"తినవేంరా" అన్నాడు సుందరం.

"నేను యింటికి పోవాలి."

"తిని పోదుగాన్లే."

ఏమీ అనలేక శివయ్య కొంచెం కొంచెమే అప్పడం తుంచి నోట్లో వేసుకుని నోరు మెదలకుండా వినపడకుండా కసపడకుండా తినసాగాడు. సుందరం ఎప్పుడో తన అప్పడం పూర్తిచేసి, కారానికి రొజుకుంటూ లోపలికి పరిగెత్తి మంచినీళ్ళు తాగాడు.

వంటదగ్గిర ఉన్న సీతమ్మ "ఆ అబ్బాయికూడా కావాలేమో మంచినీళ్ళు" అన్నది.

"గ్లాసుతో ఇయ్యి" అన్నాడు సుందరం.

"ఆ అబ్బాయి సూద్దరాడు కాదూ?" అన్నది సీతమ్మ.

"అయితే?"

"కరుచుకు తాగటానికి ఇవ్వకు."

"ఏమిటమ్మా?" అన్నాడు తల్లి ప్రవర్తనకు కలుగుతున్న చిరాకంతా ఒక్కసారి బయటకు కక్కుతూ.

సుందరం పుట్టుకతోనే సంస్కారి అని కాదు. క్లాసులో తనకు సమానంగా ఉండేవాణ్ణి ఇతర విషయాల్లో నీచంగా చూడాలంటే, సంఘ స్వరూపం ఎరగని సుందరానికి బాగా పట్టి యిచ్చింది.

"సరే పోనీ తాగనీ, తరవాత తోల్చుకుంటాలే" అన్నది సీతమ్మ కొడుకులో తిరుగుబాటు లక్షణాలు కనిపెట్టి.

శివయ్య మంచినీళ్ళు అక్కర్లేదన్నాడు. సుందరం బలవంతం చేసినమీదట గ్లాసు ఎత్తుకుని నోట్లో పోసుకున్నాడుగాని, కరుచుకు తాగలేదు.

"ఇక పోతానండీ" అన్నాడు శివయ్య.

"నీకు తెలుసా? క్రిష్ణమూర్తి కూడా మా యింట్లోనే ఉంటున్నాడు అవతల భాగంలో."

"ఉన్నారా, క్రిష్ణమూర్తిగారు?" అన్నాడు శివయ్య చాలా మర్యాదగా.

"ఏయ్ క్రిష్ణమూర్తీ!" అని సుందరం పొలికేక పెట్టాడు.

క్రిష్ణమూర్తి పలికాడుగాని రాలేదు.

"శివయ్యొచ్చాడు" అని అరిచాడు సుందరం.

"అట్లాగా!" అని తాపీగా తడిక అవతలనుంచి సమాధానం వచ్చింది.

"నేను వెళ్ళాలి" అంటూ శివయ్య వెళ్ళిపోయినాడు.

❀ ❀ ❀

ఊళ్ళోకి బయస్కోపు వచ్చింది. అలవాటు ప్రకారం బాండుమేళంతో సహా ఒంటెద్దు బండిమీద కాగితాలు పంచిపెట్టారు. ఆఖరు టిక్కెట్టు అణా.

"అమ్మా, అమ్మా! నేను బయస్కోపు చూడొద్దూ?" అన్నాడు సుందరం.

"ప్రతిదీ కావాలంటావు. ఎట్లాగురా నీతో?" అన్నది తల్లి.

సుందరం ఉత్సాహమంతా కుంగిపోయినట్టయింది.

"అణాయేగా, అమ్మా?" అన్నాడు వాడు.

"క్రిష్ణమూర్తీవాళ్ళూ పోతుంటే నువుకూడా పోదూగానిలే" అన్నది తల్లి.

సుందరం మరింత నీరసించాడు. క్రిష్ణమూర్తితో బయస్కోపు సంగతి ఎత్తటమూ క్రిష్ణమూర్తి తన కటువంటివి ఇష్టంలేదని "బుద్ధిమంతనం" ప్రవర్తించటమూ అదివరకే అయింది.

"క్రిష్ణమూర్తి మాడట్ట."

"అయితే నువుమాత్రం దేనికీ?"

"అట్లా అయితే నాకో సిల్కుచొక్కా కొనిపెట్టు. క్రిష్ణమూర్తి కన్ని ఉన్నయే."

"ఊరుకోరా!" అని సీతమ్మ నోరు నొక్కుకున్నది.

ఆరోజు సాయంకాలం బయస్కోపుకు పోవటానికి సుందరం తల్లి దగ్గర ఒక అణా వసూలుచేశాడు. ఈ అణా సంపాదించగలందులకై వాడు మళ్ళీ ఎన్నడూ బయస్కోపు చూస్తాననని మాట ఇవ్వాలిసొచ్చింది.

ఊరిబయట డేరాలో బయస్కోపు. అప్పటికింకా ఎలక్ట్రిసిటీ రాలేదు. బయస్కోపులో కథలుండేవికావు. కార్బైట్ లైటుతో ఏవేవో దృశ్యాలు తెరమీద చూపించేవాళ్ళు. డేరాకంతకూ ఒక గాసులైటుండేది. "కాబిన్"లోనుంచి ఆపరేటరు ఈల వెయ్యగానే గాసులైటును ఒకతొట్టిలోకి దింపి చీకటి చేసేవాళ్ళు. ఈ బయస్కోపు ప్రదర్శనాన్ని చూసి సుందరం పరమానందభరితుడైనాడు. ముఖ్యంగా రైలురావటం రెండుసార్లు చూపారు. చడీచప్పుడూ లేకుండా రైలు మీదికి వస్తుంటే సుందరానికి ఒళ్ళంతా భయానందాలతో పులకరించింది. నీళ్ళలోనుంచి కార్లుపోవటం కూడా భలే బాగుంది.

సుందరం ఫోనోగ్రాపు[5] కూడా ఈ ప్రదర్శనంలోనే చూశాడు. ప్రదర్శనం ప్రారంభం కాకపూర్వం ఈఫోనోగ్రాపుమీద పాటలు పాడించారు. "ఓరోరి బండి వాడా"[6] పాట పెట్టారు. పాటంతా అయిన తరవాత ఫోనోగ్రాపు ఏదో అన్నది. జనం కొందరు నవ్వారు. ఆ రహస్యం అప్పట్లో సుందరానికి తెలియలేదు. తరువాత మరి కొంతకాలానికి ఆ రికార్డు విన్నప్పుడు సుందరానికి పాట చివర "మైనేమీజ్ వనజాక్షి"[7] అన్న మాట స్పష్టంగా వినిపించింది.

---

5. గ్రామఫోను (చూడు. పేజి-60)

6, 7 చూడు పేజి - 60.

# 10

మళ్ళీ చలికాలం వచ్చింది. హైస్కూలు పిల్లల్నీ - కావలసిన వాళ్ళని -అణా అణా ఇచ్చి యూనియన్ జాక్[8] అనే బ్రిటిష్ పతాకాలు కొనుక్కోమన్నారు. అక్కర లేనివాళ్ళూ, కొనలేనివాళ్ళూ మానవచ్చునని మేష్టరు చెప్పాడు. ఒక్కడు కూడా "నాకు కావాలి" అని తనంతట తానుగా అనలేదు. మేష్టరు పేరుపేరునా అడిగాడు. అప్పటికీ కొందరు తమ తల్లిదండ్రుల నడగాలన్నారు. దగ్గిర అణా డబ్బులుండే అదృష్టవంతులు నలుగురైదుగురు జెండాలు కొనేశారు.

ఈ జెండాలు ఎందుకు కొనాలో మేష్టరు విపరించి చెప్పాడు.

ప్రస్తుతం ఇంగ్లాండుకూ జర్మనీకీ మధ్య యుద్ధం జరుగుతున్నది. ఇంగ్లీషు వాళ్ళ సామ్రాజ్యం ప్రపంచమంతటా, అన్ని ఖండాల్లోనూ ఉన్నది. అందుకనే రవి అస్తమించని బ్రిటిషు సామ్రాజ్య మన్నారు. ఈ ఇంగ్లీషువాళ్ళకింద సామ్రాజ్యం వుండిపోయిందే అని జర్మనీవాళ్ళకు కళ్ళుకుట్టి, ఇంగ్లాండుతో యుద్ధం తెచ్చిపెట్టారు. అయితే ధర్మం ఇంగ్లాండు పక్షాన వున్నది గనక ఇంకా అనేక దేశాలు ఇంగ్లాండు పక్షాన యుద్ధం చేస్తున్నాయి. ఇన్ని దేశాలతోనూ జర్మనీ ఒంటరిగా యుద్ధం చేస్తున్నదంటే జర్మనీ కూడా సామాన్యమైంది కాదుమరి! ఎంతో బలం వున్నదన్నమాట. అంత మాత్రన ఇతరులసొత్తు కాజెయ్యటం మంచిదికాదు. నేను బలంగలవాణ్ణిగదా అని మీ జేబుల్లోవుండే డబ్బులన్నీ లాక్కోవచ్చా? తప్పు! ఇంగ్లీషువాళ్ళ సొత్తయిన సామ్రాజ్యాన్ని జర్మనీ లాక్కోవాలని చూడటం అటువంటిది."

"యుద్ధంలో జర్మనీ గెలిస్తే ఏమవుతుందండీ, సార్?" అన్నాడొకడు.

"ఏమవుతుందీ? మనల్నీ జర్మనీవాళ్ళు పరిపాలిస్తారు. ఇంగ్లీషుమానేసి జర్మనుభాష నేర్చుకోమంటారు."

సుందరం ఆలోచిస్తున్నాడు - జర్మనుభాష నేర్చుకోవాలంటే మళ్ళాతను వీధిబడిలో చేరాలి. ఆ భాష చెప్పటానికి మేష్టర్లుండరు. అది తనకు కొంచెమన్నా రాదు. మేష్టరు దొరికి తను జర్మనుభాషలో స్కూలు ఫైనలు పేసయేటప్పటికి ఇరవైయేళ్ళే వస్తాయో, పాతికేళ్ళే వస్తాయో! ఛా, ఛా జర్మనీవాళ్లు గెలవరాదు. ఎప్పటికీ ఇంగ్లీషువాళ్ళే గెలవాలి.

"... యుద్ధంలో దెబ్బలు తగిలిన వాళ్ళకు వైద్యం చెయ్యటానికని ఈ జెండాలు అమ్ముతున్నారు. అందుచేత అందరూ జెండాలు కొనండి. పుణ్యం! అణా అంటే పెద్ద మొత్తం కాదు. కాని అందరు పిల్లలూకొంటే మన స్కూలునుంచే 50, 60 రూపాయలు పోగవుతాయి. యిటువంటి స్కూళ్లు యీ దేశంలోనే ఎన్నో వేలున్నాయి. ఇట్లా అన్ని దేశాల్లోనూ పోగుచేస్తే లక్షలకొద్దీ రూపాయలు వస్తాయి. అదీ కాక మీరు

8. బ్రిటిష్ జాతీయ పతాకం.

అణాచొప్పున యిచ్చి జెండాలు కొంటే మీకు మిఠాయి పంచుతాను" అన్నాడు మేష్టరు.

జెండాలుకొన్న పిల్లలకు వాటిని ఎట్లా చొక్కాకు పెట్టుకోవాలో మేష్టరు చూపించాడు. జెండాలు ఈపూట తీసుకుంటే డబ్బు మధ్యాహ్నం తెచ్చి ఇవ్వొచ్చు నన్నాడాయన. సుందరం ఇతర పిల్లల్ని చూసి తానుకూడా ఒక జెండా తీసుకున్నాడు. పొడుగాటి గుండుసూదికి జెండా తగిలించి ఉంది. జెండామీద ఎరుపు, నీలంరంగులున్నాయి. చూడటానికి ఎంతో ఆనందంగా ఉంది.

మధ్యాహ్నం బడివిడిచి యింటికి వెళ్లుతూనే, "అమ్మా, చూడు" అని సుందరం తల్లికి జెండా చూపించాడు. ఇంగ్లీషువాళ్ళకూ, జర్మనీ వాళ్ళకూ జరిగే యుద్ధం విషయంకూడా తల్లికి కొద్దిగా చెప్పాడు. ఆ తరవాత యీ జెండా కొన్నందుకు అణాయివ్వాలని బయట పెట్టాడు.

"ఎందుకు నాయనా. వృధాగా ఇప్పుడీ అణా ఖర్చా?" అన్నది తల్లి.

సుందరం మొహం రంగు మారింది. ఆవిడ తనను బుద్ధిపూర్వకంగా యిరుకున పెట్టటానికామాట అంటున్నదనుకున్నాడు. ఎట్లాగూ ఇవ్వవలసిన ఈ అణాకోసం కొంత వాదించవలసి రావటం సుందరానికి ఎంతో బాధ కలిగింది.

"ఏమిటమ్మా నువ్వూ? అందరూ కొనుక్కుంటుంటే నేను మాననా?" అన్నాడు సుందరం.

"బాగుందే? ఉన్నవాళ్లు కొనుక్కుంటారు. ఒకరితో మనం ఎక్కడ పోటీకి పోగలంరా?" అన్నది. తాము ఎంత లేనివాళ్ళయిందీ సుందరం ఎరగడుగాని తల్లి అన్నంత పేదవాళ్లు కారని అనుకున్నాడు. కేవలం అణా ఎగవేయ్యటానికే ఆవిడ ఉన్నవాళ్ళనీ, పోటీ అనీ అంటున్నదనుకున్నాడు. సీతమ్మగారు అణా ఇచ్చిందిగాని సుందరానికి సుఖంగా ఉండేటట్టుమాత్రం యివ్వలేదు. తనకూ తల్లికీ జరిగిన సంభాషణ అవతలవాళ్లు పూర్తిగా విని ఉండాలి. అవతల క్రిష్ణమూర్తి చడీచప్పుడూ లేకుండా అణా సంపాదించాడు. తన తల్లి ఇట్లా చేసేటట్టయితే తను క్రిష్ణమూర్తికి లోకువై పోవటం తప్పదనుకున్నాడు సుందరం.

సాయంత్రం పిల్లలకు లడ్డూలూ, అరటిపళ్ళూ పంచారు. జెండాలు కొనని వాళ్ళకుకూడా పంచారు. మొత్తంమీద జెండాకింద యిచ్చిన అణా వృధాపోలేదు.

❀ ❀ ❀ ❀

సీతమ్మ అతి సున్నితమైన చిక్కులో పడ్డది. తన భర్త చావువల్ల ఆవిడలో కలిగిన మానసిక పరివర్తన ఎంతైనా ఉన్నది. అందులో ప్రధానమైనది ఆర్థిక బాధ్యత. కుటుంబాదాయం తగ్గిందన్న విచారంతోబాటు తక్కువఖర్చుతో కాలయాపన ఎట్లాగా అన్న విచారంకూడా ఆవిణ్ణి పట్టుకున్నది. తానూ, తన కొడుకూ, కూతురూ ఇప్పుడు బీదవాళ్ళన్నమాట. ఆవిడ అడుగడుగునా జ్ఞాపకం చేసుకుంటూ ఉండేది. ప్రతి ఖర్చులోనూ ఎంత ఆదా చేస్తున్నానా అని చూసుకుంటూ ఉండేది. తనభర్త చావుతో ఎంత సంపాదనపోయిందో అంత ఖర్చూ తగ్గించుకోక తప్పదుగదా! అంత తగ్గించటం మాటలా?

సీతమ్మగారు చిన్న నేతి గరిటతో ప్రారంభించింది. అదివరకట్లే గోంగూర కూరలు కొనడానికి వీల్లేదు. కొన్నప్పుడైనా ఖరీదైనకూరలు కొనటం ఎంతమాత్రం వీల్లేదు. కూరలబదులు పచ్చళ్ళూ, వొడియాలూ, అప్పడాలూ, వొరుగులూ ఏర్పాటుచేసుకోవాలి. తనకిక చీరెల ఖర్చు అదీ లేదుగదా. పిల్లవాడికి జత లాగూలూ, చొక్కాలూ వుంటేచాలు చాకలి ఖర్చులేదు. అంట్లదాన్ని మాన్పించేసింది. అంతకన్నా ఇంకేం చెయ్యాలో ఆవిడకు తెలియదు. ఎవరన్నా బంధువులు వస్తారేమోనని ఆవిడకు చాలాభయంగా వుండేది తీరా బంధువులు వచ్చిన తరవాత వాళ్ళకు ఉన్నదాన్లో పెట్టక తప్పుతుందా? అద్దె రెండు రూపాయలు యెక్కువ వస్తున్నదంటే దానికితగ్గట్టు సుందరం చదువుఖర్చు ఉండనే వున్నదాయె. ఇంకా ఆడపిల్ల ఎదిగొస్తున్నది ఖర్చు పెరుగుతుంటగాని తగ్గదు.

సీతమ్మగారికి కలిగిన దారిద్ర్యభయం అంతా దారిద్ర్యం వల్లనే ఏర్పడిందనటానికి వీల్లేదు. కాలిమీద కాలేసుకుని కడుపులో చల్ల కదలకుండా భూములమీద వచ్చేదానితో ఒక స్థాయిలో జీవితాన్ని వెళ్ళబుచ్చటానికి అలవాటుపడ్డ తరగతియొక్క మనస్తత్వంనుంచి ఆవిడకీ భయం దాపరించింది. ఆవిడ కాస్త శాంతంగా ఆలోచించినట్లయితే తన భర్త సంపాదించిన దానికి ఇంచుమించు సమానంగా ఆయన ఖర్చుచేశాడనీ, ఆయన చావువల్ల తనమీద కుటుంబం ఈదేభారం ఏర్పడినప్పటికీ ప్రస్తుతానికి తమ అవసరాలకు లోటేమీలేదని ఆవిడ ఊహించగలిగి వుండేదే! అయినా ఆవిడకు దారిద్ర్యం సమీపంలో వున్నదన్నభావం పోలేదు. అది ప్రత్యక్షంగా అట్టే కనిపించటంలేదు కనుకనూ తాత్కాలికంగా దారిద్ర్యాన్ని దూరంగా వుంచేటందుకు, కొన్ని జాగ్రత్తలు తీసుకుంది కనుకనూ, ఆవిడ తన ఆత్మ సంతృప్తి కోసం దూరానవున్న దారిద్ర్యాన్ని చూసి తల్లడిల్లి పోసాగింది. పోయినకొద్దీ సుందరం చదువుఖర్చు పెరుగుతుంది. సంసారం రాబడి పెరగదు. ఇంకో ఎనిమిది తొమ్మిదేళ్ళలోపల పిల్ల పెళ్ళి కెదుగుతుంది.

మనిషి తన అంతరాత్మను సంతృప్తి పరచుకోవటానికి నిరాశావాదం అవలంబించదలచిన దానికి ఆధారాలు దొరక్కపోవు. సీతమ్మగారి విచారానికి సుందరం కొంత సాయపడ్డాడు; క్లాసులో ఇతర పిల్లలను చూసి వాడు ఎటువంటి అనవసరపు ఖర్చులలో తలదూరుస్తాడో అని ఆవిడకు ఒక పెద్ద బెంగపడిపోయింది. సుందరం యెప్పుడన్నా, "అమ్మా; నాకు అది కావాలి" అని అడిగితే సీతమ్మగారి గుండెల్లో రాయి పడేది. అయితే ప్రతిసారీ సుందరం నమ్మేటట్లుగా చెప్పేవాడు.

ఒకసారి వాడు కాపీ పుస్తకాలు కొనుక్కోవాలన్నాడు. మరోసారి బ్రౌన్ పేపరుతో డ్రాయింగు పుస్తకం కుట్టుకోవాలన్నాడు. చాక్‌పీస్‌లు కొనుక్కోవాలన్నాడు. ఇదంతా తప్పనిసరి ఖర్చో, తప్పే ఖర్చో ఆవిడకు తెలిసేదికాదు. చూస్తుండగానే వాడిచదువు ఎట్లా తన తలకు మించిపోయిందో తలచుకుంటే ఆవిడకు ఆశ్చర్యం వేసేది. ఆవిడకు అనుమానం కలిగినప్పుడల్లా క్రిష్ణమూర్తిని అడిగేది. ఇట్లా చెయ్యటంవల్ల తన కొడుక్కు అసంతృప్తి కలుగుతున్నదని కూడా ఆవిడకు తట్టేదికాదు.

"అబ్బాయి, మనం బీదవాళ్ళం, క్రిష్ణమూర్తికి వాళ్ళ వాళ్ళు కొనిపెట్టేవన్నీ నేను నీకు కొనలేను. తప్పే ఖర్చయితే నాచేత చేయించకు. నీకు పుణ్యం వుంటుంది" అని కొడుక్కు నచ్చజెప్పుదామని యెన్నోసార్లు సీతమ్మగారి నోటి చివరదాకా వచ్చింది. కాని ఆపని చెయ్యటం ఆవిడకు సాధ్యంకాలేదు. అట్లా అంటే తనకూ వాడికీఉన్న సంబంధం చెడిపోతుందనీ, వాడు నొచ్చుకుంటాడనీ ఆవిడ భయపడింది. వాడు అదివరకే నొచ్చుకుంటున్నాడని ఆవిడ ఊహించలేదు. తను ఖర్చు తగ్గించటానికి చేసే ప్రతి చిన్న ప్రయత్నమూ వాడర్థం చేసుకుంటూనే వున్నాడని ఆవిడ కలలో కూడా భావించలేదు.

కాని చిన్న పిల్లలకు ఇటువంటి విషయాలు చెప్పినదానికన్న దాస్తేనే బాగా అర్థమవుతాయి. సుందరం కొనుక్కుతినటానికి కానీ ఇమ్మని ఎన్నడూ తల్లిని అడిగేవాడుకాదు.

అయినా సుందరానికి బీదరికమనేది సరిగా తలకెక్కలేదు. తోటి విద్యార్థుల్లో తనకన్నా మరీ బీదవాళ్ళు. తనకన్నా మరీ భాగ్యవంతులూ కానివాళ్ళందరూ తనతో సమానులనే అనుకునేవాడు. వాళ్ళలో ఎవరైనా బీదవాళ్ళని తెలిసినా, వాళ్ళు పూరికొంపల్లో ఉండటం చూసినా జాలిపడేవాడు. ఎవరి తండ్రిగాని పోయినాడన్నా అదే విధంగా జాలిపడేవాడు – తనకు అటువంటి విపత్తు కలగబట్టే.

❀ ❀ ❀ ❀

సరిగా డిసెంబరు పరీక్షలమధ్య సుందరానికి జ్వరం వచ్చింది. లెక్కల పరీక్షలో నూటికి నూరుమార్కులు తెచ్చుకుని ఇంటికి పరమానందంగా వచ్చిన వాడు, ఇంకా పొద్దుగూకకమునిపే, "అమ్మా, నాకు చలేస్తున్నది, నిద్దరొస్తున్నది" అంటూ పడకవేశాడు. కాస్సేపటికి సీతమ్మగారు వచ్చి ఒంటిమీద చెయ్యి వేసేసరికి కాలిపోతున్నది.

సీతమ్మగారు వెంటనే వాడిచేత కస్తూరిమాత్ర మింగించి లంకణం పెట్టింది.

ఆవిడ దగ్గర రకరకాల మందులూ, మందు దినుసులూ ఉంటాయి. జ్వరానికీ, పడిశానికీ, అజీర్ణానికీ, గజ్జికీ, దగ్గుకూ, మలబద్ధకానికీ ఏం చికిత్సలు చెయ్యాలో ఆవిడకు తెలుసు. గృహవైద్యం ఆవిడ తల్లి దగ్గర నుంచి సంపాదించింది. కురం, జీవం, కురాసానివాం, పిప్పళ్ళూ, అక్కలకర్ర, వామూ, శొంఠి, దుంపరాష్టకం, వసకొమ్ములు, మైలుతుత్తం మొదలైన దినుసులన్నీ ఆవిడ చిన్న చిన్న కాగితంపొట్లాలు కట్టి వంటింట్లో ఏనాడో దాచిఉంచింది. ఇవిగాక, తేనే, కస్తూరి మాత్రలు, ఆముదం సునాముఖిఆకూ, సైంధవలవణం మొదలైనవి కూడా ఉంచింది.

ఇటీవల ఆవిడ తిండి దగ్గర పొదుపు ప్రారంభించినప్పటినుంచీ ఇంట్లో ఎవరికీ సంపూర్ణమైన ఆరోగ్యం లేదు. చంటిదానికి చీటికీ మాటికీ బురబురలాడుతూ జలుబూ, దగ్గూనూ, సుందరానికి విడవకుండా మలబద్ధకం, కడుపునొప్పీ, సీతమ్మగారికి కీళ్ళులాగటం, నీరసం, అన్నం సరిగా సయించకపోవటం. పొద్దునే లేవగానే ఆవిడ మొదటి విధి పిల్లలకు జీలకర్రరసం పొంగించి పొయ్యటమూ,

కరివేపాకూ, మిరియాలూ, ఉప్పు నూరి మాత్రలుచుట్టి సుందరంచేత మింగించటమూనూ.

తాను చేసే వైద్యం సరిగా పనిచేస్తున్నదా లేదా అని ఆవిడ పరిశోధనలు ప్రారంభించలేదు. చిన్న చిన్న రోగాలు వస్తుండేవి. ఆవిడ మందులు వేస్తుండేది. అవి పోతూవుండేవి. రోగాలు వాటంతటవే పోతున్నాయో మందులు పనిచేస్తున్నాయో ఆవిడకు తెలీదు. కానీ ఆ మందులు అపాయకరమైనవి కాకపోవటంవల్లా, ఆ రోగాలు తీవ్రమైనవి కానందువల్లా సీతమ్మగారి వైద్యం కొమ్ములు తిరిగిన డాక్టర్లుచేసే వైద్యంకన్నా చాలా నిరపాయంగా పరిణమించింది. ఈ రోగాలు రావటం మానలేదంటే అవి ఆవిడ వైద్యంవల్ల వచ్చినవికావు. దారిద్ర్యాన్ని దూరంగా ఉంచటానికి దారిద్ర్యాన్ని దూరంగా ఉంచుతున్నాననే భ్రమతో - ఆవిడ అవలంబించిన మార్గాల ఫలితంగా వచ్చినవి.

ఆవిడ పాపం ఏం చెయ్యగలదు? మనిషి, తినవలసిన ఆహార ప్రమాణాలావిడకి తెలియవు. ఆమాటకువస్తే ఇవాళ - ఇది జరిగిన మూడు పుష్కరాల అనంతరం - చదువుకున్నవాళ్ళలో ఆహారశాస్త్రం తాలూకు ప్రాథమిక విషయాలు తెలిసిన వాళ్ళెంత మంది వున్నారు? ఈ యీ కూరలు తినాలని సీతమ్మగారికి ఒకవేళ తెలిసినా ఏమీ ప్రయోజనం లేదు. ఎందుకంటే ఒక్కో ఋతువులో ఒక్కోకూర కొనవలసిందే. అసలు కూరలు కొనటమంటేనే ఆవిడకు భయమైపోయిందాయె; అందుచేత ఈ జబ్బులు తప్పేదారిలేదు.

సీతమ్మగారు పనంతా పూర్తిచేసుకుని దీపం తగ్గించి సుందరం మంచం పక్కనే పిల్లను పెట్టుకొని పడుకోటానికి వచ్చింది. ఆవిడ నడుము వాల్చబోతూ సుందరానికేసి చూసేటప్పటికి వాడు, యెప్పుడు నిద్రలేచాడో, కళ్ళు పెద్దవి చేసుకొని ఇంటి కప్పుకేసి చూస్తున్నాడు.

"లేచావుట్రా?" అన్నది తల్లి.

సుందరం తల పక్కకు తిప్పి. "నాకు జరం పోయింది. నేను పరీక్షకు వెళ్ళాలి" అన్నాడు.

సీతమ్మ గుండె గుబుక్కుమన్నది. మొహంమీద చెయ్యివేస్తే కాలిపోతున్నది. పిల్లాడికి సంధించిందేమో అనుకుని గాభరా పడింది.

"జ్వరం ఉంది, నాన్నా! అర్ధరాత్రిపూట పరీక్షేమిట్రా?" అన్నదావిడ.

"అమ్మా, నేను - పరీక్షకు పోకపోతే - తప్పిపోనూ?" అన్నాడు సుందరం.

"ఏం తప్పవులే, ఇవి అసలు పరీక్షలు కావుగా?"

మళ్ళీ కాస్సేపుండి, "అమ్మా, జ్వరంతో పరీక్షకు పోగూడదా?" అన్నాడు.

"జ్వరంతో పడుకున్నవాడివి ఎట్లా పోతావురా? ఎట్లా కూచుని రాస్తావు?"

"రేపు జ్వరం పోదూ?"

"పోతుందిలే, జ్వరం పోతే నువ్వు చక్కగా పరీక్షకు పోదువుగాని."

సుందరం మళ్ళీ కళ్లు మూసుకున్నాడు. వాడు ఒళ్లు తెలిసే మాట్లాడుతున్నాడని సీతమ్మగారు తృప్తిపడింది.

కాని ఆ జ్వరం మూడు లంఖణాలతోగాని నయంకాలేదు. పరీక్షకు పోలేనందుకు సుందరం ఏడిచి రాగాలు పెట్టాడు. వెయ్యి చెప్పినా వినకుండా మంచంలో నుంచి లేచి, బడికి బయల్దేరటానికి ప్రయత్నించాడు. ఆఖరుకు ఆదినారాయణగారు వచ్చి, "అబ్బాయి, నువు పరీక్షకు పోకపోయినా పాసవుతావని మీ మేష్టారు చెప్పాడు" అని ధైర్యం చెబితేగాని సుందరం పడుకోలేదు.

వాడి జ్వరం జారిన రోజునే శీతాకాలపు శలవులు ఆరంభమైనాయి.

## 11

చిన్నపిల్లలు స్వతస్సిద్ధంగా వేదాంతులు. ఎట్టి సిద్ధాంతాలూ ఎరగని నిర్లిప్తమైన మనస్సులతో, వాళ్లు జీవితంలోని మంచిచెడ్డలనూ, కష్టసుఖాలనూ తమ అనుభవంగా చేసుకుంటారు. కనకనే వాళ్ళకు జీవితంనుంచి పెద్దవాళ్ళు పొందలేని ఆనందం లభిస్తుంది.

సుందరం మనస్సు రోజురోజుకూ కొత్త వికాసం పొందుతున్నది. జీవితంలో రోజూ కనిపించేవాటిలోనే కొత్త ఆనందం కనిపించటం కాక, కొత్త అనుభవాలు కూడా ఎన్నో కలిగేవి. రోజూ బడికి పోవటం, పీరియడ్లు జరగటం, మేష్టర్లు మారటం, పాఠాలు జరగటం, సాయంత్రంపూట ప్లే గ్రౌండ్‌లో ఆటలూ, స్నేహితులిళ్ళకు వెళ్ళటం, కొత్త కుర్రాళ్ళతో స్నేహితాలు చేసుకోవటం, ఇంటికి రావటం, తల్లివెంట వుండి ఆవిడ చేసే ఇంటి పనులన్నీ చూడటం, ఆవిడ పాడుకునే పాటలు వినటం మొదలైనవి నిత్య కర్మ. ఇవికాక కొన్ని అపూర్వమైన సంఘటనలు కూడా ఉండేవి.

సుందరం నాలుగో క్లాసులోకి ప్రవేశించిన ఏడు "మహమ్మారి"[9] వచ్చింది. జనం హడలిపోయినారు. జాతర్లూ, కొలుపులూ చేశారు. మారెమ్మను గురించి తన తల్లితో అమ్మలక్కలు చెప్పుకునే భయంకరమైన విషయాలు సుందరం విన్నాడు. ఎవరికన్నా మశూచికంపోసి చావటానికి సిద్ధంగా వుంటే మారెమ్మ కల్లో కనిపిస్తుదట! ఏదో తింటున్నట్టు దవడలు ఆడిస్తుందిట. లేదా ఫలానివాళ్ళని తినేస్తున్నానని చెబుతుందిట. ఈ కథలన్ని విన్నమీదట సుందరానికి మారెమ్మ కల్లోకనిపిస్తుందేమోనన్న భయంకొద్దీ చాలారోజులు నిద్రకూడా పట్టేదికాదు.

ఆ యేడే యుద్ధం అయిపోయింది. యుద్ధం అయిపోయిన సంగతి సుందరానికి విచిత్రంగా తెలిసింది. ఉదయానే వాడు వీధి వాకిట్లోకివచ్చి నిలబడి

---

9. ఈ మహమ్మారి 1918లో వచ్చింది. ఈ యేడే విషజ్వరం బహుళంగా వ్యాపించింది. 1917, 1918 సంవత్సరాల్లో చీరాల ప్రాంతంలో ప్లేగు (బొబ్బిలి) జాడ్యం వచ్చి చాలా ప్రాణనష్టం కల్గించింది.

ఉండగా అతని సహాధ్యాయి నాగేశ్వరరావు తన తండ్రివెంట వీధిన పోతూ సుందరాన్ని చూసి ఆగాడు.

"అరే సుందరం, ఇవాళ బడి లేదు. శలవు!" అన్నాడు నాగేశ్వర్రావు.

"ఏం?" అన్నాడు సుందరం.

"నీకు తెలీదా? యుద్ధంలో మనవాళ్ళు గెలిచారు. జర్మనీవాళ్లు ఓడిపోయినారు."

"నిజంగా శలవేనా?" అన్నాడు సుందరం. నాగేశ్వర్రావు మాట నమ్మి బడికి పోకుండా మానేసి పొరాలు పోగొట్టుకోవటం ఇష్టంలేక.

"అబద్ధం చెబుతానుట్రా? నువుకూడా రా తాలూకాఫీసుకు పోదాం. రాజూ రాణీ పటాలు పెట్టి ఊరేగుతారు. మా నాన్న తాలూకాఫీసులో పనిచేస్తాడు గదూ? అక్కడికే పోతున్నాం."

"ఉండు వస్తా. మా అమ్మతో చెప్పనీ" అంటూ సుందరం లోపలికిపరిగెత్తి "అమ్మా! మనవాళ్ళు యుద్ధంలో గెలిచారు. నే నిప్పుడే వస్తా" అంటూ వచ్చి నాగేశ్వరరావును కలుసుకున్నాడు. ఈలోగా నాగేశ్వర్రావు తండ్రి చాలా దూరం

స్నేహితులిద్దరూ చేతులు చేతులు పట్టుకుని తాలూకాఫీసు కేసి నడిచారు. దారిలో నాగేశ్వర్రావు చాలా వుత్సాహంగా మాట్లాడాడు. యుద్ధంలో "మనం" గెలవడంతో సుందరానికి ఆనందించవలసిన అవసరం వుందని మొదట తెలియనప్పటికీ, నాగేశ్వర్రావు ఉత్సాహం అంటువ్యాధిలా సంక్రమించింది.

"ఇక జర్మనీవాళ్లు ఎప్పటికీ యుద్ధం చేయరు. వాళ్ళ పొగరణిగిపోయిందిలే. ఇంగ్లీషువాళ్ళంటే ఏమిటనుకున్నారో, నిజంగా ఇంగ్లీషువాళ్ళని ఎవరూ జయించలేరు తెలుసా?" అంటూ ఎంతో ఉత్సాహంగా మాట్లాడాడు నాగేశ్వర్రావు.

వీళ్లు వెళుతుండగానే ఊరేగింపు ఎదురు వచ్చింది. బాండు వాయిస్తున్నారు. "సార్టు" బండిలో జార్జి చక్రవర్తివీ, మేరి రాణివీ రంగుపటాలు ఊరేగించారు. పోలీసులూ, పోలీసు ఉద్యోగస్తులూ, తహసీల్దారూ, డిప్టీ కలెక్టరూ, ఊళ్ళో ఒక రిద్దరు గొప్పవాళ్ళూ ఊరేగారు.

సుందరం ఆనందానికప్పుడు మేరలేదు. ఆ ఆనందంలో బడికి శలవన్నది ఎక్కువయిన పాత్ర వహించింది.

"నువు అన్నం తిని మా యింటికి రారాదుట్రా? ఇవాళ మా అన్నయ్యా, బావా వాళ్ళ స్నేహితులూ చాలామంది వస్తారు. సరదాగా తిరుగుదాం" అన్నాడు నాగేశ్వర్రావు.

సుందరం సరేనన్నాడు. ఈ ఇద్దరికీ ఈ రోజున ఈ విధంగా ప్రారంభమైన స్నేహం సుందరం జీవితంలో అతి ప్రధానమైన స్నేహంలో ఒకటిగా పరిణమించింది.

   

నాగేశ్వర్రావు అన్న శ్రీరామ్మూర్తి అప్పటికే ఫోర్తుఫారం చదువుతున్నాడు. నాగేశ్వర్రావు అక్క మొగుడు అత్తారింటనే ఉండి పోస్టాఫీసులో ఉద్యోగం చేస్తున్నాడు.

ఇవాళ నాగేశ్వర్రావింటికి శ్రీరామ్మూర్తి స్నేహితులూ, సహాధ్యాయులు నలుగురైదుగురు వచ్చారు. వాళ్ళంతా చాలా కలుపుగోలుగా ఉంటూ ఇంట్లో వాళ్ళల్లేనే ప్రవర్తించేవాళ్ళు. నాగేశ్వర్రావుకూడా వాళ్ళను "ఏంరా" అని పిలిచేవాడు. సాధారణంగా పెద్ద ఫారాలు చదివే పిల్లలు చిన్నక్లాసు వాళ్ళను లోకువగా చూసేవాళ్ళుకాని శ్రీరామ్మూర్తి స్నేహితులు సుందరాన్ని అట్లా చూడలేదు.

రోజల్లా చాలా సరదాగా గడిచిపోయింది. చాలాసేపు చీట్లపేక ఆడారు - దొంగాట. సుందరానికి దొంగాట చాతకాదు. అందుచేత నాగేశ్వర్రావు ఆడే ఆట చూస్తూ కూచున్నాడు.

ఇంతలో ఎక్కడినుంచో గ్రామఫోను వచ్చింది. పువ్వుతోసహా గ్రామఫోనూ, కుక్క గ్రామఫోను వింటున్న బొమ్మగల ప్లేట్లూ సుందరం యీసారి దగ్గిర్నించి చూశాడు. వాడు గ్రామఫోనుకి కీ ఇచ్చాడు కూడానూ. ప్లేట్లలో వనజాక్షి ప్లేట్లూ, రైలు బండి తమాషా, కోయంబత్తూరు తాయి ప్లేట్లూ, నవ్వే ప్లేట్లూ కొన్ని తురక ప్లేట్లూ కూడా ఉన్నాయి. వనజాక్షి ప్లేట్లలో "ఓరోరి బండివాడా", "శివదీక్షా పరురాలనురా," "పదినెలందరు వచ్చిరి" ఉన్నాయి. పాటంతాపాడి "మైనేమీజ్ వనజాక్షి" అనేది వనజాక్షి. ఆ మాటకోసం ఎన్నిసార్లో ఆ ప్లేట్లు పెట్టారు. రైలుబండి తమాషా ఎన్ని సార్లు పెట్టారో సుందరానికి లెక్కకూడా లేకుండా పోయింది. చూస్తుండగానే ఆ పాటంతా సుందరానికి వచ్చేసింది. నవ్వు ప్లేట్లు తమాషాగానే ఉందిగాని, వాడేమంటున్నాడో తెలీదు. తాళం ప్రకారం నవ్వటం సుందరానికి చాలా అసహ్యంగా కనపడింది.

సుందరం మధ్యాహ్నం ఇంటికొచ్చి అన్నంతిని మళ్ళీ రెండు గంటలకు నాగేశ్వర్రావింటికి వెళ్ళాడు. అక్కడ నాగేశ్వర్రావు తల్లి అందరికీ ఫలహారాలు పెట్టింది. ఆ ఫలహారం తిన్న తరువాత అందరూ కలసి రైలు కట్టదగ్గిర డొంకలో బిళ్ళంగోడు ఆడటానికి బయలుదేరారు.

ఆ ఆట చూస్తుంటే సుందరానికి ఆశ్చర్యం వేసింది. ఆ ఆటలో సుందరానికిగాని, నాగేశ్వర్రావుకుగాని స్థానంలేదు. అందరూ పెద్దవాళ్ళే. నాగేశ్వర్రావు బావకొడితే బిళ్ళ కంటికి కనిపించకుండా ఎక్కడికో వెళ్ళి పోయేది. ఎదురు ఆడేవాళ్ళేం తక్కువ తిన్నవాళ్ళుకారు. పిట్టల్లే యెగిరి బిళ్ళను ఒడిసి పట్టుకునేవాళ్ళు. అంతదూరం నుంచీ బిళ్ళను విసిరి గుంటమీద పడేటట్టు వెయ్యటానికి ప్రయత్నించేవారు. గెలుచుకున్న ఎల్లలు కొలవటంలేదు. గెలిచినవాడు ఇన్ని ఎల్లలని చెప్పటమూ, వాడు ఎక్కువ చెప్పాడని తోచినప్పుడు రెండో పక్షంవాళ్ళు కొలవటమూనూ.

ఈ బిళ్ళంగోడు యెంతసేపు చూచినా సుందరానికి విసుగెత్తలేదు. అందుచేత వాడికి సాయంకాలం అయిపోవటం కూడా గుర్తులేదు. తీరా ఆట చాలించేసరికి

సూర్యాస్తమానం కావస్తున్నది. ఆ తరువాత అందరూ కలిసి రైలుకట్ట వెంబడే నడిచి కాలువదగ్గిరకి వెళ్ళి అక్కడ స్నానాలు చేశారు. ఇల్లు చేరేసరికి చీకటిపడి దీపాలు పెట్టి చాలా సేపయింది.

రోజల్లా సరదాగానే గడిచినా, ఇంట్లో యెక్కువసేపు గడపనందుకూ స్కూలు మొహం చూడనందుకూ సుందరం కించపడి, ఏదో చెయ్యగూడని పనిచేసి, తనకు అధికారంలేని ఆనందం అనుభవించినవాడల్లే బాధపడ్డాడు.

❀ ❀ ❀ ❀

స్నేహితులు ఒకరినొకరు పొడి అక్షరాలతో పిలుచుకునేవాళ్ళు. సుందరం కె. యస్., నాగేశ్వర్రావు పి.యన్.ఆర్. ఇట్లాగే ఇతర విద్యార్థులూనూ. ఈ దశలో వీళ్ళు తమ అన్యోన్య సంబంధాలతో ఒక సమగ్ర ప్రపంచం సృష్టించుకునే వారు. ఈ ప్రపంచంలో ప్రేమలూ, అసూయలూ, అలకలూ, పరామర్శలూ, త్యాగాలూ, సహనాలూ, సమస్యలూ, పరిష్కారాలూ, స్వార్థమూ నేరాలూ, శిక్షలూ అన్నీ ఉండేవి. అయితే బాహ్య ప్రపంచంలోలాగా పెద్ద యెత్తున దౌర్జన్యమూ దోపిడీ, కుట్రా ఉండేవికావు.

సుందరానికీ, నాగేశ్వర్రావుకూ స్నేహం ఎప్పుడు ఎట్లా ఏర్పడిందీ ఎవరూ ఎరుగరు. అది క్రమంగా బలం పొందింది. మనసులో ఉన్న మాటలను అవతలి వాడికి దాచకుండా చెప్పుకోవటమూ, ఒకరి ప్రభావానికి ఒకరు గురికావటానికి ఒప్పుకోవటమూ స్నేహం. ఇటువంటి స్నేహం ఎంతదూరమన్నా పోతుంది.

సుందరం బడినుంచి నాగేశ్వర్రావు వెంటలేకుండా ఇంటికొచ్చే వాడుకాదు. ఇద్దరూ సామాన్యంగా కలిసే బడికి వెళ్ళేవాళ్ళు. పరీక్షలూ అవీ దగ్గిరికివస్తే ఇద్దరూ కలిసే చదివేవాళ్ళు. సుందరం రాత్రి అన్నంతిని పుస్తకాలు పట్టుకుని నాగేశ్వర్రావింటికి వెళ్ళేవాడు. రాత్రిపూట అక్కడే పడుకునేవాడు.

సుందరానికీ నాగేశ్వర్రావుకూ కలిగిన స్నేహం బలమైనదని సీతమ్మగారు సులభంగా ఊహించింది. ఎప్పుడన్నా నాగేశ్వర్రావు తమ ఇంటికివస్తే ఆవిడ వాణ్ణి అప్యాయంగానే చూసేది. కాని తన కొడుకును నాగేశ్వర్రావింటిలో వాళ్ళు యెట్లా చూస్తారో ఆవిడకు తెలీదు. నాగేశ్వర్రావు స్నేహం తన కొడుక్కు అంగరక్షగా ఉంటుందని ఆవిడ తెలుసుకున్నది.

ఇప్పుడు యుద్ధం విషయం మాట్లాడే వాళ్ళెవరూలేరు. దేశమంతటా దైవభక్తి హెచ్చిపోయింది. ప్రతిరోజూ యెవరో ముసలాయన భజన కీర్తనలు పాడుతూ బయలుదేరేవాడు. అనేకమంది పిల్లలు ఆయనవెంట పాడుతూ తిరిగేవాళ్ళు. ఉత్త అరచేతిలోనుంచి చిన్న చిన్న ఎండుకొబ్బరి ముక్కలు తీసి తన వెంటవచ్చే పిల్లలకు ఉన్నట్టుండి పెడుతూ ఉండేవాడు. అప్పుడప్పుడూ దవనం ముక్కలు కూడా తీసి యిచ్చేవాడు. ఆయన గొంతు వెలుగు రాచుకుపోయినట్లుండేది. ఆయన ఎవరినీ డబ్బు యాచించినట్టు కనబడేవాడుకాదు. వీధివెంట పోతూ పోతూ తన యిష్టం వచ్చిన యింట్లో ప్రవేశించేవాడు. అక్కడ ఏ కొబ్బరికాయలో ఇస్తే అవి అక్కడే పంచిపెట్టేవాడు. సుందరం, నాగేశ్వర్రావు యీయనవెంట దాదాపు రోజూ తిరిగేవాళ్ళు.

చీకటిపడ్డ తరవాత ఇంకొక రకం భజనలు బయల్దేరేవి. కొందరు కుర్రాళ్ళు దీపస్తెమ్మాలు పట్టుకుని ఇల్లిల్లూ తిరిగి, "అదుగో రాముడు వస్తున్నాడు. వచ్చీ వాకిట నిలుచున్నాడూ" అని పాడేవాళ్ళు. ప్రతి ఇంట్లోనూ దీపానికి నూనే, కాణీ డబ్బులూ పడేవి.

నాగేశ్వర్రావింట్లో ప్రతి శనివారం రాత్రి భజనకూడా ఏర్పాటు చేశారు. ఒకటి రెండు తరంగాలూ, రామదాసు పాటలూ పాడేవాళ్ళు. ఈ భజన సుందరానికి బాగుండేది.

ఒకనాడు సాయంకాలం సుందరం బడినుండి నాగేశ్వర్రావుతోబాటు ఇంటికి తిరిగి వస్తుండగా రోడ్డుమీద ఒక గుర్రం ఎదురువస్తూ కనిపించింది. దానిమీద కాళ్ళుతెగిపోయిన వాడొకడు పడుకుని ఉన్నాడు.

"వాడు యుద్ధంలో పనిచేసిన సిపాయిరా" అన్నాడు నాగేశ్వర్రావు.

"నిజంగానా?" అన్నాడు సుందరం ఆశ్చర్యంగా. ఆ గుర్రాన్నీ, మొండివాణ్ణి సుందరం అదివరకు రెండు మూడుసార్లు చూశాడుగాని వాడు సిపాయని ఎరగడు.

"అవును. పాపం, యుద్ధంలోనే వాడికాళ్ళు పోయినై. వాడికి పింఛినిచ్చి ఆ గుర్రాన్ని కూడా ఇచ్చేశారు. ఆ గుర్రంమీద అట్లాగే తిరుగుతూ అడుక్కుంటాడు."

"కాళ్ళు లేవుగా? ఎట్లా ఎక్కుతాడో?"

"ఎవరో ఎక్కిస్తారేమో. ఆ గుర్రంచూడు. ఎంత విశ్వాసం కలదో! ఎవరన్నా ఎదురువస్తే ఆగుతుంది. ఎప్పుడూ పరుగెత్తదు. అడుక్కున్న దాన్లోనే వాడు తను తిని గుర్రానికి పెట్టాలి. ఏం పెడతాడు పాపం?"

"గుర్రం చాలా తింటుందా?"

"తినకేంరా? పచ్చిగడ్డీ, ఎండుగడ్డీ తింటుంది. ఉలవలు తింటుంది. అదీకాక దాన్ని రోజూ మాలిస్ చెయ్యాలి."

అవును, సుందరానికి జ్ఞాపకం వచ్చింది. మునసబుగారికి గుర్రబ్బండీ ఉంది. ఆ గుర్రాన్ని కాసావాడు రోజూ మాలిస్ చెయ్యటం సుందరం చూశాడు. గుర్రం గడ్డిమీద తప్ప పడుకోదు. పక్కకు వేసేగడ్డి అది తినదుట.

కొన్నాళ్ళకు హైస్కూల్లో ఒక మీటింగు పెట్టారు. ప్రతిక్లాసుకూ నోటీసు వచ్చింది. ఉమామహేశ్వర పండితుడు ఉపన్యాసం చేస్తాడని. ఉమామహేశ్వర పండితుడి ఉపన్యాసాన్ని చాలమంది మేస్టర్లూ, రెండు వందలమంది విద్యార్థులూ విన్నారు. పండితుడు హిందూ మతాచార ధర్మాలను గురించి మాట్లాడాడు. జుట్టూ బొట్టూ, కట్టూ ఇవి జాతీయతకు చాలాముఖ్యమనీ, మనం కిరస్తానీవాళ్ళని అనుకరించి క్రాపింగులూ అవీ పెట్టుకుని జాతీయతనూ, మతాచారాలనూ పోగొట్టుకో కూడదనీ ఆయన చెప్పాడు.

ఆయన ఉపన్యాసం విని ఉద్రేకంవచ్చి చాలామంది విద్యార్థులు క్రాపింగులు తీసేసి తలలు గుండ్లుచేయించి పిలకలు పెట్టించేశారు. అట్లా చేసినవారిలో సుందరం క్లాసు మేష్టరు సాంబయ్యగారు ఒకరు.

ఆయన క్లాసులోకి వస్తూనే తలపాగా తీసి బల్లమీదపెట్టి పిల్లల్ని చూసి నవ్వాడు. పిల్లలంతా ఆయన బోడితలచూసి గొల్లున నవ్వారు.

"అంతా గుండుకాదులేరా. ఇదుగో గోష్పాదం" అంటూ ఆయన తలవెనక్కు తిప్పి పిలక చూపించాడు.

"అవునురా, మన వేడి దేశాని కిదే హాయి. నిక్షేపంగా ఎన్నిసార్లయినా స్నానం చెయ్యొచ్చు. మంగలికి అర్ధణా డబ్బులు పారేస్తే డెక్కేస్తాడు తల. ఎందుకొచ్చిన క్రాపులు?. సమాషా చూశారూ? ఈ ఇంగ్లీషు వాళ్ళు మనమీద అధికారం చేస్తున్నారు గనక మనం క్రాపులు పెడుతున్నాం. మనం వాళ్ళమీద అధికారం చేశామనుకో. ఈ దొరముండాకొడుకులంతా చచ్చినట్టు బుర్రలు గీకించి పిలకలు పెట్టరూ?"

ఆ రోజు పాఠంలేదు. సాంబయ్యగారు "వరల్డ్ మాప్" తెప్పించి, అందులో ఎర్ర రంగు వేసివున్న భాగాలన్నీ చూపించి, బ్రిటిషు సామ్రాజ్యంలో సూర్యాస్తమానం ఎందుకుకాదో చెప్పాడు. ఈ ఇంగ్లీషువాళ్ళు యుద్ధమప్పుడు ఇండియాకు స్వరాజ్యమిస్తామని ఎటువంటి కబుర్లు చెప్పారో ఇప్పుడెలా తలాయిస్తున్నారో చెప్పాడు.

"గెలిచినకోడి కప్పెక్కి కూసిందట! వాళ్ళెందుకిస్తార్రా మనకు స్వరాజ్యం? ఇవ్వరు. యుద్ధంలో గెలవటానికి నోటికొచ్చిన అబద్ధాలన్నీ ఆడారు. వాళ్ళ అక్కర తీరిపోయింది. మన దేశం నుంచి వాళ్ళు కోట్లకు కోట్ల రూపాయలు దోచుకుపోతున్నారు... ఒక్క డబ్బేనా? మన దేశంలో ఎన్నో దేవాలయాలూ, కోటలూ, దేవుళ్ళ విగ్రహాలూ ఉన్నాయి అందులో ఉండే వజ్రవైఢూర్యాలన్నీ కాజేశారు! దోపిడే అనుకోండి. వాళ్ళు వదులుతారూ? వదర్లు. ఇదంతా మనసులో పెట్టుకోండి. పైకి అనకండి ఎందుకొచ్చిన పీడ!"

సాంబయ్యగారానాడు అన్నమాటలు వింటుంటే సుందరానికి ఇంగ్లీషువాళ్ళ మీద చాలా అసహ్యం వేసింది. కొన్ని పాడుపనులు చేసేవాళ్ళని చూసి అందరూ అసహ్యపడతారు. ఈ ఇంగ్లీషువాళ్ళు అన్ని పాడుపనులూ చేశారు. వాళ్ళని ఎందుకు గొప్పగా చూడాలీ? సాంబయ్యగారన్నట్టు వాళ్ళ తెల్లతోలు చూసి మనం ఎందుకు గర్వపడాలీ?

ఇంగ్లీషువాళ్ళను గురించి సుందరమూ, నాగేశ్వర్రావూ చాలాసార్లు మాట్లాడుకున్నారు.

"ఈ వెధవ గవర్నమెంటుకింద పనిచెయ్యగూడదురా. మా నాన్న చేస్తున్నందుకు నాకు చాలా కోపంగా ఉంది" అన్నాడు నాగేశ్వర్రావు. ఈ ఆలోచన సుందరానికి కలగలేదు. కాని నాగేశ్వర్రావు చెప్పినదానిలో నిజం ఉందనిపించింది. ఈ ఇంగ్లీషు ప్రభుత్వం కింద ఎవరూ పనిచెయ్యకుండా వుంటేసరి! అప్పుడు వాళ్ళేం ప్రభుత్వం చేస్తారు?

తనూ, నాగేశ్వర్రావూ కలిసి చేసుకున్న ఈ నిర్ణయంతో బ్రిటీషు ప్రభుత్వం పతనమైనట్టే సుందరం సంతోషించాడు. ఆ తరువాత వాడు బ్రిటిషు పరిపాలన గురించి పూర్తిగా మరిచిపోయినాడు. కొత్తగా కుంటి దొర ఒకడు స్కూళ్ళ

ఇన్‌స్పెక్టరుగా వచ్చినప్పుడు కూడా సుందరానికి మళ్ళీ బ్రిటిషు ప్రభుత్వం జ్ఞాపకంరాలేదు. ఈ దొర యుద్ధంలో గాయపడ్డవాడే. దాదాపు ఏడడుగుల ఎత్తుండేవాడు. గుర్రంమీద తిరుగుతూ అడుక్కునే సిపాయల్లే ఈయనకు కాళ్ళు తెగిపోలేదు. రెండుకాళ్ళూ ఉన్నాయి. కాని ఒక కాలు కుంటి. కుంటుతూ నడిచేవాడు. ఆయన ఇంగ్లీషు మాట్లాడితే మేష్టర్లు మాట్లాడినట్లు కాకుండా ఇంకోరకంగా ఉండేది. ఆయనకు నాలుగు వందలు జీతమని ఎవరో చెప్పారు.

## 12

ప్రపంచంలో యుద్ధానంతర సంక్షోభం ఎట్లా ఉన్నదీ తెలిసే అవకాశంలేక, తెలిసినా అది తమ జీవితాలను ఏ విధంగా స్పృశించేదీ అర్థంకాని పీడిత భారత ప్రజలలో చాలా తరగతులకు అవి మంచిరోజులు. జీవితం చాలా రోజులు మంచానపడి తిరిగి కోలుకొంటున్నట్టుగా ఉన్నది. అదివరకులేని కొత్తరకం వస్తువులూ, బట్టలూ వచ్చాయి. జీవితంలో కొత్త చైతన్యం కనిపించింది.

సీతమ్మగారు, కొంత వ్యాపకం కోసమూ, కొంత డబ్బు ఆదా చూసుకునీ దొడ్డినిండా పాదులు పెట్టింది. తూర్పువైపు ఖాళీ స్థలంలో ఒకపక్క గుమ్మడి పాదులు పెట్టింది. ఇంకోపక్క వేసిన పాకమీదికి సొరపాదు ఎక్కించింది. పాక వెనకవున్న స్థలంలో బెండలూ, వంగలూ పెట్టింది. బావి సమీపంలో ఆకుమళ్ళు పెరుగుతోట కూరా, బచ్చలీ, మెంతీ, కొతిమీరా–వేసింది. గోరుచిక్కుడుకు చిన్న పాదొకటి వేసింది. వీటివేటికీ సంబంధం లేకుండా పడమటవేపు పొట్లపాదు పెట్టి అది పైకి వచ్చే సమయంలో దానికి పందిరి వేయించింది. "పొట్లకు పొరుగు గిట్ట"దని తల్లి చెప్పగా సుందరం తెలుసుకున్నాడు.

అది అచ్చంగా సీతమ్మగారికి మాత్రమే తట్టిన ఆలోచనకాదు. దాదాపు ప్రతి ఇంట్లోనూ పాదులు వెలిశాయి. ఇదివరకున్న ఇళ్ళలో విస్తరించాయి. జీవిత వ్యయం పెరుగుతున్నది. డబ్బులిచ్చి కూరలు కొనటమంటే ఎరగని వాళ్ళింకా జీవించి వున్నారు. రెండణాలకు బుట్టెడువచ్చే బెండకాయలు వీశె రెండణా లయాయి.

మళ్ళు కట్టడం, పాదులు పెట్టడం, మొక్కలు పెంచటం, అవి కాయటం సుందరానికి చాలా ఉల్లాసంగా ఉండేది. బావి దగ్గిర తల్లి నీళ్ళు తోడిపోస్తుంటే సుందరం చెంబుతో మళ్ళకు శ్రద్ధగా పొద్దునా, సాయంత్రము నీళ్లు పోసేవాడు. కాని, ఎందుచేతో దొడ్లో కాసిన కాయలు ఇళ్ళకు అమ్మవచ్చే కాయలంతబాగుండేవి కావు. బోలెడంత అవరణ ఆక్రమించిన గుమ్మడిపాదు పూలుపూసిందేగాని ఒక్క కాయకూడా వెయ్యలేదు. వంగలు ఒక కాపు బాగానేకాసి రెండోకాపుకు గిడసబారాయి. బెండలు బాగానే కాశాయి. అన్నిటికన్నా విరగకాచినవి గోరుచిక్కుళ్ళు.

"వెధవ గోరుచిక్కుడు. పైత్యమూ, వేడీనూ, గుత్తులు గుత్తులుగా ఎట్లా కాచిందో, తెలీక వేశాను" అన్నది సీతమ్మగారు. వాటి నావిడ ఎంతమందికి పందేరం చేసిందో లెక్కలేదు.

ఈ పాదులు పెట్టటలోగల చిక్కు సీతమ్మగారు గ్రహించింది. ఎంత తక్కువగా పాదులు పెట్టినా, కాచినవన్నీ తినటం అసంభవం. దొడ్లో కాచిన పొట్లకాయలూ, బెండకాయలూ, వంకాయలూ, సొరకాయలూ, కాయలేదుగాని కాస్తే గుమ్మడి కాయలూ. గోరుచిక్కుడుకాయలూ కలిపి తనూ, పిల్లా ఎట్లా తినేది? వాటిని ఎవరికన్నా ఇచ్చెయాలిసిందే లేదా అమ్మాలి. కాని కూరలు అమ్ముకోవటం అసహ్యంకాదూ? ఇంతా కష్టపడి పండించినవేమో పందేరం చెయ్యాలి. వీటి కాపు ఏ నాలుగునెల్లకో అయిపోతే మిగిలిన ఏడాదల్లా కూరలు కొనుక్కోవలసిందే. దొడ్లో కూరలు పండించటం ఒకందుకు మంచిదయింది. రోజూ ఇంటిల్లిపాదీ ఎక్కితొక్కినట్టు కూరలు తింటున్నారు చిల్లర జబ్బులు తగ్గాయి.

కూరలు వాళ్ళకూ వీళ్ళకూ ఇవ్వటం కూడా సీతమ్మగారికి సమస్యగా ఏర్పడింది. బాగా ఎరిగున్న వాళ్ళకూ, బంధువులకూ ఇవ్వొచ్చు. కాని వాళ్ళూ కూరలు పండించేవాళ్ళే!

"ఎప్పుడూ ఇంతే. ఉన్నవాళ్ళకే పెట్టటం. పనివాళ్ళ కిద్దామంటే వాళ్ళు తినరు అమ్ముకుంటారు. మనం అమ్ముకోపటానికి భయపడి చస్తూ వాళ్ళకిచ్చి అమ్ముకోనివ్వటం ఎట్లా? పైగా పనివాళ్ళచేత అమ్మిస్తున్నా మంటారు. ఆ జానకమ్మ అట్లాగే అమ్మిస్తుంది కూడానూ" అన్నది సీతమ్మ.

"అమ్మా, మా క్లాసులో చాలామంది బీద పిల్ల లున్నారు. కూరలు వాళ్ళకిస్తే ఏం" అన్నాడు సుందరం.

"కొంతమంది కిచ్చి మిగిలినవాళ్ళ కివ్వకపోతే బాగుంటుందిట్రా? అందరికీ యిస్తే ఇంక మనకేం ఉంటై?" అన్నది తల్లి.

తల్లి చెప్పినమాట సుందరానికి సబబుగా కనబడింది.

   

మురికి గుంటలాగావున్న జీవితం జలియన్‌వాలాబాగ్ కాల్పులతోనూ, డయ్యర్[10] పేరుతోనూ ఒక్కసారిగా కదలబారిపోయింది. డయ్యర్ రాక్షసుడు. భారతీయులను కుక్కలకన్న అన్యాయంగా చూశాడు. యుద్ధం కాగానే బ్రిటీషువాళ్ళు

10. జనరల్ డయ్యర్ జరిపిన పంజాబు దురంతం. 1919 ఏప్రిల్ 13వ తేదీ సాయంత్రం నాలుగున్నర గంటల ప్రాంతంలో అమృతసర్ పట్టణంలోని జలియన్ వాలాబాగ్‌లో వేలాది ప్రజలు "వైశాఖి" ఉత్సవ సందర్భంగా సమావేశమయ్యారు. 11వ తేదీన సభలమీదా, సమావేశాలమీదా ప్రభుత్వం ఆంక్షలు విధించిన విషయం సమావేశితులకు తెలియదు. నిస్సహాయులు, నిరాయుధులు అయిన దాదాపు పదివేల మంది ప్రజల మీద, ఎలాంటి హెచ్చరికలు లేకుండానే జనరల్ డయ్యర్ పాశవికమైన హత్యాకాండ జరిపాడు. 90 మంది సిపాయిలు పదినిమిషాల్లో 16 వందల రౌండ్లు కాల్పులు జరిపారు. ఉన్న ఒకే ఒక్క యిరుకుదారికి అడ్డంగా సిపాయిలు నిలుచున్నారు. మందుగుండు అయిపోకుండా వుంటే, కొన్ని వేలమంది బలియ్యై ఉండేవారు. ఈ హత్యాకాండలో దాదాపు వెయ్యిమందికి పైగా బలి అయ్యారు. ఈ తోటలో మృతవీరుల గౌరవార్థం స్మారక స్థూపం నిర్మించారు. తూటాలు గోడలకు తగిలిన గుర్తులు యిప్పటికీ చూడవచ్చు.

ఇస్తామన్న స్వరాజ్యం ఎటువంటిదో వాడు చూపాడు. జలియన్ వాలాబాగ్‌లో సభ చేసే ప్రజని పారిపోకుండా చుట్టుముట్టి కాల్చటమూ, మనుష్యుల్ని పొట్టలమీద దేకించి అవాచ్యాలకు గురి చెయ్యటమూ వింటుంటే ప్రతివాడికీ మండిపోయింది.

ఎక్కడి జలియన్‌వాలాబాగ్? ఎక్కడి పంజాబ్? అక్కడ జరిగిన దురంతాలు దేశాన్నంతనీ ఎట్లా కదిలించాయి? కాలమహిమ! పంజాబు కూడా భారతదేశమే! అక్కడా బ్రిటిషు పరిపాలనే ఉంది. ఇవాళ అక్కడ జరిగిన సంఘటనలు రేపిక్కడ జరగవచ్చు. ఇక్కడ జరక్కపోతే అది ఇక్కడివాళ్ళ దేశభక్తి దీక్షకు కళంకమవుతుందేమోగాని బ్రిటిషువాళ్ళ మంచితనానికి నిదర్శనం మటుకు కాదు. ఈ దృష్టి చదువుకున్న వాళ్ళందరికీ పూర్వంకంటే ఇప్పుడు బాగా ఏర్పడింది.

రౌలట్ చట్టం[11] సత్యాగ్రహం, జలియన్‌వాలాబాగ్ కాల్పులు, డయ్యర్ అనే మాటలు సుందరం విన్నాడేగాని, ఈ సంఘటన వెనకవున్న రాజకీయాలు సుందరం ఎరగడు. అయినా ఈ సంఘటనవల్ల వాడిలో ఏదో వికారం కలిగింది. తొమ్మిదేళ్ళు నిండిన సుందరం ఈ సంఘటనను తాత్వికంగా అవగాహన చేసుకోవటానికి ప్రయత్నించాడు. అధికారంలో వున్న వాళ్ళు ఇటువంటి పనులు ఎట్లాచేస్తారు? ఎందుకు చేస్తారు? మనుష్యులకు - ఎరగని మనుష్యులమీద అంత ఆగ్రహం ఎట్లా వస్తుంది? దొంగతనం చేసినవాణ్ని పోలీసులు పట్టుకోవచ్చు. ఖైదులో పెట్టవచ్చు. కాని సభ చేస్తున్న వాళ్ళను చేతులారా ఎట్లా కాలుస్తారు. ఈ సంగతి ప్రపంచానికంతా తెలుస్తుందని వాళ్ళకు తెలీదా? ఈ ప్రశ్నలు వాణ్ణి బాధించాయి. చెడ్డతనమూ, చెడ్డబుద్ధులూ అనేవి చదువుకున్న వాళ్ళలోనూ, ఉద్యోగాలు చేసేవాళ్ళలోనూ అధికార్లలోనూ ఉండవనీ; తక్కువ కులాల వాళ్ళలోనూ కూలినాలి చేసుకునే అలగాజనంలోనూ, మర్యాదలేకుండా జీవించే బిచ్చగాళ్ళు, రౌడీలు మొదలయిన వాళ్ళలోనూ మాత్రమే ఉంటాయని సుందరానికి భ్రమ ఉండేది. ఆ భ్రమ ఒకంతట వదిలేది కాదు; అయినా బాగా దెబ్బతిన్నది.

❀ ❀ ❀ ❀

సుందరం సీతప్పగారిక్లాసులోకి వచ్చాడు. సీతప్పగారు స్కూలు పెట్టినప్పటినుంచీ ఉన్న మేష్టరు. అప్పుడది హైస్కూలుకాదు. మిడిల్‌స్కూలు. ఇప్పుడున్న చోట ఉండేదికాదు. దయ్యాల మర్రి దగ్గిర ఉండేది.

---

11. 1905-1908 మధ్య భారతదేశంలో జరిగిన విప్లవ కార్యకలాపాలను సమీక్షించి ఆ నెపంతో బ్రిటిష్ ప్రభుత్వం కేంద్ర లెజిస్లేచర్ 1919 మార్చి 21వ తేదీన రెండు బిల్లులు ప్రవేశపెట్టింది. రౌలట్ బిల్లు ప్రధాన ఉద్దేశం భారత పౌరుల హక్కులను, పత్రికల హక్కులను శాంతి సమయంలో కూడా హరించడం, జాతీయోద్యమకారులను కఠిన నిర్బంధాలకు లోనుచేయడం. ఈ చట్టాన్ని రద్దు చేయాలని కోరుతూ గాంధీ మార్చి 30వ తేది హర్తాళ్ చేయాలని ప్రజలకు విజ్ఞప్తి చేశారు. ఆ పిలుపు అందుకుని ఆంధ్రలో యీ బిల్లు పట్ల ఏప్రిల్ ఆరవతేది బెజవాడ, రాజమండ్రి, గుంటూరు, నరసాపురం, చిత్తూరు, నెల్లూరు, ఏలూరు, విశాఖపట్టణాల్లో హర్తాళ్ళు జరిగాయి. బెజవాడ తాలూకా రైతులు కోలవెన్నులో సమావేశమై చట్టాన్ని అధిక్షేపించారు. జలియన్‌వాలాబాగ్ హత్యాకాండకు మూలకారణమైన యీ చట్టాన్ని తెలుగు పత్రికలు ముక్తకంఠంతో ఖండించాయి.

స్కూల్లో ఉండే మేష్టర్లందర్లోకి మెత్తనివాడు సీతప్ప. పిల్లల్ని "ఏమయ్యా" అని పిలిచేవాడు సాంబయ్యగారల్లేనే ఈయనా దేశభక్తి పరాయణుడు. అయితే ఆదర్శవాది. ఎప్పుడూ బ్రిటిషువారిని తిట్టేవాడుకాదు. బ్రిటిషువాళ్ళమీద కోపం కొద్దీ సాంబయ్యగారు క్రాపుతీసేసి గుండు చేయిస్తే. సీతప్పగారు ఎప్పుడూ సనాతన ధర్మాన్నే అనుష్టించేవాడు. మత గ్రంథాలమీద, వేదాంత గ్రంథాలమీద ఆయనకు చాలా ప్రీతి. ముఖ్యంగా ఆయనకు భగవద్గీత అంటే చాలా యిష్టం.

ఒకరోజు సీతప్పగారు క్లాసులోకి అడుగు పెట్టడమే విచారంగా అడుగు పెట్టాడు. ప్రార్ధనకాగానే ఆయన అటెండెన్సుకూడా తీసుకోకుండా చాలా ఖిన్నుడైపోయి, "చాలా గొప్పవాడు పోయినాడయ్యా!" అన్నారు.

"ఎవరండీ పోయిందీ?" అన్నారు విద్యార్థులు.

"బాలగంగాధర తిలక్[12] మహానుభావుడయ్యా! అవతార పురుషుడు. ఆయన పోవడం దేశానికి పెద్దదెబ్బ. అటువంటి మహానాయకుడు దేశానికి మరి దొరకడు. 'గాంధీ' అని ఇంకో ఆయన ఉన్నాడుగాని – ఎబ్బే. తిలక్ మహాశయుడి కెవ్వరూ చాలరు 'యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యీహం' అంటూ చచ్చిపోయినాడు! మహానుభావుడు, మహానుభావుడు ఇవాళ నిజంగా బడికి శలవివ్వటం ధర్మం" అని విద్యార్థులకు చెప్పాడు సీతప్ప.

అదే సాంబయ్యగారైతే ఈ తిలక్ ఏం చేశాడో, ఎందుకు గొప్పవాడో పిల్లలకు చెప్పి, ఏదోవిధంగా బ్రిటిషు వాళ్ళను తిట్టి ఉండేవాడే. సీతప్పగారి విచారం చూసి పిల్లలు విచారపడ్డారేగాని తిలక్‌గారిని గురించి వాళ్ళు తెలుసుకున్నదేమీ లేదు.

ఆ పీరియడ్ సీతప్పగారు పాఠం చెప్పలేదు. అటెండెన్సు తీసుకోలేదు. పిల్లలతో జాస్తిగా మాట్లాడనూలేదు. విచార సముద్రంలో మునిగిపోయినాడు.

అదృష్టవశాత్తూ ఆరోజు బడికి శలవని నోటీసు రానేవచ్చింది కొంతసేపటికి.

ఆరోజు శలవు రావటంతప్ప తిలక్ మహాశయుడి చావువల్ల చెప్పుకోదగిన వింతలేవీ జరగలేదు. జీవితపు మురికిగుంటలో ఒకచిన్న అల వచ్చి

---

12. బాలగంగాధర్ తిలక్ (1856-1920): లోకమాన్య తిలక్ తీవ్ర జాతీయవాది, సంఘసంస్కర్త, వేదపండితుడు. ఆగార్కర్, రెనడే, నౌరోజీల వల్ల ప్రభావితుడై, రాజకీయ, సామాజిక దురాచారాలపై పోరాటం సల్పిన వ్యక్తి. 1880లో పూనాలో న్యూ ఇంగ్లీష్ స్కూల్స్ 1885 ఫెర్గ్యుసన్ కాలేజీ స్థాపించినారు. "కేసరి", "మరాఠా" పత్రికలు నడిపారు. బెంగాల్ విభజన తర్వాత స్వదేశీ ఉద్యమం (1905), జాతీయ విద్య, ప్రాముఖ్యాన్ని తెలియజేసిన, రాజీపడని తీవ్ర జాతీయవాది. 1916లో హోమ్‌రూల్‌లీగ్ ప్రారంభించారు. 1916 లోనే జరిగిన లక్నో కాంగ్రెస్ సమావేశంలో "స్వరాజ్యం నా జన్మ హక్కు"ని నినాదం యిచ్చారు. భగవద్గీత వ్యాఖ్యానంలో ఆయన తీవ్రవాద రాజకీయాలు కనిపిస్తాయి. ఆంధ్రలో తిలక్ ప్రభావం వున్నవ లక్ష్మినారాయణ పంతులు వంటి పలువురు రాజకీయవేత్తల మీద కనిపిస్తుంది. మన దేశంలో ట్రేడ్ యూనియన్ ఉద్యమాన్ని నిర్మించిన తొలితరం కార్మిక నాయకుల్లో ఒకరు. తిలక్ రచనల్లో – పేర్కొనదగినవి గీతారహస్యం, ఆర్కిటిక్‌హోమ్ ఇన్‌వేదాస్. తిలక్ 1920 ఆగస్టులో మరణించారు.

మాయమయింది. మళ్ళీ పాచి దాన్ని కప్పేసింది. దానికింద యధాప్రకారంగా బడి, హోంవర్కూ, పరీక్షలూ, మార్కులూ, పాఠాలూ, మేష్టర్లు పిల్లల్ని కొట్టడమూ, మెత్తని మేష్టర్లను పిల్ల లేడిపించటమూ జరుగుతూ పోయింది.

మేష్టర్లందరిలోకీ తెలుగు మేష్టర్లు లోకువ. ఇది అనాదిగా వస్తున్న ఆచారం. వాళ్ళకి ఇంగ్లీషురాదు. కాని ఇంగ్లీషు మాట్లాడకుండావుండరు. పిల్లల్ని భయపెట్టలేరు. పిల్లలు మరీ పెచ్చుమీరిపోతే హెడ్మాష్టరుకి రిపోర్టిస్తారు. హెడ్మాష్టరు పేంబెత్తెంతో నాలుగుతంతాడు. ఆ తరవాత తెలుగుమేష్టర్లకు పశ్చాత్తాపం పట్టుకుంటుంది. పిల్లలు మరింత ఆకతాయితనం చేస్తారు. ఇన్‌స్పెక్టర్ వస్తున్నాడంటే తెలుగు మాస్టర్లకి హడలు. వాళ్ళకి హెడ్మాష్టరన్నా హడలే.

అందరు పిల్లలల్లేనే సుందరానికికూడా కొందరు మేష్టర్లంటే ఇష్టమూ, కొందరిపైన నిర్లక్ష్యమూ, మరికొందరిమీద అసహ్యమూ వుండేది. అయితే ఏ విద్యార్థి కూడా అభిప్రాయాలు తన స్వంతమని చెప్పలేడు. ఈ అభిప్రాయాలు విద్యార్థుల్లో ప్రచారమవుతాయి. కాని వీటివెనక ఆధారం ఉండకపోదు. స్కూలు కమిటీవారు ఏటా రహస్య బాలట్ ఏర్పాటు చేసేటట్టయితే ఉపాధ్యాయుల్లో నిజంగా పనికివచ్చే వాళ్ళెవరో, బొత్తిగా పనికిరానివాళ్ళెవరో సులభంగా తేలిపోతుంది. కాని ఆపని చెయ్యటానికి ఎవరికీ తట్టలేదు.

సుందరానికి చదువు బాగాచెప్పే మేష్టర్లంటే యిష్టం. వాళ్ళు కొట్టేవాళ్ళయినా వాడికి అభ్యంతరంలేదు. కాని పాఠాలు సరిగా చెప్పలేని మేష్టర్లు ఎంత మంచి వాళ్ళయినా, సాధువులయినా వాడి కాటే ఇష్టం వుండేదికాదు.

సీతప్పగారి సెక్షనులో ఉండటానికి సుందరానికి మనస్కరించలేదు. సీతప్పగారు పాఠాలు సరిగా చెప్పకపోవటం ఒకటేకాదు. నాగేశ్వర్రావు ఇంకో సెక్షనులో పడ్డాడు. అందుచేత సుందరం తానుకూడా ఆ సెక్షనుకే పోతానని సీతప్పగారిని అభ్యర్థించాడు. ఆ సెక్షన్నుంచి ఈ సెక్షనుకు రాగోరే కుర్రవాణ్ణికూడా సుందరం చూపించాడు. అయితే ఆ కుర్రవాడికి కిందటేడు మంచిమార్కులు రాలేదు. సుందరంచాలా మంచిమార్కులతో పాసయినాడు. అందుచేత సీతప్పగారు మార్పుకు ఒప్పుకోలేదు. అయితే అదృష్టవశాత్తూ ఒకటి జరిగింది. ఆ యేడు సెంకడు ఫారంలోకి విద్యార్థులు విపరీతంగా వచ్చిపడ్డారు. ఒక్కొక్క సెక్షనులోనూ యాభయ్యేసి మందిదాకా తయారయినారు. అందుచేత అయిదో సెక్షను ఏర్పాటుచెయ్యవలసి వచ్చింది. సుందరమూ నాగేశ్వరరావుకూడా కొత్త సెక్షనులోకి వెళ్ళారు.

అయినా సుందరం గుండె పిచపిచ లాడుతూనేవుంది. కొత్త మేష్టరు ఇదివరకల్లా ఫస్టు ఫారానికి మాత్రమే చెప్పినవాడు. సెంకడు ఫారానికి చెప్పగలడా అని? ఈ భయం మొదటిరోజునే పోయింది. సీతప్పగారికన్న ఈయన పాఠాలు చాలా బాగా చెప్పేవాడు.

   

తిలక్ మహాశయుడి చావు గురించి జనం మరిచారో లేదో, గాంధీ ముందుకు వచ్చి సహాయ రాకరణోద్యమం[13] ప్రారంభించారు. ఎవరినోటవిన్నా గాంధీ పేరే, సత్యాగ్రహమున్నమాటే.

తిలక్ చావును గురించి విన్నప్పుడే సుందరం గాంధీ పేరుకూడా విని వున్నాడు. గాంధీని గురించి ఇప్పుడింకా చాలా విషయాలు తెలిశాయి. తిలక్ పొయ్యేటప్పుడు గాంధీ దగ్గిరే వున్నాట్ట. జాతీయోద్యమాన్ని గాంధీకి అప్పగించి తిలక్ ప్రాణం విడిచాట్ట. గాంధీ చెప్పే కొత్త పద్ధతుల్లో ఒకటి స్వదేశీ ఉద్యమంతో విదేశీవస్తు బహిష్కారం.[14] ఇంగ్లీషువాళ్ళు వర్తకంతో ఇండియాను దోస్తున్నారు. ఈ దోపిడీకోసమే ఇక్కడ పరిపాలన తతంగమంతానూ మనదేశంలో వాళ్ల వస్తువులను ఎవరూ కొనకుండా మానేస్తే వాళ్ళరోగం కుదిరిపోతుంది. ఏటా ఎన్నో కోట్ల రూపాయల సరుకులు ఇంగ్లండు నుండి ఇండియాకు దిగుమతి అయి అమ్ముడు పోతున్నాయి. వాటిని కొనడం మానాలి. ముఖ్యంగా విదేశీ వస్త్రాలు బహిష్కరించాలి. అందరూ నూలు వడికి నేయించుకుని అ బట్టలే కట్టాలి. అదే ఖద్దరు. అదే స్వదేశీ దీక్షా వస్త్రం.

ఒకనాడు సుందరం, నాగేశ్వర్రావూ స్కూలుకు వచ్చేసరికి అక్కడ పికెటింగు సాగుతున్నది. వందలకొద్దీ విద్యార్థులు గేటుబయట నిలబడి ఉన్నారు. పికెటర్లు వాళ్ళని లోపలికి పోవద్దని నయానా భయానా నివారిస్తున్నారు. పికెటింగు చేసే వాళ్ళు విద్యార్థులు కారు. కాని చాలా పెద్దవాళ్ళూ కారు.

ఒకాయన సైడుకాలవ కల్వర్టుమీద నుంచోని ఉద్ఘోషిస్తున్నాడు.

"ఒరే అబ్బాయిలూ, మీరెవరూ స్కూలుకు పోనక్కర్లేదు. స్కూళ్ళు మానమని గాంధీ చెప్పాడు ఆ మాటే నేనూ మీకు చెబుతున్నా... ఇదిగో, అభిమానం

---

13. 1920 సెప్టెంబరు 4వ తేదీన జరిగిన కలకత్తా కాంగ్రెస్ ప్రత్యేక సమావేశంలో గాంధీజి సూచించిన అహింసాత్మక సహాయ నిరాకరణోద్యమం తీర్మానం జరిగింది. 1919లో జరిగిన మాంటేగ్- చెమ్స్‌ఫర్డ్ సంస్కరణలకు వ్యతిరేకంగా జరిగిన ఆందోళనల పర్యవసానం యీ వుద్యమం. ఆంధ్రనుంచి అయ్యదేవర కాళేశ్వరరావు, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, బులుసు సాంబమూర్తి, గొల్లపూడి సీతారామశాస్త్రి, దండు నారాయణరాజు, ఆత్మకూరి గోవిందాచార్యులు, మొదలయిన ముప్పయి మంది సమావేశంలో పాల్గొన్నారు. కొండా, తప్పమిగిలిన వారంతా గాంధీ ఉద్యమానికి అనుకూలంగా ఓటు చేశారు.

14. స్వదేశీ ఉద్యమం విదేశ వస్తు బహిష్కారం: విద్యార్థులు విద్యాలయాలను వదిలివేయటం. న్యాయవాదులు బ్రిటిష్ కోర్టులను త్యజించటం. విదేశవస్తు బహిష్కారం, ప్రభుత్వోద్యోగాలను మానివేయటం. గాంధీజీ 1920 డిసెంబరు 20న నాగపూర్‌లో జరిగిన కాంగ్రెసు మహాసభలో యిచ్చిన పిలుపు లక్ష్యాలు: నిర్మాణ కార్యక్రమంలో ప్రధాన లక్ష్యాలు, అంశాలు: నూలు వడకటం, నూలుబట్టలు నేయటం, అస్పృశ్యతా నిర్మూలనం, మద్యపాన నిషేధం, తిలక్ స్మారక నిధికి కోటి రూపాయలు వసూలు చేయటం. 1921 మార్చి 31, ఏప్రిల్ 1న విజయవాడలో జరిగిన భారత కాంగ్రెస్ సంఘ సమావేశంలో గాంధీ, నెహ్రూ, సి.ఆర్. దాస్, పటేల్ మొదలైన జాతీయ నాయకులు పాల్గొనటం, ఆంధ్రలో గాంధీజీ పర్యటన తెలుగుదేశంలో ఈ ఉద్యమ వ్యాప్తికి మరింత తోడ్పడ్డాయి.

ఉన్నవాళ్ళెవరూ లోపలికి పోకండి. సిగ్గుమాలినవాళ్ళు పోతేపోవచ్చు. నేనొద్దనను మీరెవరూ వెళ్ళకపోతే పారాలు జరగవురా పిచ్చివాళ్ళలారా. రెండు మూడు రోజులాగారంటే జాతీయ కళాశాల పెడుతున్నాం. అందులోకి వచ్చి నిజమైన చదువు చదువుదురుగాని."

మేష్టర్లు మాత్రం లోపలికి వెళ్ళారు. పిల్లలు దాదాపు ఎవరు వెళ్ళలేదు. దాదాపు పదకొండు గంటల ప్రాంతాన సుందరం నాగేశ్వర్రావుతో కలిసి యింటికి తిరిగిపోయినాడు.

శ్రీరామ్మూర్తి స్నేహితులంతా చేరారు. వాళ్ళలో ఒక్కడూ స్కూలుకు వెళ్ళలేదు. వాళ్ళంతా ఉద్రేకంగా మాట్లాడుకునే విషయాలన్నిటిని సుందరం ఆలకించాడు. ఈ చదువు పద్ధతి ఇంగ్లీషువాళ్ళు కావాలని తెచ్చిపెట్టారు. ఇంకో భాష నేర్చుకుంటేనేగాని ఉద్యోగాలు దొరకని పద్ధతి భూప్రపంచంలో యెక్కడా లేదు. ఇంగ్లీషు వాళ్ళు ఇండియాలో తెచ్చిపెట్టారు. ఎందుకూ పనికిరాని చదువు ప్రవేశపెట్టారు. నూటికి తొంభైతొమ్మిది మంది ఏవో వృత్తులు చేసుకునే వాళ్ళయితే దేశంలో వృత్తి విద్యలు లేకుండా చేశారు. చరిత్రనిండా అబద్ధాలు రాశారు. ఈ చదువు బహిష్కరించాల్సిందే.

అట్లాగే విదేశీ వస్తువులు కూడా బహిష్కరించాలి. అవి లేకుండా మనం గడుపుకోవాలి. మంచో చెడో మన దేశంలో తయారయేవే కొంటే దేశంలో ఉండే డబ్బు దేశం దాటిపోకుండా ఉంటుంది. ఆ తరువాత ఇంగ్లీషువాళ్ళు మనల్ని దోచుకోలేరు. ఈ విషయాలు సుందరం విన్నాడు. అర్థం చేసుకున్నాడు. ఇవి వాడికి క్రొత్త విషయాలే. అయినా తెలియదగిన విషయాలల్లే కనిపించాయి.

స్కూలు ముందు రోజూ పికెటింగు సాగుతూనే ఉంది. సుందరానికి ఒకటే సందేహం కలిగింది. ఇట్లా ఎన్ని రోజులు సాగుతుంది? ఎప్పుడో ఒకనాడు పికెటింగు మానరా? ఆ తరువాత మళ్ళీ స్కూలు యధావిధిగా సాగదా? అని!

అయినా సుందరం పికెటింగు జరిపేవాళ్ళ పక్షాన్నే ఉన్నాడు. స్కూలూ, హెడ్మాష్టరూ, మేష్టర్లూ జాతీయోద్యమానికి శత్రువులుగా వాడికి కనపడ్డారు. పికెటింగు లక్ష్య పెట్టకుండా లోపలికి వెళ్ళి ఖాళీక్లాసుల్లో కూర్చున్న యాభై, అరవైమంది విద్యార్థులూ, స్వార్థపరుల్లాగానూ, పిరికివెధవల్లాగానూ కనిపించారు.

మొదటి రోజుకంటె రెండోరోజు తక్కువమంది విద్యార్థులు క్లాసులకు వెళ్ళారని విని సుందరం సంతోషించాడు. మూడోరోజు రెండువందల మందిదాకా వెళ్ళారని విని ఎందుకో భయపడ్డాడు. ఎవ్వరూ స్కూలుకు వెళ్ళరాదని సుందరం కోరాడేగాని, ఎవరు బడికిపోయినా తాను పోకూడదన్న నిర్ణయం సుందరం చెయ్యలేదు. అదీకాక క్లాసులు నడిచి తాను వాటికి హాజరు కాకుండా ఉండటం సుందరానికెంత మాత్రమూ ఇష్టంలేదు.

పికెటింగు నిరసించేవాళ్ళ పక్షం కూడా సుందరం విన్నాడు. ఇంట్లో ఆడవాళ్ళకు ఆదినారాయణ చిన్న ఉపన్యాసం ఇచ్చాడు.

"వీళ్ళ మొహం పికెటింగు! రెండు రోజులు పికెటింగుచేసి మూడోరోజు మానేస్తారు. స్వరాజ్యం రావటానికి పిల్లల చదువులు మానుకోవాలా? అందరూ

చదువులుమాని బడుద్ధాయిలయితే స్వరాజ్యం వచ్చేసి చదువురాని వాళ్ళకి ఉద్యోగాలొస్తాయి కాబోలు, ఏమిటో?"

ఆదినారాయణగారు ఈ మాట అన్న మర్నాడే ఊళ్ళో జాతీయ విద్యాలయం[15] మంత్రపూర్వకంగా శంకుస్థాపన జరిగింది. హైస్కూల్లో పనిచేసే ఉపాధ్యాయులిద్దరు అందులో ప్రవేశించారు కూడానూ. విద్యాలయం ప్రారంభమైన రోజు ఉదయం సుందరం అక్కడికి వెళ్ళాడు. పెద్ద పందిరి వేశారు. భజంత్రీలు వాయించారు. అనేక వందలమంది అక్కడ చేరారు. వాళ్ళలో చాలావరకు స్కూలుకు వెళ్ళని విద్యార్థులే. బ్రాహ్మడు మంత్రాలు చదివాడు. బరంపురం వంగపండు రంగు పట్టుబట్టలు కట్టుకుని ఎర్రగా, అందంగా వుండే ఒకాయన హడావుడిగా అటూ ఇటూ పెత్తనం చేశాడు. ఆయన శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్య[16]ని సుందరానికి ఎవరో చెప్పారు.

ఆ సాయంకాలం అక్కడే మీటింగు. ఇసకవేస్తే రాలకుండా జనం మీటింగుకు వచ్చారు. కొండా వెంకటప్పయ్య[17] ఇంకా ఎవరెవరో మాట్లాడారు కాని ఎవరు మాట్లాడినా దుగ్గిరాల గోపాలకృష్ణయ్య మాట్లాడినట్లులేదు. ఆయన మాట్లాడుతుంటే వినేవాళ్ళు పరవశమై పోయినారు.

"... అయితే ఇంగ్లండంటే ఏమిటనుకున్నారు. మన మద్రాసు రాజధానంత కూడా లేదు. మనమంతా వెళ్ళి ఉచ్చపోస్తే మునిగిపోతుందన్నమాట. నే చూసే వచ్చాలే!"

పిల్లలంతా గొల్లున నవ్వటం. నిజంగానే దుగ్గిరాల గోపాలకృష్ణయ్య ఇంగ్లండులో చాలాకాలం వుండి వచ్చాట్ట. అటువంటివాడే బ్రిటిషువాళ్ళ పరిపాలన

---

15. జాతీయ విద్యాలయము; జాతీయోద్యమ నిర్మాణోద్యమ కార్యక్రమంలో భాగంగా అనేక జాతీయ పాఠశాలలు ఆంధ్రలో వెలిశాయి. 1921 జూన్ నాటికి ఈ పాఠశాలల్లో 275 మంది విద్యార్థులున్నారు. ఏలూరు జాతీయ కళాశాలను గాంధీజీ ప్రారంభోత్సవం చేశారు. జాతీయ దృక్పథంతో చరిత్ర బోధన, హిందీ భాషాభ్యాసము, రాట్నం వడకటం, నేత, వడ్రంగం మొదలైనవి జాతీయ పాఠశాలల కార్యక్రమాలు.

16. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య (1889-1925). పండితుడు, కవి, మంచి వక్త, గాయకుడు. చీరాల - పేరాల సత్యాగ్రహ నిర్మాత. యూనియన్‌లుగా వున్న చీరాల - పేరాలలను మున్సిపాలిటీగా ప్రభుత్వం మార్చాలనుకున్నప్పుడు మొత్తం 15326 మంది ప్రజలలో 13570 మంది ఊరువదలి ఆరు నెలలు బయట రామనగర్‌లో స్థిరపడటానికి ఆయత్తమయారు. రామదండు నిర్మాత గోపాలకృష్ణయ్య సంఘటిత శక్తికిది నిదర్శనము. సహాయ నిరాకరణోద్యమంలో ఈ సత్యాగ్రహం భాగం. "సాధన" అన్న వారపత్రిక సంస్థాపకుడు. రాజకీయాలకు మత చైతన్యాన్ని జోడించిన ఆదర్శవాది. (మరికొన్ని వివరాలకు చూ. మామిడిపూడి వెంకటరంగయ్య, ఎన్. ఇన్నయ్య, "ఆంధ్రలో స్వాతంత్ర్య సమరం" హైదరాబాదు, 1972, పేజీ. 67-70).

17. కొండా వెంకటప్పయ్య (1856-1949); బందరు జాతీయ కళాశాల స్థాపకుడు. 1900లో కృష్ణా పత్రికను స్థాపించారు. 1916లో ఆంధ్ర మహాసభ ద్వారా ఆంధ్ర రాష్ట్ర నిర్మాణానికి కృషిచేశారు. గుంటూరు జిల్లా కాంగ్రెస్ అధ్యక్షులుగాను, ఆంధ్ర కాంగ్రెస్ సంఘ కార్యదర్శిగాను ఉన్నారు. 1921లో ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్షులు. 1929-30లో ఆంధ్రలో గాంధీజీతో తిరిగి ఖద్దరు నిధి వసూలు చేశారు.

దగా అని చెబుతున్నాడు. ఇంత గొప్పవాళ్ళు జాతీయోద్యమంలోకి వస్తున్నారంటే ఇంకేం కావాలి?

సుందరానికి ఉపన్యాసాలన్నీ అర్థం కాకపోయినా వాటిని ఎంతో భక్తితో విన్నాడు. ఇంత వైభవంగా ప్రారంభమైన ఈ స్కూల్లో చేరకుండా ఇంగ్లీషు వాళ్ళకు ఎదురుతిరగలేని ఆ పాతస్కూల్లో చదవటం ఘోరమైన తప్పు, పిరికితనం. గాంధీకీ, దుగ్గిరాల గోపాలకృష్ణయ్యకూ, కొండా వెంకటప్పయ్యకూ మిగిలిన వాళ్ళకూ కూడా ఎంతో అన్యాయం!

"ఏంరా, పీయెన్నార్? మనం కూడా రేపటినుంచీ ఈ జాతీయ విద్యాలయంలో చేరదాం?" అన్నాడు సుందరం.

నాగేశ్వరరావు అట్టే ఉత్సాహం కనబరచలేదు.

"ఈ క్రొత్తబడి నాలుగు కాలాలపాటు నడిస్తే అప్పుడు చూడొచ్చు లెమ్మన్నాడ్రా మా నాన్న" అన్నాడు వాడు.

అది కూడా బాగానే వుందనుకున్నాడు సుందరం. ఒక బడి సాగదేమో? అనే ఆలోచన వాడికి రానేలేదు. ఒకవేళ ఈ బడి ఎట్లాగూ సాగుతుంది. అటువంటప్పుడు ఎప్పుడు చేరితేనేం? ఈ విధంగా వాడు తన అంతరాత్మను సమాధాన పరచుకున్నాడు.

కాని నాగేశ్వర్రావు అన్న శ్రీరామ్మూర్తి మాత్రం తండ్రి సలహా వినిపించుకోకుండా బడి మానేశాడు లేకపోతే అతను ఆయేడు స్కూలు ఫైనలు పాసై ఉండవలసింది.

పికెటింగు హడావుడి తగ్గి మళ్ళీ స్కూలు యథాప్రకారం నడవటం ఆరంభించేసరికి సుందరం క్లాసులో వాళ్ళు ముగ్గురు నలుగురు చదువు చాలించినట్లు తెలిసింది. అందులో ఒకడు సుందరానికి కనపడి, తాను ఇకముందు తన స్వగ్రామం వెళ్ళి సంస్కృతం చదవబోతున్నానని చెప్పాడు. వాడికేం? వాడికి బోలెడంత ఆస్తి ఉంది. చదువుకున్నా వాడు ఉద్యోగం చెయ్యడు.

రోజులు గడుస్తున్నాయి. దాదాపు రోజూ ఊళ్ళో దుగ్గిరాల గోపాలకృష్ణయ్య ఉపన్యాసాలిస్తూనే ఉన్నాడు. సుందరం వాటికోసం పోతూనే ఉన్నాడు. ఏవో సరదా కబుర్లు చెబుతాడు గోపాలకృష్ణయ్య. "... అబ్బాయిలూ శ్రీకృష్ణపరమాత్మ అర్జునుడికి భగవద్గీత చెప్పినట్టు నేనూ చెబుదును. కాని ఇప్పుడు టైములేదు. అందుచేత నేను మీకు చెప్పేదల్లా ఏమంటే – ఇది పాత ఉద్యమాలల్లే ఆగేదికాదు. ఈ సారి స్వరాజ్యం తెచ్చామన్నమాటే... మీరు ఈ దేశద్రోహకరమైన చదువు మానేసి నిజమైన జాతీయవిద్య నేర్చుకోండి..."

కొంతకాలం గడిచింది.

ఒకనాటి సాయంకాలం సుందరం, నాగేశ్వర్రావూ జాతీయ విద్యాలయం మీదుగా పెద్దబజారుపోతూ లోపలికి వెళ్ళారు. సుందరానికి పెద్ద ఆశాభంగమయింది. పందిరి లేదు. జనంలేరు. పెళ్ళిల్లు కళలేదు. అది నిజంగా జాతీయవిద్యాలయం

తప్పుకాదు. అయినా సుందరాని కదేదో లోపంగా కనిపించింది. విద్యాలయంలో ఏడెనిమిది మంది విద్యార్థులు మాత్రమే కనిపించారు. ఇద్దరు ముగ్గురు రాట్నాల మీద నూలు తీస్తున్నారు. ఒకడు ఏకులు చేస్తున్నాడు. ఇంకొకడు నవారు నేస్తున్నాడు. మిగిలినవాళ్ళు తాటాకు చాపలమీద గోడకు చేరగిలబడి కూర్చున్నారు. ఒక్క మేష్టరూ కనిపించలేదు. హైస్కూలునుంచి వచ్చి చేరిన ఇద్దరు మేష్టర్లలోనూ ఒకాయన మాత్రమే ఇంకా పనిచేస్తున్నాడనీ, రెండో ఆయనా పై నుంచి వచ్చిన మరి ఇద్దరు మేష్టర్లు సరిగా రావటంలేదనీ జాతీయ విద్యాలయానికి డబ్బులేదనీ తెలిసింది.

## 13

శేషగిరి మామయ్య వచ్చాడు. ఆయన వేషమంతా మారిపోయింది. మామూలుగా ఉండే ఉద్యోగి అవతారమే లేదు. ముతక ఖద్దరు బట్టలు వేసుకున్నాడు.

"ఉద్యోగం మానేశానమ్మా!" అన్నాడు శేషగిరి సీతమ్మగారితో.

"అయ్యో అదేమిట్రా?" అన్నదావిడ.

"ఆc. ఎవరుచేస్తారు బాడఖోపని? దేశంకన్నానా? అందుట్లోనూ గవర్నమెంటు ఉద్యోగం!"

"అందరూ చెయ్యటంలా? కాకపోయినా స్వరాజ్యం అయిపోయిందిటగా?" అన్నది సీతమ్మగారు.

శేషగిరి పెద్దగానవ్వి, "స్వరాజ్యం అయిపోవటమేమిటి? అది వచ్చేదాకా ఈ కొరివి చల్లారుతుందా? రావణాసురుడి కాష్టంకాదూ? అదేమో నిమిషాలమీద వచ్చేదనుకున్నవాళ్ళు జావకారిపోయారు. గాని ఈ ఉద్యమం అయిపోవటమంటూ ఉండదు. ఇకముందు దేశాన్ని ఎట్లా నడిపిస్తాడో ఆ మహాత్ముడిమీద ఆధారపడి వుంది. మనం ఆయన చెప్పినట్టు చెయ్యవలసిందే" అన్నాడు.

"ఏముందీ చెయ్యటానికీ?"

"ఏం లేకేం? ఇంటింటా రాట్నం తిరగాలి. ఊరూరా జాతీయ విద్యాలయం నడవాలి. అస్పృశ్యత పోవాలి. జనమంతా ఏకంకావాలి. నలభైకోట్ల గొంతులూ "వందేమాతరం! మందే రాజ్యం!" అని అరిస్తే స్వరాజ్యం వస్తుందా, దానితల్లో జేజ కూడా వస్తుందా!" అన్నాడు శేషగిరి.

ఆ తరవాత తాను వచ్చిన పనికూడా చెప్పాడు. ఇంకోవారంరోజుల్లో తానూ, మరికొందరూ చేరి జాతీయ విద్యాలయం నెలకొల్పుతున్నారు వాళ్ళ ఊళ్ళో. దానికి సీతమ్మగారూ, పిల్లలూ రావాలి.

సీతమ్మగారు ముక్కుమీద వేలేసుకుంది. తన అన్న తన జీవితంలో ఎంత పెద్దమార్పు తెచ్చి పెట్టుకుంటున్నాడో ఆవిడకి కొంచెం కొంచెంగా అర్థంకాసాగింది.

ఈ పరిణామం ఎక్కడికి దారితీసేదీ ఆమె ఊహించుకోలేకపోయింది. శేషగిరి ఇల్లు దర్జాగా ఉద్యోగస్తుడి ఇల్లల్లే ఉండేది. ఆ కళ ఇక ముందుంటుందా? ఎట్లా ఉంటుంది? ఎవరో శపించినట్టుగా ఆయన ఎందుకీ పనులు చేస్తున్నాడు.

డిసెంబరు శలవలు గనక సుందరం చదువు చెడుతుందన్న భయం లేదు. సీతమ్మగారూ, సుందరం, వాడి చెల్లెలు జానకీ కలిసి శేషగిరి వెంట వెళ్ళారు.

సీతమ్మ పుట్టింటివారి గ్రామం చాలా చిన్నది. అంతాచేరి రెండొందలగడప. పెద్దకాలవ కిందనే ఉన్నది గనక ఊరుచుట్టూ సుక్షేత్రమయిన మాగాణి భూములు. ఊరికి నాలుగు మిద్దెలున్నాయి. మిగిలినవాటిలో సగం పెంకుటిళ్ళూ, సగం పూరిళ్ళూనూ. ఊరికి తగ్గట్టు పశుసంపదకూడా ఉన్నది. సుభిక్షమైన గ్రామాల్లో ఇదొకటి అయినప్పటికీ ఈ ఊరి కింతవరకు ఒక ఆసుపత్రిగాని, బడిగాని, లైబ్రరీగాని లేదు. ఇటీవలనే ఊరికి దినపత్రిక రావటం, నలుగురూచేరి పత్రికాపఠనం చెయ్యడం ప్రారంభమైంది.

సీతమ్మ పెత్తండ్రిగారు ఏనాడో ఒక సత్రం కట్టించాడు. కాని ఆ వూళ్ళో సత్రం అంటే ఉపయోగకరమైనదిగాదు. రహదారి ఊరికి అయిదారు ఫర్లాంగుల దూరంలో వుంది. దానినుంచి వూళ్ళోకి ఒక కంకరరోడ్డు వూళ్ళోవాళ్ళే వేసుకున్నారు. అది వూళ్లోవాళ్ళకూ, వారిని వచ్చి చూసేవాళ్ళకూ మాత్రమే ఉపయోగపడుతుంది. అందువల్ల సత్రానికి తాకిడేమీ లేదు - ఎప్పుడన్నా పెళ్ళి విడిదిగా ఉపయోగపడటం తప్పిస్తే.

ఊరిమధ్య చెరువుగట్టున వున్న ఈ సత్రంలో శేషగిరీ, వూళ్లోగల ఇతర విద్యావంతులూ, ధనవంతులైన ఆసాములూ చేరి ఒక లైబ్రరీ, జాతీయ విద్యాలయమూ పెట్టాలని నిర్ణయించారు. ప్రేరేపణ శేషగిరిదే, దీనికి ఊళ్ళోవున్న భజనల మందిరంవాళ్ళు అభ్యంతరం చెప్పారు. (వాళ్ళు ప్రతీ శనివారమూ అక్కడ భజన చేస్తూ ఉంటారు) అయితే వాళ్ళ అభ్యంతరాలను పెద్దవాళ్ళు సాగనివ్వలేదు. భజన మీద పెద్దవాళ్ళకు విశ్వాసం పోయింది. మామూలు మనుష్యులకు ఇంకా పోలేదు. గనక శనివారం భజన సత్రం లైబ్రరీలోనే జరగవచ్చునన్నారు.

శేషగిరికిప్పుడు వూళ్ళో మిద్దెతప్ప చెప్పుకునే సంపద అంటే లేకపోయినప్పటికీ మూడు తరాలుగా వస్తున్న పెద్దరికానికిమాత్రం ఏలోపమూ లేదు. అదివరకల్లా ఆయన ఎక్కడెక్కడో ఉద్యోగం చేసుకుంటుంటే పరాయివాణ్నిగా భావించిన గ్రామస్తులు తిరిగి ఆయన గ్రామములో కాపరం పెట్టగానే అప్పుణ్ణిగా స్వీకరించారు. శేషగిరి తమ గ్రామాన్ని ఎంతో పైకి తీసుకురానున్నాడని కూడా వాళ్ళు అర్థం చేసుకున్నారు.

శేషగిరికి తోడుగా వకీలు సీతారామయ్యకూడా వున్నాడు. జాతీయ విద్యాస్థాపనకూ, లైబ్రరీకి ఆయనకూడా అయిదువందలిచ్చాడు. సీతారామయ్యా ఈ గ్రామంవాడే కాని ఆయన బస్తీలో ప్లీడరు వృత్తిలో పాతుకుపోయినాడు. శేషగిరితో కలిసి ఈ పనిచేస్తున్న మిగిలిన నలుగురైదుగురూ గ్రామంలోని మోతుబర్లు. వాళ్ళు

విద్యావంతులు కారు. శేషగిరి చెప్పినమాట శిరసావహించేవారే. అంచేత ఈ ఉద్యమంలో శేషగిరి గ్రామానికి ఏకైక నాయకుడైపోయినాడు.

   

సుందరం ఈగ్రామానికి వెనక ఒక్కసారే వచ్చాడు. అదికూడా చాలా చిన్నతనంలో, అయినా వూరు కళ్ళకు కట్టినట్టేవుంది. దీనికి కారణం ఇన్ని ఏళ్ళలోనూ గ్రామంలో ఆవగింజంతైనా మార్పులేకపోవటమే.

శేషగిరి భార్య కామేశ్వరి జానకిని చూసి ముందు గుర్తుపట్టలేదు. తరవాత ఆశ్చర్యపోయి "ఓసీ, ఎంత పెద్దదానివైనావే?" అన్నది. సుందరం కృష్ణవేణిని గుర్తించలేదు. తల్లి జ్ఞాపకం చేసిన తరవాత దాన్ని పలకరించటానికి కాస్సేపు బిడియపడ్డాడు.

"ఏంరా, నీ పెళ్ళాన్ని చూసుకున్నావా?" అన్నది కామేశ్వరత్తయ్య.

"ఛాః!" అన్నాడు సుందరం.

ఆ సమయంలో వాడికొకమాట జ్ఞాపకం వచ్చింది. తనక్లాసులో తన ఈడువాడే పన్నెండోయేడు జరుగుతున్నవాడు ఒకడున్నాడు. వాడి కప్పుడే పెళ్ళయి ఏడాది అయింది. పెళ్ళానికి తొమ్మిదోయేడు! వాణ్ణి చూస్తే సుందరానికి ఏమిటో దిగులుగా వుండేది.

నరుసు మాత్రం పది నిమిషాలసేపు బెట్టుగావుండి చివరకు తనంతటతనే జానకితో స్నేహం చేసుకుని దాన్ని అవతలింట్లోకి తీసుకుపోయి తనకు రాట్నం మీద నూలు వడకటం ఎంత చాతవునో చూపించసాగాడు. జానకి కెవ్వున ఏడిచేదాకా ఈ సంగతి ఎవరూ గమనించలేదు. తిరిగే కదురు మొనమీద జానకి వేలు పెట్టింది జానకి ఏడుస్తుంటే నరుసు బిక్కమొహం వేశాడు.

"పిల్లలిద్దరి చదువూ మానిపించారుగదా!" అన్నది కామేశ్వరి. "నరుసు యింకా రెండేళ్ళకల్లా స్కూలుఫైనలు పేసు కావలసినవాడు. ఇదేమిటండీ అంటే స్వరాజ్యం వచ్చేదాకా ఈ చదువెందుకే? అంటారు. ఆడపిల్ల చదివేదేమిటి? ఈ స్వరాజ్యం వచ్చేదెప్పుడో, వాడు కొత్త చదువు నేర్చుకునేదెప్పుడో? ప్రస్తుతం ఈ గంతలు మొయ్యలేక చస్తున్నాం. నేనూ, పిల్లలూను."

"ఈ పెట్టే బళ్ళో వాడికి చదువుండదా ఏం?" అన్నది సీతమ్మగారు.

"నయం! ఇప్పుడు మూడు క్లాసులు పెడుతున్నారు. మేష్టర్లు కావద్దా? అదీగాక ఈ కొత్త చదువు పెద్ద క్లాసులదాకా రావద్దా? ఈ స్వరాజ్యం బళ్ళలో చెప్పే చదువు వేరుగా మరీ!"

సీతమ్మగారికి "స్వరాజ్యం చదువు"[18] అంతు చిక్కలేదు. నిజాని కావిడకు హైస్కూలు చదువు గురించికూడా తెలీదు. కాని దాన్నిగురించి తెలీకుండానే దానియందావిడకు విశ్వాసం ఉన్నది. ఆ చదువు చదివి తన కొడుకు పరీక్షలు

18. స్వరాజ్యం చదువు: చూ. జాతీయ విద్యాలయం. పే 71.

పాసయినట్టూ, డిగ్రీలు పొందినట్టు, చదువుకున్నవాడుగా అందరిచేతా గుర్తించబడినట్టు, పెద్ద ఉద్యోగాలు సంపాదించినట్టూ సీతమ్మగారు ఊహించుకో గలిగింది. కాని ఈ స్వరాజ్యం చదువుమాట? దాన్ని గురించి శేషగిరి చాలా చెప్పాడు.

"ఇప్పుడు మన పిల్లలు చదువుకునే చదువు ఎందుకైనా పనికొస్తుందా? వీళ్ళకి తెలుగు రాదు. తెలుగు పుస్తకాలు చదవరు. తెలుగులో గొప్ప కవులెవరో, ఏం చేశారో ఎరగరు. పదిహేనేళ్లు చచ్చేట్టు ఇంగ్లీషు భాషా, ఇంగ్లీషు పుస్తకాలూ, ఇంగ్లీషు కవిత్వమూ చదువుతారు. చదివి ఏమన్నా చెయ్యటానికుందా? ఒక వృత్తి విద్య వుందా? ఏమీ లేదు. ట్రెయినింగయితేగాని మేష్టరీ రాదు. 'లం' చదివితేగాని ప్లీడరీ లేదు. ఇంజనీరింగూ, వైద్యమూ వేరే చదవాలిసిందేగదా! నూటికి ఒకడు కూడా ఉద్యోగాలు చెయ్యడు. చాలామంది వృత్తులు చేసుకుంటారు. వ్యవసాయం, వడ్రంగం, కుండలూ, కూజాలూ చెయ్యటం, నేయటం, నగలు చెయ్యటం మొదలయినవి నేర్పేటందు కెక్కడన్నా ఒక్క బడి వుందా? లేదు. ఈ బళ్ళలో ఎవరికీ పనికిరాని చదువు నేర్పుతారు గనకనే మనదేశంలో చదువింత తక్కువ. మనజాతిని నిర్జీవం చేసి, ఎందునా కాకుండా చెయ్యటానికే ఇంగ్లీషువారీ చదువుప్రవేశపెట్టారు. పై పెచ్చు 'దేశ చరిత్ర' అని పేరుబెట్టి అబద్ధాలు రాశారు. బ్రిటీషువాళ్ళను ఎదిరించిన మన రాజులనందర్నీ వొఠ్ఠి దుర్మార్గులుగానూ, బ్రిటీషువారికి సాయపడ్డ అధములందర్నీ చాలా గొప్పవాళ్ళుగానూ చరిత్రలో రాశారు. మన కర్మ గాలితే మనం దేశ భక్తి చూపించాలంటే దేశద్రోహులనందర్నీ ఆరాధించాలిసిన గతి పట్టింది యీ పాపిష్టి చదువువల్ల."

తన ఈ ఉపన్యాసాన్ని ఆడవాళ్ళూ, పిల్లలూ ఎంతవరకు అర్థంచేసుకున్నారో శేషగిరికి తెలీదుగాని. అయన మాత్రం ఇప్పట్నుంచే ఉపన్యాసానికి తయారు తింటున్నాడు.

❀ ❀ ❀ ❀

మామూలుగా పెళ్ళిళ్లకూ, వడుగులకూ, శోభనాలకూ పెట్టినట్టుగానే జాతీయ విద్యాలయానికి పంచాంగం చూసి ముహూర్తం పెట్టారు. సత్రానికి సున్నం వేసి, తోరణాలూ, రంగు కాగితాల తోరణాలూ కట్టారు. సన్నాయి పెట్టారు. శేషగిరీ, కామేశ్వరీ పీటల మీద కూచుని మంత్రోక్తంగా విద్యాలయ ప్రారంభం చేశారు. అప్పుడే విద్యాలయానికి పన్నెండుమంది పిల్లలూ, ఒక మేష్టారూ ఏర్పడ్డారు. తరవాత బీదకీ బిక్కికీ అన్నదానం జరిగింది.

సాయంకాలం గ్రంథాలయం ప్రారంభోత్సవమూ, బహిరంగసభా.

సుందరానికి ఇదంతా చూస్తుంటే ఏదో పెద్దయెత్తున జరుగుతున్నట్టూ అందులో తానుగూడా పాల్గొని అలిసిపోతున్నట్టూ అనిపించింది.

సాయంకాలపు సభకు దాదాపు ఊళ్ళోవాళ్లు వచ్చారు. ఊళ్ళోవాళ్ళూ, పైవాళ్ళూ కూడా వచ్చి మాట్లాడారు. శేషగిరి జాతీయ విద్యను గురించి ఇంట్లో ఇచ్చిన ఉపన్యాసమే మరింతసేపు యిచ్చాడు. మిగిలినవాళ్లు శేషగిరి త్యాగాన్నీ,

దీక్షనూ, కృషినీ ప్రశంసించారు. ఒక్కొక్క ఉపన్యాసకుడూ తన మామయ్యను మెచ్చుకుంటున్నకొద్దీ ఆయనలో తనకు తెలియని గొప్పతనం కనిపిస్తున్నట్టుగా తోచి సుందరం అయిదునిమిషాలకొకసారి శేషగిరి మొహంకేసి చూడసాగాడు. కాని శేషగిరి ఇదంతా వినిపించుకున్నట్టులేదు. హడావిడిగా తిరుగుతూ ఎవరెవరితోనో ఏమేమిటో మాట్లాడుతున్నాడు క్షణం తీరకుండా.

ఆ మర్నాడు విదేశీ వస్త్ర దహనం. శేషగిరి భార్యకు చాలా ఖరీదైన చీరెలున్నాయి. శేషగిరికి ఖరీదైన కోట్లూ, మల్లుపంచెలూ వున్నాయి. వీటన్నిటినీ తగల బెట్టాలనేసరికి కామేశ్వరి కంటనీరు పెట్టింది. సీతమ్మగారిక్కూడా యిది చాలా అఘాయిత్యంగా కనిపించింది.

"అదేమిట్రా చక్కని బట్టలు తగలేసుకోవటం? పోతే మళ్ళీ వస్తాయా? ఎంతేసి డబ్బుపోసి కొనుక్కున్నవో గదా! మీరు కట్టుకోకపోతే పెట్టెలో దాచి ఉంచండి. లేదూ, ఎవరికన్నా ఇవ్వండి" అన్నది సీతమ్మగారు.

"భ్రమ! కేవలం వ్యామోహం! మహాత్ముడేమన్నాడు? కుళ్ళిపోయిన పండని ఇంకొకరికిస్తామా? చాలా తప్పు. కల్మషం. దీన్ని దహించవలసిందే. అప్పుడుగాని మన ఆత్మల్లో అంటిపెట్టుకున్న స్వార్థం కడిగేసుకుపోదు" అన్నాడు శేషగిరి.

ఇంకా చాలామంది ఇళ్ళనుంచి విదేశవస్త్రాలు వచ్చాయి. అన్నిటినీ చెరువుగట్టున పోగేశారు. బీదాబిక్కీ వచ్చి కాస్సేపు మొరపెట్టుకున్నారు తమకేమన్నా ఇప్పించమని. కాని ఆ వస్త్రాలు దగ్ధమై తీరాలిసిందే. దగ్ధమే అయాయి. ఆ మంటలు చూస్తున్న సుందరానికి జాతీయోద్యమమంటే ఏదో వికారభావం కలిగింది. "ఇది తప్పు! దారుణం! అన్యాయం!" అని వాడి అంతరాత్మ చెప్పసాగింది. ఈ మాటలే ఊళ్ళో చాలామంది నోట ధ్వనించాయి.

జాతీయ విద్యాలయం - అందరూ పిలిచేది "స్వరాజ్యం బడి" - గురించి చిక్కులు ఆరంభమయాయి. అందులోకి అస్పృశ్యులను చేర్చుకోవాలా వద్దా? అనే విషయం ఇళ్ళల్లోనూ, అరుగులమీదా, సత్రంలోనూ ఆఖరుకు శేషగిరి మేడమీదా మీటింగులు జరిగాయి.

"ఇందులోకి ఈ అస్పృశ్యులను ఎందుకు తెస్తావు శేషగిరీ? వాళ్ళ సంగతి తరవాత చూద్దాం. వాళ్ళకు కావాలంటే వేరేబడి పెడదాం. ఇందులోకి వాళ్ళని చేర్చకు."

శేషగిరికి ఇది ఆదర్శపతనంగా కనిపించింది.

"ఇంకా స్పృశ్యులూ, అస్పృశ్యులూ ఏమిటి? అంతా గాంధీమయమై పోతుంటేనూ? అంతా గాంధీమయం! జగమంతా గాంధీమయం."

"అయితే వద్దన్నదెవరూ? ఇప్పుడు మనం అస్పృశ్యుల్ని తెచ్చి పెట్టామో, సంసార్ల పిల్లలు ఒక్కరు చేరరు. కార్యవాదం కావాలి. మనం ఏ పరిస్థితి రావాలని కోరుతున్నామో అది వచ్చేసినట్టే పనిసాగిస్తే మొదలుకే చెడుతుంది."

ఈ వాదాన్ని సమర్థిస్తూ నలుగురూ నాలుగు మాటలు మాట్లాడారు.

"సంస్కారం మెల్లిగా వస్తుంది. తొందర పడరాదు."

"అసలే ప్రజలలో ఇంకా జాతీయోద్యమం నాటుకోలేదు. పంచములు లేకపోయినా పిల్లలు వచ్చేట్టు లేరు. ఈ ఊళ్ళోవాళ్ళకు యే చదువూ ఇష్టంలేదు."

"ఇప్పుడే అస్పృశ్యులు చదువుకావాలని ఏడుస్తున్నారా ఏమిటి? ఏమిటో! ఉట్టిపుణ్యానికి లేని కలతలు తెప్పించటంగాని?"

శేషగిరి అందర్నీ కోప్పడ్డాడు. సంకుచితత్వం విడవకపోతే దేశాన్ని ఉద్ధరించలేమన్నాడు. మార్పుకు జడిస్తే ఎప్పటి పరిస్థితులకు భిన్నం ఉండదన్నాడు. పంచముల్ని చేర్చుకోకుండా ఉండటానికి ఒప్పుకున్నాడు. అందరూ తృప్తిపడి వెళ్ళిపోయినారు.

శేషగిరి సీతమ్మగారినీ పిల్లల్నీ ఇంటి దగ్గర దిగవిడిచాడు. తన అన్న గృహ జీవితంలో కలిగిన గొప్ప మార్పును గురించి ఆవిడ ఇరుగుపొరుగువాళ్ళతో ఈ విధంగా చెప్పింది.

"ఇదెందుకొచ్చిందోగాని మా అన్నయ్య మాత్రం వొట్టిప్పిచ్చివాడల్లే అయిపోయినాడు. తెల్లారి లేచింది మొదలు పడుకోపోయేదాకా గాంధీ గొడవా, స్వరాజ్యం గొడవానూ! శుచీ, ఆచారంలేదు కొంపలో. ఇంట్లో ఎక్కడచూసినా గోనెపట్టాలల్లే ఈ ఖద్దరు బట్టలే. మడికీ అవే, మైలకూ అవే. బయట తిరగటానికిపోయి ఆ గుడ్డతోనే అన్నాని క్కూచుంటాడు మా అన్నయ్య. నానా అయోమయంగానూ ఉంది. ఉద్యోగం మానేశాడుగదా! పిల్లాడి చదువుకాస్తా పోయింది! ఏం కానుందో ఏమో!"

❀ ❀ ❀ ❀

సహాయ నిరాకరణోద్యమంలో శేషగిరి ఆరునెల్లపాటు జైలుశిక్ష అనుభవించాడు. ఆయన జైల్లోవున్న కాలంలో సీతమ్మగారు పిల్లలతో వదినెగారిని చూడవెళ్ళింది. కామేశ్వరి, వకీలు సీతారామయ్యను బాగా తిట్టిపోసింది.

"ఈయనకు ఈ పాడు ఆలోచనలన్నీ ఆ సీతారామయ్యే పెట్టాడు. చివరకు జైలుకు వెళ్ళాలిసొచ్చేటప్పటికి ఈయన ఒక్కరే అయినాడు. ఆయన తన ప్లీడరీ చేసుకుంటూ హాయిగా ఠింగురంగా అని కూచున్నాడు. ఆయన ఉద్యోగం ఒకరు తీసేసేదా, రాజీనామా ఇచ్చేదా? మాకివి శనిరోజులు వదినా. నానా అగచాట్లూ పడుతున్నాం. పిల్లకేమిటిగాని, నరుసు బొత్తిగా చెడిపోతున్నాడు. ఎంత చక్కగా చదువుకునేవాడు. బీడీలు కాలుస్తూ గొడ్లగాసే పిల్లలతో తిరుగుతున్నాడు. వాడికిప్పుడు చదువు రంధేలేదు. ఎంతసేపటికి సంగీతాలూ, పద్యాలూ, పాటలూనూ, ఊళ్ళో పనిలేనివాళ్ళని పోగుచేశాడు. ఇప్పుడీయన నాటకాలాడతాట్ట. వాళ్ళనాన్న ఆడిన నాటకం చాలనట్టు. ఆ జైలుతిండి ఆయనకు పడలా. రక్తవిరేచనాలు పట్టుకున్నాయట. ఇరవైపౌన్లు తగ్గానని రాశారు. ముందేం కానుందా అని తలుచుకుంటే భయంగా వుంది" అని కామేశ్వరి కంటనీరు పెట్టుకున్నది.

సీతమ్మగారు వేదాంతం చెప్పింది. అంతా భగవంతుడి ఆధీనం. మనం దేనికీ కర్తలం కాం. ఎట్లా కావలిసుంటే అట్లా కాకమానదు.

తన అన్న కుటుంబానికి ఏదో కోరదగని పరిణామం జరుగుతున్నట్టూ తను ఎంతో అదృష్టవంతురాలు కావటంచేత తనకూ, తన పిల్లలకూ అది తప్పినట్టూ సీతమ్మగారు వూహించుకున్నది. అన్నకోసం విచారంతోబాటు ఈ సంతృప్తికూడా ఆవిడకు కలిగింది.

సుందరంకూడా తల్లినానుకుని కూచుని అత్తయ్య చెప్పిన మాటలన్నీ విన్నాడు. వాడికి మిగిలినవేవీ పట్టలేదుగాని, నరుసు విషయం చాలా విచారం కలిగించింది. ఇది వరకల్లా నరుసు తనకంటె రెండు క్లాసులు ముందున్నవాడు. ఇప్పుడు తనకన్న రెండుక్లాసులూ, మూడుక్లాసులూ, నాలుగు క్లాసులూ వెనకపడిపోతాడు. తను బియ్యే, ఎమ్మేకూడా పాసయిపోతాడు. నరుసు మాత్రం మూడోఫారం సహం చదివి మానేసినవాడుగానే ఉండిపోతాడు. ఈ ఆలోచనల వల్ల సుందరానికి ఆవగింజంతైనా సంతృప్తి కలగలేదు.

సీతమ్మగారూ పిల్లలూ చేరిన కొద్దిసేపటికి నరుసు యింటికి వచ్చాడు.

"ఏంరా, ఎప్పుడొచ్చారు?" అన్నాడు నరుసు.

కిందటిసారికీ ఇప్పటికి వాడు చాలా మారిపోయినాడు. వెనుకటి బెట్టులేదు. చాలా రోజులకు సుందరాన్ని చూసిన ఆశ్చర్యంలేదు.

"ఇంతకుముందే వచ్చాం" అన్నాడు సుందరం తనకన్న చాలా పెద్దవాడితో మాట్లాడినట్లుగా. నిజానికి నరుసుకు వయసులాంటి దేదో వచ్చింది.

"రా, మేడమెట్లమీదికి పోదాం" అంటూ నరుసు మేడమెట్లమీదికి వెళ్ళాడు. నరుసు తనను ఆజ్ఞాపించినట్టే భావించుకుని సుందరం పైకి వెళ్లాడు.

మేడమీద నాలుగు మంచాలూ, వడ్లబస్తాలూ తప్ప ఇంకేమీలేవు, నేలమీద చాప పరిచివుంది. దానిమీద హార్మోనియం ఒకటి పెట్టివుంది.

మేడమీది డాబాలో ఒకమూల ఆరుబయట రాట్నం పడిఉన్నది.

"నూలు తియ్యటంలేదా?" అన్నాడు సుందరం.

"ఎన్నాళ్ళయిందో నూలుతీసి?... పాడనా? వింటావా? అయితే అట్లా కూచుని తిత్తిపొయ్యి."

నరుసు మాటల ధోరణీ, వాలకమూ, అంతా మారిపోయింది. వాడిమీద పల్లెటూరి ముద్ర బాగా పడింది.

సుందరం గాలిపోస్తుంటే నరుసు రెండుచేతులా హార్మోనియం వాయిస్తూ నాటకాల్లో పద్యాలు – హరిశ్చంద్ర[19]లోవీ, చిత్రనళీయం[20]లోవీ, గయోపాఖ్యానం[21] లోవీ పాడాడు.

---

19. హరిశ్చంద్ర: బలిజేపల్లి లక్ష్మీకాంత కవి (1881-1953) రచించిన నాటకం.
20. చిత్రనళీయం: ధర్మవరపు రామకృష్ణమాచార్యులు (1853-1912) రచించిన నాటకం.
21. గయోపాఖ్యానం: చిలకమర్తి లక్ష్మీనరసింహం (1867-1946) రచించిన నాటకం.

"నీకు రాగాలు తెలుసా?" అన్నాడు నరుసు. సుందరానికి తెలీదు. నరుసు పాట సుందరం చెవులకు చాలా గొప్పగా ఉన్నది. నాటకంలో వాళ్ళు పాడినట్టుగానే ఉన్నది.

"ఎవరుమాత్రం ఇంతకన్న బాగా ఎట్లాపాడతారు? ఎంతబాగా నేర్చుకున్నావురా? ఈ హార్మోనియం వాయించటం ఎట్లా వచ్చిందీ?" అన్నాడు సుందరం.

నరుసు సంతోషించాడు. సుందరం తనను మనస్ఫూర్తిగా మెచ్చుకుంటున్నట్టు వాడు గ్రహించాడు.

"వెధవ అరుమోనియం వాయించటానికి నేర్చుకోవాలికూడానా? ఇంకా పాటన్నావ్? అది చాలా నేర్చుకోవాలి. వచ్చేయేడు చూసుకో ఎట్లా పాడతానో. నాటక బృందం ఒకటి తయారు చేస్తున్నాలే. మానమాట వినే పిల్లకాయలున్నారు" అన్నాడు నరుసు.

నరుసు మాట్లాడుతుంటే వాడు ఎవరినో ఎందుకో అపహాస్యం చేస్తున్నట్టు సుందరానికి తోచింది. తననుచూసి తానే నవ్వుకుంటున్నాడేమో కూడా సుందరానికి తెలియలేదు. నిజానికి నరుసు మనఃప్రవృత్తి ఎట్లా పరిణమించిందీ ఊహించగల స్థితిలోలేదు సుందరం. నరుసు కివాళ దేనిమీదా పెద్ద విశ్వాసంలేదు. ఇప్పుడు వాడు తన ఆనందంకోసం తనలోనే వెతుక్కుంటున్నాడు. వాడిలోవున్న పట్టుదల ఇప్పుడు మామూలు మార్గాలు వదిలేసి కొత్త మార్గాలు పడుతున్నది. లేకపోతే కొద్ది మాసాలలో వాడు ఇంత సంగీత సాధన చేయటం సాధ్యంకాదు.

నరుసు ప్రయత్నాలలో ఇంకో విశేషంకూడా ఉన్నది. వాడిప్పుడు అచ్చగా తన విషయమే చూడటంలేదు. తన ఈడువాళ్ళని కూడగట్టి వాళ్ళందరితోనూ కలసి ఏదో చెయ్యాలని చూస్తున్నాడు – నాటకాలాడడమే కానీగాక!

సుందరం కార్యక్రమంలో పెద్ద పరీక్ష పాసుకావటమూ, పెద్ద ఉద్యోగాలు చెయ్యటమూ వంటివి ఉన్నాయిగాని, నలుగుర్నీ కూడగట్టి చేసే పని అందులో ఒక్కటీలేదు. అయితే యీ తేడా – సుందరం అర్థం చేసుకోలేదు. బహుశా నరుసుక్కూడా తనకూ సుందరానికి గల తేడా అర్థమైఉండదు. అయినా తాను చేస్తున్నపని వాడికి చాలా స్వాభావికంగా కనిపించింది. సుందరానికి మటుకు నిరర్థక మనిపించింది. నరుసు ఎంత పాటపాడి ఎన్ని నాటకాలాడించినా అవి మామూలు నాటకాల్లో ఉండవనీ, ఏదో పల్లెటూరి అమాయిక ప్రజలు వీధినాటకం చూసినట్టు చూసి సంతోషించటానికి మాత్రమే పనికివస్తాయనీ సుందరం నమ్మకం. ఈ నమ్మకాన్ని బయటపెట్టి సుందరం నరుసును నొప్పించలేదు.

నాలుగైదు రాగాలమీద పద్యాలుపాడి విశ్రాంతి తీసుకుంటూ, నరుసు జేబులోనుంచి బీడీతీసి అంటించాడు.

"నిజంగా బీడీలు కాలుస్తున్నావుట్రా?" అన్నాడు సుందరం ఆశ్చర్యంతో.

"ఆ మాత్రం ఉండాల్లే" అన్నాడు నరుసు. వాడి ఉద్దేశం సుందరానికి అర్థం కాలేదు.

"నువు పాడతావా ఏం? కాస్సేపు వాయిస్తా" అన్నాడు నరుసు.

"అబ్బే నాకేంరాదు" అన్నాడు సుందరం.

"ఏదో పాట రాకుండా ఉంటుందా ఏం? ఏమీ రాకపోతే అప్పనతనమనాపాడు."

సుందరానికి లోపలినుంచి ఏదో దడపుట్టింది. పాట వినటమంటే ఎంతో ఆసక్తికలవాడు కనక వాడికి కొన్ని పాటలు వచ్చినమాట నిజమే. కాని నరుసు తనను పాడమంటాడేమోనని సుందరం హడలిపోయినాడు.

నరుసు, వాడిధర్మమా అంటూ బలవంతం చెయ్యలేదు.

## 14

సెకండు ఫారంలోకి వచ్చినప్పటినుంచీ సుందరం క్లాసులో రాణించటంలేదు. అదివరకెన్నడూ వాడి "ప్లేసు" పది దాటేదిగాదు. ఇప్పుడు పదిహేను ఇరవై మధ్య ఉండటమేకాక, క్లాసులో తనకన్న చురుకైన వాళ్లూ, తెలివిగలవాళ్లూ చాలామంది ఉన్నట్టు వాడికి తోచసాగింది. దీనికి కారణమేమిటో వాడు చాలా రోజులు ఊహించలేకపోయినాడు.

"నాకీయేడు మంచిప్లేసు రావటం లేదమ్మా" అన్నాడు సుందరం, తన సమస్య ఆవిడేమో తీరుస్తుందన్నట్టు.

"నువు సరిగా చదవటంలేదు గామాలు! కాకపోయినా ఆ నాగేశ్వర్రావూ నువ్వూచేరి ఒకరి చదువు ఒకళ్ళు చెడగొట్టుకుంటున్నారు. ఒక్కడివీ చదివినప్పుడేనయం" అన్నది సీతమ్మగారు.

ఆవిడ నాగేశ్వర్రావుమీద తప్పు తోయడమూ, తమ స్నేహాన్ని కించపరచటమూ సుందరానికేమీ ఇష్టం లేకపోయింది. కాని "ప్లేసు" రావటం లేదన్న చింత అట్లాగే ఉండిపోయింది. "క్వార్టర్లీ" లోనూ, "హాఫియర్లీ" లోనూ ఈ చింత మరింతయింది. సుందరానికి పాసు మార్కులు వచ్చాయి పాసు మార్కులయితే మాత్రమేం!

"ఈ పరీక్షల్లోనే ఇట్లా మార్కులొస్తే అసలు పరీక్షల్లో పాసుకావడం ఎట్లారా?" అన్నాడు సుందరం నాగేశ్వర్రావుతో.

"నూటికి యాభైలూ, అరవైలూ ఎంతమందికి వచ్చాయో చూశావా" అన్నాడు నాగేశ్వర్రావు.

దీనికంతకూ కారణమేమిటో నాగేశ్వర్రావు అన్న చెప్పేదాకా వాళ్ళకు తెలియదు.

వాళ్ళ క్లాసు టీచరుకు ఇంటిదగ్గర వేరేబడి వుంది. అందులో నలభై మందిదాకా చదువుతారు. వాళ్ళల్లో సగానికి పైగా ఆయన క్లాసు పిల్లలే. బళ్ళోలాగే ఈ పిల్లలు ఆయనకు నెలకు రెండున్నర చొప్పున యిచ్చుకుంటారు. ప్రతి రాత్రీ

ఆయన ఒక గంటసేపు వాళ్ళచేత మర్నాటి పాఠాలు చదివిస్తాడు. తాను మర్నాడు క్లాసులో వెయ్యబోయే ప్రశ్నలూ, లెక్కలూ వాళ్ళకు చెప్పి నూరుతాడు. చాలామంది పిల్లలు క్లాసులో మంచి మార్కులు తెచ్చుకుంటారు. ఇంతనూరినా క్లాసులో తెల్లమొహాలు వేసే మొద్దులూ వున్నారు. ఆయనకు స్కూలు వాళ్ళు ఎంత జీతం ఇస్తారో అంతా ఆయన ప్రైవేట్లతో సంపాదిస్తాడు.

స్కూలు పిల్లలు కాక యితర విద్యార్థులు కూడా ఆయనదగ్గిర చదువుకుంటారు. వాళ్ళలో యెక్కువ భాగం ఏబీసీడీలు కూడా రాని మచ్చు. వాళ్ళేం చేస్తారంటే ఆయన దగ్గిరచేరి ఒక యేడాదిలో ఫస్టుఫారం స్టాండర్డుకు వస్తారు. రాకపోయినా యిబ్బందిలేదు. సెకండు ఫారంలోకి బయటి నుంచి వచ్చి చేరేవాళ్ళను చేర్చుకునేది ఆయనే గనక తన దగ్గర యేడాదీ అరునెల్లూ చదువుకున్నవాళ్ళని సెకండు ఫారంలో చేర్చుకుంటాడు. ఆయేడల్లా కూడా ఆయన వాళ్ళను తన ట్యూషన్‌కిందే ఉంచుకుంటాడు. సెకండు ఫారం ఆఖరు పరీక్షలు వచ్చే సమయానికి సెకండు ఫారం పరీక్ష పేపర్లు సెట్‌చేసే వాళ్ళలో వీలయినంత మందిని మంచి చేసుకుని వాళ్ళిచ్చే ప్రశ్నలు తెలుసుకుని తన ప్రైవేటు విద్యార్థులకు చెప్పి వాళ్ళు థర్డుఫారంలోకి తోసుకుపోవటానికి వీలయినంత వరకు చేస్తాడు. ఆ తరువాత వాళ్ళపాట్లు వాళ్ళుపడతారు.

ప్రతిరాత్రీ తొమ్మిది గంటలయేసరికల్లా లాంతర్లతో సహా, కప్పుకునే బట్టలతో సహా యీ పంతులు ఇంటికి తయారయే విద్యార్థుల తుగిడీలు చూడముచ్చటగా వుంటాయి.

ఈ సంగతులు కొంతవరకు సుందరం అదివరకు ఎరుగును. కాని క్లాసులో తాను ప్లేసు సంపాదించటానికీ, వీటికీ సంబంధం వున్నదని వాడికి తట్టలేదు.

❀ ❀ ❀ ❀

నాగేశ్వర్రావు అన్న యెక్కడినుంచో తెలుగు పుస్తకాలు తెచ్చేవాడు. చదువు కోటానికి కనపడిందల్లా చదివే అలవాటు సుందరానికున్నది. ఈ అలవాటు నాగేశ్వర్రావు సుందరం దగ్గిరే నేర్చుకున్నాడు. ఇద్దరూ కలిసి "కన్యాశుల్కం"[22] నాటకం చదవసాగారు. ఆ నాటకం మొదటి నుంచి చివరిదాకా వాళ్ళకు నవ్వొస్తూనే వుండేది. అందులోవున్న పాత్రలూ, శిల్పమూ, హాస్యపు లోతులూ వాళ్ళ కర్థంకాక పోయినా సంభాషణలు చాలా తమాషాగా, అచ్చగా మనుషులు మాట్లాడినట్లే వుండేవి. ఇదే వాళ్ళకు సహం నవ్వొచ్చేది. వీరేశలింగంగారి నాటకాలు కూడా వాళ్ళకు చిన్న చిన్న పుస్తకాలుగా దొరికాయి. ఆ మామూలు నాటకాలకు దగ్గిరగావున్నా అవి కూడా నవ్వొచ్చేవి

ఆధునిక సాహిత్యంతో సుందరానికిది తొలి పరిచయం. కాని దాని ప్రభావం వాడిమీద దాదాపు ఏమీ లేకపోయింది. ఆ పుస్తకాలు చదివినట్టే కొన్ని అపరాధ పరిశోధక నవలలూ, విదేశీ నవలల అనుకరణలూ కూడా సుందరం చదివి

22. కన్యాశుల్కం: గురజాడ రచించిన ఆధునిక తెలుగు మహానాటకం.

ఆనందించేవాడు. ముఖ్యంగా డిటెక్టివు నవలలు చదువుతుంటే ఎప్పటికీ విసుగెత్తేది కాదు.

శేషగిరి చిక్కి శల్యమై గుర్తించటానికి లేకుండా మారిపోయి జైలునుంచి విడుదలై ఇంటికిపోతూ కనిపించి వెళ్ళిన తరువాత సుందరం మనస్సులోనుంచి రాజకీయాలు పూర్తిగా మాయమై జీవితం మళ్ళీ యధాప్రకారమయింది. ఈ జీవితంలో ముఖ్యమైనవి స్కూలు విషయాలు, వినోదమైనవి సుందరం చదివే పుస్తకాలు, విద్దూరాలూ, సినిమాలు, సర్కసులూనూ.

ఎందుకంటే ఈ తరుణంలోనే సుందరం మొట్టమొదటిసారిగా నిజమైన మృగాల సర్కసు చూశాడు. సర్కసుకు పోవటానికి డబ్బులిమ్మంటే సీతమ్మగారు యెట్లాగూ ఇచ్చి వుండేదికాదు. కాని నాగేశ్వర్రావు ఇంట్లో అందరూ బయలుదేరుతూ సుందరాన్ని కూడా తీసుకువెళ్ళారు. మిగిలినవాళ్ళంతా ఏనుగులూ, గుర్రాలూ, పులులూ, సింహాలూ చూసి సంతోషించారు గాని, సుందరానికి ఆ "ఫీట్స్"లో వుండే స్వారస్యం అర్థంకాలేదు. ఆ ఫీట్సును గురించి ఎవరన్నా వర్ణిస్తే ఎంత తృప్తికలిగేదో చూస్తున్నా అంతే తృప్తికలిగింది. అన్ని ఫీట్సుకన్నా సర్కసు బఫూనులు వాడికి బాగా నచ్చారు. వాళ్ళను జ్ఞాపకం చేసుకుని వాడు చాలా రోజులపాటు నవ్వుకున్నాడు. అయినా, సర్కసు వెళ్ళిపోయిన తరవాత సుందరం యితర పిల్లలతోబాటు కర్రలకు పొడుగాటి తాళ్ళుకట్టి. సర్కసులో గుర్రాలు, ఏనుగులూ ఆడించేవాడల్లే తిరిగాడు.

ఈసారి సుందరం చూసిన సినిమా కూడా నిజమైన సినిమాయే. ఎలెక్ట్రిక్ దీపాలూ-వాటంతటవే వెలిగి ఆరేవి-వాడు చూడటం ఇదే మొదలు. ఈ సినిమాలో కథలున్నాయి-శ్రీరామ జననం, శ్రీకృష్ణ జననం, లంకాదహనం, మైరావణ, సతీ తులసీ, కంసవధ మొదలయినవి. తల్లిని ఎట్లాగో ఒప్పించో, నాగేశ్వర్రావుతో కలిసో, తల్లి తనకెప్పుడన్నా కొనుక్కోవటానికిచ్చే కాన్లు దాచో సుందరం చాలా సినిమాలు చూశాడు. వాడికవి "అద్భుతంగా" ఉండేవి. హాలులోకి పోయి కూర్చోటమే ఎంతో ఆనందంగా ఉండేది. రీలుకూ, రీలుకూ మధ్యలైట్లు వచ్చినప్పుడూ ముళ్ళమీద వున్నట్టుండేది. కథచెప్పేవా డొకడుండేవాడు. వాడు కథ చెప్పటంలో ప్రత్యేకత ఏమీ లేకపోయినా వాడిగొంతు వినిపిస్తుంటే పరమానందంగా వుండేది. వాడు అప్పుడల్లే వుండేవాడు. ఇటువంటి భావాలు అచ్చగా సుందరానికి ఒక్కడికే కలగలేదు. ఒక రోజు సుందరం మధ్యాహ్నం పూట స్కూలుకు పోతూండగా వాడితో వస్తున్న స్నేహితులు కొందరు ఒకళ్ళ నొకళ్ళు గిల్లుకుని "అదుగో, సినిమాల్లో కథచెప్పే శేషయ్య" అన్నారు. శేషయ్య కిల్లీ కొట్టు దగ్గిర నిలబడి బీడీలు కొంటున్నాడు.

❀ ❀ ❀ ❀

సెకండుఫారం పరీక్షలో సుందరం పాసయినాడు. మధ్య పరీక్షల్లో కొద్ది మార్కులే వచ్చినా ఈ ఆఖరు పరీక్షలో మామూలు ప్రకారం యాభైలూ, అరవైలూ వచ్చినై; లెక్కల్లోమటుకు ఎనభైకి పైగా వచ్చాయి. తన క్లాసుమేష్టరు తొమ్మిది

నెలలపాటు తనకు చేసిన అన్యాయాన్ని సుందరం పూర్తిగా గ్రహించనూ గ్రహించాడు. క్షమించనూ క్షమించాడు.

సుందరానికి తన క్లాసుమేష్టర్లని ద్వేషించటం ఎన్నడూ అలవాటులేదు. కాని మూడోఫారం మేష్టర్ని ఆరాధించటం మొదలుపెట్టాడు. అంతకు పూర్వం యే మేష్టరూ వాణ్ని అంతగా ఆకర్షించలేదు. ఆయన పాఠం చెబుతుంటే తన ఒక్కడికే చెబుతున్నట్లుగా వుండేది. ఆయన అచ్చగా పాఠం చెప్పటమేకాదు, చదవటంలోనూ, ఇతరులతో సరిగా ప్రవర్తించటంలోనూ ఆసక్తి పుట్టించేవాడు. పుస్తకాలలో అర్థం చేసుకునేవీ, అన్వయించుకునేవీ ఉంటాయని సుందరానికి తలకెక్కేటట్టు చేసినది ఈ మేష్టరే.

అయితే ఈ మేష్టరు మూడు నెల్లయినా ఉండక పూర్వమే ఆయనకు ఉద్వాసన చెప్పారు కమిటీవారు. ఈ కమిటీలో ఎక్కువమంది బ్రాహ్మలే. కాని అంతా నియోగులుకాదు. ఒకప్పుడు స్కూలును పైకి తీసుకు వచ్చిన వాళ్ళంతా పెద్ద స్థితిలో ఉండిన నియోగులే. అయితే రానురాను పెద్దలు దాటిపోయారు. స్కూలు వ్యవహారాలు నిర్వహించటానికి కొత్తకారు వచ్చింది. వీరిలో వైదీకులు ఎక్కువ వున్నారు. వైదిక రాజకీయాలు తెచ్చి పెట్టాలని వీరికి కలిగింది. ఈ కక్ష రాజకీయాలకు మొట్టమొదటగా బలి అయినది సుందరం క్లాసుమేష్టరు.

దీనితో ప్రారంభమైన మర్కట పరిపాలనలో కొత్తమేష్టర్లు రావటమూ, పోవటమూ, ఎంతో కాలంగా ఉన్న మేష్టర్లను పిచ్చిసాకుమీద పంపెయ్యటమూ ప్రారంభమయ్యాయి. సుందరం క్లాసుకువచ్చిన కొత్త మేష్టరు సుందరం దృష్టిలో వర్ఠి చవట. అంతమంచి మేష్టరును తీసేసి ఈయనను పెట్టినందుకు హైస్కూలు అధికారులపైన సుందరానికి చాలా అసహ్యం పుట్టుకొచ్చింది.

ఈ అసహ్యం కూడా సుందరానికి ఒక్కడికే కలగలేదు. అది పిల్లల మధ్య దానంతట అదే ఏర్పడింది. మేష్టర్ల మీద పిల్లలకు కలిగే సదభిప్రాయాలు, దురభిప్రాయాలూ కూడా ఇట్లాగే క్రమంగా ఒక స్వరూపానికి వస్తాయి. యీ అభిప్రాయాలు మొట్టమొదట ఒకడికే కలగవచ్చు. వాటికి ప్రచారం కూడా జరగవచ్చు. కాని వాటికి అంతో ఇంతో ఆధారం లేకపోతే అవి పిల్లలను పట్టుకోవు.

పిల్లలు చాలామంది మేష్టర్లకు మారుపేర్లు పెట్టారు. డైమన్ రాణి. సీమ సున్నం, విసనకర్ర, పొడుంచిప్ప, ఇత్యాది. సుందరం ఇటువంటి నామధేయాలను సాధారణంగా ఎన్నడూ తన నోటితో ఉచ్చరించేవాడుకాదు. ఇతరులు ఉచ్చరిస్తే కాదనే వాడూ కాదు. కాని తనకు మంచి మేష్టరని తోచినవాణ్ణి గురించి విసుగులేకుండా నలుగురిలోనూ ప్రచారం చేసేవాడు. ఇట్లా ప్రచారం చెయ్యటంలో ఒక్కొక్కప్పుడు సుందరానికి తన సదభిప్రాయం భ్రమ అనికూడా తెలిసేది.

తెలుగు మేష్టర్లంటే చులకనగా చూసే అలవాటుకూడా సుందరానికి లేదు. అయితే వాళ్ళు ఇతర మేష్టర్లల్లే పిల్లలను నిగ్రహించక వాళ్ళకెందుకు అలుసిస్తారో సుందరానికి తెలిసేదికాదు. సుందరానికి మూడోఫారంలో తెలుగు చెప్పిన శాస్తుర్లుగారు తెలుగు పుస్తకాలలో సుందరానికి ఆసక్తి కలిగించాడు. కాని ఈ ఆసక్తి

ఎందుకూ ఉపకరించలేదు. శాస్త్రుర్లుగారు గొప్పగా చెప్పిన తెలుగు పుస్తకాలు తనకు సులభంగా దొరికేవికావు. అయినప్పటికీ సుందరం మూడో ఫారం పూర్తిచేసిన తరవాత వేసవి శెలవుల్లో కుచేలోపాఖ్యానం టీకా తాత్పర్యం సహితం కొనుక్కొచ్చి అందులోవున్న పద్యాలన్నీ బట్టీపట్టి వాటి అర్థం తెలుసుకున్నాడు.

❀ ❀ ❀ ❀

ఈ శలవుల్లోనే సుందరం ఒంటరిగా తన మేనమామ ఊరు వెళ్ళాడు. తాము ఫలానా తారీఖున "హరిశ్చంద్ర" ఆడుతున్నామనీ సుందరం తప్పక వచ్చి చూడాలనీ నరుసు మరీ మరీ రాశాడు.

తను కోరిన ప్రకారం సుందరం వచ్చినందుకు నరుసు చాలా సంతోషించాడు. కొంతకాలం కిందట తాను గుంటూరు వెళ్ళి హరిప్రసాదరావు[23] "హరిశ్చంద్ర" చూసి వచ్చిన సంగతి అంతులేకుండా చెప్పాడు నరుసు. హరిప్రసాదరావు పొడుంముక్కుతో "హా చంద్రమతీ" అని ఎట్లా అంటాడోకూడా చూపించాడు.

"ఒరే. ఇవాళ హరిప్రసాదరావు హరిశ్చంద్రుడి పద్యాలు ఇమిటేట్ చేస్తే, బెల్లంకొండ నరసింహారావు చెయ్యాలి. లేదా నేను చెయ్యాలి. అంతే!" అన్నాడు నరుసు. పత్రిసీనప్ప పాటనూ, దాశరధి పాటనూకూడా తెగ మెచ్చుకున్నాడు. దురదృష్టవశాత్తూ సుందరం వీళ్ళనెవర్నీ చూడలేదు, వీళ్ళను గురించి వినలేదు.

కాని నరుసు ధైర్యం చెప్పాడు.

"ఎల్లుండి రాత్రికి నేను హరిప్రసాదరావు బాణీ దించేస్తాగా!" అన్నాడు వాడు.

కాని సుందరం "ఎల్లుండి రాత్రి" దాకా ఆగనవసరం లేకుండానే ఆ పద్యాలను అరడజనుసార్లు వినటం జరిగింది.

ఆ పల్లెటూర్లో సుందరాని కేమీ తోచలేదు. నరుసు ఎంతసేపైనా కబుర్లు చెప్పగలడు. కాని సుందరం చదువుతున్న చదువు ప్రభావం ఛాయలు అప్పుడప్పుడే తల ఎత్తుతున్నాయి. తిమింగలం అరగంటకోసారి నీటిమీదికి వచ్చి గాలి పీల్చుకొని మళ్ళీ నీటిలోకి వెళ్ళిన విధంగా, సుందరం ఆటేసేపు బాహ్యప్రపంచంలో, యథార్థవ్యక్తుల మధ్య ఉండి సంతృప్తి పడలేక పోతున్నాడు. అదే "తోచక పోవటం" రూపేణా బయట పడుతున్నది. వాడికి కావాలసిన "గాలి" పుస్తకాలలోనూ, కథలలోని పాత్రలలోనూ లభిస్తుంది - ఎటువంటి చెత్త పుస్తకమైనా సరే వాడికి "తోచేటట్టు" చేసేది.

---

23. హరిప్రసాదరావు (-1936): కూచిపూడి భాగవతుల వంశానికి చెందిన ప్రఖ్యాత రంగస్థల నటుడు గుంటూరు ఫస్ట్ కంపెనీ అని పిలువబడే (1882-1912) హిందూ నాటక సంఘ సంస్థాపకులు. వీరు ధరించిన ప్రసిద్ధ పాత్రలు, "సత్య హరిశ్చంద్ర"లో హరిశ్చంద్రుడు, 'చిత్రనళీయం'లో నల, బాహుక పాత్రలు, 'శాకుంతలం'లో దుష్యంతుడు, 'వేణీ సంహారం'లో దుర్యోధనుడు, పాత్రలో లీనమైనట్లు నటించేవారే కాని. తాదాత్మ్యాన్ని పొందేవారుకాదట. పద్యాన్ని భావయుక్తంగా పాడేవారట.

"ఏంరా నరుసూ! మీ లైబ్రరీకి వెళ్ళి చదువుకోవటానికేమన్నా పుస్తకం తెచ్చుకుందాం" అన్నాడు సుందరం.

"లైబ్రరీలో ఏం పుస్తకాలున్నె? ఏమీలేవే?" అన్నాడు నరుసు.

"వెనక నే వచ్చినప్పుడు చాలా పుస్తకాలుండేవే? పానుగంటి ఆయన సాక్షి నాటకాలూ, డిటెక్టివు నావెల్సూ అవీ చాలా వుండాలిగా?" అన్నాడు సుందరం.

"అన్నీ ఎవరి దారిన వారెత్తుక పోయినారు. మేష్టరే లైబ్రరీ కూడా చూస్తూ వుండేవాడు. బడి మానేసి ఆయన వెళ్ళిపోగానే ఎవరికందిన పుస్తకం వాళ్ళు ఎత్తుకుపోయినారు."

"బడి అయిపోయిందా?" అన్నాడు సుందరం.

"అయిపోకేం జేస్తుందిరా? లేనివాళ్ళకు జీతం లేకుండా చదువు చెబుదామంటే వున్నవాళ్ళు కూడా ఊరికినే చెప్పమన్నారు. జీతం అడిగితే పిల్లల్ని పంపించం అన్నారు. కొందరు బడికి చందాలిచ్చారు చూడూ, వాళ్ళ పిల్లలూ, వాళ్ళ బంధువుల పిల్లలూ జీతాలు కట్టలా. వాళ్ళని అడగాలో అడగరాదో తెలీలా బీదవాళ్ళ పిల్లలు కూడా బడికి రావటం మానేశారు. ఇళ్ళకు వెళ్ళి ఎందుకు రార్రా అని అడిగితే, మా అబ్బాయికి బట్టలు లేవని ఒకరూ, పుస్తకాలు లేవని ఒకరూ. ఒరే నువ్వు నమ్మవుగాని, ఎదురు డబ్బిస్తేతప్ప పిల్లల్ని పంపమన్న వాళ్ళున్నారు. ఈ బడికాదుగాని ఊళ్ళో సహంమంది కిప్పుడు మా నాన్నంటే పడదు. కొందరు, నీమూలంగా పిల్లల్ని పాడుచేశాం. వాళ్ళ చదువులు పాడుచేశాం అన్నారు. మరికొందరు మానాన్న చాలా పెద్దపేరు తెచ్చుకుందామని ఇదంతా చేశాడని కూడా అన్నారు. తిట్లుతినటం మాటా, కాళ్ళుపడేటట్టు చందాలకోసం తిరగడం మాటా అటుంచు. చేస్తూ చేస్తూన్న ఉద్యోగం మానుకుని మా నాన్న ఈ చందాల మీద కుటుంబం పోషిస్తున్నాడని వదంతులు పుట్టించిన వాళ్ళున్నారు. మానాన్న తప్పుకూడా ఉందిలే. ఇంత త్యాగం చేశాను, అంత త్యాగం చేశాను, మీరేం చేశారు అని అందర్నీ దెప్పాడు. వకీలు సీతారామయ్యకూ నాన్నకూ ఇప్పుడు మాటల్లేవు తెలుసా!... అదెట్లా వచ్చిందంటే, మా చలమయ్యమీద దాయాదులు దావావేస్తే అతనివైపు వకాల్తా సీతారామయ్య పుచ్చుకున్నాడు. చలమయ్య కూడా మా నాన్నల్లేనే జైలుకు వెళ్ళినవాడేగా మరీ? ఇటువంటివన్నీ పెట్టుకుంటే అవుతుందా? అన్నాడు సీతారామయ్య. మా నాన్న ఆయన్ని నానా మాటలూ అన్నాడు. అంతే, ఇద్దరూ మళ్ళీ మాట్లాడుకోలేదు. నాలుగు నెల్లపాటు మా నాన్నే బడి పోషించాడు. ఆ తరువాత వొదిలేసి ఊరుకున్నాడు. ఒక్కడూ ఎంతదూరమని దేకుతాడు చెప్పు?"

సుందరాని కిదంతా వింటున్న కొద్దీ కంపరం ఎత్తింది. ఈ ఉదంతం గురించి ఇన్ని వివరాలు తెలుసుకోవలసిన అవసరం లేదనీ, ఒక్క ముక్కలో శేషగిరి మామయ్య తన జీవితమూ, పేరుకూడా భ్రష్టు చేసుకున్నాడనుకుంటే సరిపోతుందనీ సుందరం అనుకున్నాడు.

ఇందులో నేర్చుకోవలసిన నీతికూడా ఉన్నట్టు కనబడలేదు సుందరానికి. దేశంకోసం ఒళ్ళు విరుచుకోవటం వృథా అని తప్ప.

ఆ సాయంకాలం నరుసూ, సుందరంకూడా సత్రంకేసి వెళ్ళారు. అక్కడే రోజూ నాటకం రిహార్సల్సు. సత్రంమీద మాసిపోయిన నీలం అక్షరాలలో "జాతీయ విద్యాలయం" అని, పక్కగది తలుపుమీద తెల్ల అక్షరాలతో "లైబ్రరీ" అనీ ఇంకా కనిపిస్తున్నది.

సుందరం నాటకం చూశాడు. నరుసు హరిశ్చంద్రుడి వేషం వేశాడు, పాడాడు, అభినయించాడు. ఆ నాటకమూ, ఆ తెరలూ, నాటకం చూడటానికి వచ్చిన ఆ మూకచూస్తే ఏమనుకోవాలో సుందరానికి తెలీలేదు. ఈ నాటకం చూస్తుంటే నాటకం చదివితే వచ్చే ఆనందంలో నూరోవంతురాలేదు. నరుసుకూడా ఏదో తెచ్చి పెట్టుకొని నటిస్తున్నట్టూ చూసేవాళ్ళ తెలివితేటలను అపహాస్యం చేస్తున్నట్టూ ఉన్నది గాని, తాను ఒక అనుభవాన్ని సృష్టిస్తున్నట్టు లేదు. ఈ నాటకాల గొడవ పెట్టుకుని నరుసు ఎందుకూ కొరగాకుండా పోతున్నాడని సుందరం నమ్మాడు.

నాటకం అయిన తరువాత నరుసు, "ఎట్లావుంది మా తోలుబొమ్మలాట?" అన్నాడు.

సుందరం ఈమాటకు కాస్త ధైర్యంవచ్చి "నాటకం ఏమీ బాగా లేదనీ, ఇంకా బాగా ఉండవచ్చుననీ" అన్నాడు.

నరుసు ఆ మాటతో ఏకీభవించి ఊరుకోక, ఎక్కడ లోపాలు జరిగాయో, ఎక్కడ ఎవరు బాగాచేశారో, ఎక్కడ ఎట్లా పాడుచేశారో, తాను ఎక్కడ, బాగా చేశాడో, ఎక్కడ చెయ్యలేక పోయినాడో, ఎందుకట్లా అయిందో సవిస్తరంగా చెప్పనారంభించాడు. సుందరం లోలోపల విసుక్కుంటూ అంతా విన్నాడు.

సహృదయుడు కాని వాడితో మాట్లాడుతున్నానని నరుసు కొంచెం అనుమానించినా ఈ వివరాలు మాట్లాడి వుండడు. సుందరం వినోదంకింద మాత్రమే పరిగణించే కళను నరుసు తన జీవితాశయంగా పెట్టుకున్నాడు. అందుచేత ఇద్దరూ కలిసి మాట్లాడేది ఏమీలేదు.

* * * *

ఊళ్ళోవాళ్ళ పోరుబడలేక శేషగిరి మామయ్య కృష్ణవేణికి పెళ్ళిచేశాడు. ఆ సందట్లోనే నరుసుకు ఉపనయనం కూడా అయిందనిపించాడు.

"కాకులు పొడిచినట్టు పొడుస్తుంటే ఏం చెయ్యను? చెబితే వినడాయె. ఈ బాల్య వివాహాలూ, దిక్కుమాలిన ఆచారాలూ, మానలేకపోతే మనకు స్వరాజ్య మెందుకట? ఛీ!ఛీ! మనగతి ఇంతే. గాంధీ మహాత్ముడింత ఉద్యమం నడపట మేమిటి. ఈ పేద సుద్ధులు ఉన్నచోటే ఉంటాయనటమేమిటి?" అని శేషగిరి వాపోయినాడు.

"అదేమిట్రా స్వరాజ్యమంటే సమత్తాదేదాకా పెళ్ళిళ్ళు చెయ్యకుండా ఉంచటమా? చాల్లే" అన్నది సీతమ్మగారు పెళ్ళికి తీసుకుపోవటానికి వచ్చిన అన్నతో-

ఉపన్యాసం ఇచ్చేందుకు మంచి అవకాశం దొరికింది.

"ఇల్లు శుభ్రంగావుంటే చీపురుకట్ట తీసుకుని ఊడవ్వగా? బ్రిటిషువాళ్ళు రాజకీయంగా మనకు పీడలు కొన్ని తెచ్చిపెట్టారు గనకే స్వరాజ్యమంటున్నాం.

అవునా? ప్రజలుండే, వాళ్ళు రాజ్యాలేలేది ఎన్నడూలేదు. అందుకని, ఎవరు పరిపాలిస్తే ఏంలే అనుకోంగా? బ్రిటిషువాళ్ళ పరిపాలనకన్న మనవాళ్ళ పరిపాలన మనకు లాభసాటిగా వుంటుంది. బ్రిటిషువాళ్ళు నాశనంచేసే రాజకీయ జీవితాన్ని మనవాళ్ళయితే పెరిగి రానిస్తారు. ప్రజలకు హక్కులిస్తారు. ఉద్యోగాలిస్తారు. జీవితం తోటకూర మడిలాగా నవనవలాడుతూ పెరిగివస్తుంది. ఇదంతా అర్థంకాని మూర్ఖులుండి "ఎబ్బే ఇదంతా ఏమిటి? బ్రిటిషువాళ్ళచేత మొట్టించుకోవటం మనకు ఆనవాయితీగా వస్తున్నదాయె. అదంతా మారితే ఎట్లా? అని అన్నారనుకో, ఎట్లా వుంటుంది? మన చేతుల్లోవున్న విషయాలను కూడా మనం పరిష్కరించుకోలేకపోతే ఇంక బ్రిటిషువాళ్ళను తరిమేసి రాజకీయ సంస్కరణ లేం చేసుకుంటాం? ఒక్కటడుగుతా చెప్పు! మన జీవితంలో మనం అసంతృప్తి చెందకపోతే దాన్ని మార్చుకుందామనే ఆవేదన లేకపోతే, మార్పుకోసం కృషిచేసే శక్తి ఎట్లావస్తుంది."

"ఆదదాన్ని నా కివన్నీ ఏం తెలుస్తాయిగాని, చక్కగా చిన్నప్పుడే పెళ్ళి చెయ్యటానికేమీ? బఱ్రెలల్లే ఇరవైయ్యేసేళ్ళ పిల్లల్ని పల్లకిలో ఎక్కించి ఊరేగిస్తారు? అచ్చటా ముచ్చటా ఉండొద్దూ?"

"అదే వచ్చింది! పిల్లల జీవితాలతో మనం బొమ్మలాడుతున్నాం. మన ముచ్చట తీరితేసరి! వాళ్ళేమన్నా కానీ!"

"ఆc, ఏమవుతారు? ఏమీ కారు. మనమంతా మట్టికొట్టుకు పోయినామా?"

"అదేంమాట? మనకన్నా ఎవరూ సుఖంగా బతక్కూడదా? యావజ్జీవం వుండవలసిన లంకెగదా, మొగుడు పెళ్ళాలు వ్యక్తులై తమ బంధం తమ చేతులమీదుగా చేసుకునే హక్కు ఎంత అవసరమైనది! ఏ హక్కులూ లేకుండా బానిసలయుగంలో బానిసలూ బతికారు, అదా?"

సీతమ్మగారు విషయంమార్చి, "సరేగాని, నువు విధవల పెళ్ళిళ్ళు కూడా చేయిస్తున్నావుటగా" అన్నది.

"నాదేమిటి? నా తలతన్నినవాళ్ళు చేయిస్తున్నారు. ఉన్నవ లక్ష్మీనారాయణ[24]గారున్నారు. సాంబశివరావుగారున్నారు. వెంకయ్యగారున్నారు. ఇంకా

24. ఉన్నవ లక్ష్మీనారాయణపంతులు (1887-1957): ప్రముఖ సంస్కర్త, జాతీయవాది, ఆంధ్రోద్యమ ప్రారంభకుల్లో, నిర్మాతల్లో ఒకరు. రచయిత. 1890 లోనే ఉపాధ్యాయుడుగా ఉన్నప్పుడు గుంటూరులో వితంతు వివాహాన్ని వీరేశలింగం అధ్యక్షతన జరిపించారు. గుంటూరులోని వితంతు శరణాలయం సూపర్నెంటుగా ఉంటూ 30కి పైగా సంస్కరణ వివాహాలు జరిపించి "గుంటూరు వీరేశలింగం'గా పేరుపడ్డారు. 1922లో శారదానికేతనం స్థాపించి స్త్రీ విద్యకు దోహదం చేశారు. తెలుగువారు గర్వించదగిన నవలల్లో ఒకటైన మాలపల్లి నవలను రాయవేలూరుజైల్లో వున్నప్పుడు రచించారు. బ్రిటిష్ ప్రభుత్వం యీ నవలను 1923లో ఒకసారి, 1936లో మరొకసారి నిషేధించింది. ఉన్నవ రచనలు: నాయకురాలు, భావతరంగాలు, సంగీత నాపసాని, ఇండియా రాజతంత్రం, బిపిన్ చంద్రపాల్ ఉపన్యాసాలు మొదలైనవి. రాజకీయోద్యమ ప్రచారంలో జానపద గేయరీతుల ప్రాముఖ్యతను గుర్తించి స్వరాజ్య సోది, బుడబుక్కల జోస్యం రచించారు. వివరాలకు చూ. బంగోరె, మాలపల్లి నవలపై ప్రభుత్వ నిషేధాలు, 1979.

బోలెడుమంది పెద్దలున్నారు. స్త్రీ పునర్వివాహాలు చూడు; ఎంత అవసరమైన సంస్కరణో!"

"నా మొహమల్లేనే వుంది!" అన్నది సీతమ్మగారు.

ఇదంతా వింటున్న సుందరానికి తన మేనమామ చెప్పే మాటల్లో గొప్ప భావాలు కనిపించాయి. వాడు జీవితాన్ని విమర్శించే స్థితిలో ఇంకాలేదు. అయినప్పటికీ జీవితాన్ని ముందుకు తీసుకుపోయేట్టు కనపడే ఏ ప్రయత్నమైనా మంచిదనే విశ్వసించగల స్థితిలో ఉన్నాడు.

సుందరానికి తనతల్లి భావాలమీద అనాదరం క్రమంగా హెచ్చుతూ వస్తున్నది. పుస్తకాల ద్వారా అయితేనేం, శేషగిరి వంటివాళ్ళు చేసే ప్రచారం వల్లనయితేనేం సుందరం జీవితంలో జరగదగిన మార్పులను గురించి కొన్ని విశ్వాసాలు సంపాదిస్తున్నాడు. ఈ విశ్వాసాలు వాడిబుద్ధికి హేతురహితంగాలేవు. తాను మారే జీవితానికి ప్రతినిధిననీ, తన తల్లి మారని జీవితానికి ప్రతినిధి అనీ వాడు భావిస్తున్నాడు. శేషగిరి తనతల్లితో ఈ చర్చంతా జరపటం వాడికి సబబుగానే కనిపించింది. తన మామయ్యచేత ఇంత తొందరలో కృష్ణవేణి పెళ్ళి చేయిస్తున్నది తన తల్లివంటి వాళ్ళేనని సుందరం ఊహించాడు.

దొరలూ దొరసాన్లూ చక్కగా పెద్దవాళ్ళయినాక వాళ్ళంతటవాళ్ళే పెళ్ళి చేసుకుంటారు. చిన్నతనంలోనే పెళ్ళి చెయ్యటం తప్పు. పెద్దయిన తరవాత మొగుడు పెళ్ళాలు ఒకరికొకరు నచ్చకపోతే ఏం కావాలి? వెధవ ముండల పెళ్ళిళ్ళు కూడా చెయ్యాలిసిందే. వెధవముండలకి జుట్టు గొరిగి నెత్తినముసుగేసి కూచోబెట్టటం చాలా ఘోరం... ఆడవాళ్ళంతా జుట్టూ, నగలూ, చీరెలూ ఉండి తిరుగుతుంటే చూడటానికి ఎంత బాగుంటుంది!.

అయితే సుందరానికి సందేహాలు లేకపోలేదు. చాలా ఏళ్ళు వచ్చిన తరవాత వెధవముండలకి పెళ్ళి చెయ్యాలా, వద్దా? పిల్లలున్న వాళ్ళు పెళ్ళి చేసుకుంటే ఏమవుతుందీ? ఛా, ఛా! వాళ్ళనెవరు చేసుకుంటారు!

ఇంతలో ఇంకో భయంకరమైన ఆలోచన కలిగింది. తన తల్లికి మళ్ళీ పెళ్ళి చెయ్యటమా! సుందరానికి ఒళ్ళంతా ఒక్కసారి భగ్గున మండిపోయింది. అది ఎంత మాత్రం వీల్లేదనుకున్నాడు. ఆవిడ జుట్టు పెంచి, చీరెలుకట్టి, నగలు పెట్టుకోవటం కూడా వాడికి సమ్మతం కాలేదు. ఆవిడలో కాస్త మార్పుకూడా వాడు సహించలేదు.

❀ ❀ ❀ ❀

పాపం శేషగిరి చాలా చిత్రమైన ఆవేదనకు గురి అవుతూన్నాడు. సంజీవిలాంటి ఔషధం దగ్గిర ఉండికూడా అనుపానం తెలియని వైద్యుడల్లే ఆయన ఎంతో ఉన్నతాశయాలు కలిగిఉండిన్నీ, వాటిని ఎట్లా అమలులోకి తేవాలో తెలియక కొట్టుకుంటూ, అడుగడుగునా సంఘం తనకు అడ్డం వస్తున్నట్టు భావిస్తున్నాడు. ఆదర్శ వాదులకందరికీ ఈ గతి ఎప్పుడో ఒకప్పుడు కలగక తప్పదు. వారి సంఘం మీద కొన్ని సంస్కరణలు పడవెయ్యటానికి ప్రయత్నించి విఫలులై, చిట్టచివరకు

ప్రాణం విసిగి, "ఈ పాడు సంఘానికి బాగుపడటం ఇష్టంలేదు. దీనికి బాగుపడే గీత లేదేమో" అనుకుని వైరాగ్యంలో పడతారు.

శేషగిరి వైరాగ్యంలో పడటమేకాక, తన చుట్టుపక్కల ఉన్నవాళ్ళ ఒత్తిడికి తట్టుకోలేక కృష్ణవేణికి పదకొండో ఏడు వెళ్ళుతుందనగా పెళ్ళి ఏర్పాటు చేశాడు. జాతీయ విద్యాలయంలో అస్పృశ్యుల పిల్లలను ప్రవేశ పెడతానన్నందుకే వెలివేసినంత పని చేసిన వాళ్ళున్నారు. కూతురికి రజస్వలానంతర వివాహంకూడా చేస్తే ఊళ్ళో ఉండే ఆస్కారం లేకుండా పోతుందని శేషగిరి భయపడ్డాడు.

కృష్ణవేణికి నిర్ణయించిన వరుడు ఉద్యమంలో చదువు చాలించుకుని ఆరుమాసాలు శ్రీకృష్ణజన్మస్థానం సందర్శించినవాడు. అతనికి విశేషం ఆస్తిలేదు. కట్నమూ, లాంఛనాలూ లేకుండా పెళ్ళికి ఒప్పుకున్నాడు. ఖద్దరు బట్టలతో పెళ్ళి అయింది. శేషగిరి బంధువులకు ఈ పెళ్ళి చాలా వేళాకోళంగా ఉంది.

"ఇదేం పెళ్ళి? నా మొహం పెళ్ళి! అలగాజనం కూడా ఇంతకన్న బాగా చేసుకుంటారు. బాజాలేవి, ఊరేగింపులేవి, మేజువాణీ ఏది, దండాడింపేది, బూజంబంతి ఏది, కట్నాలేవీ, కానుకలేవి?" అని ఉభయపక్షాలవారుకూడా చప్పరించారు.

"ఇది స్వరాజ్యం పెళ్ళి కాబోలు" అన్నారు మరికొందరు వెటకారంగా.

ఎవరేమన్నప్పటికీ సుందరానికి రంగారావు - కృష్ణవేణి భర్త - నచ్చాడు. అతను పెళ్ళికొడుకు పోజు పెట్టనేలేదు. పెళ్ళితానే చేయిస్తున్న వాడల్లే తానుకూడా ప్రతిపనిలోనూ తోడవుతూ, అందర్నీ పలకరిస్తూ, ఎక్కడబడితే అక్కడ ఎవరితో బడితేవాళ్ళతో కూచుని ఏదిపడితే అది మాట్లాడాడు.

చీకటిపడేవేళ రంగారావూ, నరుసూ, సుందరమూ, ఇంకా ఒకరిద్దరు పిల్లలూ కలిసి చెరువు అవతలిగట్టుమీద కూచున్నారు. రంగారావు స్వరాజ్యం గురించి కబుర్లు చెప్పాడు.

ఆరోజు పౌర్ణమి కావటంచేత ఎప్పుడు సూర్యకాంతిపోయి వెన్నెల వచ్చింది కూడా తెలియరాలేదు. చెరువుగట్టుమీద చెట్లనీడలు దీర్ఘంగా పడుకుని ఉన్నాయి. వాటి మధ్య కూచుని రంగారావు ఉద్యమం గురించి మాట్లాడాడు.

స్వాతంత్ర్యోద్యమం అయిపోయిందనుకోవటం పొరపాటు, ఇది ఆగదు. కొండమీదినుంచి మైదానాలు ప్రవేశించే నదిలాగా వడితగ్గింది. ఇప్పుడిది విస్తరించాలి. నిజంగా ఇవాళ బ్రిటిషువాళ్ళు వెళ్ళిపోతే మనం స్వరాజ్యం సాగించటానికి సిద్ధంగా వున్నామా? లేము. ప్రతి రాష్ట్రంలో, ప్రతిజిల్లాలో, ప్రతిపట్టణంలో, ప్రతిపల్లెలోనూ స్వరాజ్యవాదం వేళ్ళుతన్నాలి. జీవితం అన్ని రంగాలలోనూ చైతన్యం కలగాలి. మనం రాజకీయాలు ఓనమాల దగ్గిర్నుంచీ నేరవాలి. కాంగ్రెసు సంస్థను నిర్మించాలి. దానిద్వారా విద్యార్థులలో, ఉద్యోగులలో, ఆఖరుకు పొలాలు దున్నుకునే రైతుల్లోనూ, ఫ్యాక్టరీ కార్మికుల్లోనూ చైతన్యం కలగాలి. ఇదంతా ఒక్కరోజులో జరగాలంటే సాధ్యం కాదు. కాని, ప్రతి కాంగ్రెస్‌వాడూ

స్వార్థరహితంగా పనిచేస్తే ఇవాళ ఒకడున్నచోట రేపు పదిమంది కాంగ్రెస్ వాళ్ళుంటారు. ఎల్లుండి నూరుమంది వుంటారు. ఆ విధంగా ఉద్యమం వ్యాప్తిచెందితే స్వరాజ్యం రాక ఏం చేస్తుంది.

రంగారావు ఖద్దరు గురించి చాలా ఉద్రేకంతో మాట్లాడాడు. అతను శేషగిరి మామయ్యంత ఆదర్శవాదీ కాదు. నిరాశావాది కాదు.

ఈ సంగతులు రంగారావునోట వింటుంటే సుందరానికి మరింత నమ్మదగినట్టుగా కనపడ్డాయి. వాడు యిక ఖద్దరుతప్ప కట్టరాదనుకున్నాడు.

దీనికోసం వేరే ప్రయత్నం చెయ్యనక్కర్లేకుండా ఇంటికి వెళ్ళేటప్పుడు శేషగిరి తన మేనల్లుడికీ, మేనకోడలికీ కలిపి పదిగజాల ఖద్దరు గుడ్డ పెట్టాడు.

❀ ❀ ❀ ❀

రోజులూ, మాసాలూ గడిచిపోతున్నాయి. జానకి ఆడపిల్లల బడికి పోయి చదువుకుంటున్నది. దాన్ని మగపిల్లల బడిలో చదివించవచ్చునని ఎవరో సూచించారు. సీతమ్మగారు ఈ ఆలోచనకు సుతరామూ ఒప్పుకోలేదు. సుందరం ఒక్క నిట్టూర్పు నిట్టూర్చాడు. తన చెల్లెలు తనతోకూడా రోజూ బడికివచ్చి చదువుకుంటుందేమోనని వాడు చాలా భయపడ్డాడు.

చిక్కేమిటంటే సుందరం క్లాసులోనే – మరొక సెక్షనులో – కొత్త మున సబుగారమ్మాయి చదువుకుంటున్నది. మునసబుగారి గుర్రబ్బండీలో రోజూ ఆ పిల్ల బడిముందు దిగేది. ఆమెకు ముందుగా దవాలీ బంట్రోతు దిగి ఆమె పుస్తకాలు పట్టుకుని ఆమె క్లాసు దాకా వచ్చి పుస్తకాలామెకిచ్చి వెళ్లిపొయ్యేవాడు. స్కూలు ప్రారంభమైన ఒకటి రెండు నిమిషాల కామె సరిగా ఎట్లా హాజరయ్యేదో అందరికీ వింతగా ఉండేది. ఈ పిల్లను గురించి తన తోటి విద్యార్థులు మాట్లాడుకునే మాటలు సుందరం వినేవాడు. ఈ మాటలకు సుందరం బాధపడేవాడు కాదు – ఎప్పుడైనా ఆ పిల్లను గురించి కాస్త జాలిపడేవాడేమో. తన చెల్లెలు స్కూలుకువస్తే దాన్నికూడా అటువంటిమాటలే అంటారనీ, పైపెచ్చు తను ఎదుటలేనప్పుడు అంటారేమోననీ అనిపించగానే సుందరానికి చలవలు కమ్మినంత పని అయింది.

జానకికి స్నేహితురాళ్ళు చాలామంది ఉండేవాళ్ళు. వాళ్ళలో కొందరు అప్పుడప్పుడూ జానకి కోసం వచ్చేవాళ్ళు. వాళ్ళలో ఒక్కరుకూడా సుందరం కేసి చూసేవాళ్ళు కారు. సుందరంతో మాట్లాడేవాళ్ళు కారు. ఇరవై ఏళ్ళ వాళ్ళతో స్వేచ్ఛగా మాట్లాడే పదేళ్ళ ఆడపిల్లలు దాదాపు తమ ఈడు మగపిల్లల దగ్గిర ఎందుకు బెట్టుగా ఉంటారో ఎవరికీ తెలీదు. సుందరానికి ఆడపిల్లలంటే పెద్ద భయంగాని ఆకర్షణగాని లేదు. అయినా జానకి స్నేహితురాళ్ళెవరన్నావస్తే ముళ్ళమీద ఉన్నట్టుండేది. సుందరం కనిపిస్తేచాలు, జానకితో వటవటా మాట్లాడేవాళ్ళు కాస్తా అట్టే కొయ్యబారిపోయి మూతులు గట్టిగా బిగించేసి బొమ్మలల్లే తయారై కళ్ళతో తమలో తాము అవధానం ప్రారంభించేవాళ్ళు.

సుందరానికి ముఖ్యంగా చిరాకెందుకు కలిగేదంటే, వాళ్ళు దగ్గిర ఉండగా జానకి కూడా తన అన్నతో వాళ్ళలాగే ప్రవర్తించేది. వాడికేసి చూసేదికాదు. ఒకవేళ వాడు తనను పలకరిస్తే "ఏమో, నాకు తెలీదు" అని క్లుప్తంగా సమాధానం ఇచ్చి తోటి స్నేహితురాళ్ళతో మళ్ళీ నేత్రావధానంలో పడేది.

"మేం ఆడవాళ్ళం, నువు మగవాడివి. మా జోలికి వచ్చేవు. భద్రం! నీ జాగాలో నువ్వుండు. మా జాగాలోకిరాకు! తరవాత నీ యిష్టం!" అని ఈ ఆడ ముఠా తనతో అన్నట్లు తోచినప్పుడల్లా సుందరానికి వీళ్ళమీదేకాక ఆడజాతిమీదనే చెప్పరాని రోత కలిగేది.

అయితే ఈ రోత అందరిమీద కలిగేదికాదు. జానకి స్నేహితురాళ్ళలో శకుంతల అనే పిల్ల ఉండేది. ఏ అనిర్వచనీయకారణమోగాని, సుందరానికి శకుంతలంటే ఏ మాత్రమూ కోపం ఉండేదికాదు. పైగా ఆ పిల్లను చూస్తే వాడికెందుకో ఎక్కడలేని గౌరవమూ వుండేది. తనకు తెలియని బాధలేవైనా శకుంతలకున్నాయేమోనని సుందరం విచారించేవాడు. ఎప్పటికైనాసరే ఈ శకుంతలకు ఏదన్నా సహాయం చెయ్యవలసివస్తే తాను తప్పక చేస్తాననుకునేవాడు.

శకుంతల పెద్ద అందగత్తె అని కాదు. సుందరానికి అసలు సౌందర్యమంటే ఏమిటో తెలియదు. వాడు మనుష్యులను మంచివాళ్ళుగానూ, చెడ్డవాళ్ళుగానూ విభజించేవాడు. తనకు మంచివాళ్ళుగా తోచినవాళ్ళంతా అందంగా వున్నట్టూ, చెడ్డవాళ్ళుగా తోచినవాళ్ళు వికారంగా ఉన్నట్టూ ఊహించుకునేవాడు. ఎవరిమీదనన్నా వాడికి పూర్వం ఉన్న అభిప్రాయం మారుతుంటే దానితోబాటు వారి అందచందాలుకూడా మారుతున్నట్టు భావించుకునేవాడు. దీనికి దృష్టాంతంగా సుందరానికి పూర్వం చాలా అందంగా కనపడిన శేషగిరి మామయ్య మొహం ఇప్పుడిప్పుడంత అందంగా కనబడటంలేదు.

శకుంతలలో సుందరాన్ని ఆకర్షించిన లక్షణం ఆమె మంచితనం - కోప్పడటమూ, చిరాకుపడటమూ, పరుషంగా మాట్లాడటమూ, కపటంగా ప్రవర్తించటమూ మొదలైనవి చాతగాని మంచితనం. ప్రపంచంలో ఏ మనిషిగాని శకుంతల కన్న మంచిగా ఉండటం సాధ్యమని సుందరానికి తోచలేదు. జానకి కూడా శకుంతల మంచిదని అనేదేగానీ ఆ మంచితనం గురించి తనకు తెలిసినంత బాగా ఇంకొకరికి తెలుసునన్న నమ్మకం వాడికిలేదు. ఇది సుందరం తొలి ప్రణయం. ఇంగ్లీషులో దాన్ని లేగదూడ ప్రణయమంటారు.

శకుంతల జానకికన్న ఏడాదో, ఏణ్ణర్ధమో పెద్దది. ఆమెకు పెళ్ళి కావటం సుందరం ఎరుగును. పెళ్ళి బూజంబంతినాడు జానకితోపాటు సుందరంకూడా భోజనానికి వెళ్ళాడు. ఆ రాత్రే శకుంతల పెళ్ళి ఊరేగింపు కూడా చేశారు. పెళ్ళికూతురు అవతారంలో శకుంతల సుందరం కళ్ళకు మరింత అందంగా కనపడటం కాక, మరింత గొప్ప ఆపదలో ఉన్నట్టు, తాను తప్ప ఆ ఆపదనుంచి ఎవరూ రక్షించలేనట్టూ, తాను రక్షిద్దామంటే మిగిలిన మనుషులంతా అడ్డంగా ఉన్నట్టూ సుందరానికి తోచింది.

ఊరేగింపు సుందరం వాళ్ళ ఇంటివేపు వచ్చేటప్పటికి పన్నెండు దాటింది. ఊరేగింపు వెళ్ళిపోయిన అరగంటదాకా సుందరం నిద్రపోలేదు. కాని ఈ అరగంటలోనూ సుందరం తలలో చెలరేగిన ఆలోచనలు నిమిషాలతో కొలిచేవికావు.

❀ ❀ ❀ ❀

"వచ్చే ఏడు ఏ సబ్జక్టు తీసుకుంటావోయ్?" అన్నాడు నాగేశ్వర్రావు బావ సుందరంతో.

"ఇంకేం తీసుకుంటాను? లెక్కలే తీసుకోవాలి."

శ్రీనివాసరావు పెద్దగా నవ్వాడు.

"లెక్కలు తీసుకొని ఏంచేద్దామని."

"ఇంటరు చదువుదామని"

"తరువాత?"

"బియ్యే"

"ఆ తర్వాత?"

"చేతైతే ఎమ్మేకూడా చదవొచ్చు."

"చేతైకాకపోతే?"

"మానేసేదీ!"

సుందరంచేత ఉద్యోగం విషయం మాట్లాడించాలని శ్రీనివాసరావు ప్రయత్నించాడు గానీ, సుందరం చదువు సంగతి తప్ప ఇంకేమీ ఆలోచించలేదు. వాడికి చదువే ఒక పరమాశయంగా బుద్ధిలో మెసలుతుంది. చదువు వెంబడే ఉద్యోగం మాట ఆలోచించాలనిగానీ, ఉద్యోగానికీ చదువుకూ సంబంధం వుంటుందనిగానీ, ఉద్యోగం దృష్టిలో ఉంచుకుని చదువు నిర్ణయించుకోవాలనిగానీ సుందరం ఎరగడు.

వాడు లెక్కలు తీసుకుంటానని అనటంలో కూడా ఒక ఉద్దేశం లేకపోలేదు. తెలివికల వాళ్ళంతా లెక్కలు తీసుకుంటారనీ, అవి రానివాళ్ళు హిస్టరీ తీసుకుంటారని వాడి తలలోకి క్రమంగా – అనేక సంభాషణల ఫలితంగా – ఎక్కింది.

"ఉద్యోగం మాటేమిటోయ్?" అన్నాడు శ్రీనివాసరావు.

"ఉద్యోగమా?" అన్నాడు సుందరం.

"అవును, ఫోర్తుఫారందాకా అందరూ ఒకటే చదువు చదువుతారు. ఫిఫ్తుఫారంలోకి వెళ్ళి ఏదో సబ్జక్టు సెలెక్టు చేసుకుంటున్నావంటే దానిమీద నువ్వు ముందుముందు చెయ్యబోయే ఉద్యోగం ఆధారపడి వుంటుంది" అన్నాడు శ్రీనివాసరావు.

ఇది సుందరానికి తెలియదు. లెక్కలూ, సైన్సు తీసుకోవాలా, హిస్టరీ తీసుకోవాలా అన్నది కేవలం పిల్లల తెలివితేటలపైనే ఆధారపడి ఉంటుందని వాడి అభిప్రాయం.

"నాకు లెక్కలు బాగా వచ్చుగా? నేను లెక్కలు తీసుకోకపోతే ఎట్లా?" అన్నాడు సుందరం.

"నువ్వనుకునేది మంచి ఉద్యోగాలు చేసేవాళ్ళంతా లెక్కలు తీసుకునేవాళ్ళనా? చాలా పొరపాటు. మాట వరసకు ప్లీడర్లను తీసుకో ప్లీడరీ స్వతంత్రమైన ఉద్యోగం. తెలివితేటలుంటే బోలెడంత సంపాదించవచ్చు. ఇప్పుడు కాంగ్రెసు నాయకుల్లో ఎంతమంది ప్లీడర్లున్నారో చూడు. మోతీలాల్ నెహ్రూ,[25] చిత్తరంజన్‌దాస్,[26] విఠల్‌భాయి పటేల్,[27] రాజేంద్ర ప్రసాద్,[28] మాలవ్యా,[29] అందరూ ప్లీడర్లే. వీళ్ళకి నీ ఆల్ జీబ్రా, ఫిజక్సు రాకపోయినా ఇంత గొప్పవాళ్ళయేవాళ్ళే. వైద్యుడు కాదలిస్తే సైన్సు, లెక్కలూ చదువు. కాని ఆలోచించుకో. రెండేళ్ళు కాలేజీ చదువూ, అయిదేళ్ళు వైద్యమూ నేర్చుకుంటేగాని డాక్టరువు కాలేవు. అన్నేళ్ళ చదువుకు నీదగ్గర డబ్బుందా? నిజంగా అంత డబ్బే ఉంటే మందులషాపు పెట్టుకుని చాలామంది డాక్టర్లకన్నా యెక్కువే సంపాదించుకోవచ్చు తెలుసా?... నీ దగ్గర అంత డబ్బులేదని నాకు తెలుసు. ఇక యెందుకీ లెక్కలూ? బియ్యే పాసయి ట్రెయినింగయి పంతులు పనిచెయ్యొచ్చు. ఎమ్మే పాసయి అదృష్టం ఉంటే లెక్చరరు పని చెయ్యొచ్చు. కానీ ఏం జీతమిస్తారు. ఇక ఉద్యోగాలు మాత్రం అన్నప్పుడల్లా దొరుకుతాయా? కాలేజీలో ఏ నాలుగేళ్ళో, ఆరేళ్ళో చదవాలంటే మాత్రం డబ్బు కావద్దుటోయ్. స్కూలు ఫైనలు కాగానే ఏదో ఉద్యోగం సంపాదిస్తే యీ నాలుగేళ్ళలోగా ప్రమోషన్లురావూ?"

శ్రీనివాసరావు ఏం చెబుతున్నాడో తెలుస్తూనే ఉందిగాని, ఎందుకు చెబుతున్నాడో సుందరానికి తెలియలేదు.

---

25. మోతీలాల్ నెహ్రూ (1861-1951): ప్రముఖ న్యాయవాది, జాతీయోద్యమ నిర్మాతల్లో ఒకరు. ప్రొ చేంజరు.

26. చిత్తరంజన్ దాసు (1870-1925): ప్రముఖ న్యాయవాది, జాతీయవాది. అలీపూర్ బాంబు కేసును చేపట్టి అరవిందుని విడిపించారు. మొదట్లో గాంధీజీ సహాయ నిరాకరణోద్యమాన్ని వ్యతిరేకించినా, తర్వాత నాగపూరు సమావేశంలో అంగీకరించారు. 1923 బెంగాల్ ఎన్నికల్లో గెల్చి ద్వంద్వ పరిపాలనా విధానాన్ని వ్యతిరేకించారు. కలకత్తా మేయరుగా ఉంటూ హిందూ - ముస్లిం ఒప్పందం జరిపించారు (1923). ఫరీదాపూర్ రాష్ట్ర సమావేశానికి (1925) అధ్యక్షులుగా "స్వరాజ్యం ప్రజలకోసంగాని, వర్గాలకోసం కాదు" అన్నారు.

27. విఠల్ భాయి పటేల్ (1871 - 1933): ప్రముఖ రాజకీయవాది. ఒకరోజు విఠల్‌భాయి పటేల్ కుటుంబరావు కాశీ విశ్వ విద్యాలయంలో చదువుతున్నప్పుడు అక్కడ ఒకరోజు కొత్తగా కట్టిన జిమ్నాషియం హాలులో. ``We want freedom with honour" అని గర్జించినట్టు కె.యస్ నా కాలేజీలో నేను అనే వ్యాసంలో రాశారు. ఆ వ్యాసంలో పటేల్ ఆకారం కూడా వర్ణించారు. "సింహంలాటి మనిషి. చాలా పొట్టివాడు పెద్దతల, సింహంజూలులాటి గడ్డం, భయంకరమైన కళ్ళు" అని.

28. రాజేంద్రప్రసాద్ (1884 - 1963)

29. మదనమోహన మాలవ్యా (1861 - 1946): కాంగ్రెసు ఉదార జాతీయవాది, పార్లమెంటేరియన్, విద్యావేత్త, పాత్రికేయుడు, కాశీ హిందూ విశ్వవిద్యాలయ సంస్థాపకుడు, నేషనలిస్టు పార్టీ వ్యవస్థాపకుడు (1926).

"నన్ను హిస్టరీ తీసుకోమంటారా?" అన్నాడు సుందరం.

"అది మాత్రం యెందుకు? ప్లీడరు అవుదామనా? దానికి డబ్బుండాలి. దానికి ఆరేళ్ళు కాలేజీలో చదవాలి. అదీకాక ప్లీడర్లందరికీ ప్రాక్టీసున్నదా?"

"మరేం తీసుకోమన్నారు?" అన్నాడు సుందరం పూర్తిగా ఖంగారుపడి.

"నేనేదో నిన్ను చెయ్యమంటున్నాననుకోకు. నువు తమ్ముడులాంటి వాడవు గనుక, నీ మంచికోరి నీకు సలహా ఇస్తున్నానంతే. చదువుగురించి ఆలోచించేటప్పుడు ఖర్చూ, ఉద్యోగమూ ఆలోచించకపోవటం చాలా పొరపాటు. అసలే ఈ చదువులో వృత్తివిద్య చాలా తక్కువ. కనీసం స్కూలు ఫైనలన్నా పాసుకాకపోతే ప్రపంచ జ్ఞానమే ఉండదు మరి. అందుచేత స్కూలుఫైనలుతో నిలిపివేస్తూ వృత్తివిద్య సంపాదించేదారి ఆలోచించాలి. కాలేజీ క్లాసులో మరింత ఇంగ్లీషూ, మరింత ఇతర సబ్జక్టులూ చెబుతారు. అవి మనలోకజ్ఞానాన్నీ పెంచవు. వృత్తికా పనికిరావు అందుచేత స్కూలు ఫైనలుతో చదువు సరిపెట్టి పెందలాడి ఉద్యోగంలో ప్రవేశిస్తే, సంసారంమీదపడి పిల్లలు పుట్టుకొచ్చేనాటికి నాలుగురాళ్ళు తెచ్చుకుంటూ ఉండొచ్చు. అవునా? నేను ఇంటరు పాసయాను. కానీ అది నాకెందుకూ వుపకరించలేదు. స్కూలుఫైనలు వాడికి దొరికే ఉద్యోగమే దొరికింది. అదైనా చిన్నతనంలోనే సంపాదించాను. గనక నెల తిరిగేసరికి 50 రూపాయలు కళ్ళజూస్తున్నా. నాకు సలహా చెప్పినవాళ్ళుంటే షార్టుహేండు, టైప్ రైటింగ్ తీసుకుని స్కూల్ ఫైనలుతో పూర్తిచేసి యీపాటికి ఎనభయ్యో, తొంభయ్యో సంపాదించుకుని ఉందును. నా స్నేహితుడొకడు బొంబాయిలో తొంభై సంపాదిస్తున్నాడు. మా నాగూక్కూడా అదే సలహా ఇస్తున్నాను."

శ్రీనివాసరావు సలహా సుందరానికి కొంచెంకూడా రుచించలేదు. చదువు సొంతం చదువుకోటానికిగాను డబ్బు లెక్క చూడటమేమిటి? ఇప్పటినుంచీ ఉద్యోగం సంగతి ఆలోచించటమేమిటి? వెనకటి రోజుల్లో చదువుకోసం కాశీ, నవద్వీపం వెళ్ళేవాళ్ళు కష్టాలూ, ఉద్యోగాలూ చూశారా?

అయితే నాగేశ్వర్రావు షార్టుహేండూ టైప్‌రైటింగ్ తీసుకుంటాడన్నది రూఢి అయింది. నాగేశ్వర్రావు స్కూలు ఫైనలుతో ఆపేస్తే, తను బియ్యేదాకా చదవటం చాలా అన్యాయమనిపిస్తుంది.

కాని సుందరం సమస్య ఇంకోవిధంగా పరిష్కారమయింది. వాడికి ఫోర్త్‌ఫారం ఆఖరు పరీక్షలో లెక్కల్లో మొదటిమార్కు వచ్చింది. స్కూలు తెరచి ఫిఫ్తుఫారం క్లాసులో కూచున్న తరువాత ఒకపూట సైన్సు మాష్టరూ, లెక్కలమాష్టరూవచ్చి ఒక్కొక్క పిల్లవాణ్ణీ నిలబెట్టి, వాడి పేరడిగి వాడికి లెక్కల్లోనూ సైన్సులోనూ ఎన్నేసి మార్కులు వచ్చాయో చూసి 'బాగా మార్కులు వచ్చినవాళ్ళు లెక్కలు తీసుకుంటానికి ఒప్పుకుంటూ, రాని వాళ్ళను నిరుత్సాహపరుస్తున్నారు. తనవంతు రాగానే సుందరంకూడా లేచి నిలబడ్డాడు.

"నీ పేరు?" అన్నాడు సైన్సు మాష్టరు.

"కె. సుందరం సార్."

"కూర్చో" అన్నాడు లెక్కలమాష్టరు సుందరంకేసి ఒక్కక్షణం చూసి...

తన చేతిలో ఉన్న పట్టీలో సుందరం పేరుకోసం వెతుకుతున్న సైన్సు మేష్టరు. "ఏం సబ్జెక్టు తీసుకుంటావ్?" అన్నాడు.

"లెక్కలు తీసుకుంటాడు... నెక్స్ట్!" అన్నాడు లెక్కల మేష్టరు.

సైన్సు మేష్టరుకు సుందరంపేరు పట్టీలో కనిపించకపూర్వమే ఇంకో విద్యార్థి లేచి నిలబడ్డాడు.

సుందరం తన నోటిమీదిగా, "లెక్కలు తీసుకుంటాను" అనలేదు. లెక్కల మేష్టరు ధర్మానవాడి సబ్జక్టు ఖాయమయింది. కాని సుందరం తన నోటిమీదుగా, "నేను లెక్కలు తీసుకోను. షార్ట్‌హాండ్, టైప్‌రైటింగ్ తీసుకుంటాను" అనీ అనలేదు.

## 15

జానకికి పదోఏడు. సీతమ్మగారు పిల్ల పెళ్ళికి తొందరపడుతున్నది.

"ఎవరు చూశారుబాబూ. కొంపతీసి మా పిన్ని పోలిక వస్తే పది వెళ్ళకుండానే ఈడేరి కూర్చుంటుంది. దిక్కులేని ఆడచచ్చినదాన్ని దీనికెట్లా సంబంధం తెస్తానో. కట్నా లెక్కణ్ణుంచి తెచ్చిపోస్తానో, పెళ్ళి ఎట్లా చేస్తానో నాకే తెలీకుండా ఉంది" అని ఆమె ఎరిగినవాళ్ళ దగ్గిరా, బంధువుల దగ్గిరా వాపోసాగింది.

చాలామంది జానకిని నరుసు కివ్వమని సలహాఇచ్చారు. కాని ఆడపిల్ల మేనత్త కొడుకును చేసుకోవటం సబబుగాని, మేనమామ కొడుకును చేసుకోరాదని ఆవిడ అనుమానం.

"అదేమిటమ్మా చాదస్తం? మేనమామను చేసుకోంగాలేందీ మేనమామ కొడుకెందుకు పనికిరాదు? ముడిపెట్టెయి. అయిన సంబంధం తేలికయిపోతుంది" అని చాలా మంది సలహా చెప్పారు.

ఆడపిల్లను మేనమామకొడుక్కు చేసుకోరాదన్న విశ్వాసం తనకు తప్ప ఇంకెవ్వరికీ తీవ్రంగా ఉన్నట్టు కనపడలేదు సీతమ్మగారికి.

"అది ఎట్లాగైనా రెండోపక్షమేగాని నిషేధం మటుకు కాదు" అన్నారు కొందరు.

సీతమ్మగారు అన్నకు కబురుచేసింది.

"నాదేం ఉందీ! నీకిష్టం ఉంటే అట్లాగే చేద్దాం. ముహూర్తంకూడా చూడనక్కర్లా మేము మాత్రమేవస్తాం. గుట్టుచప్పుడు కాకుండా చేసేయి పెళ్ళి." అన్నాడు శేషగిరి.

అన్నగారి వైఖరి సీతమ్మగారికి యెందుకో అసంతృప్తి కలిగించింది. జానకమ్మ పెళ్ళి తన జీవితంలో ఒక గొప్ప విషయంగా ఉండాలని ఆవిడ కోరిక. తాను, ఒంటరిగత్తె అయివుండికూడా కూతురికి గొప్ప సంబంధం తెచ్చిందని అందరూ

సంతోషించాలనీ, తన కూతురు భాగ్యవంతుల యింట కాకపోయినా గొప్పవాళ్ళింట పడాలనీ ఆవిడ కలలు కన్నది. అయితే ఇవి నిజమయే కలలుకావని ఆవిడకు తెలుసు. గొప్ప సంబంధాలకోసం ఆలోచించటానికి తనకు వెనక ఏమంత ఉన్నదని? ఏదో ఇంత తినటానికున్నది. అంతకన్నా చెప్పుకునేటందు కేమీలేదు.

ఆదినారాయణగారబ్బాయి క్రిష్ణమూర్తికి తన కూతుర్ని చేసుకుంటే, బాగుండునని ఆవిడకు కొండంత కోరిక కలిగింది. కానీ వాళ్ళను అడగటానికి అభిమానమయింది. వాళ్ళు చేసుకోమంటే? పైగా ఆ పిల్లవాడికి రెండువేలిస్తామనీ, మూడువేలిస్తామనీ, వస్తుంటే పెద్దవాళ్లు "మావాడికిప్పుడు పెళ్ళిచేసే ఆలోచనలేదు" అని చెబుతున్నారు. ఆదినారాయణగారి భార్య ధోరణి చూస్తే ఆవిడకు అయిదారువేలదాకా ఆశ వున్నట్టు కనబడింది. అంత కట్నం పొయ్యటం తనవల్ల ఎట్లా అవుతుంది? వున్నదంతా అమ్మాలి. ఆ తరవాత చిప్పపట్టుకోవలసిందే!

అప్పటికీ సీతమ్మగారు ఊరుకోలేక ఆదినారాయణగారి భార్యతో, "ఏమండీ వదినెగారూ, మా పిల్లకు మీ ఎరికెన ఎక్కడన్నావుంటే మంచి సంబంధం చూసి పెడుదురూ!" అన్నది.

"మీ పిల్లకేమండీ, రత్నంలాంటి పిల్ల! దానికి పందునాయనంటి మొగుడొస్తాడు" అన్నది ఆదినారాయణగారి భార్య భ్రమరాంబ.

ఈ మాటతో సీతమ్మగారికి కాస్త ధైర్యం వచ్చింది. "ఏమో వదినెగారూ, ఇన్నేళ్ళనుంచి పొరుపూ, పొచ్చెం లేకుండా కలిసి ఉంటున్నాం. మేమేం కట్నాలూ, కానుకలూ యివ్వలేకపోయినా, పిల్లని మీబోటివాళ్ళ చేతుల్లో పెడితే అవునని ఉన్నది కాని మీరు చేసుకుంటారా?" అన్నది.

భ్రమరాంబగారు చేతులు తిప్పుతూ "అయ్యో, మీ జానకంటిపిల్ల కోడలైతే ఇంకా కావలసిందేమిటండీ? కాని మావాడు బియ్యే పాసయ్యేదాకా పెళ్ళే వద్దంటూండె. ఈ కాలంలో ఆడపిల్లలకే ఇష్టంలేని పెళ్ళి చెయ్యలేకుండా ఉన్నాంకదా, మగపిల్లాడికి ఎట్లా చేస్తాం చెప్పండి అక్కగారూ?" అన్నది.

భ్రమరాంబను సీతమ్మగారు వదినె వరసపెట్టి పిలవటమూ, సీతమ్మగారిని భ్రమరాంబ అక్కవరసపెట్టి పిలపటమూ కూడా ఆరోజే మొదలూ, ఆరోజుతోనే చెల్లు కూడాను.

జానకి పెళ్ళికోసం తనతల్లి పడుతున్న తాపత్రయం సుందరానికి కొంత కాకపోతే కొంతైనా తెలుస్తూనే ఉంది. వాడికి యెన్నడూ క్రిష్ణమూర్తి అంటే అట్టే సదభిప్రాయంలేదు. ఏమోయ్ అంటే ఏమోయ్ అని ఇద్దరూ పలకరించుకునే వాళ్ళుగాని, ఇద్దరూకలిసి దోస్తీగా మాత్రం తిరిగేవాళ్లుకాదు. చదువులో, మార్కుల్లో వాళ్ళకి కనపడని పోటీ ఉండేది. నాగేశ్వర్రావుబావ మాటవిని తను టైప్‌రైటింగ్, షార్టుహాండ్ తీసుకుంటే క్రిష్ణమూర్తికి తక్కువై పోవాలిసొస్తుందన్న దురభిమానం కూడా సుందరాన్ని బాధించింది. క్రిష్ణమూర్తి లెక్కలు తీసుకుంటాడని సుందరం యెరుగును.

అయినప్పటికి క్రిష్ణమూర్తికి జానకి నివ్వగలగితే జానకి అదృష్టవంతురాలవుతుందని సుందరం గ్రహించాడు. రెండుమూడేళ్ళ క్రితం రామ్మూర్తి పెళ్ళికిగాను ఆదినారాయణగారు స్వగ్రామం వెళ్ళినప్పుడు సీతమ్మగారు మాటవరసగా "జానకి రామ్మూర్తిగారికి ఈడుకాదుగానీ క్రిష్ణమూర్తికి ఈడే" నన్నప్పుడు సుందరం "రామ్మూర్తికి ఈడూ కాదు, క్రిష్ణమూర్తికి జోడూ కాదు" అన్నమాట నిజమే. కాని ఈ రెండు మూడేళ్ళల్లో సుందరం కొద్దిగా కళ్ళుతెరచి క్రిష్ణమూర్తికి "మంచి సంబంధం" కింద జమ అనీ, తనకు పిల్లనివ్వనివాళ్ళు క్రిష్ణమూర్తి కివ్వవచ్చుననీ గ్రహించాడు. క్రిష్ణమూర్తికి డబ్బున్నది. క్రిష్ణమూర్తి తండ్రికి హోదా, పలుకుబడీ, ఉన్నాయి. అంతకంటే ఇంకేం కావాలి? తన తండ్రి బతికిఉంటె తనకూ కొంత హోదా ఉండునేమో. కాని ఇప్పుడు తను ఎవరు?

జానకిని క్రిష్ణమూర్తికిస్తే బాగుండునని తోచినట్టే నరుసు కివ్వమంటే సుందరానికి అసమ్మతికూడా కలిగింది. ఎంత దగ్గిర బంధువైతే మటుకు చూస్తూ చూస్తూ నరుసుకు జానకి నివ్వటమేమిటి? వాడు పూర్తిగా గొడ్లకాడి పిల్లలపత్తు అయిపోయినాడు. బీడీలు కాలుస్తాడు. చదువూ సంధ్యాలేదు. పల్లెటూరి బైతులందర్నీ చేర్చి రెండుచేతులా హార్మోనియం వాయిస్తూ, పాటలూ, పద్యాలుపాడి వాళ్ళు నోళ్ళు తెరుచుకు చూస్తుంటే చాలా గొప్పవాణ్ణనుకోవటం తప్ప వాడికేమీ చాతకాదు. వాడికా జానకి నివ్వటం, వాడికన్నా జానక్కి – యెక్కువ – చదువొచ్చు.

నరుసు పల్లెటూరి వాలకమూ, వాడి ముతక ఖద్దరు గుడ్డలూ, పల్లెటూరి హాస్యమూ తలచుకున్నకొద్దీ సుందరానికి వాడిమీద మరింత దురభిప్రాయం ఏర్పడటమేగాక, క్రిష్ణమూర్తిమీద గౌరవం హెచ్చసాగింది. క్రిష్ణమూర్తికి జానకి పెళ్ళాంకావటం అసంభవమనీ, నరుసుకిచ్చి ముడి పెట్టేకన్న తమకు తాహాతులేదనీ తనబుద్ధికి రూఢి అయిన కొద్దీ సుందరం బుద్ధి మరింత తిరగబడిందేగాని ఉన్న పరిస్థితులకు సమాధాన పడలేదు – ఆ మాట అని ఉన్న పరిస్థితులను మార్చటానికీ పూనుకోలేదు.

నరుసుకూ జానకికీ పెళ్ళి అయింది. పెళ్ళికి సీతమ్మగారు ఏడువందలు అప్పుతెచ్చి ఖర్చు చేసింది. ఇందువల్ల ఎవరు సంతోషించారో తెలీదు. సుందరానికి పెళ్ళి ఎంతమాత్రం యిష్టంలేదు. తన చెల్లెలు ఇంత ఖర్చు చెయ్యటం శేషగిరికి అసలే ఇష్టంలేదు. "ఎందుకు పెట్టుకున్నా వింతమేళం? అసలే దేశం అధోగతిలో ఉంటేనూ!" అన్నాడాయన. పెళ్ళి చూసినవాళ్ళు మహావైభవంగా జరిగిందని అనుకోనేలేదు. పెళ్ళి నడిమింటకూచుని చుట్టపక్కాలు వైభవంగా జరిగిన ఇతర పెళ్ళిళ్ళను గురించి తనివితీరకుండా చెప్పుకున్నారు.

ఈ పెళ్ళికీ, ఈ ఖర్చుకూ సంతోషించినది సీతమ్మగారొక్కతే. "ఏమోనమ్మా, ఆయన లేకపోయినా దేవుడల్లే కరణంగారు అప్పు ఇప్పించబట్టీ పెళ్ళి ఈ మాత్రంగానన్నా చెయ్యగలిగా. మళ్ళీ పెళ్ళి చెయ్యబోయినానా పెట్టబోయినానా? పిల్లవాడున్నాడంటే వాడిదారి వేరూ? ఎట్లాగయినా వాడు మగవాడూ!" అన్న దావిడ.

అప్పుతెచ్చి అయినా అల్లుడికి వెండికంచమూ, వెండిచెంబూ, పట్టుబట్టలూ
పెట్టినందుకు సీతమ్మగారు సంతోషించింది. తన భర్త ఆస్తి అచ్చగా సుందరమే
కాకుండా తన కూతురుకూడా తింటున్నదిగదా అన్న సంతృప్తి ఆవిడకు పూర్తిగా
కలిగింది. శేషగిరి సూచించినట్టు నూరు రూపాయల్లో పెళ్ళి అయేదే కాని
జానకమ్మకు తండ్రి ఆస్తిలో దమ్మిడీకూడా ముట్టేదికాదు. తరవాత సుందరం
ఉద్యోగం చేసి డబ్బు సంపాదించేటప్పుడు చెల్లెలికి పెట్టుకుంటే పెట్టుకుంటాడు.
మానుకుంటే మానుకుంటాడు. కాని తన హయాంలో జరిగే ఈ అక్కరసమయంలో
తాను తన కుమార్తెకు ఆ మాత్రం ఇచ్చుకునే అధికారం లేకపోలేదు. ఈ విధంగా
సీతమ్మగారు జానకి పెళ్ళి ఖర్చు తన అంతరాత్మనూ, కొందరు అమ్మలక్కలనూ
ఒకేసారి సమాధాన పరచ యత్నించింది.

పెళ్ళిని గురించి అపరిమితానందం చెందిన ప్రాణి మరొకడుకూడా ఉన్నాడు
నరుసు. వాడీ పెళ్ళిచూచి చాలా గర్వపడ్డాడు. తన పెళ్ళాన్ని గురించి గర్వపడ్డాడు.
తన బావమర్దిని గురించి గర్వపడ్డాడు. ఈ సంగతి నరుసు దాచలేదు – దాచాలని
వాడికి తట్టనూలేదు.

“అసలే దగ్గిర చుట్టాలమూ, ఇంకా దగ్గిర అయినందుకు నాకు బలే
సంతోషంగా ఉందిరా సుందరం? మన బంధువులందర్లోకీ నువ్వంటే నాకెప్పుడూ
ఎందుకో ఎక్కువ అభిమానం” అన్నాడు నరుసు.

ఈ మాటవిని ఏడవాలో, నరుసును చూసి జాలిపడాలో సుందరానికి
తెలీలేదు.

నరుసు తన పెళ్ళిచూసి సంతోషించటమేకాక పెళ్ళివారందరూ వుండగానే
నాటకాల్లో పద్యాలు పాడాడు, పాటలే పాడాడు. అంతటితో పోనివ్వక తన పద్యాలను
గురించి జానకి ఏమనుకున్నదీ కనుక్కుని చెప్పమని నరుసు సుందరాన్ని
బతిమాలాడు.

“భగవంతుడా. జానకి ఏం పాపం చేసుకుని ఈ పిచ్చివాడికి పెళ్ళామయింది”
అనుకున్నాడు సుందరం.

సుందరాన్ని చూసి నరుసు ఎంత గర్వపడ్డాడో! నరుసుని చూసి సుందరం
అంత సిగ్గుపడ్డాడు.

❀ ❀ ❀ ❀

ఊళ్ళో కొందరు పెద్దలు సినిమా ఒకటి పెట్టారు. అందులో వరసగా అమె
రికన్ స్టంటుపిక్చర్లు, సీరియల్స్ వెయ్యసాగారు. సుందరం తల్లితో పోట్లాడి ప్రతివారం
సినిమాకు డబ్బులు పుచ్చుకుని వెళ్ళసాగాడు. ఎడ్డీపోలో[30] విలియం డెస్మాండు[31],

---

30. ఎడ్డీపోలో: అమెరికన్ చలనచిత్ర నటుడు.

31. విలియం డెస్మాండ్: అమెరికన్ చలనచిత్ర నటుడు.

డగ్లస్ ఫెయిర్‌బాంక్స్[32] ఎల్మోలింకన్ మొదలయిన నటులు - సుందరం దృష్టిలో గొప్పనటులు - నటించిన సినిమాలు వేశారు.

నిజానికి సుందరం అప్పటికే బళ్ళారి రాఘవాచారి[33]నీ, స్థానం నరసింహారావు[34]నూ స్టేజిమీద చూచి తన్మయుడైనాడు. రాఘవాచారి "పఠాన్", స్థానం "రోషనారా" చూచినప్పుడు సుందరం ఉక్కిరి బిక్కిరైనాడు. అయినా నటనను గురించి వాడి అభిప్రాయాలింకా పాకానికి రాక ఈ స్టంట్ నటుల కుప్పిగంతులు కూడా నటనే అనుకున్నాడు.

అయితే రాను రాను యీ సినిమావాళ్లు హాలీవుడ్ నుంచి అనేక మంచి సినిమాలు కూడా తెప్పించివేశారు. చార్లీ చాప్లిన్[35] హాస్యచిత్రాలు డజన్లకొద్దీ వేశారు. చార్లీ చాప్లిన్ వింత ఆకారమూ, టోపీ, దుస్తులూ, చేతికర్రా, వంకర నడకా, సగం మీసాలూ సుందరాన్ని బలంగా ఆకర్షించాయి.

32. డగ్లస్ ఫెయిర్ బాంక్స్ (1883-1939): అమెరికన్ చలనచిత్ర నటుడు. అసలు పేరు జూలియస్ ఉల్మన్. రంగస్థల నటుడిగా ప్రఖ్యాతి పొంది, ఆ తర్వాత హాలీవుడ్ వెళ్ళాడు. అనితాలూజ్ రచించిన సరదా అయిన వ్యంగ్య వినోదాత్మకాల్లో ప్రఖ్యాతి పొందాడు. 1919లో ఛార్లీ చాప్లిన్, డి. డబ్ల్యు. గ్రిఫిక్, మేరీఫిక్ ఫోర్డ్స్‌తో కలిసి యునైటెడ్ ఆర్టిస్ట్ సంస్థ స్థాపించాడు. 'ది మార్క్ ఆఫ్ జీరో (1920), 'రాబిన్ హుడ్' (1922), ' ది తీఫ్ ఆఫ్ బాగ్దాద్ (1924), 'దిబ్లాక్ పైరేట్' (1926) చిత్రాల్లో సాహసకృత్యాలు చేసే నటుడిగా ప్రఖ్యాతుడు.

33. బళ్ళారి రాఘవాచారి (1880-1946): భారతదేశ అగ్ర రంగస్థల నటుల్లో ముఖ్యులు. రామదాసులో రామదాసు, చంద్రగుప్తలో చాణక్యుడు, ప్రహ్లాదలో హిరణ్యకశ్యపుడు, చంద్రహాసలో దుష్టబుద్ధి, సుభద్రార్జునీయంలో అర్జునుడు, రోషనారలో శివాజి, సారంగధరలో రాజరాజు, రామరాజ చరిత్రలో పఠాణి మొదలైన పాత్రలు ఆయన అభినయకీర్తికి దృష్టాంతాలు. శిశిర్ కుమార్ బాధురి, టాగోర్, బాలగంధర్వ, గుబ్బివీరన్న మొదలైన ఆంధ్రేతర కళాకారుల ప్రశంసలు పొందిన రంగస్థల నటుడు. ఒథెల్లో, మేక్‌బెత్, హేమ్లెట్, షైలాక్ పాత్రలను అభినయించి ఆంగ్ల నటకులనే ఆశ్చర్యపరిచిన కళాకారుడు (1927). 1935 లో ద్రౌపదీ మాన సంరక్షణం, రైతుబిడ్డ చిత్రాలల్లో నటించారు. బహుభాషావేత్త, మంచి వక్త, రచయిత.

34. స్థానం నరసింహారావు. (1902-1971): స్త్రీ పాత్రలు ధరించి, నటనా కౌశలంతో నాలుగు దశాబ్దాల కాలం రంగస్థలం మీద వెలిగిన నటుడు. నటశేఖర, ఆంధ్ర గంధర్వ, నటకావతంస బిరుదులు పొందారు. కన్యాశుల్కంలో మధురవాణి, సారంగధరలో చిత్రాంగి రోషనారలో రోషనార వేషాలు ధరించి కీర్తి పొందిన నటుడు.

35. చార్లీ చాప్లిన్ (1889-1975): ప్రపంచ విఖ్యాత చలనచిత్ర నటుడు. ముకాభినయవేత్త, ప్రొడ్యూసరు, దర్శకుడు చాప్లిన్ సినిమాల్లో హాస్య, కరుణ రసాలు సమ్మిళితమైన నిశిత సమాజ విమర్శ వుంటుంది. "చాప్లిన్ చిత్రాల ద్వారా సాంఘిక వ్యవస్థను విమర్శించుతాడేకానీ ప్రపంచానికి రాజకీయ ప్రణాళిక లివ్వడని" ఒకచోట కొడవటిగంటి కుటుంబరావు రాశారు. 1925-47 మధ్య "కిడ్", "గోల్డ్ రష్", "సర్కస్", "సిటీ లైట్స్", "మోడరన్ టైమ్స్", "గ్రేట్ డిక్టేటర్" "మాన్సూన్ వెర్డ్" సుప్రసిద్ధ చలనచిత్రాలు తీశారు. ఇందులో ఎక్కువభాగం మూకీలే. కమ్యూనిస్టుల సానుభూతిపరుడనే నెపంతో అమెరికన్ ప్రభుత్వం చాప్లిన్‌ను వేధించింది.

ఈ రోజుల్లోనే సుందరం ఇమిటేషనాచారి ప్రదర్శనమూ, మాస్టర్ మన్‌హర్ బర్వే సంగీత ప్రదర్శనమూ కూడా చూశాడు. తన చదువూ, తనకు సన్నిహితంగా వుండే జానకి పెళ్ళిలాటి సంఘటనలూ తప్పిస్తే ఇవే – ఈ ప్రదర్శనాలే, ఈ సినిమాలే – సుందరానికి మానసిక వాతావరణం. వాటిని గురించి మాట్లాడేవాడు. ఆలోచించేవాడు.

కాని వీటన్నిటినీ తలదన్నారు విప్ర వినోదులు. ఒకరోజు స్కూల్లో వాళ్ళ ప్రదర్శనం ఏర్పాటు చేశారు. స్కూలు పిల్లలంతా వాళ్ళ చుట్టూ నిలుచున్నారు. కూచున్నారు. మేష్టర్లకు మాత్రం కుర్చీలు వేశారు.

అసలు ముగ్గురు విప్ర వినోదులు. అందులో ఒకడు మటుకు ప్రదర్శనం ఆరంభంలోనే ఇసకలో నాలుగు పుల్లలు నిలబెట్టి వాటిచుట్టూ గుడ్డ ఒకటి చుట్టి, పైనకూడా గుడ్డ కప్పి, అందరూ చూస్తుండగానే అందులోకి ఒకడు చేరాడు. మిగిలిన ఇద్దరూ రకరకాల విద్యలు ప్రదర్శించారు. ఇసకలో తేలు బొమ్మగీసి దానికొండిమీద స్కూలు ప్యూనును వేలు పెట్టమని వాడికి తేలు కుట్టినంత బాధ తెప్పించారు వాడు వేలు చేత్తో గట్టిగా పట్టుకుని "అమ్మో, బాబో" అని ఏడుస్తుంటే మొదటి కుర్రాళ్ళు నవ్వారు. కాని అంతకంతకూ వాడి బాధ జాస్తి అయింది. చివరకు మేష్టర్లు కూడా జోక్యం కలిగించుకుని వాడికి బాధపోగొట్టమని విప్ర వినోదులను అడగాలిసొచ్చింది. వాడికి బాధ ఎట్లా వచ్చిందో అట్లాగే పోయింది.

తరవాత కుర్రాళ్ళు కొందరు వాణ్ణి ఎడంగాపిలిచి, "ఏంరా పోలాయ్? నిజంగా నీకు బాధ పుట్టిందా? లేక దొంగవేషం వేశావా?" అని అడిగితే వాడు నిజంగా బాధపెట్టిందన్నాడు. తేలు కుట్టినచోట యింకా చిమచిమ లాడుతున్నదా అంటే లేదన్నాడు.

విప్ర వినోదు లింకా చాలా తమాషాలు చేశారు. అందులో కొన్ని వీధి గారడీ వాళ్ళు చేసేవి. మరికొన్ని కనుకట్టు లాటివి.

అన్నిటికన్నా సుందరానికి జన్మలో మరపురాని విస్మయం కలిగించిందేమంటే గుడారంలోనుంచి దేవతార్చన గంట వినిపించింది. ఆ మరుక్షణం హారతి వెలుగుతున్నట్టు గుడ్డలోనుంచి కనిపించింది. గుడారంలోకి వట్టి చేతులతో వెళ్ళిన మనిషి హారతి పళ్ళెంతో, రెండోచేత గంట వాయించుకుంటూ గుడ్డ తోసుకుని బయటికొచ్చాడు. తరవాత గుడ్డ తీశాడు. లోపల మూడు విగ్రహాలు అమర్చివున్నాయి. వాటి పాదాల వద్ద పూలు పూజ చేసి ఉన్నాయి. విగ్రహాల ముందు రెండు పళ్ళాలలో కొబ్బరి ముక్కలూ, అరటిపండు ముక్కలూ, ప్రసాదం ఉన్నాయి.

అందరూ హాహాకారాలు చేశారు.

నాగేశ్వర్రావుతో యింటికి తిరిగివచ్చే సుందరానికి ఈ ప్రదర్శనం గురించి ఎట్లా మాట్లాడుకోవాలో కూడా సరిగా తెలియలేదు. ఇద్దరూ కలిసి చూసిన వింతనే ఒకరికొకరు పదేపదే చెప్పుకున్నారు.

"ఇంత విద్య వాళ్ళ దగ్గిర ఉండికూడా కానీ, అర్ధణా యిమ్మని పిల్లల్ని ఎట్లా బతిమాలారో! ఎట్లా దణ్ణాలు పెట్టారో!" అన్నాడు సుందరం.

"నాకే అటువంటి విద్య ఉంటేనా పదిహేను రూపాయలు టిక్కెట్టు పెట్టి ఏ నాటకం హాలులోనో చూపించి వుందును" అన్నాడు నాగేశ్వర్రావు.

❀ ❀ ❀ ❀

స్కూలు ఫైనలు పరీక్షలు దగ్గిరపడ్డాయి. సుందరం ఇంటిదగ్గిర చాలాకొద్ది కాలమే గడుపుతున్నాడు. వాడూ నాగేశ్వర్రావూ కలిసి ఏకదీక్షగా చదివేస్తున్నారు. నాగేశ్వర్రావు షార్టుహేండ్ వాడు గనక లెక్కలూ, సైన్సూ కూడా సుందరం ఒంటరిగా చదువుకోవలసిందే. అయినాకూడా సుందరం నాగేశ్వర్రావింట్లోనే చదవటానికి సిద్ధపడ్డాడుగాని, క్రిష్ణమూర్తితో చదవటానికి ఒప్పుకోలేదు. ఆ విషయంలో క్రిష్ణమూర్తి ఆటే బలవంతం చెయ్యలేదు కూడానూ.

ఒకరోజు శేషగిరి వచ్చాడు.

"ఎట్లాగో ఈయేడుతో పిల్లవాడు మెట్టున పడ్డాడు. ఇకముందెట్లాగో తెలియటం లేదు. వాడికేమో కాలేజీకి వెళ్ళి చదవాలని వున్నది. కాలేజీ చదువంటే మాటలా? పిల్ల పెళ్ళికి చేసిన అప్పుమీద ఏటా నూరు రూపాయలు వడ్డీ పెరుగుతున్నది" అన్నది సీతమ్మగారు.

సీతమ్మగారి చిక్కులు శేషగిరికి సహజమైనవిగా కనిపించాయి. వాటిపట్ల ఆయనకు సానుభూతి లేకపోగా, వాటిని గురించి ఆలోచించే ఓర్పు కూడా లేదు. "ఆ పోనిస్తూ, వాడు చెప్పటానికేం? చదువుమాని ఏదైనా ఉద్యోగం చూసుకోమను. లేదూ ఇంటిపట్టున కూచుని ఉన్న పొలం చూసుకోమను. అసలే అంతంతమాత్రంగా ఉంటే యింకా కాలేజీ చదువెక్కడ చెప్పిస్తావు? కాకపోయినా ఎందుకొచ్చిన కాలేజీ చదువులు, ఏమిటో?" అన్నాడాయన.

"నీ జీవితం నువు నిరర్థకపరచుకున్నావు. అందుచేత నీకు ఎవరి జీవితం గురించీ నిజమైన ఆసక్తిలేదు" అని శేషగిరితో ఎవరన్నా అనివుంటే ఆయన ఒప్పుకుని ఉండేవాడు కాదు. పైపెచ్చు ఆయనకు కోపంకూడా వచ్చి ఉండేది. "దేశం కోసం త్యాగం చెయ్యటం తప్పా?" అని ఆయన ఎదురు ప్రశ్నించి ఉండేవాడు.

అందుచేత ఆయన ప్రస్తుత పరిస్థితినిగాని, మనస్థితినిగాని విమర్శించి లాభంలేదు. కాని వాటిని అర్థంచేసుకోవాలంటే మాత్రం ఆయన తన జీవితాన్ని నిరర్థకపరుచుకున్నవాడి స్థితిలో ఉన్నాడన్నది గుర్తించి తీరాలి.

"రోలు మద్దెలతో మొరపెట్టుకున్నట్టుంది" అనుకున్నది సీతమ్మగారు తనలో.

ఎవరితోనూ చెప్పుకుని లాభంలేని ఈ సమస్య గురించి ఆవిడకు చాలా బాధగా వున్నది. ముందు చదువు విషయమయి ఉన్న చిక్కులు సుందరంతో మాట్లాడాలని ప్రయత్నించింది. వాడు చదువు మానటానికి ఎంత మాత్రమూ ఒప్పలేదు. పైపెచ్చు చాలా బాధపడ్డాడు. కాస్త గింజుకున్నాడు కూడానూ. "పరీక్షలు పూర్తి కావటం మటుకు దేనికీ? ఇప్పుడే మానేస్తాను" అన్నాడు కళ్ళనీళ్ళ పర్యంతమై.

తన నోటితోనే "ఇక చదువు చాల్లే నాయనా. ఎక్కడన్నా నాలుగు రాళ్ళుతెచ్చుకొనే దారి చూడు" అనవలసిరావటం సీతమ్మగారిక్కూడా కష్టంగానే ఉన్నది.

ఈ చదువుల వల్ల కొడుకు తనకు దూరమవుతున్న సంగతి కూడా ఆవిడకు తెలుసు. అయినా దానిక్కూడా సమాధాన పడింది. తనకు మించిపోయి తనకే చెప్పగల స్థితిలోకి కొడుకు వస్తున్నాడుగదా అని సంతోషించింది.

కాని వాడి చదువుకు డబ్బు చూపించే బాధ్యత తనమీద ఉన్నప్పుడు తన అసమర్థత కొడుక్కు చెప్పుకోకుండా ఎట్లా?

"అయినా ఆ విషయమై ఇప్పట్నించే మధనపడటం దేనికి? పరీక్ష అయిన తరువాత ఏదో చూడవచ్చు. ఈ వేసవికాలం వాడికి పెళ్ళి చేసేస్తే కాబోయే మామగారేమన్నా..." అనుకున్నది సీతమ్మగారు.

## 17

సుందరం స్కూలు ఫైనలు పరీక్షలకు కూచుంటున్నాడు. ఆయేడు పరీక్షా పత్రాలలో కొన్ని కొత్త మార్పులు వచ్చాయి. కొద్దిమంది విద్యార్థులను ఇది కంగారు పెట్టిందిగాని, సుందరానికి ఎట్టి యిబ్బందీ కలగలేదు. పరీక్షలకు చదవటంలో సుందరం నోట్సు సహాయం తీసుకోవటంగాని, రాబోయే ప్రశ్నలు ఊహించటంగానీ, సులభ మార్గాలు అవలంబించటంగాని చేసేవాడు కాడు. ప్రతి సబ్జెక్టూ సొంతం చదివేవాడు. ఏ ప్రశ్న వచ్చినా, తనకున్నంతలో తెలివితేటలు ఉపయోగించి సమాధానం రాయడానికి సిద్ధంగా ఉండేవాడు.

సుందరం లెక్కల పరీక్ష రాసివచ్చినరోజున ఇంటికి రాగానే జానకి, "విన్నావా? శకుంతల మొగుడు పోయాట్ట!" అన్నది.

"ఏ శకుంతల?" అన్నాడు సుందరం ఏమీ ఆత్రంగానీ, విచారంగానీ లేకుండానే.

"నా స్నేహితురాలు శకుంతలే. ఇంకెవరున్నారూ?" అన్నది జానకి. సుందరం మొహంలో మార్పేమీ లేకపోవటం చూసి జానకి, "ఏం మనిషి" అనుకున్నది.

శకుంతల కింతగతి పట్టినందుకు లోపల రాయిపెట్టినట్టున్న సుందరం తన చెల్లెలిని చూసి, "ఏం మనిషి?" అనుకున్నాడు. జానకి తన స్నేహితురాలిని గురించి కించిత్తయినా విచారిస్తున్నదని సుందరానికి నమ్మకం లేకపోయింది.

గంటల తరబడి సుందరం శకుంతలకు పట్టిన ఈ దుస్థితిని గురించి తప్ప ఇంక దేన్ని గురించీ ఆలోచించలేకపోయినాడు. వచ్చే నెలలోనో ఎప్పుడో ఆ పిల్ల కాపరానికి వెళుతుందనికూడా ఇంట్లో జానకీ, తన తల్లీ అనుకోవటం విన్నాడు. ఇంకేం కాపరానికి పోతుందీ? రేపో ఎల్లుండో జానకి కాపరానికి పోతుంది. పిల్లల్ని

కంటుంది. చీరెలు కట్టుకుని, పూలూ, నగలూ పెట్టుకుని, పేరంటాలకూ వాటికీ పోతూ ముత్తయిదువుగా వుంటుంది. జానకితోటిదే శకుంతల. ఇవేమీ చెయ్యదు.

"అన్నట్టు శకుంతలకు జుట్టు తీసేసి కోరామల్లు కట్టి రాత్రిపూట అన్నం బదులు పిండి తినిపిస్తారు గామాలు" అనుకున్నాడు సుందరం గాభరాగా. వాడి రక్తమంతా ఒక్కసారి చల్లబడ్డట్లయింది. ఈ సందేహం ఎట్లా నివర్తి చేసుకోవటం? తల్లి నడిగితే అందరికీ తెలిసిపోయి అందరూ తనను చూసి నవ్వుతారేమో.

"నాకేదో దివ్యదృష్టి ఉండి ఉంటుంది. శకుంతల మొహంలో ఎప్పుడూ - నవ్వుతూన్నాకూడా - ఏదో దైన్యం కనపడేది. ఆ పిల్లమొహం అట్లా దిగాలుగా వుంటుందేమని అంటే అమ్మ. "చాల్లే. ఆ పిల్లది చక్కని కళ మొహం అన్నది" అనుకున్నాడు సుందరం.

వాడి మనస్సు ఇంకా అనేకరకాల పోయింది. తన తండ్రి చచ్చిపోయినప్పుడు తల్లి ఏడవటం జ్ఞాపకంవచ్చి శకుంతల కూడా అట్లాగే ఏడిచి వుంటుందా? అని ఆశ్చర్యపడ్డాడు. ఈసారి శకుంతల కనిపిస్తే ఆమెను చూడటానికి తనకు భయం వేస్తుందనుకున్నాడు.

"ఈ పరీక్షలైన తరవాత నా బతుక్కూ నాగేశ్వర్రావు బతుక్కూ మధ్య ఎంత తేడా ఏర్పడుతుందో. ఇకముందు జానకికీ, శకుంతలకూ అంత తేడా వుంటుంది" అనుకున్నాడు సుందరం. శకుంతలతోబాటు నాగేశ్వర్రావు మీదకూడా వాడికి చాలా జాలి కలిగింది. ఎందుకంటే తాను బియ్యే డిగ్రీ తెచ్చుకుని పెద్ద ఉద్యోగాలు సంపాదిస్తే, పాపం నాగేశ్వర్రావు, ఇంతటితో చదువు కట్టిపెట్టి ఏదో చిన్న ఉద్యోగం చూసుకుంటాడు.

"నేను అభిమానించేవాళ్ళెవరికీ అదృష్టం ఉండదుగామాలు. ఏం జాతకం నాది?" అనుకున్నాడు సుందరం.

వ్యథ పడటంలో కూడా ఆడదానికీ మగవాడికీ తేడా ఉంటుంది గద. శకుంతలకు ప్రాప్తించిన వైధవ్యం గురించి సుందరం లోపల కుమిలితే, జానకీ సీతమ్మగారు కూడా ఈ విషయం రోజుల తరబడి మాట్లాడుకుని తమ ఆవేదన ఉపశాంతి చేసుకున్నారు. వాళ్ళు తమలోతాము మాట్లాడుకునే ప్రతీమాటా సుందరం వింటూనే ఉన్నాడుగాని, విననట్టు నటించాడు. వాళ్ళకు నిజంగా మనస్సులో విచారం ఉంటే ఏ సర్కస్ గురించో, సినిమా గురించో మాట్లాడుకున్నట్టు అట్లా మాట్లాడుకుంటారా? దీనికితోడు వాళ్ళు ప్రకటించే భావాలూ, శకుంతలపై చూపే అభిమానమూ అమిత కృత్రిమంగా - అబద్ధంగా, కపటంగా కనిపించాయి.

"అయ్యో పాపం, ఆ పిల్లంటే నాకు మా జానకిని చూసినట్టే ఉండేదండోయ్. ఇద్దరూ ఎప్పుడూ విడవని జంటగా ఉండేవాళ్ళు కాదూ?" అన్నది సీతమ్మగారు భ్రమరాంబతో.

"నే నెరగనూ?" అన్నది భ్రమరాంబ.

ఆవిడ శ్లేషగా మాట్లాడిందేమోనని కూడా సుందరానికి అనుమానం తట్టింది.

తన తల్లి ఆవిడతో అంత అతిశయోక్తులాడకపోతే ఏమనుకున్నాడు వాడు.

శకుంతల భర్తచావు వివరాలు కూడా సుందరానికి ఆడవాళ్ళ సంభాషణ ద్వారానే తెలియవచ్చాయి. శకుంతల రజస్వల అయినప్పుడు కొద్దిపాటి శాంతి కావాలనుకున్నారు. శకుంతల భర్తకు శాంతుల్లోనూ, శాపనార్థాల్లోనూ నమ్మకం లేదు. గర్భాదానప్పీటల మీదనే నూనెలో మొహాలు చూసుకుంటారు లెమ్మనుకున్నారు. కాని ఏదీ? అతనికి మామూలు జ్వరమే వచ్చింది. మందులిస్తే ఎక్కువయింది. బరువుగా వుందని టెలిగ్రామిస్తే నిన్న రాత్రే శకుంతలా, ఆమె తల్లిదండ్రులూ బయలుదేరి వెళ్ళారు. వాళ్ళు వెళ్ళేటప్పటికే దాదాపు అంతా అయిపోయింది. వార్త ఇవాళ తెలిసింది. భార్యనూ, పిల్లనూ అక్కడే వొదిలేసి శకుంతల తండ్రి తిరిగి వచ్చాడు.

"దిక్కుమాలిన ఉద్యోగాలాయె మరి. అల్లుడు చచ్చినా శలవు పుచ్చుకోక తప్పదుగా... ఇంకేముందీ? ఇవాళో రేపో వాళ్ళూ వస్తారు. దహనం ఉదయమే అయిపోయి ఉంటుంది. ఇంక వాళ్ళక్కడ ఉండిచేసేది మాత్రమేముంది. నెత్తిబాదుకు ఏడవటం తప్ప. అదెట్లాగూ జన్మల్లా రాసిపెట్టి ఉన్నదాయె! హుం!" అన్నది సీతమ్మగారు.

"ఇక ఆ పిల్ల ఆ తల్లిదండ్రులకు రొమ్ముల కుంపటే గాదుటండీ! ఇంకేమన్నా ఉన్నదా?" అన్నది భ్రమరాంబ.

తన తల్లి మాటలకన్న భ్రమరాంబగారి మాటలే హృదయంలోంచి వస్తున్నట్టు తోచింది సుందరానికి.

సుందరం పైకి అనటానికి భయపడిన మాట జానకి అనేసింది.

"అయితే అమ్మా శకుంతలకు జుట్టు తియ్యరుగా?" అన్నది జానకి.

"జుట్టొకటి తియ్యకపోతే ఏం తల్లీ? ఇంత విపత్తు ఆ బిడ్డకు మళ్ళీ జన్మలో కలగబోదుగదా?" అన్నది భ్రమరాంబ.

సుందరం హృదయంలో వున్న భారంలో సగం దించేసినట్టయింది. భ్రమరాంబకు ఎన్ని కొబ్బరికాయలు కొట్టినా ఆవిడ ఋణం తీరదని వాడు తన అంతరాత్మలో అనుకున్నాడు.

ఆ రాత్రి అన్నం తినేటప్పుడు సుందరం అకస్మాత్తుగా తలఎత్తి "అమ్మా, మొగుడుపోయిన వాళ్ళందరికీ జుట్టు తీస్తారుకదా. శకుంతలకు తియ్యరా?" అన్నాడు. వాడి గొంతులో తీసేస్తే బావుండునన్న ధ్వని పైవాళ్ళకు వినిపించింది.

"నీదంతా సోద్దెంరా, కాపరానిక్కూడా వెళ్ళని పిల్లకు జుట్టు తీయించి కూచోబెడతారా ఏం? పాపం చిన్నపిల్ల. జానకి ఈడుదేగద - ఖర్మ ఇట్లా కాలిందిగాని!" అన్నది సీతమ్మగారు

జానకి పైకేమి అనలేదుగాని, సుందరం కేసి ఒక్కసారి చూసి మళ్ళీ "ఏం మనిషి" అనుకున్నది.



మర్నాడు పరీక్షకు చదువుదామని కూర్చున్నాడు సుందరం. చదువుమీద దృష్టి నిలవలేదు.

"ఎందుకీ చదువు? అంతా తెలిసినదే. ఆత్రంకొద్దీ చదవటమేగాని ఇవాళ కొత్తగా తలకు పట్టించుకునేందు కేముంది? వెధవ చదువు. వెధవ జీవితం. రేపేంజరిగేది తెలీదు. అన్నీ తెలిసినట్టుగా ప్రయత్నాలు చేస్తాం" అనుకున్నాడు వాడు విరక్తిగా, పుస్తకం మీదినుంచి ఆలోచన యెటో పోసాగింది.

అందరూ నిద్రపోతున్నారు. శకుంతల మొగుడు పోయాడన్న సత్యం ఒకటే మేలుకుని ఉండి నిశ్చల జ్యోతిలాగా వెలుగుతున్నది. రాత్రి పదకొండయింది.

తలవైపున స్టూలుమీదవున్న లాంతరు దీపం తగ్గించి పుస్తకం మూసేసి దిండుకిందపెట్టి గుండెమీద చేతులు ముడుచుకుని సుందరం కళ్ళు మూసుకుని వెల్లకిలా పడుకున్నాడు. ఇప్పుడు వాడి ఆలోచనలు తిన్నగా ఒక ధోరణికి రాసాగాయి... ఎవరు చూశారు. శకుంతలకు వాళ్ళ వాళ్ళు మళ్ళీ పెళ్ళి చెయ్యొచ్చు. ఏం తప్పులేదు. మొగుళ్ళు పోయిన చిన్న పిల్లలంతా పెళ్ళి చేసుకోవలసిందే. అయితే ఎవరూ చేసుకోరు. భయం. ఎక్కడన్నా ధైర్యం గలవాళ్ళుంటే చేసుకుంటారు... ఒకడికి పెళ్ళయినదాన్ని మళ్ళీ ఇంకోడు చేసుకోవాలంటే ఎట్లాగయినా కొంచెం సిగ్గుగానే ఉంటుంది. అందరికి తెలుస్తుందాయె. వాళ్ళంతా ఏమీ అనకపోయినా లోపల అనుకుంటారుగా! వాళ్ళేమనుకుంటున్నారో మనకు తెలుసుగా!... అదీకాక అటువంటి పెళ్ళిళ్ళు చిన్నతనంలో పెళ్ళి చేసుకునే కుర్రాళ్ళూ, చదువుకుంటున్న వాళ్లూ చేసుకోరు. బాగా పెద్దయినవాళ్ళూ, ఉద్యోగాలు చేసుకునేవాళ్ళూ, డబ్బున్నవాళ్ళూ చేసుకోవాలి. అన్నట్టు రెండో పెళ్ళివాళ్ళు చేసుకుంటే భలే బాగుంటుంది.

ఎవరో రెండో పెళ్ళివాడు వచ్చి శకుంతలను తప్పక పెళ్ళి చేసుకుంటాడని క్షణంపాటు సుందరానికి గట్టి నమ్మకం కలిగి అంతలోనే ఆలోచన మరోదారిలో పడ్డది.

ఒకసారి పెళ్ళి అయేటప్పటికి ఆడదాని ఇంటిపేరు మారుతుంది గదా. మళ్ళీ పెళ్ళి చేసుకుంటే రెండోసారి మారుతుంది గామాలు... శకుంతల తన మొగుడు పోయినందుకు తప్పక ఏడిచి ఉంటుంది. అట్లా ఏడిచిన మనిషి ఇంకోణ్ని పెళ్ళి చేసుకోవటానికి ఒప్పుకుంటుందా? పోయిన మొగుడు కోసం ఏడిచిన సంగతి జ్ఞాపకం వుండదూ?... ఇటువంటివి ఎందుకు జరగాలీ? హాయిగా మొగుడు పెళ్ళాలు ఒక్కసారే పోతే ఎంత బాగుండును ఈ చిక్కులన్నీ లేకుండా!...

మర్నాడు సుందరం నిద్రలేచేసరికి ఎనిమిదయింది. బయట ఎండ చూసేసరికి ఏదో గొప్ప తప్పిదం చేసినట్టు భావన కలిగింది వాడికి. సామాన్యంగా ఆరింటికల్లా లేచేవాడు. తాను పరీక్షకు అరగంట ఆలస్యంగా వెళ్ళి పరీక్షాధికార్లు హాలులోకి రానివ్వమంటే తాను పేపరు రాయటానికి లేకుండాపోయి, పరీక్షతప్పి యింకోసంవత్సరం చదవవలసివస్తే ఎంత బాధపడవచ్చునో, అంత బాధా కొద్దిక్షణాలపాటు, సుందరం పక్కమీదనుంచి హడావుడిగా లేస్తూ ఆదరాబాదరా

మొహం కడుక్కుని బావి దగ్గరకు వెళ్ళి గబగబా నాలుగు బొక్కెనల నీళ్ళు పోసుకుని, ముక్కులానోటా అన్నం కొట్టుకొని స్కూలుకు చేరుకునేసరికి పరీక్ష కింకా అరగంట టైమున్నది. దాంతో పెద్ద ఆపద గడిచిపోయినంతగా మనస్సుకు భారం తగ్గిపోయింది. కాని ఇంకేదో భారం మనస్సు మీద వుండనే వున్నట్టు మనసు పూర్తిగా తేలికపడలేదు. ఆ భారం ఏమిటో సుందరం పరీక్షించి చూసుకోలేదు. ఎవరెవరు ఏయే ప్రశ్నలు వస్తాయనుకుంటున్నారో విన్నాడు. ఒక ప్రశ్న వస్తుందని ఒకరూ, చచ్చినారాదని ఇంకొకరూ, వస్తే రావచ్చునని మరొకరూ, ఎంత పందెం కడతావని వేరొకరూ శషభిషలు చెయ్యటం చూశాడు. కొందరు పుస్తకాలను తదేక ధ్యానంతో చూస్తూ మధ్య మధ్య కళ్ళుమూసి ఆ పుస్తకంలో తాము చూసినది మనసుల్లోకి పట్టిస్తూ పరీక్ష నెగ్గాలనే తాపత్రయాన్ని ప్రదర్శిస్తున్నారు. మరికొందరు తమకు పరీక్షను గురించిన చింతే లేనట్టు ఇంకేవో కబుర్లు చెప్పుకుంటున్నారు.

వీళ్ళంతా సుందరానికి వట్టి బుద్ధిహీనులుగా కనబడ్డారు. నిజమైన మానవుడు పరీక్షను గురించి విచారించకుండానే విచార సముద్రంలో మునిగి వుండాలని సుందరానికి అనిపించింది. పరీక్షకు పొయ్యే విద్యార్థీ పరీక్ష గురించి ఎందుకు ఆదుర్దా పడగూడదో, ఇంకే కారణంచేత విచార సముద్రంలో మునిగి ఉండాలో వాడికి స్పష్టంగా తెలీదు.

సుందరం ఆరోజు పరీక్షలో ఏం రాశాడో, ఎట్లా రాశాడో వాటి పేపరుదిద్ది పాసుమార్కులు వేసే పెద్దమనిషికీ, భగవంతుడికీ మాత్రమే తెలుసు. మూడో వాడికి తెలీదు.

పరీక్ష పూర్తి అయి సుందరం ఇంటికి వెళ్ళేసరికి ఇంట్లో జానకిలేదు. సీతమ్మగారు కూడా లేదు. వాళ్ళిద్దరూ శకుంతలను చూడవెళ్ళినట్టు పక్కభాగంలో అద్దెకున్న వాళ్ళు చెప్పారు. సుందరం ఒక నిట్టూర్పు విడిచి, వాళ్ళిద్దరూ ఇంటికి తిరిగివచ్చాక ఏమి భయంకరమైన విషయాలు చెబుతారో అని భయపడసాగాడు. కాని తీరా వాళ్ళు వచ్చి మాట్లాడటం మొదలు పెట్టినాక ఆ భయం నిరాధారమనిపించింది.

జానకి అన్నది: శకుంతల మామూలుగానే వున్నదట. తల కొంచెం రేగి వుందిట, మొహాన బొట్టులేదుట. అంతే, శకుంతల ఏడవలేదుట. వాళ్ళమ్మ మాత్రం ఎవరన్నా వచ్చినప్పుడల్లా చప్పుడు కాకుండా కంటతడి పెట్టుకుంటున్నదట. "మీ అన్నయ్య పరీక్షలు అయిపోయాయా?" అని శకుంతల జానకిని అడిగిందిటగూడా! ఇద్దరూ గదిలో ఒంటరిగా కూర్చుని చాలాసేపు ఏవేవో మాట్లాడారుట. తన మొగుడు చావటం గురించి అంతా చెప్పిందిట.

"పైవాళ్ళు చేసే పరామర్శచూస్తే ఒళ్ళు మండిపోతుంది." అన్నది జానకి. "శకుంతలకు వెంట్రుకలు తీసి ముసుగు వెయ్యటానికి ఎవరో సిద్ధంగా ఉన్నట్టు 'ఇంకా రెండేళ్ళదాకా జుట్టుంచుకోనివ్వండి పాపం' అంటారు! అది బతికినన్నాళ్ళూ 'రామా, కృష్ణా' అంటూ బతకాలిట! ఎవరో ఆయన తత్వోపదేశం చేస్తాట్ట! ఆయన

దగ్గిర ఉపదేశమైతే తరిస్తుందిట. చూస్తూవుండు, వాళ్ళనాన్న, దానికి తప్పక మళ్ళా పెళ్ళిచేస్తాడు. ఏం, చేసుకుంటే? చేసుకునేవాళ్ళే ఉండాలిగాని!" అన్నది జానకి.

❀ ❀ ❀ ❀

ఆ వేసవిలో సుందరానికి రెండు సంబంధాలు వచ్చాయి. పిల్లవాడికి పెళ్ళి వెంటనే చెయ్యటమా, కొంతకాలం ఆగటమా అన్న విషయం సీతమ్మగారు అడ్డమైన వాళ్ళందర్నీ సలహా అడిగింది.

"పదిహేనేళ్లు నిండినవాడికి పెళ్ళికి తొందరనిగాదు గాని, వీడి చదువెట్లాగా అని నాకు పెద్ద దిగులు పట్టుకుంది. కాలేజీ చదువంటే ఇంకోవూరు పోవలసిందేగదా? నేనుకూడా వెళ్ళాలాయె - కాస్త డబ్బా అదీ చూసి పెట్టాలన్నా, సమయానికి అందించాలన్నా మగదిక్కన్నది లేకపోయె. పెళ్ళిచేస్తే మామగారైనా కనిపెట్టి ఉంటాడేమోనని!" అన్నది సీతమ్మగారు, ఒకప్పుడావిడ పాపం దేనికైనా శేషగిరి మీద ఆధారపడటానికుండేది. ఇప్పుడాయన స్థితి ఏమీబాగాలేదు.

సుందరం పెళ్ళి చేసెయ్యమనే అందరూ సలహా యిచ్చారు. వచ్చిన రెండు సంబంధాల్లోనూ ఏదో ఒకటి చేసేద్దామనుకున్నది సీతమ్మగారు. ఆవిడ అప్పుడే తన కిష్టమైన సంబంధం ఎన్నుకున్నది కూడానూ. ఆ సంబంధం నేరుగా తన దగ్గిరకే నడిచివచ్చింది. వాళ్ళది ఏటి వద్దున పల్లెటూరు. పిల్ల తండ్రీ, ఆయన అన్నా భాగాలు పడలేదింకా. ఇద్దరికీ కలిసి యాభై ఎకరాల ఆస్తివుంది. ఏటా మూడువేల రాబడి వుంది. లంకంత ఇల్లున్నది.

"నా పిల్లను గురించి నేనే ఏం చెప్పుకుపోను? పిల్ల కను ముక్కు తీరుగా వుంటుంది. బుద్ధిమంతురాలు, తెలుగు చదువుకున్నది. సంగీతాలూ అవీ చెప్పించలేదు, మీకు కావాలంటే మీరు చెప్పించుకోండి. కట్నాలూ, లాంఛనాలూ మిమ్మల్ని అడగనివ్వం, వాటిదగ్గిర నేను లోభించినా మా అన్నగారూరుకోడు. మా ఇద్దరికీ కలిసి ఒకటే ఆడపిల్ల. పిల్లకు పది వెళతాయి శ్రావణానికి" అన్నాడాయన.

రెండో సంబంధం శేషగిరి ద్వారా వచ్చింది.

"పాపం, బాగా బతికినవాళ్ళు. ఇప్పుడు చితికిపోయారు. ఆయన ఎంతో పెద్ద మనిషి. పెద్దపిల్లకి పెళ్ళిచేసేసరికి కాళ్ళు విరిగాయి. ఇది రెండోపిల్ల. తెల్లగా మల్లెపువ్వల్లే వుంటుంది. అన్నివిధాలా కలవవలసిన సంబంధం" అని చెప్పాడు శేషగిరి. సీతమ్మగారి ప్రాణానికి ఎందుచేతోగాని, శేషగిరి తెచ్చిన ఈ సంబంధం ఏటొడ్డు సంబంధమంత సన్నిహితంగా తోచలేదు. సుందరం మొదలు పెళ్ళికే పేచీ పెట్టాడు. ఇప్పుడప్పుడే తనకు పెళ్ళి వద్దన్నాడు.

"అట్లా అంటే ఎట్లాగురా? నిన్నేమో చదువు చాలించమంటే నీకు కోపమాయె. పైచదవుకేమో ఏవూరో వెళ్ళాలాయె. ఊరుగాని ఊళ్ళో పోయి కూచుంటే నాకుమాత్రం దిక్కామొక్కా? ఆడచచ్చిందాన్నయినా ఇంటిపట్టున వుంటున్నా గనక రైతు ఇంటికి వచ్చి కనపడిపోతూ ఉంటాడు. ఎరిగినవాళ్ళున్నారు గనక వాళ్ళ కాళ్ళూ గడ్డాలు పట్టుకుని బతిమాలి పనులు చేయించుకోగలగుతున్నా. ఇకముందెట్లా

సాగుతుంది? నీమీద శ్రద్ధతీసుకునేవాళ్ళూ, నీ చదువు గురించి శ్రద్ధ తీసుకునేవాళ్ళూ లేకపోతే నువు మటుకెట్లా చదువుకుంటావురా? పోనీ చదువు మానేసి ఏ ఉద్యోగంలో నన్నా చేరు. అట్లాగే నీ యిష్టం వచ్చినప్పుడు పెళ్ళి చేసుకుందువుగాని" అన్నది సీతమ్మగారు.

ఏదో విధంగా తనకు పెళ్ళి చెయ్యాలనే ఉద్దేశంతోనే తల్లి ఈ వాదన తెచ్చిందని సుందరం నిశ్చయించుకున్నప్పటికీ దాన్ని కాదనటం వాడికి చేతకాలా.

"మా అమ్మ నాకు పెళ్ళిచేస్తానంటుందిరా" అని సుందరం నాగేశ్వర్రావుతో అన్నాడు విచారంగా.

వాళ్ళింట్లో నలుగురూచేరి చిన్నతనపు పెళ్ళిళ్ళను గురించి చర్చించారు.

నాగేశ్వర్రావు బావమరిది శ్రీనివాసరావు సుందరాన్ని హేళనకూడా చేశాడు.

"ఇప్పుడే పెళ్ళేమిటోయ్ నీకూ? ఆడపిల్లలు రజస్వలా అయిపోతారేమోనని పెళ్ళి చెయ్యటానికి పెద్దవాళ్ళు తొందరపడటంలో అంత తప్పులేదుగాని, మగపిల్లవాడి పెళ్ళికి తొందరెందుకూ?" అన్నాడతను.

శ్రీనివాసరావు తనను ఆడపిల్ల కింద జమకట్టటమూ, అందరూ నవ్వటమూ సుందరానికి కోపం వచ్చింది. తన చదువూ, నాగేశ్వర్రావు చదువూ వేరై పోతున్నాయనీ, ఇద్దరూ కలిసి చదువుకోవటం అయిపోయిందనీ, ఈ ఇంట్లోవాళ్ళు తనను పరాయిగా చూస్తున్నట్టు సుందరానికి అకారణ సంశయంకూడా కలిగింది. తమ నాగేశ్వర్రావు చదువు చాలించి సంపాదన చూసుకోవలసినవాడయి ఉండగా సుందరం ఇంకా పెద్ద చదువు చదివే స్థితిలో ఉన్నందుకు వాళ్ళు అసూయపడుతున్నారని కూడా సుందరం అనుకున్నాడు.

"అడపిల్లల పెళ్ళికి తొందర ఉండటం రైటైతే, మగపిల్లల పెళ్ళి క్కూడా తొందర ఉండాలిసిందేగా? ఆడవాళ్ళకు ఏ పదోఏటో పెళ్ళిళ్ళు చేస్తుంటే మగవాళ్ళకు మటుకు ఏ పాతికేళ్ళకో చేస్తారా! అప్పుడు మొగుడు పెళ్ళాలకు వయసులో చాల తేడా ఉండదూ?" అని ఎదురు సవాలు చేశాడు సుందరం.

సుందరం ఈమాట ఎందుకన్నాడో శ్రీనివాసరావుకు అర్థమయింది. మొగుడు పెళ్ళాల మధ్య అయిదేళ్ళకంటె తేడా ఉండటం మంచిది కాదని శ్రీనివాసరావే ఎన్నోసార్లు అని వున్నాడు.

శ్రీనివాసరావు ఓడినట్టు తెలుసుకునికూడా చిత్తుగా ఓడిపోవటం ఇష్టంలేక రాజీపడే గొంతుతో, "నిజమే. ఈ పదేళ్ళ పిల్లల పెళ్ళిళ్ళూ పోవలసిందే. చూడు, ప్రతివాడూ తన జీవితానికి తాను బాధ్యతవహించే స్థితిలో ఉండాలి. రేపు నువు ఉద్యోగం సంపాదించలేకపోతే అందరూ నిన్నే తప్పు పడతారు. నీ పెళ్ళాం బిడ్డల్ని నువు పోషించుకోగలిగితే నిన్నే మెచ్చుకుంటారు. అటువంటప్పుడు పెళ్ళి విషయంలో కూడా మనిషికి స్వతంత్రం వుండొద్దా? ఉద్యోగంలాంటిది ఎన్నిసార్లయినా మార్చవచ్చు. పెళ్ళాలని చీటికీ మాటికీ మార్చగలమా? మగవాడుగాని, ఆడదిగాని బుద్ధిపూర్వకంగా 'ఈ మనిషినే నేను చేసుకుంటాను' అని నిర్ణయించుకుని చేసుకోవాలి" అన్నాడు.

సుందరం మాట్లాడలేదు. ఇంకో నాలుగైదేళ్ళు పోయి తను ఉద్యోగం చేసుకుంటూవుంటే శకుంతలను చేసుకోవాలన్నా చేసుకోవచ్చునేమో - శకుంతల యిష్టపడితే.

సుందరం నేరుగా యింటికి రాలేదు. ఆ వీధీ యీ వీధీ తిరిగి శకుంతల వాళ్ళ యింటి మీదుగా వచ్చాడు. ఈ శ్రమ వృథా అయింది. శకుంతల కనిపించలేదు.

మర్నాడు సుందరం శేషగిరి వెంట ఏటివద్దు సంబంధం చూడటానికి బయలుదేరాడు.

# 18

పరమ పల్లెటూరు. ఊరంతా పశువుల వాసనా, వ్యవసాయం వాసనా, పాటి మట్టి వాసనా, అయినా ఈ పల్లెటూరు చూడగానే సుందరానికి తన శక్తులన్నీ ఒక్క సారిగా హెచ్చినట్టు తోచింది. బలహీనుడు ఎదురు పడితే బలశాలికి ఎటువంటి భావం కలుగుతుందో ఈ గ్రామంలో అడుగుపెట్టగానే సుందరానికి అదే భావం కలిగింది.

పెళ్ళికూతురు వారిల్లు లంకంత ఇల్లు. దొడ్లో బోలెడన్ని చెట్లూ, చేమలూనూ, ఇంటివారు అతిథుల్ని చాలా మర్యాదగా చూశారు. తమది పల్లెటూరైనందుకు క్షమాపణ కూడా చెప్పుకున్నారు. సుందరంతో ఎవరూ మాట్లాడలేదు. సంభాషణ యావత్తూ శేషగిరే సాగించాడు.

"ఇది మా అత్తవారిల్లులాగా లేదు" అనుకున్నాడు సుందరం, ఇల్లంతా కలయజూస్తూ.

కాబోయే పెళ్ళికూతురు వచ్చింది. ఆమెకేసి పరీక్షగా చూడటానికి సుందరం బిడియపడ్డాడు. దుకాణంలో సరుకు చూసినట్టు మనిషిని చూడటం ఎట్లా?

పిల్ల చామనఛాయగా వుంది. అసహ్యంగానూలేదు. ఆకర్షవంతంగానూ లేదు. కొందరు కొందరు ఆడపిల్లలను చూస్తే కలుగుతూ వచ్చిన ఆనందమేదో ఈ పిల్లను చూస్తే కలగలేదు. జానకి స్నేహితురాళ్ళు కొందరు తనను చూడగానే తమ ఆడతనాన్ని జ్ఞప్తికి తెచ్చుకున్నట్టుగా ఈ పిల్ల తెచ్చుకోలేదు.

"ఏం చదువుకున్నావమ్మాయ్?" అని శేషగిరి అడిగాడు. ఆ పిల్ల సహాయం కోసం తండ్రికేసి చూసింది.

"రుక్మిణీ కళ్యాణంలో ఏదన్నా పద్యం చదువు" అన్నాడు తండ్రి.

పెళ్ళి చూపుల అనుభవం సుందరానికి ఇదే మొదలు. అయినప్పటికీ పెళ్ళి కూతురిచేత రుక్మిణీ కళ్యాణంలో పద్యాలు చదివించటం ప్రతిసారీ జరిగితీరాలిసిందే ననుకున్నాడు. ఏ గజేంద్రమోక్షమో, ప్రహ్లాదచరిత్రో ఎందుకు కాగూడదో వాడికి తెలియలేదు. "ఆ వనజగర్భ పంపున" అన్న పద్యం చదివింది పెళ్ళికూతురు.

"సంగీతం నేర్చుకున్నావా?" అన్నాడు శేషగిరి.

"లేదు. మా ఊళ్ళో సంగీతం నేర్పేవాళ్ళు లేరు" అన్నదాపిల్ల.

తిరిగి వస్తుండగా మామ సుందరాన్ని "ఎట్లా వుందిరా పిల్లా?" అన్నాడు.

"ఏమో నే సరిగా చూడలా" అన్నాడు సుందరం.

"మనం వచ్చింది దేనికీ? పిల్లను చూడటానికికాదూ?"

"చూడాలనిపించలా."

"తల్లి పోలికలే. ఈడొస్తె అందంగానే ఉంటుంది. చిన్నతనంలో అందంగా వుండేవాళ్ళు కొందరు పెద్దయి పూర్తిగా పాడౌతారు."

ఆరోజు సాయంకాలం-అయిదు గంటలకు వాళ్ళు రెండోసంబంధం పిల్లను చూశారు.

ఇది సుందరానికి పెళ్ళిచూపులల్లేలేదు. వాళ్ళు వస్తున్న సంగతి ఇంట్లోవాళ్ళకి తెలీదు. ఇంటి యజమాని బయటికి వెళ్ళాడు. మగపిల్లలు బయటినుంచి ఇంకా తిరిగిరాలేదు. ఇంట్లో పిల్లా, తల్లీ మాత్రమే ఉన్నారు. తల్లి శేషగిరిని గుర్తుపట్టి. "అమ్మాయ్, కాళ్ళు కడుక్కునేటందుకు నీళ్ళు తీసుకురావే" అని కేకపెట్టింది.

"ఎందుకు లేవమ్మా, ఆరున్నర బండికి వెళ్ళాలి. వీడే మా మేనల్లుడు" అన్నాడు శేషగిరి, అప్పుడావిడకి అర్థమై ఉంటుంది.

"అదేమిటండీ, ఈ బండికి వెళ్ళటానికి వీల్లేదు. ఆయన నన్ను కోప్పడుతారు" అన్నదావిడ.

"మళ్ళావస్తాంగా? రోజల్లా చెడతిరిగి ఉన్నాం" అన్నాడు శేషగిరి.

ఇంతలో లోపల్నించి ఆవిడ కూతురు చెంబుతో నీళ్ళు పట్టుకొచ్చింది. ఒక పొట్టిచొక్కా పరికిణీ మాత్రమే వేసుకుని ఉన్నది. జుట్టుకు నూనెరాసి ముడేసింది. చేతులకేవో గాజులున్నాయి.

"ఏమిటమ్మాయ్, పెళ్ళిచూపులకు వస్తామని తెలిసి సింగారించుకున్నావల్లే ఉందే?" అన్నాడు శేషగిరి.

"జడేసుకు నీళ్ళు పోసుకోబోతున్నా" అన్నదాపిల్ల నవ్వుతూ. ఆ పిల్ల సిగ్గులో బిడియంలేదు. నవ్వేసరికి చెక్కిళ్ళు కొంచెంగా ఎర్రబడ్డాయి.

సుందరం కళ్ళ కీపిల్ల రంభలాగా కనపడింది. ఆ పల్లెటూరి పిల్ల ఎంత స్తబ్ధుగా ఉందో, ఈ పిల్ల అంత చలాకీగా ఉంది. రంగు కూడా చాలా ఎక్కువ. గొంత సన్నగా, నాజూకుగా ఉంది.

"మేమూ అనుకోకుండానే వచ్చాంలే. వచ్చి వెళ్ళామని పార్వతీశంతో చెప్పు."

"వస్తారేమో కాస్త ఆగకూడదూ?"

"లేదులే, బయట బండివాడు కనిపెట్టుకున్నాడు. ఆలశ్యం చేసినకొద్దీ వాడు జాస్తి అల్లరి చేస్తాడు."

శేషగిరీ, సుందరమూ మళ్ళా బండి ఎక్కి స్టేషనుకు బయలుదేరారు.

"ఎట్లా ఉందిరా, పిల్ల? ఈసారన్నా చూశావా?"

"ఆ పిల్లకన్న నయమే" అన్నాడు సుందరం ఈ పిల్లను చూసిన సంతృప్తి కన్న ఆ పిల్లమీద ఆగ్రహం ఎక్కువగా ప్రకటిస్తూ.

"దాని కాక్షేపణేమిటి?" అన్నాడు శేషగిరి. "కాని వాళ్ళిచ్చే కట్నాలూ, కానుకలూ వీళ్ళివ్వలేరు. పార్వతీశం మనందరికన్నా బాగా బతికినవాడు, ఇప్పుడు చితికిపోయినాడు. ఇప్పుడా? వీళ్ళను నా చిన్నతనం నుంచీ ఎరుగుదును."

❀ ❀ ❀ ❀

పార్వతీశంగారు పెళ్ళిఖాయం చేసుకుపోవటానికి వచ్చాడు. మిగిలిన విషయాలేమైనా ఆయన చాలా పెద్దమనిషి అనీ, సజ్జనుడనీ సీతమ్మగారు ఒప్పుకోక తప్పింది కాదు. నిజానికి ఆవిడ మనస్సంతా ఏటిఒడ్డు సంబంధంమీదే ఉన్నది. వాళ్ళకు బస్తీ భేషజాలులేవు. ఇంత ఉన్నవాళ్ళు. అటువంటి సంసారాలు వృద్ధిలోకి వస్తాయిగాని దివాలా తీయవు. పిల్లకూడా మంచి పనిపాటలుగలదై ఉంటుంది. మొగుడన్నా, అత్తగారన్నా, ఆడబిడ్డన్నా భయభక్తులు కలిగి ఉంటుంది. కాని సుందరం ఈ పిల్లనే చేసుకుంటానన్నాడు. వాడికిష్టంలేకుండా పెళ్ళిచెయ్యటం ఆవిడ మతంకాదు.

తను కట్నాలూ కానుకలూ ఇచ్చుకోలేనని పార్వతీశంగారు చెప్పారు.

"మాకున్న లక్ష్మిఅల్లా మా అమ్మాయే. దాన్ని మీచేతుల్లో పెడుతున్నప్పుడు మిగిలిన వాటి మాటేమిటి? పెళ్ళన్నది పెళ్ళిపీటలమీదనే తీరిపోయే బంధంకాదుగదా, ఎవరు చూశారు? మాస్థితిబాగుపడవచ్చు. అప్పుడు మా అల్లుడికి ఏం పెట్టుకుంటే చెల్లదు! బలవంతాన పెళ్ళిపీటల మీద రాబట్టే వాళ్ళనుచూస్తే నాకాశ్చర్యం వేస్తుంది. అల్లుడికి పెట్టుకోవాలనే ఇచ్ఛ ఆ విధంగా చంపేస్తే తరవాత ఏమవుతుందో గమనించరు. పెట్టుకోవాలనే కోరిక దక్కాలగాని, పెట్టుకునే అవకాశాలు రాకపోతాయా? వేలకు వేలు వస్తాయి" అన్నాడు పార్వతీశంగారు.

"మేమయినా కట్నాలమీద పెద్ద ఆశలు పెట్టుకోలేదు. నలుగురూ చూడటానికైనా ముచ్చటగా వుండేటట్టు వుండాలిగా–మీకైనా మాకైనా తోడబుట్టు పిల్ల ఒక్కటే. ఏ లాంఛనలు జరిపినా"

పార్వతీశంగారు సీతమ్మగారి మాటలకు అడ్డొచ్చి, "ఆ విషయం మీరు ఒక్క నాటి సంకోచించకండి. మా అల్లుడి లాంఛనాలైనా మానేసి జానకమ్మకు సమస్త లాంఛనాలూ జరుపుతాంగాని?" అన్నాడు.

పార్వతీశం చెప్పిన అన్ని మాటలకన్నా ఈ మాట సీతమ్మగారికి నచ్చింది. సాహిత్య ప్రియులు పుస్తకాలలో చదివిన మంచి మాటలు కలకాలం జ్ఞాపకం వుంచుకున్నట్టు ఆడవాళ్ళు నిత్యసంభాషణలో తమకు నచ్చేమాటలు కలకాలం చెప్పుకుంటారు. పార్వతీశంగారు అటువంటి మాట అన్నాడు.

ఏమయినా సీతమ్మగారు తన పిల్లవాడికి వెయ్యినూట పదహార్లు కట్నం అడగటానికి ఇవేవీ అడ్డం రాలేదు.

సుందరానికి తల్లిని చూస్తే కోపంవచ్చింది. పార్వతీశంగారు తన అశక్తతను ఏ భాషలో చెబుతున్నాడో తల్లి అర్థం చేసుకోవటంలేదనుకున్నాడు. "మీరు చాలా మంచివాళ్ళు, మీ అమ్మాయి మాకు నచ్చింది. కాని మాకు వీటన్నిటికన్నా వెయ్యి నూటపదహార్లు చాలాఅవసరం" అని తల్లి అంటే ఎంతకోపం వచ్చివుండునో అంత కోపమూ వచ్చింది సుందరానికి. కాని సుందరం భావాలు గమనించే స్థితిలో మిగిలినవారులేరు.

సీతమ్మ కోరినదానికి పార్వతీశంగారు ఓపికగా సమాధానం చెప్పాడు. వెయ్యినూటపదహార్లకు పట్టుపట్టవద్దన్నాడు. తనకిచ్చేశక్తి వుంటే సుందరానికి ఇంకా ఎక్కువ కట్నమే ఇచ్చి వుండేవాణ్ణి అన్నాడు.

"శక్తిలేదంటున్నారు గనకనే అంతవరకైనా ఇవ్వండి" అన్నది సీతమ్మగారు.

పార్వతీశంగారు ఎటువంటి గొప్ప భావాలతో సంభాషణ మొదలు పెట్టాడో అంతగా అణా పైసలకు దిగింది చర్చ. అన్ని లాంఛనాలతోనూ కలిపి పార్వతీశంగారి సొత్తు సీతమ్మగారికీ, సుందరానికి వెయ్యినూటపదహార్లకు తక్కువ కాకుండా ముట్టేటట్టు బేరం సెటిలయింది. ఇదంతా వింటున్న సుందరానికి వికారంపుట్టింది. తన కళ్ళ ఎదుటే మానవత్వానికి ఘోరమైన అపచారం జరిగిందని వాడు తలపోశాడు. ఆ అపచారాన్ని నివారించే శక్తిమటుకు వాడికి లేకపోయింది.

❀ ❀ ❀ ❀

సుందరం పెళ్ళి ఇంకా ఇరవై రోజులుండనగా శకుంతల జానకిని చూడవచ్చింది. కొత్తగా వచ్చిన "భారతి" ఏ స్నేహితుడిదగ్గరో సంపాదించి చదువుకుంటూ సుందరం ఇంట్లోనే ఉన్నాడు.

"రా, తల్లీ, శకుంతలా, రా?" అన్నది సీతమ్మగారు. శకుంతల వైధవ్య ప్రాప్తిని మాసాలతోనూ, వారాలతోనూ సహా తూచి కొలిచే జాలి తనగొంతులో ప్రవేశపెట్టి.

జానకి తాను చేసేపని పూర్తిగా కట్టిపెట్టి తనను తాను శకుంతల పరం చేసుకున్నది. సామాన్యంగా గొప్పవాళ్ళకు చూపే ఆదరమే పెద్దజబ్బులో వున్నవాళ్ళకూ, గొప్ప విపత్తు సంభవించిన వాళ్ళకూ చూపటం స్వాభావికం.

త్వరలో సీతమ్మగారూ, జానకి, శకుంతలా ఒక కట్ట అయిపోయి నట్టింట్లో లోకాభిరామాయణం మాట్లాడారు. గదిలోవున్న సుందరానికి ద్వారబంధంగుండా శకుంతల మొహం మూడుపాళ్ళూ, జానకి మొహం ఒకపాలూ, తల్లి వెనకభాగంలో సగమూ కనిపిస్తున్నాయి.

సుందరానికి కథ నడవలేదు. శకుంతలకేసి చూడాలన్న కోరిక కూడా వాడికిప్పుడు లేదు. తన కాబోయే భార్యను ఎన్నుకున్న తరవాత శకుంతల వాడికి దూరమయిపోయింది. ఆమెను గురించి వాడి మనసులో ఇప్పుడు ఎటువంటి ప్రశ్నార్థకపు గురుతులూలేవు. అయినా వాటి తాలూకు ఆనవాళ్ళేవో నిలిచిపోయి వున్నాయి. తనకే తెలియకుండా సుందరం శకుంతలపట్ల తనకుగల బాధ్యత ఎట్లా నిర్వర్తించేదీ ఆలోచించటం మొదలు పెట్టాడు.

తనుకూడా ఒక కథ రాస్తాడు - ఒక గొప్ప సంఘసంస్కరణ కథ? వెంటనేకాదు. కొంతకాలానికి! దాన్ని "భారతి"కి పంపిస్తాడు. అది "భారతి"లో బొమ్మలతోసహా అచ్చుపడుతుంది. అప్పుడు దాన్ని చాలామంది చదువుతారు. ఆ చదివినవాళ్ళలో ఎవరో ఒకరు శకుంతలను పెళ్ళాడతారు. శకుంతల తనకు కృతజ్ఞత తెలుపుతూ ఒక ఉత్తరం రాస్తుంది. అదీ జరగబోతున్న విషయం.

"వైకుంఠపాళీ ఆడదాం వస్తావా అన్నయ్యా?" అన్నది జానకి.

సుందరం లేచివచ్చాడు.

వాడు శకుంతలతో ఆప్యాయంగా ఎన్నడూ మాట్లాడలేదు. ఆటలు అంతకన్నా ఆడలేదు. ఇదే మొదటిసారి అయినప్పటికీ సుందరానికిది అసహజంగాలేదు. అందరికన్నా శకుంతల ఆటలో మునిగిపోయింది. "నాలుగు వేసుకుంటే చిన్న నిచ్చెన, మూడు వేసుకుంటే పాము" అంటూ ఆ పిల్ల జానకినీ, సుందరాన్నీ కూడా హెచ్చరిస్తూ, నిచ్చెన లెక్కితే సంతోషిస్తూ, పాములు కరిస్తే విచారిస్తూ వచ్చింది.

ఆ కాస్సేపూ సుందరానికి జానకి ఎంత దగ్గిరమనిషో శకుంతల కూడా అంత దగ్గిర మనిషల్లేనే తోచింది. వెనక తను ఆమెను ఎవరో మనిషల్లేనూ, ఎక్కడో మనిషల్లేనూ చూసినందుకు వాడిప్పుడాశ్చర్యపడ్డాడు.

"పెళ్ళెప్పుడు?" అన్నది శకుంతల ఆటమధ్య.

జానకి చెప్పింది.

"నువ్వు కూడా పెళ్ళికి వస్తావా. శకుంతలా? రారాదూ?" అన్నది జానకి.

"ఇంకా నయం! పెళ్ళయి వస్తారుగా? అప్పుడు మీ వదిన్ని చూస్తాలే" అన్నది శకుంతల.

శకుంతల తనకన్నా, జానకికన్నా ఎంతో పెద్దదనిపించింది సుందరానికి.

## 19

సుందరం పెళ్ళి అయిపోయింది. పెళ్ళి అయిదురోజులూ తాను - ఆనందమే అనుభవించాడో, బాధే పడ్డాడో కూడా ఊహించటం సాధ్యం కాలేదు. పెళ్ళి హడావుడీ, పందిళ్ళూ, ఊదువత్తులవాసనా, ఆడవాళ్ళ పట్టుచీరెల తళతళా, గంధం పూతలూ మల్లెపూల ఘుమఘుమా, ఆడవాళ్ళ కేకలూ, పిల్లల పరుగులూ, సన్నాయి మేళమూ, పురోహితుడి మంత్రాలూ, పెళ్ళివారింటి పందిట్లో గాడిపొయ్యి దగ్గిర నుంచి వంట వాసనలూ, పంక్తులు తీరి భోజనాలూ, మేజువాణీలూ, పూలచెళ్ళాటా, ఊరేగింపులూ, పేర్లు చెప్పించటాలూ - ఇదంతా చాలా వినోదంగానే ఉంది. కాని దానివెంట తగూలూ, సాధింపులూ, స్వార్థాలూ, ఎక్కణ్ణుంచి ఊడిపడ్డాయో తెలీని హక్కులు ప్రకటించుకోవటాలూ, ఒకరి వెనక ఒకరు నిందించుకోవటాలూ, సాగదీయటాలూ, సాగదీయించుకోవటాలూ మొదలైనవి చూస్తే సుందరానికి చాలా అసహ్యం వేసింది.

మనం అందరం సంఘంలో ఉంటున్నవాళ్ళమే. సంఘ ధర్మాలకు కట్టుబద్ధవాళ్ళమే. అయినా కూడా, నిత్యమూ మనకు సంఘంతో సన్నిహిత సంబంధం ఉండదు. అందులో సుందరం విద్యార్థి కావటమేగాక బాహ్యంగా కొద్దిమంది స్నేహితులతోనూ, అంతరంగంలో తన భావ ప్రపంచంలోనూ జీవించేవాడు. అటువంటివాడు సంఘాన్ని - అది కూడా తన బంధువర్గానికి సంబంధించినంతవరకే దగ్గిరగా చూసే అవకాశం పెళ్ళిలో కలిగింది. దగ్గిరగా చూస్తే ఈ సంఘం వాడికి నచ్చలేదు. తన పెళ్ళికి వచ్చిన వాళ్ళలో నిజమైన మానసిక జీవితం జీవిస్తూ, జీవితంలో పరిపూర్ణత్వం చవిచూస్తున్న వాళ్ళు దాదాపు ఎవరూ లేరనిపించింది వాడికి. అందుచేతే వీళ్ళకు అభిమానంలేదు; తమ ప్రవర్తన చూసి ఎవరన్నా ఏమన్నా అనుకుంటారనే భయం లేదు. వాళ్ళకి ఇతరులతోగల సంబంధాలన్నీ స్వార్థంమీదా, సాధింపుల మీదా ఆధారపడినవి.

ఈ పెళ్ళి అట్టహాసమంతటికీ వాస్తవమైన విషయం తనకూ లక్ష్మికీ ఏర్పడిన మొగుడూ పెళ్ళాం సంబంధం మాత్రమే. మిగిలినదంతా వొట్టి అబద్ధం, కృత్రిమానందం. నిరర్థకమైన పోట్లాటలు. సుందరం మనస్సు మనిషికీ మనిషికీ మధ్య ఉండదగిన ఆదర్శ సంబంధం గురించి ఆలోచిస్తున్నది. ఆ సంబంధం బయటి ప్రపంచంలో ఎక్కడా కనిపించలేదు.

ఆఖరుకు జానకీ, నరుసూ సాగించిన శృంగారం కూడా సుందరానికి నచ్చలేదు. జానకి కింకా కార్యం చెయ్యలేదు. అయినా విడిదిలో వాళ్ళిద్దరూ కొంత సందడి చేశారు. నరుసు హార్మోనియంతో సహా దిగాడు. అయిదు రోజులూ పెళ్ళి విడిది నరుసు పాటలతో హోరెత్తిపోయింది. జానకి విడిది దొడ్లో కొబ్బరిచెట్టు ఆకులు కోసి నాలుగైదు బూరలు తయారుచేసింది. నరుసు హార్మోనియం ముందుంచుకొని పాట ప్రారంభించినప్పుడల్లా జానకి తాను చేసిన బూరలు నాలుగూ నలుగురు పిల్లల కిచ్చి కిటికీ కింద నుంచి ఊదమనేది. విడిది యావత్తూ కోలాహలమై పొయ్యేది. నరుసు పాట వినాలని కుతూహల పడేవాళ్ళు జోక్యం కలిగించుకుని పిల్లల దగ్గిర్నుంచి కొబ్బరాకు బూరలు లాక్కునేదాకా అల్లరిసాగేది.

"నా పాట వినటం ఇష్టం లేనివాళ్ళు చెవుల్లో ఇంతదూది పెట్టుకోరాదా? లేకపోతే అట్లా చల్లటి ఎండలో ఇసకమీదికి షికారు వెళ్ళరాదా?" అని నరుసు పాట పాడేవాడు. జానకి మాట్లాడేదికాదు.

ఒకసారి నరుసు "ఇంత పెద్ద పెళ్ళి విడిది ఉంది. నాకెవరూ ఒక చుక్క సెంటు రాసిన పాపాన పోరాయె" అన్నాడు. ఆరోజు సాయంకాలమే జానకి విడిది దగ్గిరకి అమ్మవచ్చిన వాళ్ళదగ్గిర బేడాపెట్టి 'ఓటో దిల్బహార్' బుడ్డీకొని నరుసు పెట్టెలో బట్టలన్నిటికీ పట్టించేసింది. తరవాత నరుసు పెట్టె తెరుస్తూనే ముక్కుగట్టిగా మూసుకుని "హరిహరీ!" అన్నాడు. ఆ తరవాత పెళ్ళి పూర్తి అయేదాకా నరుసు బట్టల వాసనను గురించి అందరూ ఏడిపిస్తూనే వున్నారు.

బూజంబంతి రోజున నరుసూ జానకీ చేసిన అల్లరి ఇంతా అంతా కాదు.

నరుసు పల్లెటూరి బైతని సుందరం ఏనాడో నిశ్చయించుకున్నాడు. తన చెల్లెలు జానకి గంభీరమైన మనిషిగా ఉంటుందని వాడు ఆశించాడు. మనుషులంతా చాలా గంభీరంగా ఉండాలని వాడి ఉద్దేశం. తాను కూడా ఉండదగినంత గంభీరుడుగా ప్రజలకు కనిపిస్తున్నాడో లేదో అన్న భయం సుందరాని కుండేది. నరుసు హార్మోనియం వెంటబెట్టుకు రావటమే సుందరానికి ఏవగింపు కలిగించింది. దానికితోడు జానకీ వాడూ కలిసి అల్లరి చేస్తున్నారనీ, వాళ్ళనుచూసి అంతా నవ్వుతున్నారనీ తెలిసి సుందరం లోలోపల చాలా చిరాకుపడ్డాడు. వాడు ఎక్కువభాగం పెళ్ళివారింట్లో ఉండేవాడు. గనక విడిదిలో జరిగే విషయాలు వాడికి తెలియవు. నరుసు సంగీతం చాలా మందిని ఆకర్షించిందంటే వాడు నమ్మలేక పోయినాడు. కాని పెళ్ళి నాలుగోరోజు ఉదయమే సుందరం విడిదికివచ్చి చాలాసేపు కూర్చున్నాడు. అప్పుడు నరుసు చాలా పద్యాలూ, పాటలూ పాడాడు. ఎవరో కోరగా బాలగంధర్వాది "మూర్తిమంత"[36] పాడాడు. ఒక సారికాదు అరడజనుసార్లు పాడితేగాని వినేవాళ్ళు వదలలేదు. పెళ్ళికి వచ్చిన వాళ్ళు కాక రోడ్డుమీద పొయ్యేవాళ్ళు కూడా చాలా మంది పోగయినారు.

సుందరానికి ఒక్కసారి పెద్దకనువిప్పయినట్టయింది. బాలగంధర్వ ఎవరో "మూర్తిమంత" ఏ భాషో, అసలుపాట ఎట్లా వుంటుందో సుందరానికి తెలీదుగాని, నరుసుకన్న ఆ పాట ఇంకెవరుగాని బాగా పాడగలరని సుందరం ఊహించలేకపోయినాడు. వాడు మొట్టమొదటసారి నరుసుని చూసుకుని గర్వించాడు.

"పాట చాల ఇంప్రూవ్ చేశావురా!" అన్నాడు సుందరం.

"తొందరపడమాకా? ఎప్పటికన్నా పారుపల్లి సుబ్బారావు[37] పక్క కృష్ణుడు వెయ్యాలి. అప్పుడు మన ప్రభ వెలగాలి" అన్నాడు నరుసు.

❀ ❀ ❀ ❀

---

36. బాలగంధర్వ (1888-1967): అసలు పేరు రాజహంస నారాయణ శ్రీపాద. ప్రఖ్యాత మరాఠీ రంగస్థల నటుడు, గాయకుడు. ఒక ఆంతరంగిక గాన సభలో 1898లో బాలగంధర్వ గానానికి ముగ్ధుడైన లోకమాన్య తిలక్ బాలగంధర్వ అన్న బిరుదును యిచ్చారు. సంగీతంలో పండిత భాస్కర బుల్‌బాఖలే శిష్యుడు. ప్రఖ్యాత మరాఠీ రచయితలు గోవింద భల్లాల్ దేవల్, కాక సాహెబ్ ఖడేల్‌కర్ శిక్షణ కింద తయారైన నటుడు. కిర్లాస్కర్ నాటక మండలి (1905)లో చేరి శకుంతల వేషానికి ప్రసిద్ధి పొందారు. బాలగంధర్వ నాటకమండలి (1919-1944) స్థాపకుడు. స్త్రీ పాత్రల వేషధారణలో మన 'స్థానం'వలె ప్రఖ్యాతి పొందినవాడు. సౌభద్రలో సుభద్ర, విద్యాహారంలో దేవయాని, స్వయంవర్‌లో రుక్మిణి వేషాలు ధరించేవాడు. వి. శాంతారామ్ ఆధ్వర్యంలో 'ధర్మాత్మ' అనే చలన చిత్రంలో కూడా నటించాడు. గాయకుడిగా దక్షిణ దేశంలో అపారమైన పేరుప్రతిష్టలు గడించిన కళాకారుడు. కుటుంబరావుగారికి ప్రియమైన గాయకుల్లో ప్రథములు.

37. పారుపల్లి సుబ్బారావు: ఆంధ్రగంధర్వ జొన్నవిత్తుల శేషగిరిరావు సాహచర్యంలో సంగీత మెళకువలు గ్రహించిన ప్రసిద్ధ గాయకుడైన రంగస్థల నటుడు. స్త్రీ పాత్రల్లో ఆయనకు ప్రఖ్యాతి చేకూర్చిన పాత్ర పానుగంటి రాధాకృష్ణలో రాధ పాత్ర, లవకుశ వంటి కొన్ని చిత్రాలలో నటించారు.

"నీకేం చాదస్తమా ఎట్లా? ఎప్పుడో మంచిరోజు చూసి నరుసును పంపించేస్తాను. గుట్టుచప్పుడు కాకుండా పిల్లని గదిలోకి పంపించెయ్యి" అని సీతమ్మగారికి శేషగిరి సలహా ఇచ్చాడు.

ఇట్లా చెయ్యటానికి సీతమ్మగారి అంతరాత్మ ఎంత మాత్రమూ ఒప్పలేదు. అంతరాత్మను నమ్ముకుని అది చెప్పినట్టుచేస్తే పొరపాటు జరగదన్న భ్రమ చాలా మందికి ఉంటుంది. కాని అంతరాత్మలకు ఒక్కొక్కప్పుడు కించిత్తయినా ప్రపంచ జ్ఞానం ఉండదు. అవి మనచేత ఎన్నో బుద్ధిమాలినపనులు చేయిస్తాయి. అంతరాత్మను అనుసరించే సీతమ్మగారు తన కొడుక్కు వియ్యాలవారిచ్చిన అయిదు వందలకు సరిపడా కోడలికి నగలు చేయించి కొడుకు పెళ్ళి ఖర్చులకు మరో అయిదారు వందలు అప్పుచేసింది. నలుగుర్నీ పిలిచి ముచ్చటగా జానకికి గర్భాదానం జరిపించాలంటే ఎంత హీనంగా చేసినా నూరూ, నూటయాభై ఖర్చుగాక తప్పదు. ఇంకో నెలలో సుందరం కాలేజీలో ప్రవేశించవలసి ఉన్నది. ఇటు పిల్లని కాపరానికి పంపి, ఇల్లంతా అద్దెకిచ్చి తానూ పిల్లవాడూ పొరుగూరు కాపరం పెట్టాలి. అన్నిటికీ కలిపి మరోవందో, వందన్నరో కావాలి. సీతమ్మగారి అంతరాత్మను చూడబోతే అది జానకి కార్యానికి డబ్బు తగలెయ్యమంటున్నది. మగపిల్లవాడని పక్షపాతం చూపకూడదంటున్నది. ఇదే నువు పిల్లకు నీచేతి మీదుగా జరిపే ఆఖరు ముచ్చట. ఆ తరవాత పిల్ల అత్తవారి సొత్తు అంటున్నది.

శేషగిరి సహాయంతో సీతమ్మగారు తన అంతరాత్మ నోరుమూసి ఎవరికీ తెలియకుండా కొద్ది ఖర్చుతో కూతుర్నీ అల్లుణ్ణీ కలిపింది. మూడు నిద్దర్లయాక శేషగిరి కుటుంబమంతా వెళ్ళిపొయ్యేటప్పుడు జానకి కూడా వాళ్ళతో వెళ్ళిపోయింది.

జానకి వెళ్ళిపోయిన తరవాత సీతమ్మగారూ సుందరం మిగిలేసరికి వాళ్ళిద్దరి మధ్యా ఏర్పడిన ఎడం ఇద్దరికీ తెలిసి వచ్చింది. తల్లి ఏదన్నా చెబితే సుందరం ఊఁ కొడతాడు. వాడు వింటున్నాడో లేదో కూడా తల్లికి తెలీదు. ఏ విషయం మాట్లాడితే కొడుకు సంభాషిస్తాడో తెలుసుకుందామని సీతమ్మగారు చాలా రకరకాల విషయాలు చర్చించి ఆఖరుకు కొన్ని నిర్ణయాలకు వచ్చింది. సుందరానికి ఇంటికి సంబంధించిన డబ్బు చిక్కులు - రాబడి, ఖర్చూ, బాకీలూ, వడ్డీలూ - మాట్లాడటం యిష్టంలేదు. వాటిని గురించి ఆలోచించటంగాని, వినటంగాని వాడికి బాధ. చుట్టపక్కాలను గురించి వినటం విసుగు. తన చదువు గురించి తల్లి మాట్లాడటం వాడి కిష్టంలేదు. అందుచేత ఆవిడకు కొడుకుతో మాట్లాడదగిన విషయాలే లేకుండాపోయినాయి. పోనీ సుందరం తన కిష్టమైన విషయాలు తల్లితో మాట్లాడతాడా అంటే అదీ ఉండేదికాదు.

"ఏంరా, సుందరం? ఈ యేడు మీ అత్తవారి ఊళ్ళో కాలేజీ పెడుతున్నారుటగా? హాయిగా అత్తవారింటో ఉండి చదువుకోరాదూ?" అన్నది సీతమ్మగారు.

"నా కక్కర్లేదు. కొత్తగా పెట్టే కాలేజీలు హైస్కూళ్ళల్లే ఉంటాయి. చేతగాని లెక్చరర్లుంటారు. వాటిల్లో చదవటంకన్న చదువు మానటం మంచిది" అన్నాడు సుందరం.

ఇంకో పదిరోజులకు కాలేజీలు తెరుస్తారనగా పార్వతీశంగారు వచ్చాడు. ఆయన కూడా అదే సలహా యిచ్చాడు. సుందరం వెంటనే ఒప్పుకున్నాడు.

సీతమ్మగారు కొడుకును దెప్పకుండా ఉండలేకపోయింది.

"ఏంరా! కాలేజీ చదువుకు అత్తవారూరు పొమ్మంటే కాదు కూడదంటివే" అని కొడుకును అడిగిందావిడ.

సుందరం తల్లికేసి చూసి ఏమీ – పలకకుండా ఊరుకున్నాడు. తల్లి ప్రశ్నకు వాడు చెప్పగల సమాధానం ఉంది. "మా అబ్బాయిని మీ ఇంట్లో పెట్టుకుని చదువు చెప్పించండి" అని తల్లి తన మామగారితో అనటం సుందరానికి ఎంత మాత్రమూ ఇష్టంలేదు. అంతకన్న తనకు అవమానం ఉండబోదని వాడి అభిప్రాయం. కాని మామగారు తనకుతానై అడిగాడు గనక వాడు సమ్మతించాడు. ఇదంతా తల్లికి వివరించి చెప్పటానికి వాడికి ఎంతమాత్రం మనసు పోలేదు. తన భావాలను ఆవిడతో చెప్పుకోవటం వాడికి అలవాటు తప్పింది.

ఇదంతా తెలియదు గనక సీతమ్మగారు బాధపడ్డది. తనూ పిల్లాడూ వెళ్ళి ఏ పొరుగూరులోనో కాపరం పెడితే ఖర్చు జాస్తి అవుతుందన్న ఉద్దేశంతో ఆవిడ, సుందరం అత్తవారింట ఉండి చదువుకుంటే బాగుండునని అనుకున్నదేగాని, పిల్లవాడిని కూడా పంపించేసి తాను ఒంటరిగత్తె కావటం ఆవిడకేమీ ఇష్టంలేదు. పార్వతీశంగారు సుందరాన్ని తన ఇంటికివచ్చి చదువుకోమన్నప్పుడు సుందరం తనకు చెప్పిన సమాధానమే చెబుతాడని సీతమ్మగారు రూఢి చేసుకున్నది. తనకు చెప్పిన అభ్యంతరాలలో ఏ ఒకటీ మామగారితో చెప్పకపోగా సుందరం సరే ననేసరికి తనకేదో గొప్పద్రోహం జరిగినట్టు సీతమ్మగారు భావించుకున్నది. పాపం ఆవిడ ఇంకో ఊళ్ళో తానూ కొడుకూ పెట్టబోయే కాపరం గురించి చాలా అంచనాలు వేసుకున్నది. తన కొడుకును మళ్ళీ తన దగ్గిరవాణ్ణి ఎట్లా చేసుకుందామా అని ఆలోచనలు చేసింది. ఈ ఆలోచనలన్నిటినీ భగ్నంచేసి తనను దిక్కులేని దాన్నిగా వొదిలేసి సుందరం అత్తవారింటికి పోవటానికి సిద్ధపడ్డాడు.

"పెళ్ళి కాగానే మగపిల్లలకు అత్తవారు దగ్గిర బంధువులైపోతారు కాబోలు" అనుకున్నది సీతమ్మగారు.

అల్లుణ్ణి తనవెంట తీసుకుపోవటానికి పార్వతీశంగారు సిద్ధపడ్డాడు.

"అక్కగారూ, మీరుకూడా బయల్దేరండి. మీరు ఒక్కరూ ఎట్లా ఉంటారు గనక?" అన్నాడాయన.

మరోసమయంలో అయితే సీతమ్మగారు ఈ మాటకు సంతోషించేదేమోకాని ఇప్పుడున్న మనస్థితిలో ఆవిడకిది వేడుక పిలుపులాగా వినిపించింది. తనకొడుకు తనకు దూరంగా ఉండాలని ఉబలాటపడుతుంటే అట్లాగే ఉండనీ! వాడూ వాడి మామగారూ ఏమన్నా చేసుకోనీ! మధ్య పానకంలో పుడకల్లే తనెందుకూ? ఈ ఉబలాటం ఎన్నాళ్ళో తను చూడకపోతుందా?

"ఇంకానయం! వాడు వస్తానంటున్నాడుగా? తీసుకువెళ్ళండి. నే నింటిపట్టున కృష్ణా రామా అనుకుంటూ పడివుంటా" అన్నది సీతమ్మగారు.

"ఒంటరిగా ఉంటారా?"

సీతమ్మగారికి లోపల మండిపోయింది. తనను ఒంటరిదాన్ని చేశాడన్నమాట పడకుండా ఉండగలందులకు ఆయన తనను ఆహ్వానిస్తాడా? ఏం మనిషి? అల్లుణ్ణి తీసుకుపోవాలి. ఎవరిచేత ఏమీ మాటరాకుండా చూసుకోవాలి! అది ఆయన ఎత్తు.

"తప్పుతుందా? నేనుకూడా పెత్తనాలకుపోతే ఇల్లేమవుతుంది. చెప్పండి?" అన్నది సీతమ్మగారు.

"ఇంటికేం? అద్దెకిచ్చేస్తే సరి?"

"అఁ, అద్దెవాళ్ళున్న కొంప అదెంతకాలం ఉంటుంది. ఇంటికైనా మనిషి ఉండొద్దా?"

పార్వతీశంగారు విరమించాడు. ఆయనతో మాట్లాడుతున్నప్పుడే సీతమ్మగారు ఇల్లంతా అద్దెకిచ్చి తనువెళ్ళి కూతురుదగ్గిర ఉండనిశ్చయించింది.

అయినా కొడుకు వియ్యంకుడి వెంట వెళ్ళిపోగానే ఆవిడకు దుఃఖం ఆగలేదు. ఎవరూ చూడకుండా ఆవిడ పొయ్యిదగ్గర కూచుని గాయం నుంచి రక్తంలాగా ఎంత తుడిచినా ఆగని కన్నీరుతో కట్టుకున్న బట్ట ఇంతమేర తడుపుకున్నది.

## 20

సుందరం అత్తవారింటికి వచ్చేశాడు. వాడికి ఇద్దరు బావమరుదులు. జగన్నాథం లక్ష్మికన్న పెద్దవాడు అయినా సుందరం కన్న చిన్నవాడు. ఫిఫ్తుఫారంలోకి రాబోతున్నాడు. రెండోవాడు కనకం. ఫస్టుఫారం చదవబోతున్నాడు. వాడు చాకులాంటివాడు. సుందరాన్ని చూస్తే జగన్నాథానికి ఎంత భక్తిగా ఉండేదో కనకానికి అంత నిర్లక్ష్యం ఉన్నట్లుండేది. వాడు జగన్నాథంలాగా తన దగ్గిరకు వచ్చి కూర్చోకపోవటమూ, తనతో కబుర్లు చెప్పకపోవటమూ చూసి మొదట్లో సుందరం నొచ్చుకున్నాడు. కాని త్వరలోనే నిజం తెలిసింది. కనకం సుందరాన్ని తప్పించుకు తిరగటానికి కారణం జగన్నాథమే. కనకానికి చాలా ఏళ్ళనుంచీ జగన్నాథంతో పోటీ. అన్నకంటె తన తక్కువ ఏమీలేదనీ, తనంతవాడు తాను అనీ ఋజువుచేసే ప్రయత్నంలో ఉన్నాడు కనకం. వాడికి ఏ విషయంలోనూ జగన్నాథం సహాయ సానుభూతులు అవసరంలేదు. వాడి స్నేహితులతో వీడికి సంబంధంలేదు. అంతే!

సుందరానికి మిగిలిన అన్ని చుట్టరికాలకన్నా ఈ బావమరుదుల చుట్టరికంలో ఏదో మాధుర్యం కనిపించింది. నిన్నగాక మొన్న తనపెళ్ళి అయేవరకూ వాళ్ళకు తాను ఎవరో, తనకు వాళ్ళెవరో? ఇవాళ వాళ్ళు "బావా, బావా" అంటూ ఎంతో యిష్టంగా, అభిమానంగా ఉంటున్నారు. ఇప్పటివరకూ సుందరం తన పుటకతోవచ్చిన చుట్టరికాలే ఎరుగును.

అత్తగారు మామగార్లను గురించి సుందరానికి ఈ భావం కలగలేదు. వాళ్ళు పెద్దవాళ్ళు. వాళ్ళు తనను "ఏం నాయనా? ఏమోయ్? భోజనానికి లేవోయ్! స్నానం చెయ్యవోయ్!" అనటంలో వాళ్ళ పెద్దరికమూ వాత్సల్యమూ మాత్రమే కనిపిస్తున్నాయి. తాను అల్లుడు కాకపోయినా వాళ్ళు తనపట్ల అదేవిధంగా ప్రవర్తింపవచ్చు. అందులో విశేషం ఏమీలేదు. ఇక లక్ష్మి ఉందంటే – లక్ష్మితో తనకుగల సంబంధం ఇంకా ఆచరణలోకి రానిది. ప్రస్తుతం లక్ష్మి తన కంటపడకుండా మాత్రం తిరుగుతూ ఉంటుంది. తను రాగానే స్ప్రింగు తన్నినట్టు లేచి నిలబడుతూ ఉంటుంది. పెద్దగా మాట్లాడేది కాస్తా గొంతు తగ్గించి త్వరలోనే మాట్లాడటంకూడా మానేస్తుంది. తను మాట్లాడుతుంటే బహుశా చాటునుంచి ఆలకిస్తూకూడా ఉండవచ్చు.

సుందరం అత్తవారు ఒకప్పుడు దర్జాగా బతికినవారనటానికి సందేహంలేదు. ఇప్పటికీ వాళ్ళకు దర్జా పూర్తిగా చావలేదు. సుందరం అత్తగారు కమలమ్మగారిది ఇప్పటికీ పెద్దచెయ్యి. వంటదగ్గర్నుంచీ, వడ్డనదగ్గర్నుంచీ ఆవిడ పెద్దచెయ్యి కనిపిస్తూనే వుండేది. ఇప్పుడు తాను చేసే వంట నలుగురికే అయినా గుండిగలతో వంటచేసే అభ్యాసం కలదానిలాగా కూరముక్కలూ, పులుసు ముక్కలూ పెద్దవి తరిగేది. అయినా మనిషిలో పొదుపు లేకపోలేదు.

పెళ్ళిలోనూ మనుగుడుపులకు వచ్చినప్పుడూ సుందరం అత్తవారి యధార్థ పరిస్థితి పసికట్టలేకపోయినాడు. కాని వారి దారిద్ర్యం ఈసారెదాగలేదు. ఈ దారిద్ర్యం తిండిదగ్గర బయటపడేది కాదుగాని మిగిలిన అన్ని విషయాలలోనూ బయటపడేది. పెద్దవాళ్ళదేమిటి, మగపిల్లలిద్దరికీ మంచి చొక్కాలూ, లాగులూ కూడా లేవు. ఈ విషయంలో లక్ష్మికొద్దిగా నయం. అదైనా ఇటీవలనే పెళ్ళి అయివుండటాన కావచ్చు.

ఇల్లంతా గాలించినా కాలక్షేపానికి చదువుకునేటందుకు ఒక పుస్తకంగాని, చూసుకునేందుకు బొమ్మలుగాని ఆ ఇంట్లోలేవు. తోచనప్పుడు చదువుకునే అలవాటు గల సుందరానికి ఈ ఇల్లు చూస్తే ఆశ్చర్యం వేసింది. ఇంటికంతకూ కలిసి రెండే మంచాలు. ఒకటి పార్వతీశంగారు ఉపయోగించేవాడు. రెండోది సుందరానికి వేసేవాళ్ళు. మిగిలిన అందరూ కిందనే పడుకునేవాళ్ళు. సుందరం వేసుకునే పరుపుతప్ప ఇంట్లో మరొక పరుపులేదు. కింద పడుకునేవాళ్ళంతా పాత గుడ్డలు కుట్టిన బొంతలు పరుచుకు పడుకునేవారు. పార్వతీశంగారు మటుకు మంచంమీద జంపఖాన పరుచుకుని తలకింద రాయిలాంటి దిండొకటి పెట్టుకునేవాడు.

అయితే సుందరం దృష్టికిదంతా దారిద్ర్యంగా కనిపించలేదు. ఐశ్వర్యం చూడని వాడికీ, అందులో ఆనందం మరగని వాడికీ దారిద్ర్యం బాధ కలిగించదు. లేమిగా స్ఫురించదు. తన అత్తవారు ఏదో తపస్సు చేస్తున్నారనిపించింది సుందరానికి. ఆ జీవితంలో పాల్గొనటం వాడికేమీ బాధ అనిపించలేదు.

ఆ అందరిలోకీ కనకమే కొంచెం భిన్నంగా ఉండేవాడు. వాడు తన చొక్కా లాగు విషయం పోట్లాడేవాడు. "నాకు మంచి ట్విల్లు చొక్కాలు కుట్టించు నాన్నా.

ఈసారి నాకు మంచి పంట్లాం కుట్టించు నాన్నా" అని వాడు తండ్రిని రోజూ కోరేవాడు. పార్వతీశంగారు "సరేలేరా, అట్లాగేలేరా" అని సమాధానమిచ్చేవాడు.

కనకం తన సుఖం తను ఏదో విధంగా చూసుకునేవాడు. కాని మిగిలినవాళ్ళ జీవితం పంచుకుని సంతృప్తిపడేవాడు కాడు. ఏదో విధంగా వాడు కానీ సంపాదించి సోడా తాగేవాడు. అణా సంపాదించి కాఫీ హోటల్లో ఒక ఇడ్లీ, అరకప్పు కాఫీ తాగేవాడు. బేడా సంపాదించి సినిమా మొదటి ఆటకు వెళ్ళివచ్చేవాడు. ఇటువంటి వాటిల్లో వాడికి అమితమైన ఆనందం ఉండేది. జగన్నాధానికి ఇటువంటి పనులు చేయాలన్న ఉబలాటంగానీ, చేస్తే ఆనందంగానీ ఉండేదికాదు - కనీసం ఉన్నట్లు పైకి కనపడేది కాదు.

సుందరం తనవెంట కొంత డబ్బు తెచ్చుకున్నాడు. అప్పుడప్పుడూ తన బావమరుదులను వెంటపెట్టుకుని ఏ సినిమాకో, కాఫీ హోటలుకో బయల్దేరేవాడు. అటువంటప్పుడు కనకం ఎంతో ఆనందం కనబరిచేవాడుగాని, జగన్నాధం మటుకు కొంచెమన్నా తొణికేవాడుకాదు.

లక్ష్మి అన్నలాంటిదిగాని, తమ్ముడిలాంటిది కాదు. అది తల్లికి ఇంటిపనులన్నిటిలోనూ సహాయపడేది. పనిలేనప్పుడు ఏ స్నేహితురాళ్ళతోనో, తల్లితోనో కబుర్లు చెబుతూ కూర్చునేది తప్ప మామూలు ఆడపిల్లల వ్యాపకాలేవీ పెట్టుకునేది కాదు. ముగ్గూ, అల్లికా, పాటలూ, పుస్తకాలూ మొదలైన సరదాలేవీ దానికి లేవు. ఇష్టం లేకనో, జరక్కనో సుందరానికి తెలీదు. లక్ష్మి చదువుతుందనే ఆశతో సుందరం తెగబడి తన దగ్గిరవున్న డబ్బులో కొంత పెట్టి రెండుమూడు ఆంధ్ర ప్రచారిణి నవలలూ, ఒకటిరెండు పత్రికలూ కొన్నాడు. లక్ష్మి పనికూడా మానేసి వాటిని తదేక ధ్యానంతో చదివింది. వీలయినప్పుడల్లా పుస్తకాలు కొనాలని సుందరం సంకల్పించాడు.

* * * *

అత్తవారింట తనకు అల్లుడి మర్యాద అతిగా జరగటం సుందరానికిష్టంలేదు. కొద్దిరోజులు జరిగే మర్యాద చాలాకాలం జరగదని వాడికి తెలుసు. ఇప్పుడు మర్యాద చేయించుకోవటం సులభమే అయినా తరవాత అది సన్నగిల్లినప్పుడు తనకు తప్పక బాధకలుగుతుందని వాడి నమ్మకం. అంత్యనిష్ఠూరంకన్నా ఆదినిష్ఠూరం మేలు. రెండు సంవత్సరాలో, నాలుగు సంవత్సరాలో తాను ఇక్కడే ఉన్నమీదట ఏర్పడే పరిస్థితిని తన అత్తవారు తనలాగా ఊహించుకోలేకపోతున్నారని సుందరం అనుకున్నాడు. అన్నం దగ్గిర అత్తగారు వడ్డించేటప్పుడూ, మధ్యాహ్నం పూట కేవలం తన ఒక్కడికోసమే టిఫిను చేసినప్పుడూ సుందరం చాలా బాధపడేవాడు. తనకు ప్రత్యేకంగా టిఫిను చెయ్యవద్దని చెప్పేవాడు. కాని ఎవరూ వినిపించుకునేవారు కారు.

అత్తవారి వైపు చుట్టాలతో సుందరానికి మరొక సమస్య అయింది. వాళ్ళందరూ తనకు ఎవరో అన్నట్టు భావించేవాడు. వాళ్ళ పుట్టుపూర్వోత్తరాలూ, పేర్లూ చుట్టరికాలూ జ్ఞాపకం పెట్టుకోవాలంటే సుందరానికి విసుగుగావుండేది. వాళ్ళు

కూడా ముభావంగా ఉన్నప్పుడు ఇబ్బంది లేదుగాని వాళ్ళు తనతో ఆప్యాయంగా మాట్లాడటం ప్రారంభించినప్పుడూ, తనతో చిన్నతనంనుంచీ పరిచయం వున్నట్టు ప్రసంగించినప్పుడూ ఊపిరి సలిపేది కాదు. చిక్కేమిటంటే సుందరం ఎటూగాని వయసులో ఉన్నాడు. తాను పెద్దవాడైపోయినట్టు తనకన్న చిన్నవాళ్ళను నమ్మించగలడుగాని తనకన్న చాలా పెద్దవాళ్ళను నమ్మించలేడు. ఆ వయసులో వున్నవాళ్ళను చూసినప్పుడు పెద్దవాళ్ళను పొడిచి చూడాలన్న ప్రేమ కలుగుతుంది.

అందులోనూ పార్వతీశంగారిది చుట్టపక్కాలు వచ్చిపొయ్యేకొంప. కమలమ్మగారి బలగం మరీ జాస్తి, వాళ్ళలో చాలామంది గొప్ప గొప్ప హోదాల్లోకూడా వున్నారు. ఆవిడ చెల్లెలొకావిడ పట్నంలోనే నివాసం. మొగుడు అడ్వకేటు. కమలమ్మగారి పినతండ్రి మెజిస్ట్రేటు పనిచేసి పింఛను పుచ్చుకున్నాడు. పినతల్లి కొడుకొకాయనకు పెద్ద వ్యాపారమున్నది.

పార్వతీశంగారింటికి వచ్చిపొయ్యేవారిలో గంభీరులున్నారు. వెకిలివాళ్ళున్నారు. హాస్యగాళ్ళున్నారు. ఎవరితోనూ పలకకుండా మోహం ముడుచుకునే వాళ్ళున్నారు. అందరికన్నా ఒక పెద్దమనిషి సుందరాని కెక్కువ ఆగ్రహమూ ఆశ్చర్యమూ తెప్పించాడు.

"ఏం బాబూ, నువ్వేనా పార్వతీశం అల్లుడివి? నేను పెళ్ళికి రాలేదులే మా పార్వతీశం ఈ పెళ్ళితో పూర్తిగా క్షవరమైపోతే పోయినాడు గాని మంచి అల్లుణ్ణే సంపాదించాడులే" అన్నాడు.

ఈ మాటల్లో హాస్యమే వుందో, వ్యంగ్యమే వుందో, విషమే వుందో, కేవలం బర్బరత్వమే వుందో సుందరం తేల్చుకోలేదు. అందుచేత దీనికి సమాధానం చెప్పలేదు. ఒకవేళ చెప్పుదామనుకున్నా ఏం చెప్పాలో సుందరానికి తెలిసి వుండేదికాదు. తనకు పిల్లనిచ్చి పెళ్ళిచేసి తన మామగారెంత నష్టపడ్డాడో సుందరం ఎరగడు.

❀ ❀ ❀ ❀

రెండు మూడు రోజుల్లో సుందరం కాలేజీలో ప్రవేశిస్తాడనగా శ్యామలగారు, అంటే కమలమ్మగారి చెల్లెలు, పట్నంలో భర్త హైకోర్టు ప్రాక్టీసు చేస్తున్నావిడ, వర్షాకాలంలాగా ఒక్కుమ్మడిగా పిల్లలతో సహా వచ్చిపడింది. ఆవిడభర్త తాలూకు బంధువు లెవరింట్లోనో కాకినాడలో వివాహమైతే వెళ్ళారుట. తిరిగి పట్నం వెళుతున్న శ్యామలగారు అక్కగారినీ, కొత్తగా పెళ్ళయిన అక్కకూతుర్నీ చూసిపోదామని దిగబడింది.

సుందరం పిన్నత్తగారి ధాటికి తట్టుకోలేక మొదట్లో దిమ్మరపోయినాడు, ఆవిడ మాట్లాడటం మొదలుపెడితే ఒకే కాలమందు అరడజను విషయాలు అవలీలగా మాట్లాడగలదు. ఆ సంభాషణయొక్క సారాంశం ఒక్కముక్కలో చెప్పాలంటే, "నా జీవితం తారామండలంగా వెలిగిపోతోంది" అనీ.

"మొన్న బొబ్బిలి రాజాగార్ని కలిసినప్పుడు మా ఆయన స్థానం నరసింహారావును రాజాగారికి పరిచయం చేశారు చూడూ – అప్పటికి మా ఆయన స్థానాన్ని ఎరిగి ఎంతకాల మయిందిగనకా? ఈయన ఊటీవెళ్ళి గవర్నరుగారి వెంట నెలరోజులుండి రావటానికి ముందేగా?..." యీ ధోరణిలో ఆవిడ గంటల తరబడి మాట్లాడగలదు.

ఆవిడ అభిప్రాయం అందరి దృష్టిలోనూ చాలా గొప్పదిగా కనబడటమే అయినట్టయితే, సుందరంమీద ఆవిడ సంభాషణ ఆటే పారలేదు. ఆవిడకు గొప్ప స్నేహాలున్నాయని వాడు గ్రహించాడు – ఆవిడ మాటల్లో పదోవంతు నిజమైనా పెద్దెత్తున జీవిస్తున్న మనిషే. కాని ఇతర విషయాల్లో ఆవిడను గురించి సుందరం మెచ్చుకోలేకపోయినాడు. ఒకపూట ఆవిడే వంటచేసింది. ఆవిడను వంటింట్లో చూడకుండానే సుందరం ఆవిడకు వంట చెయ్యటంలో ఏమీ ఆసక్తిలేదనీ, ఎప్పుడయి పోతుందా అన్నట్టు చేస్తుందనీ ఆఖరుకు ఆవిడకు తిండి గురించి కూడా ఏమీ తెలీదనీ నిశ్చయించుకున్నాడు. పప్పుపులుసు చేసి పెసర పచ్చడి చేసింది. పప్పుపులుసులో వంకాయ ముక్కలు వేసింది. వంకాయ పులుసు పచ్చడిచేసింది. అందులో ఉల్లిపాయలు వేసింది. వేరే మళ్ళీ ఉల్లిపాయ పచ్చడి చేసింది. వంకాయకూర చేసింది. అందులో ఉల్లిపాయలు వేసింది. పులుసు కాగలేదు. వంకాయ పులుసు పచ్చడిలో ఉప్పువెయ్యటం మరచిపోయింది. వంకాయ కూర బొగ్గుప్రమాణానికి మాడింది.

"పాపం ఈ ఇల్లాలు వంటింట్లో ఉల్లిపాయలతోనూ, చింతపండుతోనూ ఇష్టం వచ్చినట్టు ఆడుకున్నది. వంట చేసినంతసేపూ ఆవిడ ఊటీ గురించీ, బళ్ళారి రాఘవాచారి గురించీ, ఉల్లిపాడు జమీందారు గురించీ హైకోర్టు ఛీఫ్ జస్టిసు గురించీ, మాట్లాడుతూ వుంటుంది" అనుకున్నాడు సుందరం. వాడి ఊహ సరో కాదో చెప్పేవాళ్ళు లేరు.

గొప్పకవి కవిత్వంలాగా ఆవిడను చూస్తున్నకొద్దీ సుందరానికి ఆవిడలో ఎన్నో కొత్తవిషయాలు కనపడసాగాయి. పైకి ఎంతో ఉల్లాసంగా ఎక్కడో ఆకాశవీధుల్లో మహోన్నత భావాలమధ్య విహరిస్తున్నట్టు కనపడటమూ, ఏవేవో తలచుకుని విరగబడి నవ్వటమూ, తాను మాట్లాడుతున్న మాటలు అవతలవాళ్ళమీద ఎట్లా పనిచేస్తున్నదీ గమనించలేకపోవటమూ చూసి ఆవిడ తన జీవితంతో చాలా అసంతృప్తిచెంది వుండాలని అనుకున్నాడు. తన కిష్టమైన విషయాలను గురించి ఎంతో అద్భుతంగా చెప్పటమూ, తన కిష్టంలేనివాటిని గురించి ఎంతో జుగుప్స కనబరచటమూ శ్యామల గారికి అలవాటు. ఎంతో వయస్సులేని సుందరానికే ఆవిడలో ఓర్వలేని తనమూ, కుళ్ళుమోతుతనమూ చాడీఖోరుతనమూ, తాను చెప్పేదానికి తిరుగువుండవీలులేదన్న అహంకారమూ, తెలియనివి తెలిసినట్టు నటించటమూ వున్నట్టు తోచింది.

కాని ఆవిడను ఎవరూ పల్లెత్తుమాట అనలేదు. ఆవిడ చెప్పినవన్నీ శ్రద్ధగా విన్నారు. ఆవిణ్ణి ఆనందపరచటానికి విశ్వప్రయత్నాలు చేశారు. ఆవిడతోపాటు

నవ్వారు. ఒక్క సుందరం తనను గురించి ఏమనుకుంటున్నాడో మటుకు ఆవిడకు అర్థంకాలేదు. అందుచేత ఆవిడ నలుగురినీ కూర్చోబెట్టి, బహిరంగ సభలకు పనికి వచ్చే గొంతుతో మాట్లాడేటప్పుడు, పక్కన సుందరం వుండటం జరిగితే వాడికేసి మధ్య మధ్య పక్కచూపులు చూసేది. ఒకసారి ఇది గమనించి సుందరం అక్కణ్ణుంచి లేచి అవతలికి వెళ్ళాడు. ఆవిడ బహుశా వాణ్ణి శపించుకుని ఉంటుంది.

శ్యామలగారి కిద్దరుపిల్లలు. ఒక ఆడపిల్లా, మగపిల్లవాడూనూ, ఇద్దరూ అరవం మాట్లాడుతారు. ఆడపిల్ల తల్లిలాగే నోరు తెరిచినప్పుడల్లా గొప్పలు చెప్పుకుంటుంది. పిల్లవాడికి మటుకు నోట్లో నాలికలేదు. ఆ ఇద్దర్నీ చాలా ఆదర్శంగా పెంచుతున్నట్లు శ్యామలగారు నటించేది. కాని ఆవిడకా పిల్లలమీద ఏదో విసుగున్నట్టూ, తన అవతారానికి వాళ్ళు ప్రతిబంధంకంగా వున్నారని ఆవిడ భావిస్తున్నట్టూ సుందరానికి పొడగట్టింది. వాళ్ళమీద తనకు అంతలో కలిగే చిరాకును ఓర్పుకింద ప్రదర్శించేటందు కావిడ చేసే వ్యర్థప్రయత్నాలు సుందరానికేమీ నచ్చలేదు. సుందరం మనుష్యులను అర్థం చేసుకునేస్థితిలో ఉన్నాడుగాని సహించేస్థితిలో లేదు.

రెండు రోజులుండి శ్యామలగారు సుందరం కాలేజీలో ప్రవేశించే రోజే పట్నం బయలుదేరింది.

“ఏం నాయనా? నువు నిజంగా పట్నం కాలేజీలో చేరవలసింది. చదువంటే పట్నంలోనే చదవాలి. సీటు మీ పినమామగారు అవలీలగా ఇప్పించి వుండేవారు. పట్నంలో ఆయన్నెరగనివాళ్ళెవరు? అంతా అయితే ప్రిన్సిపాల్ అవతారంగారి భార్యతో నేనన్నా చెప్పి ఉండేదాన్ని... ఎప్పుడన్నా పట్నంవస్తే మా ఇంట్లోకూడా వుండి పోవచ్చులే, మేం పరాయివాళ్ళంకాదు” అన్నదావిడ.

ఆవిడ ప్రారబ్ధమో, సుందరం ప్రారబ్ధమోగాని ఆవిడ అన్న ప్రతిమాటా వాడి చెవులకి తప్పుగానే వినిపించింది – అవతారం అనే ఆయన ఏ కాలేజీ ప్రిన్సిపాలో తెలియకపోవటం అటుంచి.

“పట్నం చదువు చదివేటంత తాహతులేదులెండి. ఈ చదువు ఈడిస్తే చాలా అదృష్టవంతుణ్ణే” అన్నాడు సుందరం.

“డబ్బా?” అన్నదావిడ తూస్కారంగా, “వెధవ డబ్బు, నీ చదువుకయ్యే డబ్బుకూడా ఒక డబ్బేటోయ్ పిచ్చివాడా!” అన్నది శ్యామలగారు.

ఎవరో ఒకరికి డబ్బంటే అంత తృణీకారభావం ఉన్నందుకు సుందరంచాలా సంతోషించాడు.

ఆవిడ వెళ్ళిపోయిన మరుక్షణం సుందరానికి మళ్ళీ మానవ ప్రపంచంలో పడ్డట్టనిపించింది. కాని పార్వతీశంగారన్నట్టు సందడంతా అణిగిపోయింది.

ఆరోజే సుందరం కొత్తగా పెట్టిన కాలేజీలో చేరాడు. ఆ సంగతి తల్లికి కార్డు కూడా రాశాడు. ఆ కార్డుతోబాటు మేనమామక్కూడా రాశాడు. తనవెంట ఉన్నడబ్బు చాలదని, పుస్తకాలు కొనుక్కోవటానికి 15 రూపాయలైనా పంపించమనీనూ.

ఈ కార్డుకు సమాధానం రాస్తూ శేషగిరి, "డబ్బు రెండు మూడు రోజుల్లో పంపిస్తాను. నిన్ననే మీ అమ్మ ఇక్కడికి వచ్చింది. ఇక్కడే ఉండమన్నాను. ఇల్లంతా అద్దెకిచ్చేద్దామని నా ఆలోచన" అని రాశాడు.

## 21

చదువంటే ఇప్పటికీ సుందరానికి పూర్వం వున్న ఆదరాభిమానాలున్నాయి. కాని ఈ ఆదరాభిమానాలు క్లాసు పుస్తకాల పరిమితిలో నిలిచి వుండటంలేదు. అదివరలో పాఠ్యపుస్తకాలే సాహిత్యంగానూ, ఉపాధ్యాయులే రచయితలుగానూ ఉన్నట్టుండేది. ఇప్పుడు వాడు వేరే సాహిత్యాన్నీ వేరే గ్రంధకర్తలనూ తెలుసుకోసాగాడు. చార్లెస్ డికెన్స్[38] నవలలూ, థామస్ హార్డీ[39] నవలలూ వరుసగా తెచ్చుకుని చదివెయ్యసాగాడు. వాడికి మానవ సమాజంతో ఆటే పరిచయంలేని లోపాన్ని ఈ సాహిత్యం అద్భుతంగా తీర్చింది – కనీసం తీర్చినట్టు కనబడింది.

కాలేజీ పాఠాలూ, లెక్చరర్లూ – వీటిలో సుందరానికి ఆనందం కనిపించలేదు. ఒకప్పుడు వాడి జీవితంలో కల్లా స్కూలులో గడిపేకాలమే కాంతివంతంగా తోచేది. యిప్పుడు కాలేజీలో గడిపేకాలం అంత కాంతివంతంగా లేదు. అంతమాత్రానికే సుందరానికి కాలేజీమీద అసహ్యం వేసిందనికాదు. ఇప్పటికికూడా కాలేజీ వాతావరణమూ, విద్యార్థులూ, వారి సాంగత్యమూ సుందరానికి ఆహ్లాదకరంగానే వుంది. అయినా. "మంచి" అబ్బాయిగా లెక్చరరు చెప్పే మాటలన్నీ చెవులు రిక్కించి వినటమూ, సందేహాలు కలిగితే లెక్చరర్ను అడిగి నివృత్తి చేసుకోవటమూ చాలా అనవసర మనిపించింది.

హైస్కూలులో సుందరం సహాధ్యాయులకూ, కాలేజీ సహాధ్యాయులకూ ఏమీ సంబంధం లేదు. వీళ్ళలో అతి విచిత్రమైన వ్యక్తులున్నారు. జగన్నాథం ఆడవేషాలు వేస్తాడు, పాడతాడు. చిన్నప్పటినుంచీ నాటకాలలో వేషాలు వేస్తూనే వున్నాడు. చిన్నప్పుడు లోహితాస్యుడూ, ప్రహ్లాదుడూ, కృష్ణుడూ వేశాడు. ఇటీవలనే ఆడవేషాలు ప్రారంభించాడు. బసవపున్నయ్య ఫుట్‌బాల్ ఛాంపియన్. గోవిందరాజులు టెన్నిస్‌లో పైకి వస్తున్నాడు. లెక్చరర్లతో ఆడుతున్నాడు. సుదర్శనం ప్రత్యేకత ఏమంటే క్లాసులో కనపడని అల్లరీ, కనపడే అల్లరీ కూడా చేసేవాడు. ఒకనాడు ఇంగ్లీషు పాఠం

---

38. ఛార్లెస్ డికెన్స్ (1812–1870): విక్టోరియన్ రచయితల్లో ప్రముఖుడైన గొప్ప ఆంగ్ల నవలా రచయిత. ఆయన ప్రపంచ ప్రఖ్యాతి పొందిన నవలలు, "ఆలివర్ ట్విస్ట్" (1837–38), "డేవిడ్ కాపర్ ఫీల్డ్" (1849–50), "ఎటేల్ ఆఫ్ టూ సిటీస్" (1859), "గ్రేట్ ఎక్స్‌పెక్టేషన్స్" (1860–61).

39. థామస్ హార్డీ (1840–1928): ఆంగ్ల నవలా రచయిత – కవి, నాటక రచయిత. హార్డీ రచించిన కొన్ని నవలలు "అండర్ ది గ్రీన్ వుడ్ ట్రీ" (1872), "ఫార్ ఫ్రం ది మ్యాడింగ్ క్రౌడ్" (1874), "ది రిటర్న్ ఆఫ్ ది నేటివ్" (1878), "ది మేయర్ ఆఫ్ కాస్టర్ బ్రిడ్జి" (1886), "ది వుడ్ లాండర్స్" (1887).

జరుగుతూండగా వాడు గడియారం తెచ్చి బల్లకిందపెట్టి అలారం కొట్టించాడు. మరోరోజు తెలుగు క్లాసులో తన చుట్టుప్రక్కలవాళ్ళకు గారెలు పంచి పెట్టసాగాడు. ప్రతి జీవి తన జన్మ సార్థక్యం కోసం తెలిసో తెలియకో అనుక్షణమూ ప్రయత్నిస్తూ వుంటాడన్నమాట నిజమైతే, వరండాలో వెళ్ళే లెక్చరర్ల మీదా, విద్యార్థుల మీదా కాగితం బాణాలు వెయ్యటమూ, క్లాసు పాఠం మధ్య కప్పగంతులు గియ్యటమూ తన జన్మ సార్థక్యమని సుదర్శనం భావించాడన్నమాట.

సుదర్శనం చేసే పనులేవీ సుందరం చేద్దామనుకునే పనులుకావు. అయినా సుదర్శనాన్ని చూస్తే వాడికి ఆనందంగా, సంతృప్తిగా వుండేది. సుదర్శనం వాడికి కావలసిన పనులు యథేచ్ఛగా చేస్తున్నాడు. కాని తనకు కావలసిన పనులు చేసే ధైర్యం సుందరానికి లేదు.

అందరూ సుందరానికి నచ్చిన వాళ్ళే కారు. కొందరు వాడికి చాలా ఆగ్రహం తెప్పించారు. అటువంటి వాళ్ళలో ఒకరిద్దర్ని సహించటం కూడా సుందరం నేర్చుకున్నాడు. హనుమంతరావుండే వాడు, వాడు యెప్పుడూ ఆడవాళ్ళ కబుర్లు మాట్లాడేవాడు. పెళ్ళయిన విద్యార్థులు అత్తవారిళ్ళకు పోతున్నప్పుడల్లా వ్యంగ్య సంభాషణ చేసేవాడు. అటువంటివాడు అత్తవారింట్లో పెళ్ళానికి సన్నిహితంగా ఉంటున్న సుందరాన్ని వదులుతాడా? సుందరం ఇంటిదగ్గిర ఇంకో చదువు చదువుతాడనీ, రోజూ మూడో ఆట సినిమా చూస్తాడనీ, ఇంకా ఏమేమిటో అనటం ప్రారంభించాడు. సుందరానికి మండిపోయింది. పక్కనున్న వాళ్ళను నవ్వించటానికి ఇటువంటి అసందర్భాలు మాట్లాడినందుకు హనుమంతరావునూ, అవి విని నవ్వినందుకు మిగిలిన వాళ్ళనూ పట్టుకుని సుందరం దులిపేశాడు. అందరూ పడి ఊరుకున్నారు గాని, ఎవరో ఒకతను, "దీన్నింత సీరియస్‌గా తీసుకోవాలిటోయ్!" అన్నాడు. అప్పట్లో సుందరం కోపం తగ్గలేదు. కాని తరవాత తరవాత హనుమంతరావు హృదయం చాలా మంచిదనీ, వాడి నోటిమాటలు గాలిమాటలేగాని అందులో ఏమీ ఉండదనీ తెలుసుకుని సమాధానపడ్డాడు. హనుమంతరావులో ఇంకొక గొప్ప గుణం కూడా సుందరానికి కనిపించింది. ఎదటలేని మనిషిని గురించి ఏమీ అనేవాడు కాడు. యింకొకరు అంటే సహించేవాడూకాడు.

సుందరం స్నేహం సంపాదించిన వాళ్ళు క్లాసులో పది పన్నెండు మందిదాకా ఉండేవారు. మిగిలిన వాళ్ళలో ఏ ఇద్దరు ముగ్గురిమీదో అసహ్యం ఉండేది సుందరానికి. వాళ్ళు కేవలమూ లెక్చరర్లని "కాకా" పట్టే బాపతు. వీళ్ళలో నిజమైన తెలివితేటలున్న వాడెవడూలేడు. అటువంటి వాళ్ళలో ఒకడు "కూరగాయలు" అనే సార్థకనామం సంపాదించుకున్నాడు. వాడు తమ పొలంలో పండాయని కూరలు పట్టుకుపోయి లెక్చరర్ల ఇళ్ళలో ఇచ్చి వస్తుంటాడు. "పొలమూలేదు. పాడూలేదు. బజార్లోనే కొనుక్కుపోయి ఇస్తాడు" అన్నాడు సుదర్శనం తాను స్వయంగా చూసినట్టు ప్రమాణం చేసినా ఎవరూ నమ్మరు. అందుచేత ఈ విషయం రూఢికాలేదు.



ఒకనాడు సుందరం కాలేజీలో ఉండగా నరుసు వచ్చాడు క్లాసులు వెతుక్కుంటూ. నరుసు కళ్ళబడగానే సుందరం క్లాసులోనుంచి బయటికి వచ్చాడు.

"ఎప్పుడొచ్చావురా?" అన్నాడు సుందరం.

"ఈ పూటే వచ్చాలే. నాన్నకూడా వచ్చాడు. మీ మామగారూ నాన్నా కలిసి వాళ్ళ చిన్నతనంలో జరిగిన విషయాలు చెప్పుకుంటున్నారు" అన్నాడు నరుసు.

"అమ్మ కులాసాగా ఉందా?"

"ఆఁ, శనాదివారాల్లో అన్నా రావేంరా?"

'నువ్వూ, మామయ్యమటుకే వచ్చారా?"

"జానకి కూడా వచ్చింది."

"మా - ఇంట్లోనే దిగిందా?"

తన మామగారింటిని ఇల్లని చెప్పుకోవలసి వచ్చినందుకు సుందరం కాస్త సిగ్గుపడ్డాడు.

"ముగ్గురం అక్కడే దిగాం"

"ఇంకేమిటి విశేషాలు?"

"చాలా ఉన్నయిలే. నువు క్లాసులోనుంచి వచ్చేశావుగదా మాస్టరు కోప్పడడూ?" అన్నాడు నరుసు.

"ఇదేం వీధిబడి అనుకున్నావా?" అన్నాడు సుందరం నవ్వుతూ, కాస్తగర్వంగా.

"ఒంటిగంటన్నరకు వదుల్తారుగా, అప్పుడు కలుసుకుందాం, నువు పద, ఈ లోగా నేను క్లాసులన్నీ తొంగిచూస్తా. మా వూరి చిన వెంకయ్య కొడుకు కనిపిస్తాడేమో చూడాలి" అన్నాడు నరుసు.

సుందరం క్లాసుకు వెళ్ళిపోయాడు.

మధ్యాన్నం ఇంటర్వెల్‌లో సుందరమూ, నరుసూ కాఫీహోటలుకు వెళ్ళారు.

"ఈ ఊళ్ళో నాటకం ఏర్పాటుచెయ్యాలిరా అందుకే వచ్చా" అన్నాడు నరుసు.

"ఏం నాటకం?"

"వరవిక్రయం"[40]

"ఎవరాడుతారు?"

"మేమే. మా జట్టంతా వచ్చి ఆడుతుంది."

"డబ్బొస్తుందీ?"

"కనీసం ఖర్చులు గిట్టినా చాలు. అంతా నీలో ఉంది."

"నాలోనా?" అన్నాడు సుందరం ఆశ్చర్యంతో.

---

40. వరవిక్రయం: కాళ్ళకూరి నారాయణరావు వరకట్న సమస్యపై రచించిన నాటకం. చిత్రాభ్యుదయం లేక సారంగధర, చింతామణి, మధుసేవ, పద్మవ్యూహం వీరి యితర నాటకాలు.

"అవును. హాలు బుక్ చెయ్యటం, టిక్కెట్లు అమ్మటం, గేట్లలో మనుష్యుల్ని నిలబెట్టటం, నోటీసులు అచ్చువేయించటం, పంచి పెట్టించటం ఇవన్నీ చెయ్యటానికి నీ స్నేహితుల్ని నలుగుర్ని చూస్తే పని జరిగిపోతుంది. ఒక వంద రూపాయలు టిక్కెట్లు అమ్మినా మనకు గిట్టుబాటవుతుంది. కాలేజీ స్టూడెంట్సే కొన్నాచాలు. ఏమంటావ్?" అన్నాడు నరుసు.

తన చుట్టరికం వినియోగపరిచి నరుసు తన స్వార్థం చూసుకుంటున్నాడని సుందరానికి కోపం వచ్చింది. తనకున్న స్నేహితులను ఈ విధంగా ఉపయోగపరచుకుంటే వాళ్ళకూ తనకూ వున్న స్నేహం దెబ్బ తింటుందనుకున్నాడు సుందరం. ఆదర్శ స్నేహమన్నది ఎందుకూ పనికిరాకూడదని వాడి నమ్మకం.

"ఇదంతా జరిగేపని అనుకోను, అయినా చూద్దాంలే" అన్నాడు సుందరం.

"ఎందుకు జరగదురా? ఒక నాటకం పడాలిగాని ఆ తరువాత రెండోదానికి కనకవర్షం కురవదూ? ఊరూ పేరూ లేని వాళ్ళమైపోయినాంగాని మాది ఎంతమంచి జట్టు!" అన్నాడు నరుసు.

సుందరం మాట్లాడలేదు. నరుసుమీద వాడికిగల అభిప్రాయం మళ్ళీ కొంత జారింది. 'తను ఏ యడవల్లి సూర్యనారాయణో కావాలని వీడి ఆశ అనుకున్నాడు సుందరం. తనలో అటువంటి ఆశ వుండటంలో తప్పేమిటో వాడికే సరిగా తెలీదు.

సుందరం తన క్లాసుకు తిరిగి వెళ్ళాడు. నరుసు రాత్రిదాకా మళ్ళీ వాడికి కనిపించలేదు.

కాలేజీ వదలగానే సుందరం యింటికి వెళ్ళాడు. జానకిని చూసి వాడు సంతోషించిన మొహం పెట్టలేదు. తన అత్తవారు మాత్రం జానకిని ఎంతోముద్దు చెయ్యటం చూశాడు. నరుసు వచ్చినపని – అది కూడా ఒక పనే? – తెలిసిందిగాని వాడి వెంటపడి వాళ్ళ నాన్నా, తన చెల్లెలూ ఎందుకు వచ్చారో సుందరానికి అర్థం కాలేదు. "ఊరికేనే" వచ్చారు.

దీపాలు పెట్టిన కాస్సేపటికి నరుసు యింటికి చేరుకున్నాడు.

"మళ్ళీ కనిపించలేదేంరా?" అని అడిగాడు సుందరం.

"అట్టా హాస్టలుకు వెళ్ళాలే... మనవూరి చిన వెంకయ్యగారి కొడుకు కనిపించాడు నాన్నా. వాడు హాస్టల్లోనే వుంటున్నాడు" అన్నాడు నరుసు.

"ఏమన్నాడ్రా? నాటకం పడేనా?" అన్నాడు శేషగిరి ఆత్రంగా.

"ఎందుకు పడదు నాన్నా, హాస్టల్లో నా చేత పాడించారు. అంతమంది స్టూడెంట్సూ చుట్టూ మూగారనుకో! అంతా సహాయం చేస్తామన్నారు. హాలు మాట్లాడి తేదీ నిర్ణయించగానే కాగితాలు అచ్చు కిచ్చేస్తావా" అన్నాడు నరుసు.

సుందరానికి కాస్త ఆశ్చర్యమూ, కోపమూ, సిగ్గూ కలిగాయి. గొంతెమ్మ కోరిక అనుకున్నది నిజంగా ఫలించేటట్టు కనబడ్డది. తీరా అది నెరవేరేసరికి అందులో తనకు పాలుండదల్లే కనపడ్డది. తనను సహాయం కోరినవాడు పోయి హాస్టలు

కుర్రాళ్ళను ఎందుకు అడగాలీ? తను చెయ్యననలేదే? చేసి వుండకపోవచ్చు. అది వేరే విషయం... సుందరానికి తనమీద తనకే కొద్దిగా కోపం వచ్చింది.

❀ ❀ ❀ ❀

అతిథులకు సుందరం అత్తగారు దివ్యమైన భోజనం పెట్టింది.

"అసలే దిక్కుమాలిన రోజులు, ఎందుకమ్మా ఈ పిండివంటలూ, అట్టహాసమూనూ? అన్నాడు శేషగిరి. ఆయనకు జీవితానందంలో నమ్మకం ఏనాడో పోయిందని సుందరానికి తెలుసు. కాని ఇప్పుడా విషయం వాడికి అనుమానం కలగసాగింది. అదంతా జీవితంమీద విరక్తా, లేక తన చదువు ఇతరులు గమనించకుండా చెయ్యాలన్న ఎత్తా అని సుందరానికి సందేహం కలిగింది.

అందరికీ లక్ష్మి పక్కలు వేసింది.

"ఏమర్రోయ్, పక్కలు వేసేటప్పుడు మా జంటను కాస్త కనిపెట్టి వెయ్యండి" అన్నాడు నరుసు.

సుందరానికి చెప్పలేనంత కోపం వచ్చింది. నరుసు బదులు తనే అవమానపడ్డాడు.

భోజనాలైనాక పార్వతీశంగారూ, శేషగిరీ కూచుని వాళ్ళ చిన్ననాటి కబుర్లు చాలా చెప్పుకున్నారు. సుందరం ఆసక్తితో వింటూ కూచున్నాడు. (నరుసు జానకితో గదిలోకిచేరి తలుపేసుకున్నాడు.)

శేషగిరి చెప్పుకుపోయినాడు. "... నేను స్కూలు ఫైనలు చదివిన ఏడు మా జట్టు పరమ దుర్మార్గులు. స్కూలు పరీక్షలైతే ప్రశ్నల కాగితాలు సంపాదించారన్న మాటే. స్కూలు ఫైనల్ పరీక్షకు డిటెయిన్ అయినవాళ్ళు ఆ యేడు స్కూలు పాకలన్నీ తగలబెట్టేశారుగా?... కిష్టయ్య పనే. అమ్మో గోవింద కిష్టయ్య కాలాంతకుడు.... నీకు జ్ఞాపకం వుందా పార్వతీశం? కిష్టయ్య ఒకసారి తెలుగు మేష్టరుమీద హెడ్మాష్టరుకు రిపోర్టు చేస్తానని బయలుదేరటం, 'ఒద్దురా నాయనా! ఊరుకోరా బాబో, నీకు పుణ్యం వుంటుంది' అని తెలుగు మేష్టరు వాణ్ని కాళ్ళూ గడ్డాలూ పట్టుకుని బతిమాలటం...."

పార్వతీశం అందుకున్నాడు: "ఆ తెలుగు మేష్టరొక పిచ్చి బ్రాహ్మడు. క్లాసులో రాని ఇంగ్లీషు మాట్లాడేవాడు. నీకు జ్ఞాపకంలేదు శేషగిరీ? ఆయన ఒకసారి 'స్టాండ్ ది బెంచ్' అనేటప్పటికి పిల్లలంతా పట్టుకుని బెంచీ ఎత్తేశారు."

సుందరం మామగారికి అడ్డంవచ్చి, – "మా తెలుగు మేష్టారు, స్టాండేప్... అయిదు ఫీరుడ్లు అనేవాడు" అన్నాడు.

తాత్కాలికంగా పార్వతీశమూ, శేషగిరీ విద్యార్థులైపోయినారు. సుందరం వాళ్ళతో చేరిపోయినాడు. కోడి రామ్మూర్తి సర్కసు చూసి ఛాతీమీద పెద్ద బండ రాయి పెట్టించుకుని సమ్మెటలతో కొట్టించుకున్న అబ్బాయిని గురించీ, ఇన్‌స్పెక్టరు దొరలను ఏడిపించిన ఇంకో అబ్బాయిని గురించీ, పిల్లల చేత రకరకాల పేర్లు పెట్టించుకున్న ఉపాధ్యాయులను గురించీ, మగపిల్లలతో పాటు చదివి ఇప్పుడు కాపురాలు

చేసుకుంటున్న అమ్మాయిలను గురించీ చాలాసేపు చెప్పుకుని ఏ అర్ధరాత్రి పన్నెండింటికో నిద్రలకు పడ్డారందరూ.

## 22

ఎట్లాగైతేనేం నాటకం పడింది. ఈలోగా నరుసు రోజూ హాస్టలుకు వెళ్ళి అక్కడి విద్యార్థులకు తనకు వచ్చిన పాటలన్నీ, రాగాలన్నీ, పాడి వినిపించాడు. చాలామంది 'శిష్యులనూ', 'భక్తులనూ' సంపాదించాడు. తనతోటి విద్యార్థులు నరుసు బావమరిది అని తనను మరింత ఆదరంగా చూడటం చూసి సుందరానికి కోపంకూడా వచ్చింది. మొత్తానికి సుందరం, నరుసు నాటకానికి ఏమాత్రమూ సహాయం చెయ్యలేదుగాని, నాటకం రోజున తన ఇద్దరు బామమరుదులతో సహా స్టేజిలోకివెళ్ళి కూర్చున్నాడు. సుందరం తన అత్తగారినీ మామగారినీ, పెళ్ళాన్నీ, బావమరుదులనూ తెచ్చాడన్న మాటరాకుండా నరుసే వాళ్ళందర్నీ వరస వరసగా, "ఏమండీ పిన్నిగారూ? ఏం చెల్లెలూ? బయల్దేరి రండి. ఒకరోజుకు నిద్రకాస్త చెడగొట్టుకోండి. ఏం చేస్తాం" అని తన సహజ ధోరణిలో చెప్పి మరీ వెళ్ళాడు వేషం వేసుకోవటానికి.

స్టేజీలోకూడా నరుసు తెగవాగుతూనే ఉన్నాడు. "ఏం తమ్ముడూ? కోటా వేసుకుంటే ఎవరో అనుకుంటున్నావా ఏం? నేనేలే! కూర్చోఅట్లా!" అని సుందరం రెండో బావమరిదిని హుషారుచేస్తూ వచ్చాడు.

"ఇవాళ గొంతు ఏం పలుకుతుందో, ఇవాళ మా శివాయి చెడగొట్టకుండా వుండాలి! ఇవాళ ఈవేషం కూడా సరిగ్గా కుదరటంలేదు. ఈ కేకులు మాత్రం పట్టుకురావద్దురా అంటే ఇవే పట్టుకొచ్చాడు" అంటూ నరుసు నసపెడుతూంటే, వాడు తాను వేషం వేస్తున్న సంగతి మరిచిపోకుండా వున్నట్టు సుందరం కనుక్కోగలిగాడు.

నరుసు నాటకానికి డబ్బురాలేదు. మొత్తం కలెక్షను నూరుదాటలేదు. ఖర్చుకూడా సరిగా గడవలేదు కాని చూసినవాళ్ళు నాటకం బాగుందన్నారు. నటులు అనామకులు వాళ్ళనుంచి ప్రేక్షకులు ఏమీ ఆశించకపోవటంచేతనే ప్రదర్శనం బాగుందనిపించి వుండొచ్చు. నరుసుచేత ప్రతి పద్యమూ రెండేసిసార్లు పాడించారు ప్రేక్షకులు. సింగరాజు లింగరాజు పాత్రధారి శివయ్య ఎంతో చలాకీగా చేశాడు. ఆడపిల్లల వేషాలు రెండూ రెండే! ఏదీ బాగాలేదు.

ఇతర ప్రేక్షకుల కన్న సుందరం నాటకాన్ని చాలా నిశితంగా, నిర్దయగా విమర్శించాడు. వాడికి నాటకంలో లోపాలన్నీ కొట్టవచ్చినట్టు కనపడ్డాయి. నాటకం అయిపోయి ఇంటికి వచ్చిన తరవాత అందరూ నాటకాన్ని మెచ్చుకుంటే "వీళ్ళకి కాస్తయిన బుద్ధిలేదా!" అనుకున్నాడు సుందరం. నరుసును సంతోషపెట్టటానికి అట్లా

అంటున్నారనుకున్నాడు. తన భార్య అయిన లక్ష్మికూడా వాళ్ళతోచేరి నాటకం బాగుందనటం సుందరానికి బొత్తిగా నచ్చలేదు.

నాటకం జరిగిన మర్నాడు నరుసూ, శేషగిరీ, జానకి బయలుదేరారు. పార్వతీశంగారు జానకికి ఖరీదైన చీరె తెచ్చిపెట్టాడు. జానకి వద్దన్నది కాని పార్వతీశంగారూ మిగిలినవాళ్లు వినలేదు. ఈ చీరెకోసమే జానకి బయలుదేరి వచ్చినట్టు తోచింది సుందరానికి.

❀ ❀ ❀ ❀

సుందరం మనసులో ఏదో పరివర్తన కలుగుతున్నది. రాను రాను వాడి బుద్ధికి మనుష్యులంతా తప్పుతోవనే పోతున్నట్టూ, సంఘమంతా అగమ్యగోచరంగా ఉన్నట్టూ, ఇందులో తనకుగాని తాను సంపాదించే జ్ఞానానికిగాని ఏమీ స్థానంలేనట్టూ తోచసాగింది. తాను చదివే పుస్తకాలే, చదివే తనలో ఈ వికారం కలుగుజేస్తున్నదని తోచికూడా ఆ చదువుపైనా, పుస్తకాలపైనా వాడికి కోపం రాలేదు. వాడి మనస్సు ఆదర్శాల మీదికి పరుగెత్తుతున్నది. సంఘంలో ఉన్న ఆచారాలన్నీ తప్పే. సంఘానికి లొంగి జీవితాలు గడిపే వాళ్ళంతా అసమర్థులే. సంఘం తప్పుతోవను పోతున్నట్టు తెలిసికూడా సహించేవాళ్ళంతా పిరికిపందలే. మరి సరిఅయిన వ్యక్తి - అంటే తనవంటివాడు - ఏం చెయ్యాలి? ఈ అంధకారంలో ఆశాకిరణం లేదా? ఉన్నది. అదేమిటంటే ఆడది ఫలాని ఆడదని కాదు అది ఒక అవ్యక్తమైన ఆడస్వరూపం. దానికి బుద్ధితప్ప ఇతర కర్మేంద్రియాలులేవు. అది నీ బుద్ధిని అవలీలగా అర్థంచేసుకుంటుంది. నీ ఆరాటాన్ని ఉపశమింపచేస్తుంది. అదే నీ అంతరాత్మ. ఈ అంతరాత్మ ఆడదే ఎందుకు కావాలో సుందరానికి స్పష్టంగా తెలియదుగాని అది ఆడదేనని వాడికి స్పష్టంగా తెలుసు పైగా వాడు దాన్ని ప్రేమించాడు. అది వాడి తొలి ప్రణయం. పోతే తాను పెళ్ళాడిన యదార్థ వ్యక్తిలో యీ నిరాకార స్వరూపానికి అంశ ఎన్నిపాళ్ళున్నదీ ముందు ముందు తేలవలసి వున్నది.

"సంఘం ఎట్లా వుంటే నువు సంతోషించి వుండేవాడివి?" అని, సుందరాన్ని ఎవరన్నా అడిగితే వాడు తడువుకోకుండా, "సాంఘిక నియమాలేవీ ఉండరాదు. ఈ కులాలూ, ధర్మాలూ, ఆచారాలూ పోవాలి. వ్యక్తులు తమ ఇష్టం వచ్చినట్టు ప్రవర్తించటానికి వీలుండాలి" అని చెప్పిఉండేవాడు. వ్యక్తులు తమ ఇష్టం వచ్చినట్టు ప్రవర్తించే అవకాశం ఉంటే దుర్మార్గంగా ప్రవర్తిస్తారని వాడికి తెలీదు. ఎవరన్నా చెప్పినా నమ్మివుండేవాడు కాడు. ఎందుకంటే వాడి సంస్కృతిలో దుర్మార్గ మన్న దానికి తావులేదు. అవకాశమూలేదు. సంఘానికి ఉద్వాసన చెప్పే ధోరణిలో వున్న సుందరం సంస్కృతి యితరులను దోచుకోవటమూ, ఇతరులను వంచించటమూ, ఇతరులుదాన్ని ఆశించటమూ లేవు.

తన పెళ్ళిచేసి తన మామగారు ఆర్థికంగా ఎంత దెబ్బతిన్నాడో సుందరం క్రమంగా తెలుసుకున్నాడు. ఎవరి ప్రోద్బలంవల్ల ఆయన కూతురు పెళ్ళికి

అంతఖర్చు చేశాడో, ఆయనకు తనమీద ఆగ్రహం ఎందుకు లేదో, ఆడపిల్లను కన్నవాడికి ఈ శిక్ష దేనికో సుందరానికి అర్థంకాలేదు. "నన్నే శాసకుడుగా పెడితే పెళ్ళికి అయిదురూపాయలు మించి ఖర్చు చేసినవాణ్ని జైల్లో వేస్తాను" అనుకున్నాడు వాడు.

మామగారిని పిండి తాను కట్నం తీసుకుని బావుకున్నది కూడా ఏమీలేదు. కట్నం రొక్కంగా తీసుకున్నదంతా లక్ష్మికి నగలు చేయించారు. తన పెళ్ళి ఖర్చులకు అయిన ప్రతి దమ్మిడీకూడా అప్పు తెచ్చినదే. ఎవరికీ ఉపయోగించని ఈ ఆచారాలు ఎందుకున్నాయి? వీటిని ధిక్కరించలేని దేశం బ్రిటీషువాళ్ళ అధికారాన్ని ధిక్కరిస్తే ఎంత, ధిక్కరించకపోతే ఎంత? ఈ దేశంగతి ఇంతే. బ్రిటీషు వాళ్ళుపోరు. ఈ దేశానికి విముక్తిలేదు. ఈ సంఘానికి విముక్తిలేదు. జీవితంలో ఏదన్నా పెద్ద ప్రళయం కలిగితే బాగుండుననిపించేది సుందరానికి. ఏదో విద్ధూరం కోసం ఎదురుచూస్తున్నవాడల్లే ఉండేవాడు. కాని ఆ విద్ధూరం మటుకు జరిగేదికాదు.

❀ ❀ ❀ ❀

తలవని తలంపుగా ఒకసారి రోడ్డుమీద నడుస్తుండగా సుందరం పక్కగా గుర్రబ్బండీ వెళ్ళింది. పరధ్యానంగా చూస్తే బండిలోపోయే ఆడమనిషి ఎరుగున్న మనిషి అనిపించింది. మరుక్షణం బండి ఆగింది. సుందరం శకుంతలను గుర్తుపట్టాడు. శకుంతలతోపాటు ఇంకొక మగవాడు కూడా ఉన్నాడు.

సుందరం దగ్గిరికి రాగానే శకుంతల నవ్వుతూ పలకరించింది. ఆమెలో మార్పేమిటో సుందరానికి అకస్మాత్తుగా తెలిసి వచ్చింది. ఆమె బొట్టుపెట్టుకున్నది. పూలు పెట్టుకున్నది. శకుంతల మళ్ళా పునిస్త్రీ అయింది!

ఇదిగో మా ఆయన. ఆరునెలల క్రిందట పెళ్ళి చేసుకున్నాం. రహస్యంగా, గుంటూరులో మా బంధువుల కిష్టంలేదు. నేను మా అమ్మను చూడాలంటే వాళ్ళు రావలసిందేగాని నేను వాళ్ళదగ్గిరికి పోవటానికి లేదు" అని చెప్పింది శకుంతల.

శకుంతల భర్త సుందరంతో చాలా పరిచితుడల్లే మాట్లాడాడు. ఇద్దరూ తన కన్నా ఎంతో పెద్దవాళ్ళనిపించారు సుందరానికి. వాళ్ళు చెయ్యదగినపని చేశారు. తనకు అటువంటిపని చేసేశక్తి లేదు. అవకాశమూలేదు. అవకాశంలేదని ఎందుకనుకోవాలి? తను పెళ్ళిచేసుకోక పూర్వమే శకుంతల వితంతువయింది. కాని తానే ఈ శకుంతలను పెళ్ళాడుతానంటే ఎవరు ఒప్పుకునేవాళ్ళు? పంజరంలోవున్న చిలక చెట్టుమీద స్వేచ్ఛగా తిరిగే చిలకను చూసినట్లు సుందరం వాళ్ళిద్దరికేసి చూశాడు. శకుంతల జానకి క్షేమసమాచారా లడిగింది. బండి వెళ్ళిపోయింది.

సుందరం ఆరోజు కాలేజీలో పాఠాలు వినలేదు. వాడు తన మనస్సులో ఒక కథ ఆలోచిస్తున్నాడు. ఆ కథ అట్టే స్పష్టంగాలేదు. కానీ అందులో ఒక ఆడమనిషి ఉన్నది. ఆమెకు బుద్ధి ఉన్నది. ఆ బుద్ధి అపరిమితమైన గ్రహణశక్తి కలది. ఇతరులను – అంటే సుందరాన్ని – పూసగుచ్చినట్టు అర్థం చేసుకోగలదు. ప్రపంచం ఆమెకు పరమ శత్రువు. ఆ శత్రుత్వానికి స్పష్టమైన కారణాలు లేవు. అదే పిల్లి

ఎలుకల మధ్య ఉండే సహజ శత్రుత్వం. చిట్టచివరకు ఆమెను సంఘం చంపేస్తుంది. అది విషాదాంతమైన కథ. దాన్ని స్మరిస్తేనే సుందరం కడుపులో వర్ణనాతీతమైన కలవరం పుట్టుకొచ్చింది. ఆ బాధతో వాడు పరిసరాలను సరిగా చూడలేకపోయాడు. లెక్చరరు చెప్పేది వినలేకపోయినాడు.

ఆ రాత్రి సుందరం నిద్రపోలేదు. కాగితాలు ముందువేసుకుని రాసుకుపోతున్నాడు. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది. సుందరం తల విపరీతంగా వేడెక్కి ఉన్నది. శరీరం జ్వరంతగిలినట్లు ఆవిర్లు తేలుతున్నది. కొద్ది గంటలకాలంలో కొన్ని యుగాల అనుభవం పొందినట్టుగా ఉన్నది వాడికి. అది వాడి స్వంత అనుభవం కాకపోవచ్చు. అది వాడు రాసే కథలో పాత్రల అనుభవం. అందుచేతనే మరింత బాధాకారమైనది.

రాత్రి ఒకటిన్నర ప్రాంతాల సుందరం మొదటికథ పూర్తి అయింది. సుందరానికి ఒక సంతోషంగాని, తృప్తిగాని కలగలేదు. అన్నివిధాల తొలి అనుభవంలాగే ఈ తన మొదటి కథను గురించి ఏమనుకోవటానికీ వాడికి శక్తిలేదు. అది మంచి కథా? చెడ్డ కథా? ఏమీ తెలీదు. తాను చాలా మంచి కథలు చదివాడు. ఇది వాటిలో చేరదు. ఆ కథలు రాసినవాళ్ళు తనలాగా బాధపడి ఉండరు. ఆ సంగతి వాడికి తెలుసు తాను పడ్డ యమయాతన అచ్చగా కథారచనకు సంబంధించినదికాదు. తన మనసులో ఒక భాగాన్ని కోసి కాగితంమీద పెట్టవలసివచ్చింది.

"దీన్ని ఎవరూ నమ్మరు. ఇది యెవరికీ అర్థంకాదు" అనుకున్నాడు సుందరం తాను పూర్తిచేసిన ముప్పై పేజీలకేసి చూస్తూ.

సుందరం బుర్ర చల్లారలేదు. విశ్రాంతి తీసుకోలేదు. వాడికి నిద్ర అన్నది ఎక్కడా కూతవేటు దూరంలోలేదు. కాగితాలు ఏరి పెట్టెలో పెట్టి బయటికి వెళ్ళాడు. ప్రపంచమంతా సుషుప్తిలో ఉన్నది తను ఒక్కడే మేలుకుని ఉన్నాడు. తన భావాలు అచ్చగా తనవే వాటిని ఎవరూ పంచుకోవటంలేదు. అందులో ఏదో పరమార్థం ఉన్నట్టు కనపడ్డది. సుందరానికి.... లోపలికివస్తూ లక్ష్మి పడుకున్నచోట ఆగి నిదానించి చూశాడు. నిద్రపోతున్న లక్ష్మి ఆ క్షణాన సుందరం ప్రాణానికి తన తొలిప్రణయమైన అంతరాత్మలాగా కనపడింది. లక్ష్మి మొహంలో ఎట్టి వికారమూలేదు. ఆమెమీద ఆ క్షణాన సంఘం యొక్క ప్రభావం ఏమీలేదు.

సుందరం వొంగి లక్ష్మి బుగ్గను మునివేళ్ళతో మెల్లిగా తాకాడు. ఏదో సంతృప్తిపొందాడు. వెళ్ళి తన పక్కమీద పడుకొని త్వరలోనే నిద్రలో పడ్డాడు...

మర్నాడు లేస్తూనే సుందరం, కిందటిరాత్రి తాను రాసిన కథ తీసి చదువసాగాడు. కిందటి రాత్రి వండిన వంటలాగే అది చప్పగా చల్లారి ఉన్నది. దీపావళి రాత్రి దివ్యంగా వెలిగి మర్నాడు పొద్దున వికార స్వరూపాలతో కనపడే బాణసంచారం లాగా ఉన్నాయి వాక్యాలు! అందులో సహం బొత్తిగా కుంటివి. అసలది కథేకాదు. చొర్రి తుక్కు. తాత్కాలికంగా ఏదో అర్థం ఉన్నట్టు కనిపించి, మర్నాడు జ్ఞాపకం తెచ్చుకుంటే అర్థరహితంగా పరిణమించే కల?

సుందరం ఆ కథను నిర్దాక్షిణ్యంగా చింపిపారేసి, "ఇక యెన్నడూ ఇంత బుద్ధి తక్కువ పని చెయ్యను. నేను కథలు రాయటమేమిటి?" అనుకున్నాడు. ఆ కథను చూస్తే సుందరానికి కొద్దిగా జాలీ, కొద్దిగా నవ్వూ వచ్చింది, దాన్ని ఎవరూ చూడనందుకు వాడు చాలా సంతోషించాడు....

## 23

సీతమ్మగారింట్లో అద్దెకుంటున్నవాళ్ళు పిల్లల చదువుకోసం పొరుగూరు నుంచి వచ్చినవాళ్ళు. అందుచేత ఏప్రెల్ మాసంలో బళ్ళు మూయగానే ఇల్లు ఖాళీ చేశారు. కొంప ఏ స్థితిలో ఉన్నదీ చూసుకొని అవసరమైతే బాగుచేయించుకుని మళ్ళీ ఎవరికైనా అద్దెకు పెట్టాలనే ఉద్దేశంతో సీతమ్మగారు అన్నగారింటినుంచి బయలుదేరి ముందు వియ్యాలవారింటికి వచ్చింది. అక్కడ వియ్యాలవారి బలవంతంమీద రెండు మూడు దినాలు విందులు గుడిచి, సుందరాన్ని వెంటబెట్టుకుని ఇంటికి వచ్చేసింది.

ఏ ఇల్లయినాసరే అద్దెవాళ్ళు ఖాళీచేసిన తరువాత, రావణుడుచెరిచిన రంభల్లే కనిపిస్తుంది ఇల్లుగలవారి కళ్ళకు. సీతమ్మగారు యిల్లంతా కలయజూసుకుంటూ "అయ్యయ్యో! ఇల్లంతా ఎట్లా చేసిపోయినారో; డబ్బు కక్కూర్తికి అద్దెలకిచ్చు కోవటమేగానీ–" అంటూ గొణుక్కున్నది. ఆవిడ కొంగు బిగకట్టి చీపురుతో ఇల్లంతా వూడ్చి నీళ్ళతో కడుక్కుంటున్న రెండు గంటలసేపూ సుందరం దొడ్లో తారట్లాడుతూ చెట్లలో కనిపించే ప్రకృతి శోభను తిలకించసాగాడు.

వచ్చినరోజల్లా సీతమ్మగారికి ఇంటితోనూ, చుట్టుపక్కలవాళ్ళను పలకరించి ఏడాదిపాటు జరిగిన విషయాలను వాళ్ళకు చెప్పటంతోనూ, వాళ్ళు చెప్పేవి వినటంతోనూ సరిపోయింది. సుందరం కూడా పాత స్నేహితులందర్నీ చుట్టబెట్టాడు. ముందు నాగేశ్వర్రావును చూడబోయినాడు. వాడు తాలూకా బోర్డాఫీసులో ఉద్యోగం సంపాదించాడు. ముప్పై రూపాయలిస్తున్నారు.

"మనం కాలేజీ చదువు వెలగబెట్టి ఏం మిటకుతామో తెలీదుగానీ, నాగాయి పనే బాగుంది. అప్పుడే సంసారాన్ని పోషించటానికి సరిపోయే జీతం తెచ్చుకుంటున్నాడు" అన్నారు కొందరు స్నేహితులు. నాగేశ్వర్రావుకు సంసారం లేదింకా. అందుచేత వాడు తన సొంత ఖర్చుకింద ఏ అయిదారు రూపాయలో ఉంచుకుని పది రూపాయలు యింటికిచ్చి మిగిలింది పోస్టల్ సేవింగ్స్‌లో దాచుకుంటున్నాడు.

ఈ మాట వినగానే సుందరం నవ్వుతూ "ఏమాత్రం దాచావురా?" అని అడిగాడు.

"వంద దాటిందిలే" అన్నాడు నాగేశ్వర్రావు.

సుందరం నాగేశ్వర్రావును చూసి అసూయపడలేదు. తక్కువ చదువు తక్కువ చదువే, బియ్యేలు పాసయేకన్నా స్కూలుఫైనలు షార్ట్‌హేండ్ టైపిస్టు కావటం మెరుగనే

వేదాంతం చాలా తప్పు. ప్రత్యక్షంగా కనపడే విలువలను తలకిందులు చెయ్యటమన్నమాట. తాను బి.యే పాసయి వందలు ఆర్జించవచ్చు. నాగేశ్వర్రావు తొమ్మిది నెల్లు కష్టపడి దాచుకున్న మొత్తం తాను ఒక్క నెలజీతం నుంచి వెనకెయ్యవచ్చు.

అదివరకు సుందరం మనుష్యుల హెచ్చుతగ్గులను గురించి పొలాలమీది రాబడినిబట్టి అంచనాలు కట్టేవాడు. ఇతరులు అట్లా అంచనాలు కట్టటంచూసి వాడూ అదే అలవాటులో పడ్డాడన్నమాట. పది పన్నెండెకరాల పొలం ఉన్నవాళ్ళను గురించి మాట్లాడేటప్పుడు "వాళ్ళకేం? మహారాజులు!" అనేది సీతమ్మగారు. తమకున్నది ఏ అయిదారెకరాలో మాత్రమే కనక పదిపన్నెండెకరాలున్న వాళ్ళు రెట్టింపు ధనికులు; ఇప్పుడు సుందరం మనుష్యుల రాబడి గురించి జీతాలపరంగా ఆలోచించసాగాడు. మాటవరసకు తనకుకూడా ఏ ముప్ఫైరూపాయల ఉద్యోగమో, మటుకే వస్తుందనుకో. అది అయిదెకరాల పొలంమీద వచ్చే రాబడికన్న అంతో ఇంతో ఎక్కువే ఉంటుందిగాని తగ్గదు. అంటే ఏమిటన్నమాటా? తనుకూడా ఒక "మహారాజు" అనిపించుకోవాలంటే ఈ పొలం ఉండగా ఓ చిన్న ముప్ఫైరూపాయల ఉద్యోగం సంపాదించాలన్నమాట!

ఫరవాలేదులే. అంతకన్న బాగానే సంపాదించవచ్చు. నాగేశ్వర్రావు కన్న మంచి ఉద్యోగం సంపాదించలేకపోతే ఇంకెందుకూ ఈ చదువంతా?" అని అనుకున్నాడు సుందరం. నెలకు వందచొప్పున సంపాదిస్తే తనకు ఎన్ని ఎకరాల పొలం ఉన్నట్టవుతుందో లెక్కచూసుకునేసరికి వాడికి పరమానందమైపోయింది. తాను చదువు పూర్తిచేసే సమయానికి తనకీ ఆరెకరాలూ వుండవనీ, ఈ ముప్ఫైరూపాయలు ఉద్యోగంకూడా దొరకదనీ వాడికి తట్టలేదు.

❀ ❀ ❀ ❀

కొందరు స్నేహితులతోసహా సుందరం స్కూలువైపు వెళ్ళాడు, క్లాసులో పాఠాలు జరుగుతున్నై. స్కూలు ఏ మాత్రమో చిన్నదైనట్టు కనిపించింది. వెనకటిలాగా క్లాసులూ, విద్యార్థులూ కనిపించగానే వొళ్ళు జలదరించలేదు. మేష్టర్ల కంఠాల్లో ఇదివరకు మారుమ్రోగిన విజ్ఞానం ఇప్పుడు వినిపించటంలేదు. మారింది తనేనని సుందరం తెలుసుకున్నాడు.

ఇంతకన్న చిత్రమేమిటంటే, ప్లేగ్రౌండు సుందరం కళ్ళకి చిన్నబోయినట్టు కనిపించింది. ప్లేగ్రౌండు ఒకమూల ఉంటూ వచ్చిన వేపచెట్టు అక్కడ లేకపోవడమే అందుకు కారణం. కాని ఆ వేపచెట్టు కిందటేడు వచ్చిన గాలివాన[41]కు పడిపోయింది. అది పడిపోవటం సుందరం ఎరుగును. ఆ చెట్టు లేకుండా ప్లేగ్రౌండును వాడు అదివరకే చూశాడు. కాని సుందరం మనసులో స్థావరం

---

41. గాలివాన 1904లో వచ్చిన గాలివాన తర్వాత గుంటూరు జిల్లాలో 1936 అక్టోబర్ 28వ తేదీన తీవ్రమైన గాలివాన వచ్చింది. అపారమైన ఆస్తి, జన, పశు నష్టం జరిగింది. (ఆంధ్రభూమి, నవంబర్ - 1936, పేజి - 140).

ఏర్పరచుకున్న ప్లేగ్రౌండులో ఇంకా ఆ చెట్టు ఉండివుండాలి. అందుకనే ఇది వాడికళ్ళకు బోసిగా కనిపించింది.

ఇతర విషయాలలో ప్లేగ్రౌండ్ కళకళలాడుతూనే ఉన్నది. కొత్తగా టెన్నిస్‌కోర్టు వేశారు. అందులో మేస్టర్లు ఆడుతున్నారు. అదివరకులేని ఆట వాలీబాల్ ఒకటి వచ్చింది. అదివరకు ఒకటే బాడ్మెంటన్ కోర్టుండేది. ఇప్పుడు రెండున్నాయి. ఈ ఆటలన్నీ ఆడేవాళ్ళూ, ఫుట్‌బాల్ ఆడేవాళ్ళూ – ప్లేగ్రౌండ్ చాలా కళకళ్ళాడుతున్నది.

స్కూలు ఫైనల్ తప్పి మళ్ళీ చదువుతున్న సహాధ్యాయులు సుందరాన్ని పలకరించారు. మేష్టర్లుకూడా సుందరాన్ని పలకరించారు. స్కూలులో తనకెన్నడూ చదువుచెప్పక, తనతో ఎన్నడూ మాట్లాడని హనుమంతరావు మేష్టరు తనని పేరు పెట్టి పిలిచి కుశలప్రశ్న చేసినందుకు సుందరం ఎంతో సంతోషించాడు.

స్కూలునుంచి సుందరం దీపాలు పెట్టేవేళ ఇంటికి బయలుదేరాడు. శకుంతలవాళ్ళ ఇంటిమీదిగా పోదామనిపించింది. అటుగా బయలుదేరాడు.

కనుచీకటిలో వాళ్ళవాకిట ఎవరో నిలబడి ఉండటం కనపడ్డది. ఒక క్షణం పాటు శకుంతల తల్లేమో ననుకున్నాడు. కాని తీరా దగ్గిరికివచ్చి చూస్తే శకుంతలే. శకుంతల పెళ్ళాడిన తర్వాత పుట్టింటికి రావటంపోవటంలేదని చెప్పినట్టు అస్పష్టంగా జ్ఞాపకం వచ్చి సుందరం ఆశ్చర్యపడ్డాడు.

"ఏం సుందరం? ఎప్పుడొచ్చారు నువ్వూ, మీ అమ్మా?" అని అడిగింది శకుంతల.

"మా అమ్మ కనిపించిందా ఏమిటి?" అన్నాడు సుందరం.

"ఇక్కడికివచ్చి వెళ్ళిందిలే! నిలబడేవున్నావు. లోపలికిరా, పోదువుగాని" అన్నది శకుంతల.

శకుంతలను చూస్తే వెనకటి ఆనందం కలగలేదు. కొద్దికాలం కిందట బండీలో చూసినప్పుడు కలిగిన సంతోషమన్నా కలగలేదు. ఈ శకుంతల కూడా తన స్కూలులాగే ప్రవర్తిస్తున్నది. దాన్ని తలుచుకుంటే కలిగే సంతోషం చూస్తే కలగటంలేదు.

"ఎప్పుడొచ్చావు? మీ ఆయనకూడా ఉన్నాడా?" అని అడుగుతూ సుందరం శకుంతలవెంట లోపలికి వెళ్ళాడు.

వాళ్ళ ఇంటివసారానానుకుని గది ఒకటి ఉంది. అది ముట్లగది. శకుంతల సుందరాన్ని వసారాలో కూచోబెట్టి తాను గదిగడపలోపల కూచుని మాట్లాడటం మొదలుపెట్టింది.

"నా కర్మగాలితే, నేనిందులో ఏడవాలి! ఇంట్లోకి అడుగుపెట్టనీరు. దీనికైనా ఎంత సాహసం కావాలిసొచ్చిందో చెప్పలేను. ఇక్కడే తిండీ, పడకాకూడా. నేను వచ్చి పదిరోజులు దాటింది. ఆయన రాలా, డబ్బేదో రావాలిట, అన్నగారిదగ్గిర కెళ్ళారు."

సుందరానికి కోపం వచ్చింది. శకుంతలను కన్నతల్లితండ్రులు ఇంత నీచంగా ఎట్లా చూడగలుగుతున్నారు? శకుంతల ఎట్లా భరిస్తున్నది? ఇటువంటివి కూడా విధి అనుకుని మనుషులెట్లా సరిపెట్టుకుంటారో

"ఎంతలో పెద్దవాడివైనావు సుందరం!" అన్నది శకుంతల.

సుందరాని కేమనాలో తెలీదు "ఎంతలోనువు ముసలిదానివైనావు" అందామనుకున్నాడుగాని ధైర్యం చాలలేదు. అదీకాక ముసలిది కావటంకాదు, శకుంతలలో కలిగిన మార్పు మనిషిలో నేవళంపోయింది. మొగుడి దగ్గిరికి పోయిన ఏడాదిలోగా ప్రతి ఆడదీ అట్టాగే అవుతుంది కాబోలని మొదట అనుకున్నాడుగాని, తరవాత జానకి జ్ఞాపకం వచ్చింది. ఆ సిద్ధాంతం తప్పనుకున్నాడు.

శకుంతల అదీఇదీ మాట్టాడి "మీ ఆవిడ రజస్వల అయిందిటగా?" తన తల్లి చెప్పివుంటుందనుకున్నాడు సుందరం.

"మీ ఆవిడకిప్పుడు పన్నెండోఏడు కాదూ? కార్యానికేం తొందర్లే. ఇంకా రెండేళ్ళాగినా ఆగచ్చు అయినా దగ్గిర ఉంటున్నవాడివి ఊరుకుంటావుట్లే? మీరిద్దరూ మాట్లాడుకుంటారా?" అంటూ మాట్లాడసాగింది శకుంతల. తన మాటల సుందరానికి ఎంత కోపం తెప్పిస్తున్నది శకుంతల ఊహించలేదు.

స్త్రీ పురుష సంబంధాలను గురించి కొంత అనుభవం గలవాళ్ళు తేలికగ మాట్లాడితే సహించలేని వయసులో ఉన్నాడు సుందరం. అందుచేత వాడు బెట్టుగా "మాట్లాడుకోం" అన్నాడు.

"అదేం? చక్కగ్గా, ఎందుకు మాట్లాడుకోరాదూ?"

"ఏమో, మాట్లాడకుండానే జరిగిపోతున్నది."

శకుంతల నవ్వుతూ, "మాటాపలుకూ లేకుండా ఏమిటా జరిగిపోతున్నది?' అన్నది.

సుందరం "వస్తా"నంటూ లేచాడు.

"శకుంతలకు, పాపం పెళ్ళి ఎందుకు చేసినట్టు? నిష్కారణంగా దానిగొంతుకోశారు. దాని మొగుడు వట్టి తాష్ట్రంట. ముండల ముఠాకోరుట. పెళ్ళాన్నితెచ్చి దిగవిడిచి వెళ్ళాడు. వ్యాపారం పెట్టుకుంటాను డబ్బియ్యమంటాడు. వాళ్ళమ్మ లబ్బున ఏడిచింది." అన్నది సీతమ్మగారు ఆ రాత్రి సుందరంతో.

ఈ మాట వినగానే వాడికి శకుంతలమీద జాలివేసింది. కానీ వాడు శకుంతలను గురించి ఆలోచించాడు. ఇటీవల వాడికదొక అభ్యాసమైపోయింది - ఎక్కడ ఏ భర్త తన భార్యను అనాదరంతో చూస్తున్నట్టు చెవినపడ్డా, లేక ఏ కథలోగాని చదివినా వాడు తన భార్యనుగురించి తియ్యతియ్యగా ఆలోచించేవాడు. లోకంలో భర్తలందరూ భార్యలకు చేసే అపచారాలకుగాను తాను పరిహారం చెయ్యాలనీ, ఆ భార్యలుపొందే మనోవ్యథకు పరిహారం యావత్తూ తాను లక్ష్మికి ముట్టజెప్పాలనీ వాడి కనిపించేది.

"నేను లక్ష్మితో ఎందుకు మాట్లాడకూడదూ? మేమిద్దరం ఒకరినొకరం ఎరగనట్లెందుకుండాలి? తిరిగి వెళ్ళగానే దాంతో మాట్లాడటం మొదలుపెట్టాలి" అనుకున్నాడు సుందరం. ఆ ఆలోచన తనకు స్వతంత్రంగానే తట్టినట్టుగా.

❀ ❀ ❀ ❀

ఆ రాత్రి సుందరం పడుకునేటప్పటికి ఒంటిగంట దాటింది. తల్లీ తనూ కూడా తొమ్మిదింటికల్లా భోజనాలు పుగించుకుని పడుకున్నారు. రోజల్లా శరీరం నజ్జునజ్జు అయేటట్టు పనిచేసిందేమో, సీతమ్మగారు ఆరుబయట మంచం వేసుకుని చల్లగాలికి నిద్రపోయింది. కాని సుందరానికి నిద్రపట్టలేదు. వాడు బయట అరుగుమీద లాంతరు పెట్టుకుని తన పెట్టెలోంచి కాగితాలూ, కలమూ తెచ్చి కథ రాసేశాడు. అందులో కథేమిటంటే, ఒకపిల్ల తన మొదటి భర్తతో చాలా కష్టాలుపడి, అతను పోయిన వెనక వితంతు వివాహం చేసుకుని రెండో భర్తతో చాలా సుఖపడుతుంది.

ఈ కథ రాయటంలో సుందరం ప్రత్యక్షానుభవాన్ని ఎందుకు తల్లకిందులు చేశాడో ఊహించటం కష్టం. జీవితంలో తాను చూసింది చూసినట్టు రాయటానికి బిడియం కలిగి ఉండవచ్చు. వితంతు వివాహాలను గురించి చెడుగా రాయటం ఇష్టంలేక కావచ్చు. సంస్కారం మానవ సుఖాన్ని హెచ్చుచేస్తుందనే విశ్వాసం ప్రకటించటానికి కావచ్చు. వాడిచేత కథ రాయించే ప్రేరణ జీవితంనుంచే వచ్చినప్పటికీ ఆ జీవితం ఉన్నదున్నట్టుగా వాడికి అసంతృప్తి కలిగించటంచేత దాన్ని తనకు తృప్తి కరంగా ఉండేవిధంగా వాడు చిత్రించుకున్నాడు. స్త్రీ పునర్వివాహాలు చెయ్యటానికి చదువుకున్న వాళ్ళుకూడా భయపడేస్థితిలో శకుంతలవంటి వితంతువుల వివాహాలు అతిగోప్యంగా జరగటంవల్ల కలిగే చిక్కులను బయట పెట్టి ఇతరులకు తోడ్పడదామన్న ఆలోచనే సుందరానికి కలగలేదు. ఒక పంక వితంతువివాహాలను గురించీ, మరో ప్రక్క స్త్రీ పురుష సంబంధాలను గురించికూడా ఆదర్శవాదిగా ఆలోచించటంచేతనే వాడా కథ అట్లా రాశాడు. ఇంకోవిధంగా రాసి ఉండటం వాడికా తరుణంలో సాధ్యం కాదు.

ఇంకొక చిత్రమేమిటంటే, వాడు కథ రాస్తున్నంతసేపూ వాడి మనస్సులో మెదలుతున్నది శకుంతల కాదు, లక్ష్మి అందులో కథానాయకుడు కూడా తనే.

ఈ కథనుగురించి వాణ్ణి బాధించినదల్లా ఒకే ఒక సందేహం. అదైనా కథ చదవబొయ్యేవారిని గురించి. ఒక భర్తతో కొంతకాలం కాపరంచేసి వితంతువైన మనిషి తిరిగి పెళ్ళాడిందంటే "పాఠకులు" సానుభూతితో చూడరేమో నన్నదే ఆ సందేహం. సుందరం ఒక విధంగా సరిపెట్టుకున్నాడు. తన కథానాయిక మొదటి భర్తతో సుఖం పొందినట్టుగా తను ఎక్కడా చెప్పలేదు. ఆమె శరీరం "కళంకితం" కాలేదని పాఠకులు సరిపెట్టుకోకపోతారా అని సుందరం ధైర్యం చెప్పుకున్నాడు. దుర్మార్గులైన భర్తలు భార్యలతో శరీరసుఖం అనుభవించరని వాడినమ్మకం కూడానూ సుఖపడలేని భర్తలే పెళ్ళాలపట్ల నిర్దయులై ఉంటారనీ, భార్యలనుండి ఆనందం

పొందేవాళ్ళు భార్యలను క్రూరంగా చూడటం ఎన్నటికీ సాధ్యంకాదనీ వాడి అభిప్రాయం. ఇది తప్పు అభిప్రాయమే అయితే ఏం? కొమ్ములు తిరిగిన కథకులు కూడా ప్రేమంటే కామమే ననుకున్నప్పుడు ఏ అనుభవమూలేని అర్భకుడు సుందరం కామమంటే ప్రేమే అని ఎందుకనుకోగూడదూ?

"ఈ దిక్కుమాలిన సంఘంతో ఇదేచిక్కు. ఇదే ఏ ఇంగ్లండులోనో అయితే కథానాయిక ఎనిమిదిమందితో కాపరం చేసినా పాఠకులు అభ్యంతరం చెప్పరు. మన వాళ్ళకు ప్రతిదీ పట్టింపే" అని సుందరం విసుక్కున్నాడు.

మన సంఘంమీద సుందరానికి చిరాకు రావటం ఇది మొదటిసారికాదు. కథలు రాయటం గురించి వాడు అవకాశం దొరికినప్పుడల్లా ఆలోచిస్తూనే ఉన్నాడు. ఈ దిక్కుమాలిన సంఘంలో పన్నెండేళ్ళకే పిల్లలు పెద్దమనుషులవుతారు. నాలుగో సమర్త కాగానే గర్భాదానం చేస్తారు. స్త్రీ పురుషులు ఒకరినొకరు కలుసుకుని, మాట్లాడుకుని, ప్రేమించుకోవటం లేదు. మొగుడూ పెళ్ళాలు ఒకర్నొకరు పేరుపెట్టి పిలుచుకోవటానికి లేదు. ఆడవాళ్ళు ఎంతసేపూ కూరల్ని గురించీ, చీరెల్ని గురించీ, నగల్ని గురించీ మాట్లాడతారు తప్ప ఇంకోటి మాట్లాడరు. నిత్యజీవితంలో కనిపించేదీ కథా వస్తువుగా ఉపకరించదాయె. కథరాయాలంటే ఇంకో ప్రపంచంలోకిపోయి ఊహాచిత్రాలు నిర్మించాలిసిందే కథకులు కావటానికి ఆయత్తమవుతున్న సుందరాన్ని ఎదుర్కొన్న సమస్య ఇదే...

మర్నాడు సుందరం తన కథను ఏదో పత్రికకు పంపించేసి దాని విషయం క్రమంగా మరిచిపోయినాడు. కాని ఉన్నట్టుండి ఆ కథ విషయం జ్ఞాపకం వస్తూవుండేది. దాన్ని వాళ్ళు వేసుకుంటారా? అది వాళ్ళకు సరిగా అందుతుందా? పత్రికవాళ్ళు తన కథను గురించి తృణీకారభావం పెట్టుకున్నట్టు సుందరం సులభంగా ఊహించుకోగలిగాడు. ఆ కథ వాళ్ళకు చాలా నచ్చినట్టుకూడా ఊహించుకోగలిగాడు. కాని "ఫరవాలేదు. ఒక మాదిరిగావుంది. వేసుకోవచ్చు" అని వాళ్ళనుకుంటారని మాత్రం వాడు భావించలేకపోయినాడు... అకస్మాత్తుగా సుందరానికొక ధర్మసందేహం కలిగింది. "శకుంతలను చూసినప్పుడల్లానూ నాకు కథ రాయాలన్న ఆలోచన కలగటం దేనికీ? నేను కథలు రాయటానికీ శకుంతలకూ ఏమిటి సంబంధం?" అనుకున్నాడు వాడు. ఆ ప్రశ్నకు సమాధానం దొరకలేదు. ఎంత ఆలోచించినా...

## 24

సుందరానికి కాలం గడవలేదు. కూచుంటె ఇంట్లో తల్లికెదురుగా కూర్చోవాలి. లేదా స్నేహితుల ఇళ్ళచుట్టూ ప్రదక్షిణాలు చెయ్యాలి. తల్లితో తను మాట్లాడేదేమీలేదు. తన మనసులో మెదిలే భావాలు ఆవిడతో పంచుకునేవికావు. ఆవిడ సంభాషణ తనను కించిత్తయినా ఆకర్షించదు. ఆవిడ ఒకప్పుడు తనకు ఎంత సన్నిహితంగా

ఉండేదో, ఆవిడకు సంబంధించిన విషయాలు తనకెంతదూరంగా ఉండేవో సుందరానికి జ్ఞాపకంలేకపోలేదు. అవి తలుచుకుంటే ఆనందంగానూ వుండేది. ఆశ్చర్యమూవేసేది. తన ఈడువాళ్ళలో కొంతమంది ఇంకా తల్లులకొంగు పట్టుకుని వేళ్ళాడుతూ వుండటం చూశాడు సుందరం. అయితే వాళ్ళంతా వాడికి ఎదగని పిల్లలల్లేకనపడ్డారు వాళ్లు. మాటవరసకు కధలు రాయలేరు. అటువంటి ఆలోచనే సాధ్యంకాదు. కనక వాళ్ళతో పొంతు పెట్టుకుని ఏం లాభం?

తన తల్లి మనసులో నరసును గురించి గొప్ప అభిప్రాయం వున్నట్టు సుందరం గ్రహించాడు. వాడు మొత్తానికి పట్టుదలగా నాటకాలు వేసి నాటకానికి పాతికా పరకా ఆర్జిస్తూ తండ్రికి తోడుగా వున్నాడనీ సీతమ్మగారన్నది. అది ఆవిడ దృష్టిలో ప్రయోజకత్వంగా కనపడ్డది. సుందరానికందులో అంత ప్రయోజకత్వం కనపడలా. సుందరం స్టేజీమీద బళ్ళారి రాఘవాచారినీ, స్థానం నరసింహారావునూ, మాదవపెద్ది వెంకటరామయ్యనూ[42], అద్దంకి శ్రీరామమూర్తినీ,[43] యడవల్లి సూర్యనారాయణనూ,[44] పారుపల్లి సుబ్బారావునూ చూశాడు. వాళ్ళూ నటులంటే. నరుసు వాళ్ళ జాబితాలో చేరగలడని సుందరానికి నమ్మకంలేదు.

సీతమ్మగారు జ్ఞాపకం వచ్చినప్పుడల్లా అప్పు విషయం ఎత్తేది.

"నీ చదువెప్పటికవుతుందో, నువెప్పుడు నాలుగురాళ్ళు తెస్తావో నాకు తెలీకుండా వుంది. ఆ అప్పేమో ఆయేటికాయేడు పెరుగుతున్నదేగాని తరగటంలేదు. వడ్డీయే ఏడాదికి మూడు నాలుగు వందలవుతుంటేనూ, అప్పుంచుకోకండమ్మా, పొలం తెగనమ్మి అయినా తీర్చేసుకోండి అంటున్నారంతానూ. రెండెకరాలు పోతే పోతై. ఆ పని చేద్దామంటే, మైనార్టీ వెళ్ళని కొడుకును చేసి పొలం తగలేసిందని అంతా నన్నాడిపోస్తారేమోనని భయపడి చస్తున్నా. ఇంకో ఏడాదికిగాని నీ మైనార్టీ తీరదో ఏమిటో, పద్దెనిమిది వెళ్ళాలో ఏమో. అంటే యింకో అయిదువందలు వడ్డీ పెరుగుతుంది. ఇంతటితోనన్నా పోతుందా అంటే నీ చదువింకా వుండె.

---

42. మాధవపెద్ది వెంకటరామయ్య: కొడవటిగంటి కుటుంబరావు బంధువు. గొప్ప రంగస్థల నటుడు. 1921లో తెనాలిలో స్థాపించబడిన రామవిలాస సభలో ఒకరు. నాటకాల్లోనే కాక తెలుగు టాకీలలో కూడా నటించారు.

43. అద్దంకి శ్రీరామమూర్తి (1898-1968): సుప్రసిద్ధ రంగస్థల, చలనచిత్ర నటుడు. పాదుకలో దశరథుడు, అభిజ్ఞాన శాకుంతలంలో కణ్వమహర్షి, పాండవోద్యోగ విజయాలులో ధర్మరాజు ఆయన అభిమాన పాత్రలు. సమకాలిక ప్రఖ్యాత రంగస్థల నటుల సరసన నటించిన ప్రజ్ఞావంతుడు.

44. యడవల్లి సూర్యనారాయణ (1888-1939); గుంటూరులో దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, వంగర ఆంజనేయులు, బెల్లంకొండ నరసింహులు మొదలైనవారిలో అమెచ్యూర్ డ్రమెటిక్ క్లబ్ సంస్థాపించారు (1912-1915). కపిలవాయి రామనాథశాస్త్రికి పద్య పఠనం నేర్పిన గురువు. సావిత్రిలో సత్యవంతుడు, శకుంతలలో దుష్యంతుడూ, గయోపాఖ్యానంలో అర్జునుడు, చిత్రనళీయంలో నలుడు, బాహుకుడు, వేణీసంహారం, ద్రౌపదీ వస్త్రాపహరణం, పాండవోద్యోగ విజయాల్లో దుర్యోధనుడు, పాదుకల్లో శ్రీరాముడు, సారంగధరలో సారంగధరుడు పాత్రలు ధరించారు. తొలి చలనచిత్రాల్లో నటుడు కూడా.

అప్పుచెయ్యక తప్పదాయె. నాకేమో ఎటూ తోచకుండా ఉంది. చదివిన చదువేమో చదివావుగాని ఎక్కడన్నా ఉద్యోగం చూసుకోరాదుట్రా?" అన్నది తల్లి ఒకసారి.

సుందరం తల్లి మాటకు సమాధానం చెప్పకుండా బయటికి వెళ్ళిపోయినాడు...

బయటికి వెళ్ళి చేసేది లేకపోవటమూ, ఇల్లు బిక్కుబిక్కుమంటూ సందడి లేకుండా ఉండటమూ భరించలేక సుందరం, "నాలుగురోజులపాటు అక్కడికెళ్ళి మళ్ళీవస్తానమ్మా. కొంచెం పనివుంది" అని చెప్పి అత్తవారింటికి బయలుదేరాడు.

❀ ❀ ❀ ❀

తీరా రైలెక్కినాక తాను చేస్తున్నపని సుందరానికి బాగా కనపడలేదు. ఎందుకంటే వాడు దాన్ని ఇతరుల కళ్ళతో చూడసాగాడు. నాలుగు రోజులు అత్తవారిల్లు (లేక భార్య ముఖం) కనిపించకపోయేసరికి తోచక ఒకసారి చూసుకుపోదామని వచ్చాడనుకుంటారు అందరూనూ. ఇంకో విధంగా అనుకోడానికైనా తను ఏం పని మీద వస్తున్నట్టు కనకా?

కాని మామగారు తనని చూస్తూనే "మీ అమ్మను అక్కడ ఒంటరిగా ఒదిలి పెట్టి ఏం పనిమీద వచ్చావు?" అని అడగటానికి బదులు, "వచ్చావా సుందరం అక్కగారు రాలా?" అన్నాడు.

"లేదు. నేను మళ్ళీ వెళ్ళాలి" అన్నాడు సుందరం ఎందుకొచ్చిందీ చెప్పకుండా.

ఆయన సుందరం కళ్ళకు ఎంతో మంచివాడల్లే కనిపించాడు. నిజానికి మన అంతరాత్మల్లో ఉండే అశాంతిని వుపశమింపజేసే వాళ్ళకన్నా మనకు మంచివాళ్ళెవరుంటారు?

"అక్కడేం తోచలేదేమో., పాపం" అన్నాడు పార్వతీశంగారు.

సుందరం సరిగా నాలుగురోజులుండి మళ్ళీ యింటికి పోదామనుకున్నాడు. ఈలోగా లక్ష్మి ఒంటరిగా చిక్కితే ఒకసారి మాట్లాడాలని సుందరానికి చాలా పట్టుదలగా ఉంది. ఎంత ఒంటరిగా చిక్కాలంటే, ఇంట్లో తన అత్తగారుగానీ, మామగారు కానీ, బావమరుదులుగానీ వుండరాదు. తను లక్ష్మిని పలకరించటానికి అయిదు నిమిషాలు ముందూ, అయిదునిమిషాలు వెనకా పరాయివాళ్ళెవరూ తొంగిచూడరాదు. తలవాకిలి దగ్గిరకూడా. ఈ షరతులు సుందరానికే అసాధ్యంగా కనపడ్డాయి.

కాని పరిస్థితులు సుందరం అనుకున్నంత అసాధ్యంగా పరిణమించలేదు. సుందరం మధ్యాహ్నం భోంచేసి పడుకుని నిద్రపోయి లేచేసరికి ఇల్లంతా నిశబ్దంగా ఉంది. మగవాళ్ళెవరూ ఇంట్లోలేరు. అత్తగారు నట్టింట్లో ఏదో చేస్తున్నది. ఫలహారమై ఉంటుంది. సుందరం నిద్రపోతున్నాడనే ఉద్దేశంతో లక్ష్మి ఏదో పనిమీద ఆ గదిలోకి వచ్చి ఏమిటో వెతుకుతున్నది.

"ఏయ్?" అన్నాడు సుందరం మెల్లిగా.

చప్పున లక్ష్మి సుందరంకేసి చూసింది. దాని మొహం ఒక్కసారిగా జేవురించింది. అది నవ్వింది. మొట్టమొదటిసారిగా చూసిన మొహమే మళ్ళీ సుందరానికి కనిపించింది.

సుందరానికి గుండెదడ పట్టుకుంది.

"ఏం కావాలి?" అన్నాడు వాడు ఇంకా మెల్లిగా.

"దారపుండ," అన్నది లక్ష్మి అతి సన్నని స్వరంతో సుందరంకేసి చూడకుండానే.

లక్ష్మికి దారపుండ అప్పుడే కనిపించింది. దాన్ని పట్టుకొని లక్ష్మి అతి నెమ్మదిగా – మామూలుగా నడిచిపోతే సుందరానికి కోపం వస్తుందేమో నన్నట్టుగా – నడుచుకుంటూ బయటకి వెళ్ళిపోయింది. తననువిడిచి పోలేకపోలేక పోతున్నదానల్లే కనిపించింది లక్ష్మి సుందరానికి. వాడు చాలా సంతోషించాడు.

❀ ❀ ❀ ❀

సుందరం ఇంటికి... తన ఇంటికి వెళ్ళవలసిన అవసరం లేకపోయింది. సుందరం వచ్చిన మూడోనాడే సీతమ్మగారు – తిరిగి వచ్చింది. యింటికెవరో అద్దె కొచ్చారుట. పక్క యింటివాళ్లు సహాయపడి ఒక రూపాయ అద్దె ఎక్కువ వచ్చేటట్టు మాట్లాడారు.

సమయానికి తాను ఉండలేకపోయినందుకు సుందరం నొచ్చుకున్నాడుగాని, దాన్ని గురించి దీర్ఘంగా విచారించలేదు. సీతమ్మగారు వియ్యాలవారింట రెండురోజులుండి మరీ వెళ్ళింది. ఎందుచేతనో సుందరానికి తన తల్లి ఈ ఇంటివాళ్ళకు పెడగా ఉందనిపించింది. తనూ, లక్ష్మీ, తన తల్లీ కలిసి ఒక కుటుంబమైనట్టు వాడూహించుకోలేకపోయినాడు. లక్ష్మి కాపురానికి వస్తే సీతమ్మగారు కోడల్ని యెట్లా చూసేది. ఎట్లా పనులు చెప్పేదీ, ఎట్లా మెచ్చుకునేదీ, ఏవిధంగా విమర్శించేదీ సుందరం ఊహకు అందటంలేదు.

తల్లిని సుందరమే రైలెక్కించాడు. ఆవిడ మళ్ళా తన అన్నగారింటికి వెళ్ళిపోతున్నది. స్టేషన్ చేరిన తరువాత అరగంటకుగాని బండి బయలుదేరలేదు. ఈ అరగంటసేపూ సీతమ్మగారు అప్పు తీర్చటం విషయమే మాట్లాడింది. "మీ మామగార్నికూడా కనుక్కోరా, ఏమన్నా సలహా ఇస్తారేమో?" అన్నదావిడ.

"ఆc ఆయన సలహా యిచ్చేదేమిటి? ఆయనకే ఎవరన్నా సలహా ఇవ్వాలి" అన్నాడు సుందరం.

వాడు తల్లినీ, మామగార్నీ పోల్చిచూసుకున్నాడు. కలతపడిన అంతరాత్మను స్వస్థపరచటంలో ఆయన ఎంత నేర్పరో, తిన్నగావున్న అంతరాత్మను కలతపరచటంలో తన తల్లి అంత నేర్పరిగా సుందరానికి తోచింది. తన తల్లిని చూసి సుందరం చింతించాడేగాని తన మామగారు తన అంతరాత్మను జోకొట్టుకోవటానికి ఎంతగా నష్టపడ్డాడో, ఇతరులకు ఆయన ఎంత నిరుపయోగో ఆలోచించలేదు. జీవితంలో ఒక సంఘర్షణ ఉన్నదనీ, దాన్ని ఎదుర్కొన్నవాడే

దక్కుతాదని సుందరం ఎరగడు. వాడు పుస్తకాలలోనుంచి నేర్చుకున్న మహత్తర విషయాలలో ఈ విషయం లేదు. గొప్పపనులు సాధించేవారు ప్రపంచంలో ఉన్నా, పడకకుర్చీలో కూర్చుని వాళ్ళను మానసికంగా ఆరాధించటం కూడా సుందరం దృష్టిలో ఒక ఆదర్శమే. అటువంటి పనులు తాను ప్రయత్నించలేక పోవటంలో ఎంతో అణకువవుంది మరి.

రైలు కదలబోతుండగా సుందరం బావమరుదులు జగన్నాథం, కనకం, రోజుకుంటూ వచ్చి "బావా, బావా, నీ కథ పడింది నీపేరుకూడా ఉంది" అని అర్థంకాకుండా మాట్లాడారు.

"అడుగో, పత్రికలమ్మేవాడి చేతిలో ఉంది. మేం చూశాం. కొను బావా, ఇంట్లో అందరం చదువుకుందాం" అన్నాడు జగన్నాథం.

సుందరానికి అర్థమయింది. రెండణాడబ్బులు తీసి పత్రిక కొనమని ఇచ్చాడు వాళ్ళు పత్రిక కొని తెచ్చేలోపల రైలు సాగిపోయింది.

"నిజంగా ఈ కథ నీదేనా బావా? నువే రాశావా? చెప్పలేదే మాతో?" అన్నాడు జగన్నాథం.

కనకానిక్కూడా ఉత్సాహం వచ్చింది. వాళ్ళు ఇంటికి వెళ్ళేటప్పటికి సుందరం రైలుదగ్గిరికి వెళ్ళాడని తెలిసినట్టూ తాముకూడా బయల్దేరినట్టూ, బ్రిడ్జీ ఎక్కుతుండగా ఎవరో ఎరిగిన కుర్రాడిచేతిలో పత్రిక ఉన్నట్టూ, వాడు "మీ బావపేరు ఇందులో ఉందిరోయ్" అని చూపినట్టూ కనకం గబగబా చెప్పాడు.

అయితే తన కథ పడిందన్నమాట. పడుతుందని తను అనుకోలేదు. అక్కడి కొక అధ్యాయం ముగిసిందన్న తృప్తి కలిగిందిగాని సుందరానికి పెద్ద ఆనందం కలగలేదు. పైపెచ్చు ఆ కథ గల పత్రిక తన **బావమరుదుల** చేతుల్లో పడటం సుందరానికి అసంతృప్తి కూడా కలిగింది. వాళ్ళు ఆ కథను గట్టిగా చదివి అల్లరి చేస్తారేమోననీ, ఈ యీడుకే కథ రాయ సాహసించినందుకు తన అత్తగారూ, మామగారూ, తనను గురించి అసహ్యంగా అనుకుంటారనీ వాడికి సందేహం కలిగింది. ఏం జరిగినా తను తల ఒగ్గవలసిందేగాని చేసేదిలేదు.

"ఆ అమ్మాయిని మొదటి మొగుడితో కొన్నాళ్ళు కాపురం చేసినట్టు చూపకుండావుంటే బాగుండేది" అనుకున్నాడు.

సుందరం భయపడ్డ సంఘటనలేవీ జరగలేదు. వాడి బావమరుదులిద్దరూ నేనుముందు చదవాలంటే, నేను ముందు చదవాలని పోట్లాడుకుని పత్రికను నలిపి, చింపినంత పనికూడా చేసి, ఆఖరుకు ఇద్దరూకలిసి చదువుకోవటానికి రాజీపడ్డారు. ఆ తరవాత ఆ పత్రిక ఏమయిందో, సుందరానికి మటుకు వెంటనే చేరలేదు. తన కథను బావమరుదులుగాక మిలిగినవాళ్లుకూడా చదివివుంటారని వాడనుకున్నాడు. చదివితే చదివారు. చదివినవాళ్లు నూడాబలుక్కున్నట్టు దాని ప్రస్తావనే ఎత్తకపోవటం సుందరానికి అశాంతి కలిగించింది. ఇంతకన్న అందరూచేరి కథను వేళాకోళం చేసినా బాగుండేదనుకున్నాడు వాడు.

❀ ❀ ❀ ❀

పార్వతీశంగారు ఊళ్ళోలేదు. కమలమ్మగారు వాకిట ఉంది. వంటా అదీ లక్ష్మి వంతు. పార్వతీశంగారుంటే వంట ఎక్కువభాగం ఆయనే చేసివుండును. తెలుగుక్లాసు మేస్టరు రాగానే తోకఝాడించే పిల్లల్లాగా జగన్నాథం, కనకంకూడా లక్ష్మిని బాగా ఆటపట్టించ సాగారు. వాళ్లు మామూలుగా స్కూలుకు పోయిన తరవాత సుందరం తాను కాలేజీ ఎగగొట్ట నిశ్చయించాడు పెళ్ళానికి తోడుండాలనిపించింది. కొత్తగా తెరిచిన కాలేజీ ముంచుకుపొయ్యే పాఠాలేమీలేవు. అంతో ఇంతో జల్లుకూడా పడుతున్నది. గదిలో ముసుగుతన్ని ఏదో చదువుకుంటూ పడుకున్నాడు. పేజీలు తిరిగిపోతున్నాయిగాని, ఏం చదువుతున్నదీ తెలీటంలేదు. ఆ పిచ్చిబుర్ర ఇంకేదో ఆలోచిస్తున్నది - ఎప్పటికి లక్ష్మి ఈ గదిలోకి వస్తుందా, మళ్ళీ పలకరిద్దామని ఆలోచిస్తున్నది.

"అందరం అన్నాలు తినేసిన ఇన్ని గంటలక్కూడా ఆ వంట ఇంటోనుంచి రాదేం?" అనుకున్నాడు సుందరం. తాను భోంచేసి ఇంకా ఇరవై నిమిషాలు కూడా కాలేదు నిజానికి. పర్వతం దగ్గిరికి పైగంబరు పోవచ్చుగదా? పైగంబరు దగ్గిరికే పర్వతం రావాలన్న నియమమేమిటని స్ఫురించి సుందరం ముసుగుతన్ని పారేసి వంటింటిలోకి వెళ్ళాడు. లక్ష్మి పెద్ద పనివారక్కల్లే వొంగుని పొయ్యిదగ్గిర అంట్ల గిన్నెలూ, అవీ సర్దుతున్నది. దానిజడ ముందుకు పడి అన్ని గిన్నెలనూ తాకుతూనే ఉంది.

"దీని ఆచారం అడుక్కుతిన్నట్టే ఉంది" అనుకున్నాడు భార్యను చూసుకుని మురిసిపోతూ సుందరం.

"కాసిని మంచినీళ్ళు కావాలి" అన్నాడు.

లక్ష్మి ఉలిక్కిపడి తల ఎత్తిచూసి లేచి నిలబడ్డది. ఆ ఊపులోనే జడను వెనక్కు నెట్టేస్తూ.

మంచినీళ్ళు పుచ్చుకునేటప్పుడు సుందరం లక్ష్మి చెయ్యి పట్టుకున్నాడు. లక్ష్మి చెయ్యిలాక్కోవడానికి చిన్న ప్రయత్నం చేసిందిగాని నీళ్ళు కిందపడేటట్టు కనిపించి మానేసింది. అది సుందరం మొహంకేసి చూడకుండా "ఇందుకే గామాలు కాలేజీ ఎగ్గొట్టింది" అన్నది.

"నా యిష్టం" అన్నాడు సుందరం.

"చెయ్యి వదలండి."

"ఎవరూ చూడరులే."

"చూస్తే కొరతేస్తారనా?"

సుందరం నిర్ఘాంతపోయినాడు. అవును ఎవరో చూస్తారని తను ఇన్నాళ్ళూ ఎందుకు బెదిరిస్తున్నాడు.

"అమ్మకు ఇంకా అన్నం పెట్టాలి" అన్నది లక్ష్మి!.

సుందరం చెయ్యి వదిలేశాడు. మంచినీళ్ళు తాగకుండానే వెళ్ళి మళ్ళీ ముసుగుతన్ని పడుకున్నాడు. తనపని పూర్తికాగానే లక్ష్మి సేరుగా తన ధగ్గిరికి వస్తుందన్న ధైర్యంతో.

కాని లక్ష్మి ఎంతకూ రాలేదు. ఒక అరగంట గడిచింది. సుందరం బయటికి వచ్చి చూసేసరికి లక్ష్మి హాలులో చాపమీద పడుకుని కాళ్ళు ఆడిస్తూ ఏదో చదువు కుంటున్నది.

"ఏయ్!" అన్నాడు సుందరం రహస్యంగా.

లక్ష్మి తలఎత్తి గదివాకిట నిలబడివున్న భర్తను చూసింది. రమ్మని సుందరం తలతో సంజ్ఞచేశాడు. లక్ష్మి తల అడ్డంగా తిప్పింది. సుందరం చెయ్యి ఊపాడు. నాడికి ఒకచెంప కోపం వచ్చేస్తున్నది. ఇంత ఇష్టంలేని దాన్ని పిలవటం తనదే తప్పనిపిస్తున్నది.

లక్ష్మి నిజంగానే ఇష్టంలేనిదానల్లే ముక్కుతూ లేచి సుందరానికి ఒక గజం దూరంలో నిలబడి ఎందుకన్నట్టు చూసింది. సుందరం లక్ష్మి చెయ్యిపట్టుకుని గదిలోకి ఈడ్చుకుపోయినాడు. బలవంతాన మంచంమీద తన ప్రక్కనే కూచోబెట్టుకున్నాడు.

"ఇట్లా అయితే చదువు సాగదు" అన్నది లక్ష్మి.

"కాలేజీ ఎగ్గొట్టాననా? బద్ధకంగా ఉంది."

"బద్ధకం తెలుస్తూనే వుంది."

లక్ష్మిని ముద్దుపెట్టుకునే అధికారం తనకున్నట్టు సుందరానికి చూచాయగా తెలుసు కాని ఏదో బిడియం వేసింది. మొహంవంచి లక్ష్మి మొహాన్ని తాకికూడా చెంప వాసన చూసి మళ్ళీ తల వెనక్కులాక్కున్నాడు.

"నన్ను ఏయ్, ఏయ్ అంటారేం? నాకు పేరులేదా?" అని అడిగింది లక్ష్మి.

"ఏం పేరు. పనిచేసేవాళ్ళు పెట్టుకునే పేరు!"

"పోనివ్వండి ఏదోపేరు. అన్ని పేర్లూ అందంగా వుంటాయా యేం?"

లక్ష్మికి వచ్చిన కోపం తీర్చటానికి ప్రయత్నిస్తూ, ఒకచెయ్యి ఆమెచుట్టూ తిప్పి కొంచెం దగ్గిరికి లాక్కున్నాడు. మరుక్షణం లక్ష్మిని రెండు చేతులతోనూ గట్టిగా చేతకాకుండా ఆనందంగా లేని ఆవేశంతో కౌగిలించుకున్నాడు. లక్ష్మి తనకేసి దైన్యంతో చూసినట్టు క్షణంపాటు సుందరానికి అనిపించింది. మరుక్షణం ఆమె అతని పట్టు తప్పించుకుని వెళ్ళిపోయింది. లక్ష్మి అట్లా వెళ్ళిపోవటం సుందరానికి యిష్టంలేదు. కాని నివారించటానికి అతని మనస్సుగాని, శరీరంగాని కాస్తయినా స్వాధీనంలో లేవు...

హాల్లో చాపమీద పడుకుని చదువుకుంటున్న లక్ష్మి సుందరం డ్రెస్సు వేసుకుని కాలేజీకి బయలుదేరబోతూండటం చూసింది. ఏమనుకుందో ఏమో లేచి అతని దగ్గిరికి వెళ్ళి నిలబడింది. సుందరం పలకరించలేదు. బుంగమూతి పెట్టుకున్నాడు.

"కోపమా?" అన్నది లక్ష్మి.

"ఎందుకు రెండునా చెడటం?" అన్నాడు సుందరం.

"మానేశారుగా, మళ్ళీ ఎందుకు పోతున్నారూ?"

లక్ష్మి ఇంకొంచెం దగ్గిరికి వచ్చి భయపడుతున్నట్టు చేత్తో కోటు తాకింది.

సుందరం చేతిలో పుస్తకాలు పక్కనపెట్టి ఎంతో సాహసించి లక్ష్మిని ఎదురుగా తన రొమ్ముకు అదుముకున్నాడు. లోతుగా దిగినమేకును లాగినా నరాలు ఒక్కసారిగా అంత బాధపడవు. కాని ఈ బాధ వాంఛనీయం. కవుల పరిభాషలో తీయనిబాధ. సాహసించినవాడు ఎట్లాగూ సాహసించాడు. ఈసారి లక్ష్మిని ముద్దుకూడా పెట్టుకున్నాడు చేతయి పెట్టుకున్న ముద్దుకాదు కాని ఆప్యాయత కేమీ లోటులేదు.

తను ముద్దు పెట్టుకున్నప్పుడు లక్ష్మి కళ్ళు గట్టిగా మూసుకోవటం గమనించాడు సుందరం.

తరవాత సుందరం లక్ష్మిని వొదిలి మళ్ళీ పుస్తకాలు తీసుకుని చంకన పెట్టుకుని మబ్బులమీద తేలిపోతున్న వాడల్లే కాలేజీకివెళ్ళి క్లాసులో ఏమి జరుగుతున్నదీ తెలీకుండా కలలుగంటూ సాయంకాలందాకా గడిపాడు.

## 25

జానకికి తొలిచూలు మగపిల్లవాడు కలిగాడు. సుందరం మేనమామగారి ఊరు వెళ్ళి పుట్టిన పిల్లవాడికి మేనమామ తనం నెరిపాడు. వాడికి పురిటిల్లు అనుభవంలేదు. మొదటిసారి తన చెల్లెలినీ, మేనల్లుణ్ణి పురుటిగదిలో చూసేసరికి సుందరానికి వొళ్లు గరిపొడిచింది. వెల్లుల్లివేసి కాచిన నూనె వాసనా పొత్తిళ్ళగుడ్డలూ, "బ్రాహ్మడి కూతురు. మాదిగాడి పెళ్లాం" అన్న జపమూ చూస్తుంటే వాడికేదో భయంభయంగా వుండింది. పదోరోజున పురిటి స్నానమూ, జానకి ఒళ్ళంతా రాసుకున్న పసుపూ, వేపమండలు కట్టిన ఉయ్యాలా మొదలయినవి గణాచార్ల కొలుపులు జ్ఞాపకానికి తెచ్చాయి – వీరాంగం మినహాగా

"ఛా ఛా! ఈ పిల్లల్ని కనే ఏర్పాటు లేకుండా వుంటే బాగుణ్ణు" అనుకున్నాడు సుందరం. జంతువు కనే పద్ధతికూడారొప్టే. పక్షులుకనే పద్ధతే అన్నింటిలోకీ బాగుంటుంది. సుఖంగా గుడ్లు పెట్టేస్తాయి. ఆ తరవాత పిల్ల తనకు తానే కనుకుంటుంది.

నరుసులో చాలా మార్పువచ్చింది. వాడిప్పుడు తన నాటకాలను గురించి అదివరకు మాదిరిగా మాట్లాడటంలేదు. నెల తిరిగేసరికి యాభై, వంద మధ్య సంపాదిస్తున్నాట్ట. స్థానం పక్కన క్రిష్ణుడు వేశాడు "తులాభారం"లో. ఇంకేం కావాలీ?

నరుసు పైకి వస్తున్నాడని సుందరం సంతోషించే సమయానికి నరుసు విరక్తి కనబరిచాడు.

"ఏం బతుకురా. నాటకాలవాళ్ళ బతుకు! ఎవరూ నిజంగా గౌరవించరు గద! చదువుకున్నవాళ్ళ మధ్యకుపోతే సిగ్గేస్తుంది. చదువు మాని వుండాలిసిందిగాదు. కిందటి నెల రాజమండ్రి వెళ్ళాం. హాస్టలు విద్యార్థులు మమ్మల్ని కొందరిని పిలిచారు. ఆ హాస్టల్లో ఒక కుర్రాడున్నాడు. బియ్యే ఫిజిక్సు చదువుతున్నాట్ట. అతను పాడాడు చూడూ! నాకు తల తిరిగిపోయింది. రేపో అబ్బాయి స్టేజి ఎక్కాడంటే నా

బోటివాళ్ళంతా దిగిపోవలసిందే. ఒక పాడటమేమిటి? నాలుగైదు వాద్యాలు వాయిస్తాడు. చదువుకుంటూ ఆ కుర్రవాడు అంత సంగీతం నేర్చుకున్నాడంటే, నేను చదువు మానేసి చేసిన ఉద్ధరింపేమిటా అనిపించింది. అబ్బిగాణ్ణి తప్పకుండా చదివించాలి" అన్నాడు నరుసు.

"అబ్బిగాడు" అంటే నరుసుకు పుట్టిన నలుసని సుందరం వెంటనే గ్రహించలేదు.

ఈ కొడుకును గురించి నరుసు చాలా గాలిమేడలు కట్టటం చూశాడు సుందరం. తను ఒక పిల్లడి తండ్రి అయినందుకు నరుసు కాస్తన్నా బిడియ పడటంలేదు. చాలా మందిని కన్నవాడల్లే ప్రవర్తించాడు. ఇది సుందరానికి ఆశ్చర్యం కలిగించింది. తనకే పిల్లవాడు పుగితే కొన్ని మాసాలపాటు తన మొహం తియ్యకుండా జేవురింపవుంటుందనిపించింది సుందరానికి. ఈ మాట అనుకోగానే వాడికి లక్ష్మి జ్ఞాపకం వచ్చింది. లక్ష్మి పిల్లల్ని మోసి. కని, పురిటింట్లో ఇంగువ, వెల్లుల్లిపాయల వాసన మధ్య పడుకుని పసుపురాసుకుని, నడికట్టు వేసుకుని, చెవుల్లో దూది పెట్టుకుని, ముట్టుకోవటానికి ఒళ్లు గరిపొడిచే కనుబొమ్మలు లేనిబిడ్డకి పాలివ్వటం తలచుకుంటే, సుందరానికి కంపరం ఎత్తింది. లక్ష్మిమీద ఏదో అర్థంకాని జాలి పుట్టుకొచ్చింది.

లక్ష్మిని చూసి ఆరురోజులే అయిందిగాని సుందరానికి ఎన్నో యుగాలైనట్టుంది. లక్ష్మి అనేమాటలూ, చేసేపనులూ, ఏమిటో జ్ఞాపకంవచ్చి సుందరం తనలో తను నవ్వుకున్నాడు. ఒక్కొక్కసారి అతి చిన్నపిల్ల అనిపిస్తుంది. ఒక్కొక్కసారి తన తల్లిని జ్ఞాపకం తెస్తుంది. మొత్తంమీద ప్రపంచంలో ఏ ఇతర వ్యక్తీ యివ్వని అనుభవమూ, ఆనందమూ యిస్తుంది తనకు లక్ష్మి.

"ఏమయ్యా, సుందరం? ఇక నువు తాపీగా ఆడపిల్లను కను. లేకపోతే మేనల్లుడూరుకోడు. అన్నట్టు కార్యమెప్పుడూ? లక్ష్మి పెద్దమనిషి అయి సంవత్సరం దాటలా?" అన్నది నరుసుతల్లి భోజనాలదగ్గిర.

సుందరం మాట్లాడలేదు. కార్యమంటూ వుండదని వాళ్ళతో ఎందుకు చెప్పటం. ఒకరోజు అత్తగారు సుందరానికి తలంటిపోసింది, మామగారు కొత్తబట్టలు కట్టబెట్టాడు. సుందరానికి అర్థంకాలేదు. ఆ రాత్రి గదిలో పక్కవేశారు. భోజనాలయినాక లక్ష్మి కొత్తచీరెకట్టుకుని, సెంటువాసనతో ఘుమఘుమలాడుతూ, పూలజడ వేసుకుని గదిలోకి వచ్చింది - మిఠాయి పళ్ళెంతోనూ, పాలతోనూ, ఆనాటినుంచీ లక్ష్మికి వేరే పక్కలేదు.

ఈ సంగతి నలుగురికి చెబితే అందరూ నవ్వుతారనే భయం అటుంచి అత్తవారి దారిద్ర్యంకూడా బయట పడుతుందన్న భయంకూడా సుందరానికున్నది. కనీసం జానకినీ, సీతమ్మగార్నీ అయినా పిలుద్దామని పార్వతీశంగారు ఆలోచించాడు. కాని శేషగిరి కుటుంబాన్ని పిలవక తప్పదు. ఎంత క్లుప్తంలో పోనిద్దామనుకున్నా తడిసి మోపెడయేటట్టు కనిపించింది. అందుచేత ఈ పద్ధతి అవలంబించవలసి వచ్చింది.

సుందరం అంతరాత్మ ఆరాటపడసాగింది. కాకినాడలో కాంగ్రెసు మహాసభ[45] జరిగినప్పుడు తను వెళ్ళలేదు. తన స్నేహితులలో కొందరు వెళ్ళారు. వాళ్లు కాంగ్రెసును గురించి చెబుతుంటే తను పిచ్చిమొహం వేసుకుని వినవలసి వచ్చింది. తరువాత గాంధీ బెజవాడ[46] వచ్చినప్పుడూ, గుంటూరు వచ్చినప్పుడూ కూడా సుందరం వెళ్ళి చూడలేదు. అసలు సుందరం గాంధీనేకాదు, ఏ కాంగ్రెసు మహా నాయకుణ్ణీ చూడలేదు. తనతోటి వాళ్ళలో గాంధీనీ, మోతీలాలునూ, రాజేంద్ర ప్రసాదునూ, జవహర్‌లాల్‌నూ, రాజాజీని. సి.ఆర్. దాసునూ, చూసినవాళ్ళున్నారు. సుందరం చూసిందల్లా చీరాల రామదాసు[47] ఆ దుగ్గిరాల గోపాలకృష్ణయ్యనూ, కొండా వెంకటప్పయ్యనూ, గొల్లపూడి సీతారామశాస్త్రినీ దేశోద్ధారక నాగేశ్వరరావు నీనూ[48] మళ్ళీ మద్రాసులో కాంగ్రెసు మహాసభ[49] జరుగుతున్నది. దీనికయినా తప్పక వెళదామనుకున్నాడు.

ఇందులో సుందరం అంతరాత్మ బాధపడటానికి కారణమేమంటే తనకు తగినంత ఆసక్తిలేకనే ఏ మీటింగుకూ వెళ్ళలేదు. పెద్దవాళ్ళను చూశానని గొప్పచెప్పుకోవటంకంటె ఈ రాజకీయ వాతావరణంద్వారా తెచ్చుకోదగిన ఆవేశం ఏమన్నావుంటే అది తెచ్చుకుందామనీ, సాటివాళ్ళకు వెనకపడకుండా ఉందామనీ సుందరం అభిప్రాయం. ఇప్పుడు వెళ్ళాలన్నా తనను అడ్డేవారు లేరు. తన తల్లిదగ్గిర అంటే "ఎందుకులేరా డబ్బు దండగా!" అని తీరుతుంది. తరవాత తను ఝూముసేపు వాదించినెగ్గినా ఆ కాస్తమాట అనిపించుకోవటమయినా నిరుత్సాహ కారణమే ఇప్పుడాపాటి నిరుత్సాహంకూడా కలిగించేవారు లేరు. కనక ఎందుకు పోగూడదూ?

"ఏయ్, నేను క్రిష్టమస్ శలవుల్లో పట్నం పోయివస్తా, కాంగ్రెస్‌కు" అన్నాడు సుందరం లక్ష్మితో.

"నన్నుకూడా తీసుకుపొండి" అన్నది లక్ష్మి. సుందరం యింకా ఏమీ అనకమునుపే కాళ్ళూ, చేతులూ తన్నుకుంటూ "ఏమిటండీ? పోనీలెండి, ప్రతి చోటికీ ఒక్కరే బయల్దేరుతారు. నన్నెక్కడికీ తీసుకుపోరు. మీరుమాత్రం దేశాలన్నీ తిరిగి రావాలి. నేనుమాత్రం ఇక్కడే ఉండాలి. ఈసారి మీరు ఒంటరిగాపోతే నేను ఒప్పుకోను" అని గబగబా ఏకరువు పెట్టేసింది.

"మనిద్దరం కాపరం చేస్తున్నామని పట్నంలో నోటీసులుకూడా పంచి పెడదామా?" అన్నాడు సుందరం.

---

45. కాకినాడ కాంగ్రెస్ మహాసభ: (1923) మహమ్మదాలి అధ్యక్షులు.

46. గాంధీజీ బెజవాడ రాక: (1922).

47. గొల్లపూడి సీతారామశాస్త్రి రచయిత, జాతీయవాది.

48. దేశోద్ధారక నాగేశ్వరరావు (1876-1938): ఆంధ్రపత్రిక (1908), భారతి (1924) పత్రికల సంస్థాపకులు, సంస్కృతాంధ్ర భాషల్లో పండితులు, మంచి ప్రచురణ కర్త. ఆంధ్రదేశంలో జరిగిన జాతీయోద్యమ దశలోని ప్రతి వుద్యమంలోను గణనీయమైన పాత్ర వహించిన సంప్రదాయిక దృష్టిగల జాతీయవాది. దాత.

49. మద్రాసు కాంగ్రెసు మహాసభ: (1927) డా॥ అన్సారీ అధ్యక్షులు.

"ఎన్నాళ్ళని దాస్తామేం? ఆ మామగారికీ ఈ అల్లుడికీ తగిపోయింది. ముష్టి దాపరికాలు"

"అయినా డబ్బుకావద్దూ? నాకే డబ్బెట్లాగా అని చూస్తున్నా. కనీసం పదిహేను రూపాయలన్నా ఉండాలా?"

"మీకేం మహారాజులు. పదిహేనయినా సంపాదిస్తారు. పాతికైనా సంపాదిస్తారు. వెళ్ళటం ఖాయమేనా?"

"నువ్వేమంటావు!"

"వెళ్ళొద్దు."

"ఏం?"

"మీరు తిరిగొచ్చేదాకా నాకు తోచదు."

"చాదస్తంగా మాట్లాడకు."

"మీకేం? మీకు హాయిగా ఉంటుంది గనక, నాకూ హాయిగా ఉంటుందనుకుంటారు. మీరు ఒకరోజు ఇంటో లేకపోయినాసరే నాకు పిచ్చెక్కినట్టుంటుంది."

లక్ష్మి ఈమాట అనటం మొదటిసారి కాదు. కాని ఈ మాటను సుందరం ఎన్నడూ పూర్తిగా నమ్మలేదు. లక్ష్మి కేవలం నటిస్తున్నదనుకోవటం ఇష్టంలేక, కాస్తంత వుంటే గంపంత చేస్తున్నదనుకునేవాడు. ఆమాటా లక్ష్మి మరింత గట్టిగా అంటే సుందరానికి కాస్త చికాకుకూడా వచ్చేది. అది కనిపెట్టే లక్ష్మి సాధారణంగా ఆ విషయం యెత్తటం మానుకున్నది. ఈ ఒక్కమాటా సుందరం నమ్మితే తనకిక లోటేలేదని లక్ష్మి అనుకున్న సమయాలు కూడా లేకపోలేదు.

సుందరం పొరుగూరువెళ్ళితే తనను మరిచిపోతాడనుకోవటంలో మాత్రం లక్ష్మి పొరపాటుపడింది. సుందరం లక్ష్మికోసం వాచిపోయేవాడు కాదేమోగాని తప్పక జ్ఞాపకం చేసుకునేవాడు. ఎదురుగా ఉన్నప్పుడుకన్నకూడా సుందరానికి లక్ష్మి ఎదుట లేనప్పుడే యెక్కువ ఆపేక్ష పుట్టుకొచ్చేది. దూరానవుండి భార్యను తలుచుకున్న సమయాల్లో సుందరం ఇంచుమించు ఆదర్శభర్త అయిపోయేవాడు.

ఇంకా కాంగ్రెసు మూడురోజు లుందనగా సుందరం స్వగ్రామం వెళ్ళి ఇంటో అద్దెకున్నవాళ్ళదగ్గిర నెల పూర్తికాకుండానే అద్దె వసూలుచేసి తెచ్చుకుని ఆ డబ్బుతో పట్నం ప్రయాణం కట్టాడు.

మెయిలులో సుందరం ప్రయాణం. వాడు స్టేషనుకు బయలుదేరేదాకా ఇంటిల్లిపాదీ మేలుకుని కూచున్నారు. తీరా గుర్రబ్బండి వాకిట్లో నిలబడి వుండగా లక్ష్మి సుందరాన్ని తమ గదిలోకి తీసుకుపోయి గట్టిగా కౌగలించుకుని "మూడు రోజులూ అయిపోగానే తిరిగిరండి" అన్నది.

"ఈ ప్రయాణం తలపెట్టకుండావుంటే బాగుండేది లక్ష్మిని బాధ పెట్టేకన్న!" అనిపించింది సుందరానికి ఒక క్షణంపాటు,

సుందరం సెంట్రల్ స్టేషనులో దిగేసరికి తెల్లవారి అంత పొద్దెక్కింది కూడాను. వాడంతకు పూర్వం ఎన్నడూ మద్రాసుచూడలేదుగాని చూసినవాళ్ళద్వారా చాలా వినివుండటం చేత చాలా వివరాలు తెలుసుకుని వున్నాడు "సామీ, సామీ" అనేమాట ప్రతి పోర్టరునోటా, రిక్షావాడినోటా వినవచ్చింది. "బారిస్టరు పార్వతీశం"లో చదివిన అరవ తెలుగు మొదటిసారిగా సుందరం చెవులపడింది.

"కాంగ్రెసు పెండాలుకు ఎట్లా వెళ్ళాలి?" అని తోటి ప్రయాణికుణ్ణి రైల్లోనే అడిగాడు సుందరం.

"స్టేషనుకు ఎదురుగానే కాంగ్రెసు స్పెషల్ బస్సులు నిలుస్తాయని" ప్రయాణికుడు సమాధానం చెప్పాడు. బస్సు టిక్కెట్టు మూడణాలు, రెండణాలు ఉంటుందనికూడా ఆయనతెలిపాడు. అటువంటి సందర్భంలో రిక్షాలవాళ్ళు అర్ధరూపాయికి తీసుకుపోతామనీ, బళ్ళవాళ్ళు రూపాయి ఇస్తే చాలు కాంగ్రెసుకు తీసుకుపోతామనీ ఎందుకు ఆశపెడుతున్నదీ సుందరానికి అర్ధంకాలేదు. బస్సులు లేకనో, ఉంటే వాటిలో చోటు దొరకదో అని సుందరం భయపడ్డాడు. అయితే ఈ భయాలు నిరాధారమైనవని ఋజువయింది. సుందరం స్టేషను బయటికి వచ్చి రోడ్డు అవతలివైపుకు దాటిన మరుక్షణంలోనే వాణ్ణి ఏదో బస్సు దాదాపు దానంతట అదే ఎక్కించుకుని పారిపోసాగింది. స్టేషను ముందుగా అటు యిటూ వెళ్ళే ట్రాములకేసి కాస్సేపు చూడటానికయినా వాడికి అవకాశం చిక్కలేదు.

పట్నమంతా చాలా హడావుడిగా, అర్జంటు పనులమీద ఉన్నట్టు కనపడింది. ఇదంతా కాంగ్రెసుమూలంగానే అయిఉంటుందనీ, మామూలు రోజుల్లో యింత కోలాహలం ఉండదనీ సుందరం తనను తాను నమ్మించుకున్నాడు.

బస్సు ఎటోపోతున్నది. పడమటి దిక్కుగా పోతున్నట్లున్న భావం తప్ప ఇంకేమీలేదు సుందరం తలలో బస్సు నిండుగా ఉండటంవల్లా, వేగంగా పోతూండటంవల్లా వీధులుగాని, భవనాలుగాని, సరిగా చూసే అవకాశం లేకపోయింది వాడికి. చివరకు బస్సు ఆగింది. గమ్యస్థానం వచ్చిందని సుందరం ఎవరూ చెప్పకుండానే తెలుసుకున్నాడు. బస్సుదిగిన మరుక్షణంలోనే కాంగ్రెసు పెండాలు మైదానం మధ్యగా కనిపించింది. పుట్టలో నుంచి వచ్చిన చీమల్లాగ జనం చుట్టూతా కనిపించారు. బస్సుల్లో దిగిన వాళ్ళకన్న ఎన్నోరెట్లు కాలినడకన వస్తున్నారు. పుట్టమట్టిరంగు ఖద్దరు బట్టలు విరివిగా కనిపిస్తున్నాయి.

కాంగ్రెసుకు వచ్చినందుకు సుందరం చాలా సంతోషించాడు. అంతమంది జనాన్ని చూడటమే - వాళ్ళు చేసేపని చెయ్యటమే - ఎంతో ఆనందమయింది. పెండాలు పరిసరాల్లో చాలా అట్టహాసంగా ఉన్నది. కాంగ్రెసు వాలంటీర్లు ఏవో పనులమీద తీరకుండా తిరుగుతున్నారు. కొందరు మాత్రం కర్రలు పట్టుకుని కాపలా వాళ్ళల్లే గేట్ల దగ్గిరా అక్కడా నిలబడ్డారు. వాళ్ళని చూస్తుంటే సుందరానికి పోలీసులు జ్ఞాపకం వచ్చారు.

ఇంత హడావుడిలోనూ జరుగుతున్న తతంగమేమిటో వాడికి తెలియరాలేదు. జనాన్ని తోసుకుంటూ సుందరం పెండాలుచుట్టూ తిరిగాడు. బహిరంగ

సభలుంటాయి. నాయకులు మాట్లాడతారు విందామనుకున్నాడు. కాని అదంతా పెండాలులోపల జరుగుతున్నది. లోపలికి పోవాలంటే టిక్కెట్లో పాసులో కావాలి. సుందరం దగ్గిర యింకా పదిరూపాయల చిల్లరేవుంది. టిక్కెట్టు కొనటానికి సాహసం చాలలేదు. సుందరం ఒకచోట నిలబడి వచ్చేపోయేవాళ్ళని చూద్దామనుకున్నాడు. కాని ఒకచోట నిలవటానికీ లేదు. ఒకచోట నిలబడినప్పటికీ, రెండు నిమిషాలయేసరికి ఇంకే పక్కనన్నా ఏదన్నా జరుగుతున్నదేమోననిపిస్తుంది. నలుగురైదుగురు హడావుడిగా వెళ్ళటం చూస్తే తనకు కూడా అటే వెళ్ళబుద్ధి అవుతుంది. ఈ విధంగా ఎన్నోసార్లు ఆశాభంగమయింది. అయినా ఇప్పుడు సుందరానికి స్వయంనిర్ణయశక్తి ఏ మాత్రమూలేదు. వాడు ఈ జనప్రవాహంలో ఒకడు మాత్రమే. ఆ జనం తనలో కలిగించే ప్రతి చిన్న ప్రేరణకూ తాను గురికావాలిసిందే.

సుమారు రెండుమూడు రోజులనుంచీ తాను ఈ పెండాలుచుట్టూ ప్రదక్షణం చేస్తున్నట్టు భావన కలుగుతున్నది. ఇంతవరకు ఏమీ చూడలేదు - జనం తప్ప. ఈ జనంలోనయినా ఫక్తు ఒంటరిగాడు తను ఒకడల్లే కనిపించాడు. మిగిలినవాళ్ళు ఇద్దరేసీ, ముగ్గురేసీ. నలుగురేసీగా తిరుగుతున్నారు. వాళ్ళలో వాళ్ళు నవ్వుతూనూ, గంభీరంగానూ, ఆప్యాయంగానూ, వాదించుకుంటూనూ, మాట్లాడుకుంటుంటే ఎంత అదృష్టవంతులు!" అనుకున్నాడు సుందరం. ఆ తిరిగేవాళ్ళలో తెలుగువాళ్ళు కూడా ఉన్నారు. అందులో ఎవరినన్నా పలకరించి పరిచయం చేసుకుని వాళ్ళతో చేరి పోదామంటే "వీడెక్కడ జిడ్డు దాపరించాడురా?" అనుకుంటారేమోనని భయం.

కాళ్ళు పీకుతున్నాయి. ఆకలవుతున్నట్లుగా అనుమానంగా ఉంది. ఏ క్షణాన ఒంటేలుకు పోవలిసొస్తుందో, రెండేళ్ళకొస్తుందో అని భయంగా వుంది. ఎందుకొచ్చానా అని సుందరం పశ్చాత్తాపపడటానికి యింకా పస్తాయిస్తున్నాడు. ఈ సమయంలో తీసేసినట్టుగా వాడి నిరుత్సాహమంతా మాయమయింది. కాళ్ళనొప్పెత్తటం మానాయి. ఒక చిన్న గుంపు వాడి కంటపడింది యెవరో నల్లటి అబ్బాయి గాంధీటోపి పెట్టుకుని "బాబూ మా కొద్దీ నల్ల దొరతనమూ" అని పాడుతున్నాడు. ఈ పాట వింటున్నకొద్దీ సుందరానికి ఆశ్చర్యం కలిగించింది. "మా కొద్దీ తెల్ల దొరతనము"[50] అన్నమాట సుందరం అదివరకు విన్నాడు. తెల్లవాళ్లు దేశంలోనుంచి పోయిందాకా జనమంతా ఆపాటే పాడాలిగదా, ఈ అబ్బాయి నల్లవాళ్ళకు - దేశస్తులకు - విరుద్ధంగా పాట పాడతాడేం? గవర్నమెంటువాళ్ళు డబ్బిచ్చి పాడిస్తున్నారేమో ననుకున్నాడు. కాంగ్రెసు పెండాలు పక్కన నిలబడి

50. గరిమెళ్ళ సత్యనారాయణ రాసిన పాట 1922 లో "స్వరాజ్యగీతాలు" పై... బ్రిటిష్ ప్రభుత్వం నిషేధాలు విధించింది. గరిమెళ్ళపై కేసుపెట్టి జైలుశిక్షకూడా విధించింది. గరిమెళ్ళ "మా కొద్దీ తెల్ల దొరతనం" అనే వొక్క గీతాన్నే అరటావు కాగితం మీద రెండు పక్కలా అచ్చొత్తించి అణా వెలబెట్టి అమ్మేయేర్పాటు చేశారంటే దానికెంత ప్రచారంకల్గిందో వూహించుకోవచ్చు. ప్రభుత్వం. ఆ అరటావు కాగితంపై కూడా అఘాయిత్యం వేసింది. (బంగోరె, మాలపల్లి నవలపై ప్రభుత్వ నిషేధాలు, 1979).

కాంగ్రెసుకు విరుద్ధంగా పాడుతుంటే కాంగ్రెసు వాళ్లు ఊరుకుంటారా? కాంగ్రెసు చూడవచ్చినవాళ్లు ఆసక్తిగా వింటారా?

కొంచెంసేపు విన్నమీదట సుందరానికి ఆ పాట అస్పృశ్యతమీద పాట అని తెలిసింది. సుందరం మనస్సు కుదుటపడింది. "పాడాలిసిందే! లేకపోతే అస్పృశ్యతేమిటి?" అనుకున్నాడు సుందరం. కాని ఈ సంగతి తెలియగానే వాడికి పాటలో ఆసక్తిపోయింది. మళ్ళా వొంటరితనమూ కాళ్ళనొప్పులూ తిరిగి వచ్చాయి. కొంతదూరం నడిచాడు. జనం ఒక్కసారిగా తోసుకు పరిగెత్తటం కనిపించింది. సుందరం కూడా పరిగెత్తాడుగాని, తనకు తెలిసి బుద్ధిపూర్వకంగా పరిగెత్తలేదు. కాంగ్రెసు వాలంటీర్లు జనాన్ని వెనక్కుతోస్తున్నారు. "గాంధీ" అన్నపేరు వినిపిస్తున్నది. దూరాన "మహాత్మాగాంధీకీ జై" అన్న పెడబొబ్బ వినిపించింది. అది క్రమముగా సుందరం ఉన్న వైపుకు వస్తున్నది. సుందరం మునివేళ్ళమీద లేచి నిలబడ్డాడు. ఏదో కారుటాపు కనిపించింది. జనాన్ని ఎవరో వెనక్కు తోస్తున్నట్టయింది. కారు కూడా కనిపించలేదు. ఒత్తిడి ఎట్లావచ్చిందో అట్లాగే తగ్గిపోయింది.

"నవ్వుతున్నాడు, దణ్ణంపెడుతున్నాడు" అని గాంధీని గురించి కాబోలు, చూసిన అదృష్టవంతులు అనుకుంటున్నారు. సుందరం మటుకు గాంధీని చూడలేదు.

❀ ❀ ❀ ❀

సాయంకాలమయింది. టైమెంత అయిందో సుందరానికి తెలియలేదు. ఇంకాకొంత సేపటిలో చీకటిపడుతుందని మాత్రమే వాడికి తెలుసు. తొలి అడవి మనుష్యుల కుండిన కాలమాన జ్ఞానమే ఇప్పుడు సుందరానికి మిగిలింది. చీకటిపడ్డట్టూ, ఆ అంధకారంలో కాంగ్రెసు పెండాలు భూతంలాగా ఉన్నట్టూ, జనమంతా ఎక్కడి వాళ్ళక్కడ వెళ్ళిపోయినట్టూ చుట్టుపక్కల నగరమంతా అంధకారంలో పడుకుని నిద్రపోయినట్టూ ఊహించుకున్నాడు. ఏదో భయంవేసింది. తనకు అపాయం కలుగుతుందని కాదు. ఈ కాంగ్రెసు పెండాలు ఖైదునుంచి తాను తప్పించుకునేటందుకు సహాయం చేసేవారుండరని.

గెరిల్లా కోతులను గురించి కాబోలు ఒక చిత్రం చెబుతారు. వాటిని అరణ్యంలో చెట్లమీద ఉంచి చుట్టూ కొంతమేర అరణ్యం కొట్టేస్తే అవి మధ్యవుండే చెట్లకు ఖైదీలైపోయి తప్పించుకోలేవట. సరిగా ఈ దుర్దశే సుందరానికి పట్టింది. వాడు కాంగ్రెసు పెండాలుకు ఖైదీ అయిపోయినాడు. దాని నుంచి తప్పించుకోలేక పోయినాడు. తప్పించుకోటానికి రెండే రెండు ప్రయత్నాలు చేశాడు. ఒకసారి రైలు పట్టాలదాకా వచ్చాడు. వాటికేసి చాలాసేపు చూశాడు. వాళ్ళ ఊళ్ళో రైలుపట్టాలు జ్ఞాపకానికొచ్చాయి. అయితే అది బ్రాడ్‌గేజ్. ఇవి బందరు రైలులాగా మీటర్‌గేజి, పట్టాలుదాటి రోడ్డుపట్టటానికి వాడికి సాహసం చాలలేదు. మళ్ళీ పెండాలు దగ్గిరికి వచ్చాడు. మరొకసారి రెండోవేపు ఇళ్ళకేసి చూశాడు. అవి వాడికళ్ళకు కీకారణ్యంలా కనపడ్డాయి. మళ్ళీ పెండాలుకు తిరిగి వచ్చాడు. పెండాలును మాత్రం విడవద్దని వాణ్ణి ఎవరో ఆదేశించినట్టయింది.

ఈ మధ్యకాలమంతా కేవలం సహారా ఎడారికాదు. మధ్యలో పావలా ఇచ్చి భోంచేశాడు. పెండాలుకట్టిన మైదానంలోనే భోజనాలు ఏర్పాటు చేశారు. ఈ సంగతి ఎవరో అనుకుంటుండగా విన్నాడు. ఆ భోజనం చాలా అసహ్యంగా ఉంటుందని కూడా వాళ్ళే అనుకుంటున్నారు. ఏ భోజనమైనా పడితేగాని ప్రాణం నిలిచేట్టులేదు. భోజనాలచోటు చెప్ప వీలులేనంత హడావుడిగా ఉంది. కాని భోజనం దొరికింది. దొరకటంకాదు. చాలా బాగుందికూడానూ.

మరొక చెప్పుకోదగిన సంఘటన ఏమంటే, సుందరం డాక్టరు అన్సారీ[51]నీ, మరికొందరు నాయకులనూ చూశాడు – మధ్యాహ్నం సమావేశానికి వస్తుండగా, వాలంటీర్లు కొద్దిమందే ఉన్నారు. జనం ఒత్తిడికూడాలేదు. ఈ నాయకులను చూసిన తరవాత సుందరం అదృష్టం పూర్తిగా అడుగంటింది.

సుందరానికి ఒంటో ఒక్కచుక్కకూడా శక్తిలేదు. తన కాళ్ళింకా కదులుతూ ఉండటం వాడికే ఆశ్చర్యం వేసింది. స్నానంచేసి ఎన్నో మాసాలయినట్టుంది. ఇంటినీ, లక్ష్మినీ తలుచుకుంటే అదంతా కలలాగా కనిపించింది. అదంతా మరోయుగంగానూ, మరో లోకంగానూ అనిపించింది.

"ఇందాక నీతో మాట్లాడిన అబ్బాయి ఎవర్రా కిశోర్? టంగుటూరి ప్రకాశం[52] గారబ్బాయేనా? పట్టాబీ[53] గారబ్బాయా?"

ఆ స్త్రీ కంఠం వినేసరికి సుందరం మనస్సులో ఏదో కొద్దిగా కదలబారింది.

"రామశర్మగారబ్బాయిలేవే బియ్యే నాలుగేళ్ళు చదివాడే... కిశోర్ నా కర్జంటుగా బాదంహల్వాకావాలి. తరవాత ప్రోగ్రాం చూసుకుందాం" అన్నదొక ఆడపిల్లగొంతు.

"ఇంకా ప్రోగ్రామేముందీ? ఎస్ప్లనేడ్ థియేటర్లో రాఘవాచారి నాటకానికి పోవటమే."

సుందరం తలకాయలో ఒక్కసారిగా దీపం వెలిగింది. మాట్లాడేవాళ్ళను వాడిప్పుడు కంటితో పట్టేశాడు. శ్యామలగారుకూడా ఈసరికి సుందరాన్ని చూసి ఏదో జ్ఞాపకం తెచ్చుకుంటున్నట్టు మొహం చిట్లించింది.

"ఏమండి మరిచిపోయినారా?" అన్నాడు సుందరం.

"లక్ష్మి మొగుడే!" అన్నది శ్యామల కూతురు శారద.

"నాకు తెలీదుటే? ఏం నాయనా? ఎప్పుడొచ్చా? మా ఇంటికి రానేలేదు గాదూ?" అన్నది శ్యామలగారు.

---

51. డా॥ అన్సారి: ముఖ్తార్ అహ్మద్ అన్సారి (1880–1936); ఖిలాఫత్ కమిటీలోను, సహాయనిరాకరణోద్యమంలోనూ ప్రముఖ పాత్ర వహించిన వారు. నో ఛేంజర్. కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీ వ్యవస్థాపక అధ్యక్షుడు.

52. టంగుటూరి ప్రకాశం (1869–1957): "స్వరాజ్య" పత్రిక స్థాపకులు (1921). సైమన్ కమీషన్ వ్యతిరేకోద్యమంలో ప్రముఖపాత్ర వహించి ఆంధ్రకేసరిగా ప్రసిద్ధులయ్యారు.

53. పట్టాభి (1880–1959): ప్రముఖ జాతీయవాది. బందరు జాతీయ కళాశాల స్థాపకుల్లో ఒకరు.

"నేను రైలుదిగి ఇక్కడికే వచ్చాను. ఇంకా ఎక్కడికీ వెళ్ళలేదు. ఇక్కణ్ణుంచి మీ ఇంటికే వద్దామనుకుంటున్నాను" అని బొంకాడు సుందరం.

"లోపల మాకు కనిపించలేదే? ఏమే చారూ? ఈ అబ్బాయిని నువుచూశావా?"

'నేనూ చూడలేదు" అన్నది శారద.

"నేను లోపలికి వెళ్ళలేదు" అన్నాడు సుందరం.

"అయ్యో, అట్లాగా? అసలు చూడవలసిందంతా లోపలేవుంది. మీటింగు అయిపోవస్తున్నది. కిశోర్, నీ టిక్కెట్టివ్వరా, కాస్సేపు కూచుని వస్తాడూ?" అన్నది శ్యామలగారు.

"ఎందుకులెండి, లోపల ఏముంది? అందర్నీ బయటే చూశా."

"సరే, కిశోర్, టాక్సీ ఏమైనా దొరుకుతుందేమో చూడు."

"టాక్సీ ఎందుకమ్మా? బస్సెక్కి నేరుగా కోమల విలాస్‌దగ్గిర దిగేదానికీ?" అన్నది శారద.

❀ ❀ ❀ ❀

సుందరానికి మళ్ళీ ప్రపంచంలోపడ్డ భావన కలిగిందిగాని శ్యామలగారు కనపడకుండా బాధ పెట్టసాగింది. బస్సులో ఎక్కికూచున్నాక ఒక్కక్షణం ఆవిడ నోరు మూతపడలేదు.

"ఏమిట్రా? రాజేంద్రప్రసాదు అట్లా మాట్లాడుతాడూ? కోర్టులో మీ నాన్నగారు మాట్లాడుతుంటే ఎంత దర్జాగా ఉంటుందీ? ఏమోనబ్బా, ఈ కాంగ్రెసు నాయకులు పేరుగొప్ప ఊరుదిబ్బానూ? ఒక్కళ్ళకూ మాట్లాడటం చేతకాదు. నాకు తలనొప్పి వచ్చిందంటే నమ్ము" అని అని గొంతెత్తి ఆమె ఏకధాటిన దంచేస్తుందంటే సుందరానికి సిగ్గేసింది, బస్సులో పోతున్న వాళ్ళు ఏమనుకుంటారో అని.

శారద కిశోర్‌తో, పెండాలులోకి వచ్చినవాళ్ళలో ఎవరెవరు అందంగా ఉన్నారో చెబుతున్నది....

నియోకోమలవిలాస్‌లో శ్యామలగారు పూర్తిగా విజృంభించింది. అక్కడి సర్వర్లను ఆవిడ దువ్వింది, బెదిరించింది. వాళ్ళకు సలహాలూ, హితోపదేశాలూ యిచ్చింది. హోటల్లో చేసిన పదార్థాన్ని సుందరంచేత తినిపించాలని చూసింది. మొదట సుందరం మోహమాటపడి తెప్పించిందల్లా తిన్నాడుగాని, తరువాత ఎదురు తిరిగాడు. ఆవిడకు కోపం వచ్చింది. రానిమ్మనుకున్నాడు సుందరం.

ఇంతకూ కిశోర్ దగ్గిర పదిరూపాయలు నోటున్నది. అందుచేత హోటలు బిల్లు రూపాయిపావలా చెల్లించటానికి సుందరం డబ్బు తియ్యవలసి వచ్చింది. సుందరం దగ్గిరా పదిరూపాయలనోటు వుంది.

"ఫరవాలేదులే మార్చు నాయనా, ఇంటికిపోగానే యిస్తాను" అన్నది శ్యామలగారు.

దగ్గిరలోనే ఎస్ప్లనేడ్ థియేటర్. అందులో రాఘవాచారి "కబీర్" నాటకం. రెండు రూపాయల టిక్కెట్లుకొని నలుగురూ లోపల కూచున్నారు. శారద సుందరం పక్కనేకూచుని అయిదు నిముషాలకొసారి పమిటె సవరించుకుంటూ, పమిటె సవరించుకున్నప్పుడల్లా సుందరాన్ని మోచేత్తో పొడవసాగింది.

అసలే నాటకం హిందీలోవుంది. ఆ పైన శ్యామలగారు నాటకం విననివ్వకుండా మాట్లాడుకుపోతున్నది. ఎవరో వెనకనుంచి "కామోష్" అన్నారు. తనను కాదని శ్యామలగారికి తెలుసుకాబోలు. ఆవిడ మాట్లాడటం మానలేదు. అరవంలో వెనకనుంచి ఏవోమాటలువినిపించాయి. ఆమాటలు శ్యామలగారిమీద పనిచేశాయల్లేవుంది. మాట్లాడటం మానేసింది. కాని ఒక పావుగంట గడిచాక "నాటకం ఏడిచినట్లేవుంది. స్టేజిమీద ఆడవాళ్ళు కూడానూ పోదాం పదండి" అన్నది.

"ఏమిటమ్మా నువ్వూ?" అన్నది శారద, మోచేత్తో సుందరాన్ని పొడుస్తూ.

కిశోర్ మాత్రం తల్లి పోదామనటమే తడవుగా లేచి గేటుదాకా వెళ్ళాడు. సుందరం కూడా లేచి బయటికి వెళ్ళాడు.

నలుగురూ బస్సెక్కి శ్యామలగారింటికి ట్రిప్లికేన్ వెళ్ళారు. రూపాయికి చిల్లర లేకపోవడంవల్ల బస్సుటిక్కెట్లు సుందరాన్నే కొననిచ్చింది శ్యామలగారు. ఇంటికిపోతూనే శ్యామల తన భర్తకు సుందరాన్ని పరిచయం చేసింది. అవిడకు సుందరం పేరు జ్ఞాపకం లేదని అప్పుడు బయటపడింది.

"నీ పేరేమిటోయ్?" అన్నాడు శ్యామల భర్తగారు.

సుందరం చెప్పేదాకా శ్యామల మాట్లడలేదు.

ప్లీడరుగారు పిట్టంత మనిషి. తలమాత్రం పెద్దది. అందులో పైభాగం బట్టతల దీపం వెలుతురులో నిగనిగలాడుతున్నది. ఆఫీసు రూమూ, బీరువాలూ, లా పుస్తకాలూ పెద్దటేబిలూ అట్టహాసంగా వుంది.

"వంట అయేదాకా అట్లా బీచికి వెళ్ళోస్తారేమిట్రా?" అన్నది శ్యామల కొడుకుతో.

కిశోర్ మారుమాట్లాడకుండా సుందరంకేసి చూశాడు. సుందరం బయలుదేరాడు. ఇద్దరూకలిసి బీచికి వెళ్ళారు. బీచీ ఆటే దూరంలేదు. బీచీరోడ్డు దీపాలతో సహా సుందరానికి చాలా మనోహరంగా కనిపించింది. తల్లి పక్కన లేకపోయే సరికి కిశోర్ బాగానే మాట్లాడాడు. కాని కిశోర్ ఏ విషయం చెబుతున్నదీ సుందరానికి సరిగా అర్థమయేదికాదు. తాను చెప్పే విషయం అవతలివాడికి తెలుసునన్నట్లు మాట్లాడేవాడు కిశోర్.

"అదుగో లైట్‌హౌస్, కిందటి యుద్ధమప్పుడు ఎమ్డెన్[54] కొట్టింది హైకోర్టునేగా. గురి తప్పిందిగాని, లైట్‌హౌస్, పోవలసిందిగాదూ?"

---

54. 1914 సెప్టెంబరు 22వ తేదీ జర్మన్ ఓడ ఎమ్డెన్ మద్రాసు నగరానికి నష్టం కలిగించింది.

"అవును" అన్నాడు సుందరం, విషయమేమీ తెలీకుండానే.

❀ ❀ ❀ ❀

సుందరం శ్యామలగారింట్లో ఒకరోజల్లా ఉన్నాడు. వాళ్ళింట్లో తంతుచూస్తే సుందరానికి ఆశ్చర్యం వేసింది. వాళ్ళెవరూ ఆ ఇంటిని ఇల్లల్లే చూసుకోరు. హోటలల్లే చూసుకుంటారు. విడిచేసిన బట్టలు విడిచేసినచోటే ఉంటాయి. వాడిన వస్తువులు వాడినచోటే ఉంటాయి. నూనెసీసాలమీదా, స్నోలమీదా, పౌడరుడబ్బాలకూ మూతలుండవు. ఏ వస్తువుకూ ఒక ప్రత్యేక స్థలమంటూ లేదు. ఏదన్నా కావాలంటే కిందటిసారి ఆ వస్తువును ఎవరు ఎక్కడ ఉపయోగించారో ఆరాతీసి పట్టుకోవలసిందే. అందరూ ప్రతిక్షణమూ ఎక్కిడికో అర్జంటుగా వెళ్ళబోతున్న వాళ్ళల్లే ఉంటారు.

మర్నాడు సాయంకాలం అందరూ కలిసి ఎల్ఫిన్‌స్టన్‌లో జాని బారీమోర్[55] పిక్చరు చూడబోయినారు. మాటినీ షో బయట ఎండవున్న సంగతి ప్రతిక్షణమూ సుందరానికి జ్ఞాపకం వస్తూనేవుంది. కాని సినిమా బాగానేవుంది. సినిమా ఆడేటప్పుడు బాల్కనీలో వాయించిన ఇంగ్లీషు సంగీతం మరీబాగుంది.

సినిమా పూర్తి అయి బయటికి వచ్చేటప్పుడు సుందరానికి తన సహాధ్యాయి కోటేశ్వర్రావు కనిపించాడు. అతను మద్రాసులో ఇంజనీరింగు కాలేజీలో చదువుతున్నాడు.

"ఏమోయ్ సుందరం, ఎప్పుడొచ్చావు?" అన్నాడు కోటేశ్వర్రావు.

"నిన్ననే వచ్చా - కాంగ్రెసుకని" అన్నాడు సుందరం.

"మా స్నేహితుల లాడ్జికి పోదాం ఒక పూట రారాదూ?"

"పోదాంపద" అన్నాడు సుందరం.

సుందరం శ్యామలగారితో చెప్పాడు స్నేహితుడివెంట వెళుతున్నానని. శ్యామలగారికి కోపం వచ్చింది. వస్తే వచ్చింది లెమ్మనుకుని సుందరం స్నేహితుడివెంట వెళ్ళాడు.

క్రిష్టమస్ శలవుల్లో కోటేశ్వర్రావు స్నేహితుల లాడ్జిలో ఉంటున్నాడు. ఆ లాడ్జి పరశువాకం ట్రాంటెర్మినస్‌లో దాదాపు గ్లోబ్ సినిమాకు ఎదురుగా వుంది. కోటేశ్వర్రావు స్నేహితులు నలుగురూ చాలా సరదా అయినవాళ్ళు. సుందరానికి ఒక్క క్షణమైనా కొత్త అనిపించకుండా చేశారు. వాళ్ళ నలుగురికీ కలిపి ఇద్దరునౌకర్లు. ఏదికావలసినా వెంటనే తెప్పించేవాళ్ళు. సుందరం కట్టుబట్టలతో బయల్దేరాడు. కోటేశ్వర్రావు స్నేహితులు అతనికి తమ బట్టలిచ్చి, అతని బట్టలు లాండ్రీకి అర్జంటువాషుకు పంపారు.

55. జానీబారీమోర్ (1882-1942): అసలు పేరు బ్లిక్. హాలీవుడ్ నటుడు. ప్రహసనాల్లో తొలి రోజుల్లో, నటించేవాడు. డాక్టర్ ఓకిల్‌మిష్టర్ హైట్ (1922)లో నటించాడు. హామ్లెట్ (1924) నటనతో ప్రఖ్యాతి పొందాడు. డాన్ జాన్ (1926), ది బిలివడ్ రోగ్ (1927) మొదలైన చలన చిత్రాల్లో నటించి ప్రఖ్యాతి పొందాడు.

ఆ రాత్రి సుందరం తన కొత్తస్నేహితులతో కలిసి గ్లోబులో "హారోల్డు లాయిడ్', సినిమా చూశాడు. మర్నాడు వాళ్ళతో కలిసి మద్రాసు నగరమంతా తిరిగాడు బస్సుల్లో.

సుందరం మళ్ళీ శ్యామల ఇంటికిగాని, కాంగ్రెసు పెండాలు కేసిగాని వెళ్ళలేదు. డిసెంబరు 31 రాత్రి మెయిల్లో తిరిగిపోదామనుకున్నాడు. కాని ఆ రాత్రీ 12 గంటలకు చర్చిగంటలు వినమని స్నేహితులు బలవంతపెట్టారు ఆరాత్రి సుందరం చర్చిగంటలు విన్నాడు. పాత సంవత్సరం వెళ్ళిపోతున్నందుకూ, కొత్త సంవత్సరం వస్తున్నందుకూ చర్చి గంటలు మోగాయి.

"నువు కిందటేడు వచ్చావు. ఈయేడు వెళుతున్నావు" అని పరిహాసమాడారు స్నేహితులు. జనవరి 1 రాత్రి సుందరం మెయిలెక్కి ఇంటికి బయలుదేరాడు.

## 26

అందరి సలహాలూ త్రోసిపుచ్చి సుందరం కాశీవెళ్ళ నిశ్చయించాడు. వాడు బియ్యే పాసుకాగానే వాడిచదువు అయిపోయినట్టు అందరూ భావించారు. అందరికన్నా పెద్ద నిట్టూర్పు విడిచింది సీతమ్మగారు. చాలాకాలంగా వాడి చదువుతోపాటు ఆవిడ మనోవ్యాధికూడా పెరుగుతూ వచ్చింది. ఈ చదువు సుందరం సంపాదనకు అడ్డంగా ఉండటమేగాక అప్పుకూడా పెంచుతుండె. ఇక ఖర్చుపద్దు మూసేసి జమపద్దు తెరవొచ్చునని ఆవిడ సంతోషించింది.

ఒక సీతమ్మగారేకాదు. సుందరం అత్తగారు, మామగారు, లక్ష్మి, లక్ష్మి తమ్ముళ్ళూ, శేషగిరి మామయ్యా, నరుసూ, జానకి, ఇతర బంధువులూ, స్నేహితులూ, బంధువులూ స్నేహితులూకాని పరాయివాళ్ళూకూడా. "ఇక ఏం ఉద్యోగం చేస్తావు?" అని సుందరాన్ని అడగటం, సుందరానికి మంచిరోజులు అయిపోయి చెడ్డరోజులు ఆరంభమవుతున్నట్టూ సంసారభారమంతా మీదపడుతున్నట్టూ మాట్లాడటం.

కొద్దిరోజులపాటు సుందరం ఈ సంభాషణలన్నీ విని బెల్లంకొట్టిన రాయిలాగా ఊరుకున్నాడు. తన చదువు అయిపోగూడదన్న ఆవేదనతోపాటు జీవితాన్ని చూస్తే భయంకూడా వాణ్ణి ఆవేశించింది. ఈ భయంవాడికి తెచ్చిపెట్టినవాళ్ళు వాడి భవితవ్యాన్ని గురించీ మాట్లాడినవాళ్ళే.

సుందరం పసివాడై ఉండగా, వాడికి చదువు గురించీ, బడి గురించీ భయపెట్టిపోతారేమో అని ఒకప్పుడు సీతమ్మ వెయ్యికళ్ళతో కనిపెట్టి వుండి కాపాడింది. కాని పదిహేనేళ్ళ అనంతరం ఆ సుందరానికే జీవితం గురించి భయం కలగకుండా కాపాడేవాళ్లు కరువైనారు. వాడు ఏ పక్క తిరిగినా జీవితసముద్రంలో పడి ఈదలేకుండా కొట్టుకుంటున్న వాళ్ళే కనిపించారుగాని, జీవిత శిఖరాన్నెక్కి ణాలు చేసేవారు కనిపించలేదు. అటువంటివాళ్లు కొందరు కనిపించినా

తనుకూడా తోటి వాడేనన్న విశ్వాస  సుందరానికి కలిగేటట్టు చేసినవారు అసలే లేరు.

"ఈ రోజుల్లో బియ్యే డిగ్రీకి రోలీ విలువలేదు... ఎందుకొచ్చిన చదువులు? నాలుగురాళ్లు తెచ్చినవాడు ప్రయోజకుడు... డబ్బు సంపాదించే యోగమేవుంటే అక్షరంముక్క రానక్కరలేదు..." ఈ రకం మాటలు సుందరం మనస్సులో ఎటువంటి పరివర్తన కలిగిస్తున్నదీ ఎవరూ ఊహించలేదు. వాళ్ళంతా డబ్బుకిచ్చే ప్రాముఖ్యం సుందరానికి రుచించలేదు. సంస్కారహీనులంతా మాట్లాడే పిరికి మాటలు - ఓటమితత్వం వాళ్ళూ వెల్లడిస్తున్నారు. అందులో ఏముంది? డబ్బు సంపాదనకు బియ్యే డిగ్రీచాలదని వీళ్ళే అంటున్నారు. గనక -

"నేను బెనారస్ వెళ్లి ఏమ్మే, ఎలెల్బీ చదువుతా" అన్నాడు సుందరం.

అంతా నిర్ఘాంతపోయినారు. సీతమ్మగారి గుండె పగిలినట్లయిపోయింది. ఇంకా రెండేళ్ళా? మళ్ళీ రెండువేలు ఖర్చా? ఎవరిస్తారు అప్పు?

అప్పు ఎవరిస్తారో, ఎవరు తెస్తారో సుందరానికి పట్టలేదు. తాను చదువుకుంటా నన్నంతవరకు చదువు చెప్పించే భారం తన తల్లిమీద ఉందని వాడు గట్టిగానమ్మాడు. ఆవిడ శక్తిసామర్ధ్యాలతో వాడికి ప్రసక్తిలేదు. పట్టాభి ఎమెస్సీ చదవటానికి కాశీవెడుతున్నాడు. సోమయాజులు ఎమ్మే, ఎలెల్బీ చదవటానికి కాశీ వెళుతున్నాడు. తానుకూడా వెళ్ళితీరాలిసిందే.

సుందరం పట్టు గట్టిపట్టని తెలిసినాక ముందు మామగారు మెత్తబడ్డాడు. తరవాత శేషగిరి మెత్తబడ్డాడు. సీతమ్మగారు దిమ్మెరపోయి ఉన్నది. ఆవిడలో మెత్తబడేదేమీ మిగలలేదు.

రేపు ప్రయాణమనగా కిందటిరాత్రి లక్ష్మి సుందరాన్ని గట్టిగా కావిలించుకుని ఏడిచింది.

"ఎక్కడి బెనారస్! మళ్ళీ ఎన్నాళ్ళకు కనిపిస్తారు?" అని లక్ష్మి అల్లాడింది.

తనను విడిచి ఉండలేని ప్రేమతోనే లక్ష్మి బాధపడుతున్నదని నమ్మాలనిపించింది సుందరానికి. కాని అటువంటి నమ్మకం కలగలేదు. లక్ష్మి తెలివైన పిల్ల. అయితే ఈ బాధ తనకున్నదాంట్లో కొంత అయినా మొగుడి కుంటుందని ఊహించి ఆ బాధను బయట పెట్టనిచ్చి వుండేది. కాని లక్ష్మి తన బాధను పూర్తిగా బయటపెట్టటంలో సుందరానికి కొంచెం అలుసయింది. లక్ష్మి తన విషయమే ఆలోచించటంవల్ల వాడుకూడా అచ్చగా తన విషయమే ఆలోచించుకున్నాడు.

"నేను ఎమ్మే, ఎలెల్బీ డిగ్రీలు తెచ్చుకుంటున్నానని నీకు విచారమా?" అని అడిగాడు సుందరం. ఆ మాటకు లక్ష్మి గుండె ఎట్లా గాయపడేదీ వాడూహించలేదు. గాయపడుతుందని అయినా లక్ష్యపెట్టలేదు. సుందరం వెళ్ళిపోయిన తరవాత కొన్ని రోజులపాటు లక్ష్మికి ఈమాట జ్ఞాపకం వచ్చినప్పుడల్లా ఏదో శూలంపెట్టి

పొడిచినట్టుగా బాధ కలుగుతూ ఉండేగి. ఏదో పని చేసుకుంటూ కళ్ళవెంబడి గిర్రున నీరు తిరిగి ఎవరూ చూడకుండా కళ్ళు తుడిచేసుకునేది.

❀ ❀ ❀ ❀

ఇటార్సీ నైనీ మీదుగా సుందరమూ, స్నేహితులూ కాశీ చేరారు. చదువుకోసం కాలినడకను కాశీ వెళ్ళిన ఏ పూర్వీకుడి రక్తమో సుందరం రక్తనాళాల్లో చిందులు తొక్కింది. ఈ రెండురోజుల పైచిల్లర ప్రయాణం వాణ్ణి చదువుకు దగ్గిరగా తీసుకుపోవటమేకాక జీవితానికి కూడా దూరంగా తీసుకుపోతున్నదన్న ఆనందం కలిగింది.

బెనారస్ కాంటన్మెంట్ స్టేషనులో దిగంగానే ఇంకో ప్రపంచంలోకి అడుగు పెట్టినట్టయింది. కొత్తరకం మనుష్యులూ, అర్థంకాని భాషా, అనంతశయనాలల్లే ఎక్కాలూ, ఏనాడో సెకండుఫారం ఇంగ్లీషు పుస్తకంలో చదువుకున్న టోంగాలూ, ఎన్నడూ తినిఎరగని తినుబండారాలుగల దుకాణాలూ, చా, "బాజూ, కినారే" అంటూ అరిచే బళ్ళవాళ్ళ కేకలూ – ఇదంతా సుందరానికి చదువులో ఒకభాగంగా తోచింది గాని, జీవితంలో భాగంగా తోచలేదు. దారి పొడుగునా తింటూ వచ్చిన రొట్టెలూ, అలూతర్కారీ, సమూసా, కిచోడీ మొదలైనవి చదువులో కొత్తరకం పాఠాలల్లే కనిపించాయి. గాని ఇవే కొంతకాలంపాటు తన వాస్తవ ఆహారం కానున్నవని వాడు తెలుసుకోలేదు.

సుందరానికిగాని వాడివెంట బయల్దేరివచ్చిన పట్టాభికిగాని, సోమయాజులుకు గాని ఒక్కముక్క హిందీరాదు. కాశీ వెళుతున్న ఇతర తెలుగు విద్యార్థులుకూడా వాళ్ళకెక్కడాతగల్లేదు.

"ఇదేమిటోయ్, ప్రారబ్ధం. మనం తప్ప హిందూ యూనివర్సిటీలో తెలుగు వాళ్ళే ఉండరేమో" అన్నాడు సోమయాజులు.

"బోలెడుమంది ఉన్నారు" అన్నాడు పట్టాభి.

అదివరకు వీళ్ళు ముగ్గురూ అంత ఆప్తస్నేహితులు కాకపోయినా కాశీలో అడుగు పెట్టేసరికి వాళ్ళు ఒకళ్ళ కొకళ్ళు అత్యంత ఆప్తులైనారు. వాళ్ళకిది పునర్జన్మలాగా ఉంది. పాత స్నేహితులేగాక, దగ్గిర చుట్టాలూ, ఇళ్ళూకూడా ఏ లోకంలోనో ఉన్నట్టు తోచింది. కాశీలో ఉన్నంత కాలమూ ఇట్లాగే ఒకరికొకరు ఎంతోసన్నిహితంగా ఉంటామని వాళ్ళూహించారు. మర్నాడీపాటికి తలా ఒకదారీ అయిపోయి కొత్తస్నేహితుల్ని సంపాదించుకుంటామని వాళ్ళూహించలేదు.

ముగ్గురూ కలిసి టోంగా చేసుకుని యూనివర్శిటీకి వెళ్ళారు. యూనివర్శిటీ భవనాలు చాలా అద్భుతంగా కనిపించాయి. టోంగా మొదటి హాస్టలు ముందాగింది. ఎవరో హాస్టలు వరండాలోనుంచి, "తెలుగువాళ్ళేరా!" అని కేకేశాడు.

"రండి బాబూ! రండి."

పెళ్ళికి విడిది దిగినవాళ్ళ వ్యవహారంగా ఉందిగాని, సుందరానికి తాము విద్యార్థులమనీ, చదవవచ్చామనీ, అనిపించలేదు. వార్డెనెవరో తెలీదు. సెక్రటరీ ఎవరో

తెలీదు. ఎవరో చౌకీదారు వచ్చాడు. మూడు గదులు తెరిచి ముగ్గురికీ యిచ్చేశాడు. స్నానాల గదుల్లో స్నానాలు చేశారు. బన్యామహారాజు దగ్గిరికి ఈ ముగ్గుర్నీ పట్టుకెళ్ళి "భోజనం" పెట్టించారు పాత విద్యార్థులు.

కాని అదేం భోజనం! అదేం కూర! అదేం పచ్చడి! లెక్కపెట్టి నాలుగు మెతుకులు అన్నం పెట్టాడు. "మహారాజు" నెయ్యి చెప్పతరంగాని దుర్వాసన. కూరల్లో వేసినది ఆవనూనె అని తరవాత తెలిసింది. కనీసం మూడు నెలలపాటు తనకిదే తిండి అని అర్థం చేసుకోవటానికి మూడు పూటలు పట్టింది. తీరా అర్థమయినాక చెప్పనలవికాని విచారం ముంచుకొచ్చింది.

ఇతరత్రా సుందరానికి జీవితం బాగానే వుంది. చాలామంది తెలుగువాళ్ళ పరిచయమయింది. అందులో కొందరు సుందరంతో చుట్టరికాలుకూడా కలిపారు. సాయంకాలంపూట సుందరం యితర స్నేహితులతో కలిసి యూనివర్శిటీలో వున్న భవనాలన్నీ, మాలవ్యాభవనం, ఆడవాళ్ళ హాస్టల్‌తోసహా తిరగవేసి, రామనగరుకు ఎదురుగట్టున గంగాస్నానం చేసి పొలాలమధ్యగా పడి తిరిగి హాస్టలు చేరుకున్నాడు. హాస్టలు గదులు పైకి పటారం లోపల లొటారం. గదులు పరిచినరాయి ఎటువంటిదోగాని ఎంత ఊడ్చినా మట్టివస్తూనే ఉంటుంది. యూనివర్శిటీ భవనాలు కట్టించిన ఇంజనీరు పోతూపోతూ యూనివర్శిటీకి లక్షరూపాయలు విరాళం యిచ్చి వెళ్ళినట్టు ఎవరో సుందరానికి చెప్పారు.

త్వరలోనే సుందరం హిందూ యూనివర్శిటీని ప్రేమించటం నేర్చుకున్నాడు. వాడి అభిమానాన్ని చూరగొన్నది మాలవ్యా ఘనతకాదు, భవనాల వైశాల్యంకాదు, అధ్యాపకుల ప్రజ్ఞకాదు, లేడీ హాస్టలులోని అమ్మాయిల సౌందర్యంకాదు, బన్నీ మహారాజుపెట్టే పూరీలు, రస్ తర్కారీ, బంటాతర్కారీ వగైరాకాదు... స్వాతంత్ర్యం. ఆ రోజుల్లోనే దాదాపు రెండువేలమంది విద్యార్థులు అక్కడ చదివేవారు. అందులో ఎన్నో భాషలవాళ్ళు, ఎన్నో రాష్ట్రాలవాళ్ళుండేవాళ్ళు. ఒక్క ముస్లిములు తప్ప మిగతా అన్ని మతాలవాళ్ళూ ఉండేవాళ్ళు. రాజకీయ సిద్ధాంతాలకు అంతేలేదు. ఎక్కువమంది కాంగ్రెసు అభిమానులే అయినా, మిగిలిన రాజకీయ భావాలవాళ్లు కూడా ఉండేవాళ్లు. మహారాష్ట్రులలో చాలామంది హిందూమతాభిమానులు. బెంగాలీలలో ఒకరిద్దరు విప్లవవాదులున్నట్లు కూడా సుందరం విన్నాడు. అందరితోబాటు కొందరు సి.ఐ.డీ.లు కూడా ఉన్నారని చెప్పుకున్నారు. ఎంతమందివున్నా ఎవరి భావాలు వాళ్ళు బాహాటంగా ప్రకటించేవాళ్ళు. ఆనాటి భారతదేశానికి సరి అయిన ప్రతినిధి కాశీ హిందూ విశ్వవిద్యాలయం. హిందూ జాతీయత తనకుగల అన్ని స్వరూపాలలోనూ అక్కడ తాండవించింది.

సుందరం పుస్తకాలు కొన్నాడుగాని చదవలేదు. చదవటం కోసం వచ్చినవాడు విశ్వవిద్యాలయ వాతావరణంలో జీవించసాగాడు. వివిధ ప్రజ్ఞలుగల వివిధ రాష్ట్రాలవారితో స్నేహమూ, రోజూ సాయంకాలంపూట చుట్టుపక్కల పొలాల మధ్యగా షికారు వెళ్ళటమూ, లేకపోతే ఏ ఎక్కామీదనో "చౌక్" వెళ్ళటమూ, అక్కడినుంచి గంగాఘాటుకో, ఔరంగజేబ్ మీనారెట్‌లు ఎక్కటానికో, సినిమాకో వెళ్ళటమూ, ఏమీ

తోచకపోతే "దాల్‌మండీ" ఇటునుంచి అటునడుస్తూ పై అంతస్తులలో కనిపించే అప్సరసలను చూసి ఆనందించటమూ, క్లాసులు జరిగే సమయంలో లైబ్రరీకి వెళ్ళి అక్కడ వుండే డజన్లకొద్దీ పత్రికలు చదవటమూ, గంగాస్నానము చెయ్యటమూ, విశ్వేశ్వరాలయానికి వెళ్ళటమూ ఈ విధంగా గడిచింది కాలం.

మహారాజుపెట్టే తిండిని ఎంత అసహ్యించుకున్నా అది సుందరం తత్వానికి చాలా బాగా పడింది. సుందరం ఒంట్లో జవసత్వాలు నానాటికీ విజృంభిస్తున్నాయి. నేలమీద నడవాలనిపించేదికాదు. ఆకాశంలో ఎగరాలనిపించేది. ఒక్కొక్కసారి లక్ష్మికోసం ప్రాణం కొట్టుకుపోయేది. అటువంటప్పుడుకూడా ఈ వాతావరణంమీద అసహ్యంవేసి, ఇంటికి పోదామనిపించేదికాదు. లక్ష్మికూడా ఇక్కడే తనతో ఉండరాదా అనిపించేది.

ఇంక చలికాలం ఆరంభించబోతున్నదనగా ఒకనాడు సుందరం మరికొందరు స్నేహితులతో పడవషికారు బయలుదేరాడు. రాంనగరునుంచి డఫ్రిన్ బ్రిడ్జిదాకా వెళ్ళి తిరిగి రావటానికి పడవ మాట్లాడారు. ఘాట్లదగ్గిరికి వెళ్ళేటప్పటికే చీకటిపడింది. మణికర్ణికలో శవాలు కాలుతున్నాయి. సుందరం స్నేహితులతోసహా హాస్టలుకు తిరిగివచ్చేసరికి పదకొండుదాటింది. లైట్లు ఆరిపోయాయి. ఆకలి దహిస్తున్నది. ఎప్పుడో పొద్దున తొమ్మిదిన్నరకు తిన్నతిండి. ఆకలికితోడు చలికూడా వేస్తున్నది. ఈ ఆకలితోనూ చలితోనూ తెల్లవారేదాకా ఎట్లాగా అని విచారిస్తూ సుందరం తన గదితలుపులు తెరిచాడు. తఖ్తీమీద తలవేపున తడివి టార్చితీసి వెలిగించే సరికి ఒక్కసారిగా ప్రాణం లేచివచ్చింది. తన కుర్చీమీద థాలీ పెట్టిఉంది. రొట్టెలూ, రెండు కటోరీలలో రస్‌తర్కారీ ఉంది! బన్సీమహారాజు వెయ్యేళ్ళు వర్ధిల్లాలి! భగవంతుడు ఆపత్సమయంలో బన్సీమహారాజు రూపంలోనే ప్రత్యక్షమవుతాడు ఆర్తులకు!

రొట్టెలూ, తర్కారీకూడా చప్పగా చల్లగా ఉన్నాయి. ఉంటేనేం? ఆరస్ తర్కారీలో అమృతం వేసి వండాడు మహారాజు. ఇందులో ఇంత రుచి వుందని తనకు ఇదివరకల్లా ఎందుకు తెలీలేదు?... ఆ రోజు లగాయతు సుందరం తిండిలో హిందీ వాళ్ళతో చేరిపోయినాడు. ఏదైనా రుచి మరిగే దాకానే చిక్కు. ఆ తరవాత ఏ ఇబ్బందీ ఉండదు.

❀ ❀ ❀ ❀

సుందరం కాశీలో చాలా విషయాలు చూశాడు. పనిచేసుకునేవాళ్ళ గుడిసెల్లో కుక్కిమంచంతప్ప ఇంకేమీ లేకపోవటం చూశాడు. రెండేఇళ్ళూ. ఒక మోటబావీగల గ్రామాలు చూశాడు. చిరిచాప ప్రమాణంగల పొలాన్ని కటిక పేదరైతు పిల్లలను సాకినట్టుసాకి అందులో ఒక పంట తరవాత మరొకటి పండించటం చూశాడు. శనగచేలకు కాపలా లేకపోవటమూ, విద్యార్థులు శనక్కాయలు పీక్కుంటుంటే అడిగేవాళ్ళు లేకపోవటమూ చూశాడు. ప్రతి మనిషీ వస్తాదులాగా వ్యాయామం చెయ్యటమూ, కర్ర చేతపట్టుకు తిరగటమూ, గర్భదరిద్రులలో కూడా నిజాయితీ, ఆత్మాభిమానమూ చూశాడు. కాలేజీ విద్యార్థులు ఎక్కాలెక్కి హాస్టళ్ళుచేరి వాళ్ళకి డబ్బు

సరిగా ఇవ్వకపోగా తన్నటం చూశాడు. రోడ్డుమీద ఎదురయ్యే ఇద్దరు పాతవిరోధులు మాటా పలుకూ లేకుండా కర్రలు తీసుకొని కొట్లాడుకోవటమూ, చుట్టుపక్కలవాళ్ళు చుట్టూమూగి ఇద్దరిమధ్యా అన్యాయం జరగకుండా చూడటమూ, చివరకు ఇద్దరూ ఎవరి దారినవారు పోవటమూ అనేక పర్యాయాలు చూశాడు. అక్కడివాళ్ళు మంచినీళ్ళు తాగటానికీ "చా" తాగటానికీ "మట్కాలు" ఉపయోగించటమూ వాడినవెంటనే వాటిని పగలగొట్టి తద్వారా మట్టిపిడతల పరిశ్రమను ప్రోత్సహించటమూ చూశాడు. యు.పి.లో రైలుస్టేషన్లలో హిందూ చా, ముసల్మానీ చా, హిందూపాన్, ముసల్మానీ పాన్ విడివిడిగా అమ్మటం చూశాడు; ముసల్మానీ పాన్ తాను స్వయంగా వేసుకుని ముక్కూమొహం ఎరగని హిందువుడిచేత చీవాట్లుపడ్డాడు. అన్నిటికన్నా విచిత్రమైనసంగతి, సుందరం కాశీలో ఎక్కాతోలుకునే బియ్యేను చూశాడు. ఆ అబ్బాయి నిజంగా బియ్యే పాసయినాడో, లేక ఏ మెట్రిక్కో పాసయితే ఆనోటా ఆనోటాపడి బియ్యే అయిందో సుందరం ఎరగడు.

అదివరకల్లా చదువుమీద ఉంటూవచ్చిన అభిమానం కాశీకి రాగానే జీవితంమీదికి ఎందుకు మళ్ళిందో సుందరం ఊహించలేక పోయినాడు. తన చుట్టూగల వాతావరణం పూర్తిగా కొత్తదికావటంవల్ల కావచ్చు. తన పరిసరాలలోకి వచ్చిన విద్యార్థుల చిత్ర విచిత్రమైన ప్రభావాలు తనమీద పరిపి ఉండవచ్చు. ఉదాహరణకు: కాశీ విశ్వవిద్యాలయంలో మొదటిసారిగా కారమ్స్ ఆట చూడటమేగాక ఆ ఆట అద్భుతంగా ఆడే బీహారువాళ్ళను చూశాడు. కాశీనగరంలో మొదటిసారిగా హిందూస్తానీ సంగీతం వినటమేకాక దేవాలయాలలో అద్భుతమైన సన్నాయి విన్నాడు. ఒక మహారాష్ట్రపు కుర్రాడు అత్యద్భుతంగా హార్మోనియం వాయించగా విన్నాడు. ఇంకో మహారాష్ట్రుడు అంతకన్న అద్భుతంగా ఫిడేలు వాయించటం విన్నాడు. అంతకు పూర్వం విన్నది హార్మోనియం వాయింపూ, ఫిడేలు వాయింపూ కానేకాదని తోచింది సుందరానికి.

అంతకు పూర్వంకూడా సుందరం రాజకీయ వాతావరణం చూశాడుగాని, అందులో అమాంబాపతువాళ్ళు ఉండటమూ, వాళ్ళకి రాజకీయ విశ్వాసాలకన్న, రాజకీయ మూఢవిశ్వాసాలెక్కువ ఉండటమూ జరిగేది. ఈ విశ్వవిద్యాలయ వాతావరణంలో తప్పాతాలూ చాలా తక్కువ. రాజకీయ భావాలు బొత్తిగా లేనివాళ్ళున్నప్పటికీ ఉన్నవాళ్ళలో రాజకీయ పరిజ్ఞానం పూర్తిగావుంది. చాలామంది విద్యార్థులు చింతామణిగారి "లీడర్"[56] పత్రిక శ్రద్ధగా చదివేవాళ్ళు.

సాహిత్యంలోకూడా తనకన్న చాలారెట్లు బాగా చదివినవాళ్ళతో సుందరం పరిచయం చేసుకున్నాడు. సూర్యనారాయణ అని ఒకతను అచ్చుగా ఎలెల్బీ చదువుతూండేవాడు. అతనిదగ్గిర బెర్నార్డుషా, ఇబ్సెన్‌ల నాటకాలూ, వెల్స్ నవలలూ ఉండేవి. సుందరం ఒక్కొక్కటిగా ఇవన్నీ చదివేశాడు. ఈ పుస్తకాలతో సుందరానికి

56. చింతామణిగారి లీడర్ పత్రిక: సి.వై. చింతామణి (1880-1941): ప్రపాత్రికేయుడు 1927-36లో లీడర్ పత్రిక సంపాదకులుగా వున్నారు.

కొత్త వికాసం వచ్చినమాట నిజమేగాని అదివాణ్ణి జీవితానికి అటే సన్నిహితంగా తీసుకురాలేదు. జీవితం గురించి కొన్ని అభిప్రాయాలను మటుకు వాడు సంపాదించాడు. ఇవి తన స్వంత జీవితానికి ఎంతవరకు ఉపకరిస్తాయో వాడికీ తెలియదు.

సుందరం డిసెంబరు శలవులకు ఇంటికి వచ్చాడు. లక్ష్మికి పరమానందమయింది. సుందరానిక్కూడా చేసినతప్పు దిద్దుకున్నట్టనిపించిందిగాని, కాశీ విశ్వవిద్యాలయ వాతావరణంనుండి ఇక్కడకువస్తే వాడికి ఊపిరాండలేదు. లక్ష్మిని ఎట్లాగైనా కాశీ తీసుకుపోగలిగితే తన ఆనందానికి కళంకం వుండదనిపించింది. కాని అది ఎట్లా సాధ్యమవుతుంది? తన మామూలు ఖర్చుకే డబ్బు చాలీచాలకుండావుంది. తాను స్వయంగా పెట్టుకోలేని ఖర్చులు అనేకం తన స్నేహితులు పెడుతున్నారు.

ఒకసారి ఇద్దరు ముగ్గురు విద్యార్థులు అలహాబాదు బయలుదేరుతూ సుందరాన్ని కూడా రమ్మన్నారు. వాడిదగ్గిర డబ్బులేదు.

"నీ దగ్గిర డబ్బులేకపోతే మేమంతా దివాలా తీశామనుకున్నావా?" అన్నారు వాళ్ళు.

సుందరం వాళ్ళతో బయలుదేరి అలహాబాదు వెళ్ళాడు. అక్కడ హాస్టల్ విద్యార్థుల్లో ఎవరో సుందరం వెంటవచ్చిన వారిలో ఒకర్ని ఎరిగిన వాళ్ళు - అందరికీ ఆతిథ్యం ఇచ్చారు. అలహాబాద్‌లో రెండు రోజులు గడిపి సుందరం నగరంలో చాలాప్రాంతాలు చూశాడు. మోతీలాల్ నెహ్రూ ఉండే ఆనందభవనం, ఆయన కాంగ్రెసుపరం చేసిన స్వరాజ్య భవనం, పురుషోత్తమదాసు పార్కూ, ఒక కాశీమజిలీ లాంటి హిందీ నాటకం, జాన్‌బోల్స్ నటించిన "డెజర్ట్ సాంగ్" అనే కొత్తటాకీ చూశాడు. అందరూకలిసి బోటులో త్రివేణీ సంగమానికి వెళ్ళారు. బోటులో నిలబడి ఒకపక్క గంగనీరు తెల్లగానూ, రెండోపక్క యముననీరు నల్లగానూ ఉండటం సుందరం కళ్ళారా చూశాడు. ఇట్లా కనిపిస్తుందని ఎవరో చెప్పినప్పుడు వాడు నమ్మలేదు.

❀ ❀ ❀ ❀

సుందరం కాశీలో గడిపిన రెండో సంవత్సరం దేశానికే ఎంతో ప్రాముఖ్యంగలది. ఆయేడే వైస్రాయిని చంపటానికి టెర్రరిస్టులు[57] ప్రయత్నించారు. లాహోరు కుట్ర జరిగింది. కాశీ విశ్వవిద్యాలయంలో చదువుతూ వెళ్ళిపోయిన విద్యార్థి ఒకడు కుట్రదారుకింద అరెస్టయినట్టు పత్రికల ద్వారా తెలిసింది. విద్యార్థుల్లో చెప్పరాని చైతన్యం తలఎత్తింది. జవహర్‌లాల్ నెహ్రూ భారత స్వాతంత్ర్యాన్ని ప్రకటిస్తూ జెండా ఎత్తాడు. ఏ విద్యార్థిని చూసినా "ఝండా ఊంఛా రహే హమారా"

---

57. ట్రెయిన్‌లో వెళుతున్న లార్డు ఇర్విన్‌పై ఢిల్లీవద్ద 1929 డిసెంబరు 23వ తేదీ బాంబు దాడి జరిగింది.

పాడేవాడే. గాంధీ మహాత్ముడు ఉప్పు సత్యాగ్రహం[58] ప్రారంభించాడు. గణేశ దామోదర సావర్కార్[59] విశ్వవిద్యాలయానికి వచ్చి, "గాంధీ పిచ్చివాడు. తెల్లవాళ్ళు ఎప్పటికైనా పోయేవాళ్ళే. ఇక్కడే ఉండి మనను ఎల్లకాలం పీడించే శత్రువులు ముసల్మానులు. వాళ్ళను నిర్మూలించాలి. అందరు హిందూ యువకులూ కసరత్తుచేసి, కండలు పెంచండి" అని సలహా ఇచ్చాడు.

ఈ మాటలు వింటుంటే సుందరానికొక సంఘటన జ్ఞాపకం వచ్చింది. కిందటేడు అలీఘర్ విశ్వవిద్యాలయంనుంచి కొందరు ముస్లిం విద్యార్థులు కాశీ విశ్వవిద్యాలయం చూడవచ్చారు. వారు హాస్టల్ వరండాలమీదుగా సిపాయిల్లాగా బారుతీర్చి నడవటం సుందరం చూశాడు. వాళ్ళ నడవడికా, అవతారాలూ ఎంతో నాగరికంగా కనపడ్డాయి. కాశీ విశ్వవిద్యాలయంనుంచి ఒక పాతికమంది విద్యార్థులు అలీఘర్ వెళ్ళితే ఇట్లా ప్రవర్తించేవారని సుందరం నమ్మలేకపోయినాడు. ఇటువంటి ముస్లిములు మనస్వాతంత్ర్యానికి ప్రతిబంధకులన్నది సుందరం నమ్మలేకపోయినాడు. ప్రత్యక్షంగా మనని రాజకీయ దాస్యంలో ఉంచిన బ్రిటిషువారిని గురించి ఆలోచించవద్దంటూ, వారిపైన శాసనోల్లంఘనాన్ని ప్రయోగిస్తూ దేశాన్నంతా కదిలించే గాంధీనీ, బ్రిటిషువారిని సాగనంపడానికి ప్రాణాలు బలియివ్వ సిద్ధంగావున్న భగత్సింగ్[60], దత్తు[61] మొదలైన ధీరుల్ని అవమానించాడు గణేశ దామోదర సావర్కార్.

ఏమైనాదేశం యథార్థ జాతీయోద్యమానికే చలించింది. ఒకరోజు తెల్లవారు జామున చలికి వణుకుతూ సుందరం నిద్రలేచేసరికి గదిలో ఒక కాగితం కనిపించిది. టైము నాలుగు దాటింది. లైటు వచ్చి ఉండటంవల్ల సుందరం స్విచ్‌వేసి కాగితం చదువుకున్నాడు. అది టెర్రరిస్టులు ప్రచురించిన కాగితం. ఈ సమయానికే

---

58. ఉప్పు సత్యాగ్రహం: 1930 మార్చి 12 వ తేదీ ఉప్పు చట్టానికి వ్యతిరేకంగా సముద్రతీరంలో ఉప్పు తయారుచేయడానికి గాంధీ జరిపిన దండియాత్రతో మొదలైన ప్రజాఉద్యమం.

59. గణేశ దామోదర సావర్కార్: వినాయక దామోదర్ సావర్కార్ (1883 - 1966) తమ్ముడు. "ఇంగ్లీషువాళ్ళు ఇవాళ కాకపోతే రేపు పోతారు. మనలో వుండే శత్రువులు ముస్లిములు" అని కుటుంబరావు కాశీ విశ్వవిద్యాలయంలో చదివే రోజుల్లో ఒకరోజు ఉపన్యసించినట్లు కె.కె 'నా కాలేజీల్లో నేను', అనే వ్యాసంలో రాశారు.

60. భగత్‌సింగ్: (1907 సెప్టెంబరు, 27-1931 మార్చి, 23): స్వాతంత్ర్యానికి మించి సమసమాజ సంస్థాపన గురించి కలలుగని, కార్మిక కర్షకోద్యమాల ద్వారానే భారతదేశంలో సమసమాజం సాధ్యమని నమ్మిన భారతీయ విప్లవవీరుడు. 1929లో సెంట్రల్ అసెంబ్లీలో రెండు దుష్ట ముసాయిదా బిల్లుల్ని శాశ్వత చట్టాలుగా చేసే ప్రయత్నాన్ని వ్యతిరేకిస్తూ, సెంట్రల్ అసెంబ్లీపై తన అనుయాయులతో కలిసి "చెవిటివాళ్ళకు సైతం" తమ సందేశాన్ని వినిపించేందుకు బాంబు ప్రయోగం జరిపి, ధైర్యంగా నిలబడి తమ కరపత్రాన్ని చదువుతూ అరెస్టయ్యారు. రెండేళ్ల కేసు విచారణ తతంగం జరిపి 1931 మార్చి లాహోర్ సెంట్రల్ జైలులో భగత్‌సింగ్, రాజగురు, సుఖదేవ్‌లను బ్రిటిష్ పాలకులు ఉరితీశారు.

61. దత్తు: భగత్‌సింగ్ అనుయాయి.

పక్కగదిలోవాడు వచ్చి తలుపు తట్టాడు. ఇద్దరూ రగ్గులు కప్పుకుని తఖ్తమీద కూచుని కాగితాలు చివరంటా చదువుకున్నారు.

"గాంధీజీ కేవలం నైతికబలంతో బ్రిటిషువారి నెదిరించమంటున్నాడు. మేము నైతిక బలానికి భుజబలం కూడా జోడించమంటున్నాం. అంతే తేడా. అందరి గమ్యస్థానమూ ఒకటే. మన శత్రువులు నైతిక బలాన్ని లక్ష్యపెట్టరు" అని టెర్రరిస్టులు చెప్పారు.

ఆ చలిలో అర్ధరాత్రిపూట ఆ కరపత్రాలను అన్ని గదులలోనూ పంచటానికి చాలామంది కృషిచేసి వుండాలి. అంతమంది సాహసులు హాస్టలులో ఉన్నారంటే సుందరానికి వళ్ళు గరిపొడిచింది. గర్వంకూడా కలిగింది. కాని వాళ్ళెవరో, అందులో తాను రోజూ పలకరించేవారెవరో తెలియనందుకు మట్టుకు సుందరం చాలా విచారించాడు.

గాంధీని అరెస్టు చేశారు[62]. యూనివర్శిటీలో పాఠాలు సాగనేలేదు. మీటింగులు జోరుగా సాగుతున్నాయి. దేశమంతటా ఉప్పు సత్యాగ్రహం కార్చిచ్చులాగా వ్యాపిస్తున్నది. విద్యార్థులలో చెప్పనలవికాని చైతన్యం సాగింది. ఎక్కడచూచినా హర్తాళులూ, పికెటింగులూనూ, కాశీ విశ్వవిద్యాలయానికి పికెటింగు చేయటానికి విద్యార్థులతోపాటు వాలంటీర్లు కూడా వచ్చారు. వాళ్ళు నిజంగా వాలంటీర్లు కారనీ, గంగానదీ ఒడ్డున పెద్ద బంగళాగల శివప్రసాదగుప్తా అనే కోటీశ్వరుడు రోజుకూలీ మీద ఈ వాలంటీర్లను కొన్ని వేలమందిని నియోగించాడనీ చెప్పుకున్నారు.

కాలేజీదగ్గిర పికెటింగ్ జరగటం మాలవ్యాజీకి ఎంతమాత్రం యిష్టంలేదు. ఆయనకు జాతీయోద్యమం కూడా విశ్వవిద్యాలయం తరవాతనే. అయినాకూడా పికెటింగు విద్యార్థులు లోపలికి పోనివ్వలేదు. విద్యార్థి నాయకుడు ఆయన కెదురుగా నిలబడి చేతులు నలుపుకుంటూ, "జీ, పండిజ్జీ" అన్నాడేగాని లోపలికి మాత్రం పోనివ్వలేదు...

క్లాసులు లేవు. అసలే ఆందోళనగా ఉన్న విద్యార్థులను నిశ్చైతన్యం మరింత ఆందోళనపరిచింది. నూరుమంది విద్యార్థులు కాలినడకను బొంబాయికి బయలుదేరారు.

సుందరానికేమీ తోచలేదు. వాడు రెండో టరం జీతం కట్టలేదు. ఆ డబ్బు దగ్గరుంది. అది తీసుకుని మరిద్దరు విద్యార్థులతో ఆగ్రా బయలుదేరాడు. ఆగ్రాలో వాళ్ళు తాజ్‌మహల్ చూశారు. సుందరం తాజ్ మహల్ను అందమైన వస్తువుగా చూడలేదు. అద్భుతమైన వస్తువుగా చూశాడు – ఏ చక్రవర్తినో, వింత మృగాన్నో చూసినట్టుగా తాజ్‌మహల్ అందాన్ని అర్థం చేసుకోవాలంటే దాని ఫోటోలు చూడటమే చాలా మెరుగు. దానిలోని అద్భుతాన్ని చూడాలంటే స్వయంగా వెళ్ళి చూడవలసిందే.

62. గాంధీజీ అరెస్టు: 1930 మే 5వ తేదీన అరెస్టయ్యారు.

సుందరం ఒకరోజల్లా దయాల్‌బాగ్‌లో గడిపాడు. అక్కడి వాతావరణం సుందరానికి అవాస్తవంగా కనపడింది. అక్కడ అందరూ ఒకటేనన్నారు. జాతిమత లింగభేదాలు లేవు. అందరూ ఏవేవో పనులు చేస్తూ ఉంటారు. అందరూ కలిసి ఒకేచోట తిండి తింటారు. ఎవరికివారు వడ్డించుకుంటారు. ఎవరిపళ్ళాలు వారు కడుక్కుంటారు. అక్కడా సినిమా టిక్కెట్టు కొన్నంత సులభంగా పెళ్ళి. అంతే సులభంగా పెళ్ళి రద్దుచేసుకోవచ్చు.

గ్రామఫోను రికార్డులు తయారు చెయ్యటమూ, ఫౌంటెన్ కలాలు తయారు చెయ్యటమూ తప్ప మిగిలిన పరిశ్రమలన్నిటినీ సుందరాన్ని చూడనిచ్చారు. సుందరం అక్కడ కొత్తగా పెట్టిన దయిరీఫారంకూడా చూశాడు. అక్కడ గేదెల్ని చేత్తోపితకరట, పాలుతీసే యంత్రం వుందిట. ఆరోజు ఉదయం అల్పాహారంకింద సుందరం అణాకానీ ఇచ్చి శేరుపాలు చిక్కనివి తాగాడు.

"ఈ సమాజంలో దగాలేదు. దురన్యాయంలేదు. మనుష్యులకు ప్రతిబంధకాలు లేవు. అధికారభయంలేదు. ఇటువంటి సమాజాన్ని రాధాస్వామి ఎట్లా స్థాపించారు? ఈ గురూజీ ఎట్లా నిర్వహిస్తున్నాడు?" అనుకున్నాడు సుందరం.

సాయంకాలం సత్సంగానికి వెళ్ళాడు సుందరం. తాను పరాయివాడన్నట్టు ఎవరూ చూడరు. తాను పక్కవాణ్ణి పట్టుకుని ఏ ప్రశ్నవేసినా ఎరిగున్నవాడల్లే ఆర్తిగా సమాధానం చెబుతారు.

ఈ సంవత్సరం అచ్చగా సత్సంగులు మాత్రమే పాల్గొనేదికాదు. అందుకే సుందరం రాగలిగాడు. కాని గురూజీ ధోరణి సుందరానికి చాల కోపం కలిగించింది. ఆయన హిందీలో ఆడవాళ్ళను ఎద్దేవా చేస్తున్నట్టూ వాళ్ళు పిల్లల్ని కనటం గురించి తేలికగా మాట్లాడుతున్నట్టూ సుందరం అర్థం చేసుకున్నాడు. సత్సంగం అయినాక వాడు అక్కడివాళ్ళ ఎదట తన ఆగ్రహాన్ని వెలిబుచ్చాడు. వాళ్ళు బాధపడ్డారేగాని సుందరంమీద కోప్పడలేదు.

"గురూజీ మాకు తండ్రివంటివాడు. ఆయన మమ్మల్ని ఏమనటానికైనా స్వతంత్రం వుంది. మామీద పగగా ఆయన ఏ మాటా అనడు" అని వాళ్ళు సమాధానం చెప్పారు. ఈ సమాధానం సుందరానికి తృప్తి కలిగించకపోయినా, తను కఠినంగా మాట్లాడినందుకు నొచ్చుకున్నాడు.

మర్నాడే సుందరం తన స్నేహితులతోసహా కాశీకి తిరుగు ప్రయాణమైనాడు.

తిరిగి కాశీకి చేరేప్పటికి కాలేజీల్లో నోటీసులు పెట్టారు. "అనివార్య కారణాలవల్ల ప్రస్తుతానికి కాలేజీలు మూయబడ్డాయి. తిరిగి ఎప్పుడు తెరిచేదీ తరవాత ప్రకటించబడుతుంది" అని.

సుందరం తన దగ్గిర మిగిలిన డబ్బులు లెక్కచూసుకుని ఇంటికి ప్రయాణమైనాడు.

## 27

సుందరం మన ప్రాంతాలకు తిరిగి వచ్చేసరికి సత్యాగ్రహోద్యమం ఇక్కడ కూడా బాగా అంటుకుంది. దేశమంతా గాడిపొయ్యిలాగే ఉంది. ప్రతి ఊళ్ళోనూ మీటింగులూ, అరెస్టులూ జరగుతున్నాయి. సుందరం సహాధ్యాయుల్లోనూ, పరిచితులలోనూ, చుట్టాల్లోనూ జైళ్ళకు సిద్ధమవుతున్న వాళ్ళున్నారు.

సుందరం నాలుగురోజులపాటు శేషగిరి మామయ్య గారూరు వెళ్ళాడు. రోజూ గుడిదగ్గర పత్రికాపఠనం జరిగేది. వ్యాఖ్యానాలు జరిగేవి. సామాన్యంగా నరుసు పత్రిక చదివేవాడు. నరుసుకు ఈసారి సత్యాగ్రహంలో అరెస్టు కావాలని చాలా ఉబలాటంగా వుంది. ఈమాట వాడు ఇంట్లో అనేసరికి అందరూ వాడిమీద విరుచుకుపడ్డారు. అందరికన్నా శేషగిరి మామయ్య యెక్కువ కోప్పడటం సుందరానికి ఆశ్చర్యం వేసింది.

"ఏడిచావులేవోయ్! నువుపోయి జైల్లో కూచుంటే బండి నడిచేదెట్లా? నాబోటిగాడికి ఎట్లాగూ తప్పదు" అన్నాడాయన తన ఆఖరు మాటగా.

ఈ మాటను పూర్తిగా అర్థం చేసుకోవటానికి ప్రయత్నించాడు సుందరం. ఆలోచించినకొద్దీ ఈ ఉద్యమం గురించి సుందరానికి అసంతృప్తి ఎక్కువవుతున్నది. ప్రజలలో మానసిక చైతన్యం వచ్చింది నిజమేగాని, వారి రాజకీయ విజ్ఞానం పెంపొందలేదు. పత్రిక చదివేచోట జరిగే వ్యాఖ్యానాలు విన్నాడుగాని, ఆ వ్యాఖ్యానాల్లో బ్రిటీషు వారిమీద ద్వేషమూ, ఉప్పు సత్యాగ్రహంతో స్వరాజ్యం తప్పక వచ్చేస్తుందన్న మూఢవిశ్వాసమూ తప్ప ఇంకేమీలేదు. ఈ విశ్వాసం తొట్టిస్నానాల్లో విశ్వాసం లాంటిది. రంగు అద్దాల వైద్యంలో విశ్వాసం లాంటిది. కొందరికది మేలు చెయ్యవచ్చు. వారికి విశ్వాసబలాన్నీ దృఢబుద్ధినీ ఇవ్వవచ్చు. కాని అనేకమందికి ఈ సాధనానికీ, సాధ్యాలకూగల సంబంధ మేమిటో బొత్తిగా తెలీదు.

శేషగిరి మామయ్య ఆ సంబంధం గురించి తెలిసి ఉండదగినవాడేగా. ఆయన వైఖరిమాత్రం ఏం బాగుందీ? "మా కెట్లాగూ తప్పదు" అంటాడేమిటి? దేశమంతటా జరిగే ఈ ఉద్యమం అప్పుడే ఒకలాంఛనం క్రింద జమ అయిపోయిందా? పెళ్ళిలో వరుడు కాశీకి ప్రయాణం గావటంలాగా!

సుందరం ఆ వూళ్ళో వుండగానే బసవయ్యగారింటో చిన్న మీటింగు జరిగింది. ఇప్పుడు బసవయ్యగారు ఊళ్ళో పెద్ద మోతుబరి. ఆ వూరునుంచి ఎంతమంది జైలుకు వెళ్ళితే ఆయనకు స్వయంగా అంత ఖ్యాతి.

ఈ మీటింగుకు శేషగిరి వెంట నరుసూ, సుందరమూ కూడా వెళ్ళారు.

"ఏం అన్నయ్యగారూ, మన ఊరునుంచి ఎంతమంది శ్రీకృష్ణ జన్మస్థానం పోతున్నామో ఆలోచించండి" అన్నాడు బసవయ్యగారు.

జైలుకు వెళ్ళటానికి సిద్ధంగావున్న అయిదారుగురు పెద్దలూ మిగిలినవాళ్ళ కేసి చూశారు.

"ఏం, చలమయ్య బాంవా?" అన్నాడు శేషగిరి.

"నేనుకూడా రావలసిందేనంటావా?" అన్నాడు చలమయ్య.

"అయ్యో, కుర్రకారును నువు నడిపించాలిసిందే?"

"సరయితే ఇంకా చూసేదేముందీ? నన్నూ యేసుకోండి."

"ఏం రా, శర్మా?

శర్మ కుండ పగలేసి చెప్పేశాడు.

"నా ఆర్థిక దుస్థితి మీకు తెలీందికాదుగదా! నా భార్యకు పిల్లలకూ ఆర్నెల్లపాటు సరిపోయే గ్రాసం ఏర్పాటు చేయించండి. నేను సిద్ధమే. లేకపోతేమటుకు నావల్లకాదు."

"ఓరి నీయిల్లు దొంగల్దోలా? ఈపాటి చెయ్యలేమా? శర్మగార్ని కూడా వేసుకో."

"మరి కుర్రకారు మాటేమిటి?" అన్న ప్రశ్న వచ్చింది.

"మేం గుడిదగ్గిర వేరే మీటింగు పెట్టి తేలుస్తాంగా" అన్నాడు నరుసు. శేషగిరి నరుసు కేసి చురుచురా చూశాడు. కానీ యేమీ అనలేక పోయినాడు.

బసవయ్యగారింట్లో జరిగిన మీటింగు సుందరానికి కాస్తయినా ఆనందం కలిగించలేదు. అందులోవున్న మంచి ఏమిటో వాడికి తెలీదు. ఆ వేళ ఆ ఇంట్లోచేరి ఒక కుటుంబంలాగా వ్యవహరించిన మనుష్యులు ఈ ఉద్యమమే లేకపోతే ఒకచోట సమావేశం కాదగినవారు కారు. ఒకర్ని గురించి ఒకరు చాడీలూ, తప్పుడుకబుర్లూ చెప్పుకుంటూ ఉండవలసినవారు. అయితే ఈ విషయం సుందరం ఎరగడు. వాడికి మాత్రం ఈ ఉద్యమం గురించి సద్భావం ఏర్పడటానికి బసవయ్యగారింట జరిగిన మీటింగు తోడ్పడలేదు. దేశభక్తీ, జాతీయోత్సాహమూ అన్నవాటికి అవమానం జరిగినట్టు వాడు భావించాడు. కాశీ విశ్వవిద్యాలయంలో యువకులు ప్రదర్శించిన ఆవేశానికీ దీనికీ ఏమీ సంబంధం లేదు.

గుడిదగ్గర జరిగిన కుర్రకారు సమావేశం ఇంత అన్యాయంగాలేదు. అయినప్పటికీ అదికూడా సుందరానికి తృప్తి కలిగించలేదు. ఈ సమావేశానికి నాయకుడంటూ లేడు. అందరిలోకీ కాస్త దీక్షగల గోపాలశాస్త్రి నడుముకూ, మోకాళ్ళకూ పై బట్ట చుట్టి రాయిలాగా కూచున్నాడు.

"ఏం శాస్త్రీ! మనఊరి కుర్రాళ్ళు ఎవరెవరు జైలుకు పోతారంటావు?" అన్నాడు నరుసు.

"ఎవరికి పోవాలనుంటే వాళ్ళంతా పోతారు. నాకు పోవాలనుంది. నేను పోతానూ!" అన్నాడు గోపాలశాస్త్రి నిర్లిప్తంగా.

"అదేమిట్రా? ఎవరితోనూ సంబంధంలేనట్టు మాట్లాడుతావూ!" అన్నాడు నరుసు.

"అబ్బాయ్ నేనొకటి చెబుతున్నా విను. నువ్వేదన్నా నాటకం ఆడించదలచినట్లయితే అందర్నీ కూడగట్టు. ఎవరెవరు ఏ యే వేషాలు వేస్తారో కనుక్కో. నేను దానికీ తయారేలే - మనలోమాట. అంతేగాని సత్యాగ్రహంలోకి ఎవరు వస్తారన్నది ఒక ప్రశ్నా ఏమిటి? వెళ్ళాలన్న ఉత్సాహం ఉన్నవాళ్ళని వెళ్ళనీ, లేనివాళ్ళను మాననీ. కిందటిసారి నాకయిన అనుభవం చాలు."

ఈ అనుభవం గురించి తెలుసుకోవాలనిపించింది సుందరానికి. అడగగానే శాస్త్రి చెప్పాడు. 1921లో శాస్త్రి చదువు మానేశాడు. అతనితోకూడా మానేసిన వాళ్ళలో అతన్నిచూసి మానేసినవాళ్లున్నారు. వాళ్ళ తల్లితండ్రులచేత శాస్త్రి చాలాకాలం మాటలు పడవలసివచ్చింది.

"అదీకాకా" అన్నాడు శాస్త్రి, "నాకీ సత్యాగ్రహంలో నమ్మకంలేదు. సత్యాగ్రహం మనకూ, మన ఆరోగ్యానికీ మంచిదే. కాని దీనిద్వారా స్వరాజ్యం వస్తుందంటే, నామటుకు నాకు నమ్మకంలేదు. ఒకళ్ళమాట నాకెందుకూ? మనం జైళ్ళకి పోతే ఇంగ్లీషువారు ఈ దేశం వదలిపెడతారుట్రా? కల్లోమాట. అయితే జైలు కెందుకు పోతున్నావంటావేమో, స్వరాజ్యంకోసం నలుగురూకలిసి రామకోటి రాద్దామని నిర్ణయిస్తే దానికికూడా నేను తయారే! ఈ ఉద్యమంకూడా వృథాఅయిందో ఈసారి తుపాకులతో పోట్లాడేవాళ్ళతో చేరుతా, అదీ ఉన్నసంగతి" అన్నాడు శాస్త్రి.

కుర్రకారులో ఎవరు జైళ్ళకి పోయేది స్పష్టంగా తెలియలేదు. పోవటానికి సిద్ధంగా వున్నవాళ్ళలో ఒక్కడికికూడా పెద్దవాళ్ళ అనుమతి లభిస్తుందన్న ఆశలేదు. ఒకరిదాకా ఎందుకూ? నరుసులేడూ? నరుసు జైలుకు పోతానంటే వాళ్ళనాన్న ఒప్పుకోడని అక్కడ చేరిన కుర్రకారుకందరికీ తెలుసు.

సుందరం అత్తవారూరు తిరిగి వచ్చాడు. సుందరం వచ్చిన మర్నాటినుంచీ ఈ ఊళ్ళో కాంగ్రెసు మీటింగులు ప్రారంభమైనాయి. రోజూ రెండువేలమందిదాకా సాయంకాలంపూట మీటింగులకు హాజరవుతున్నారు. సుందరం కూడా ఈ మీటింగులకు తప్పక వెళ్ళుతూ ఉపన్యాసాలు వింటున్నాడు. ఆ ఉపన్యాసాల్లో కొన్ని భావాలు సుందరం మనస్సులో అతుక్కున్నాయి కూడానూ.

"...మహాత్ముడు మనల్ని మగవాళ్ళుచేసే పనులు చెయ్యమనటంలేదు. అచ్చగా ఆడవాళ్ళు చేసే పనులు చెయ్యమంటున్నాడు. నూలు తియ్యటం, ఉప్పువండటం, కొడితే కిక్కురుమనకుండా వుండటం... అసలు సత్యాగ్రహమంటే ఏమిటి? రోజూ మన భార్యలు చేస్తున్నదేగా? అసలు ఆడవాళ్ళను చూసే మహాత్ముడు సత్యాగ్రహం ప్రారంభించాడు. మనం మగాళ్ళం కాకపోతే పోయాం. ఆడవాళ్ళమన్నా కాలేమా?

ఈమాటలు వింటూ, "మన ఆడవాళ్ళ సత్యాగ్రహం వాళ్ళకేం లాభిస్తున్నది?" అనుకున్నాడు.

ఇంకో ఉపన్యాసం!

"... ఈ బ్రిటీషువాళ్ళుందే, భలే దగుల్బాజీలు. వాళ్ళని మనం యుక్తితో గెలవలేం. వాళ్ళు మనతో రాజీపడి ఒకపత్రం రాసినా అందులో నలభై షరతులుంటై. మొదటి వాక్యాన్ని రెండోది రద్దుచేస్తుంది. మూడోవాక్యాన్ని నాలుగోది ఖండిస్తుంది. చివరికి సున్నకి సున్నా, హళ్ళికి హళ్ళీ మిగులుతుంది. పోనీ వాళ్ళతో యుద్ధంచేద్దామా అంటే వాళ్ళదగ్గిర తుపాకులుండె. మనదగ్గిర లేకపోయె... ఎటోచ్చీ మనం ఉప్పు వండక తప్పేదేముందిగనకా! గాంధీమహాత్ముడు బాగా ఆలోచించే ఈ పద్ధతి పెట్టాడు..."

కొందరు బాగా మాట్లాడేవారు. మరికొందరు మాట్లాడుతుంటే చప్పచప్పగా ఉండేది. కొందరు ఉపన్యాసకులు మధ్యమధ్య సి.ఐ.డీ.ల మీద హాస్యాలు వదిలేవాళ్ళు. "మారువేషంలో అక్కడ కూచుని రాసుకుంటున్న హెడ్ కానిస్టేబుల్ ఈ మాటలు కాస్త జాగ్రత్తగా రాసుకోవాలి." గొల్లున సభలోనుంచి నవ్వులు. అందరూ హెడ్ కానిస్టేబుల్‌ను చూడటానికి యత్నించటం. "మనమీటింగు అయేదాక ఆయన పోడులెండి. మీకేం భయం అక్కర్లేదు" అని ఉపన్యాసకుడనటం –

ఇదంతా చాలా ఉత్సాహంగానే వుండేది. దానికితోడు ఒక్కోరోజు రిజర్వుపోలీసు వస్తున్నట్టు పుకారుపుట్టటంకూడా వుండేది. పోలీసులు రావటమూ, ఉపన్యాసకులను అరెస్టు చెయ్యటమూ, జెండా పీకటమూ, లాఠీఛార్జి – ఇవే ఈ మీటింగులకు మంగళహారతి.

సుందరం రోజూ మీటింగులకు వెళుతూనేవున్నాడు. పర్యవసానంకోసం అందరూ ఎదురుచూసేటంత ఆత్రంగా తానూ ఎదురుచూస్తున్నాడు. కాని వాడిలోపల ఏవో సందేహాలూ, ఏదో అసంతృప్తీనూ. పదేళ్ళకిందటి ఉద్యమం ఇంతకన్నా బాగా ఉన్నదని వాడి అనుమానం. నిజానికి అప్పుడు ఉద్యమంపట్ల మామూలు ప్రజలలో ఇంత చైతన్యంలేదు. అయితేనేం? ఆ ఉద్యమంలో జాతీయ పునర్నిర్మాణం వుంది. ఆ ఉద్యమం నిలిచిపోయినా ఆ జాతీయ పాఠశాలలూ. గృహపరిశ్రమలూ, ఖద్దరు దీక్షా, నూలుతీయటమూ మొదలయినవి సాగినట్టయితే జీవిత స్వరూపం క్రమంగా మార్పు చెందేది. ఈసారి అటువంటిదేమీ లేనేలేదు. ఆ కార్యక్రమం ఏదో వున్నా ఈ వుద్యమం వెంటలేదు. దాని దారిన అది గుంటపూలు పూస్తున్నది. అక్కడక్కడా కూలీలను పెట్టి నూలు తీయించి, బట్టలు నేయించి ఖద్దరు వస్త్రాలయాలలో అమ్ముతున్నారుగాని ఇదంతా చేయించేవాళ్లు డబ్బు దోచుకుంటున్నారు. నూలుతీసే కూలీలకు డబ్బు ఏమీ గిట్టుబాటు కావటంలేదు. బేడా, మూడణాలు రోజు కూలీతో వాళ్ళేం బతగ్గలరు?...

ఆఖరుకు అనుకున్నరోజు వచ్చింది. ఆ సాయంకాలం సుందరం మీటింగుకు వెళ్ళేసరికి అక్కడ అయిదారువేలమంది జనం కనిపించారు. వాతావరణం బిర్రున బిగదీసినట్టున్నది. "ఇంతకుముందే నాలుగు లారీలలో రిజర్వు పోలీసు దిగింది" అన్న వార్త సుందరం చెవిన పడింది.

"ఈ పూట పోలీసులు వచ్చారో వాళ్ళకి ప్రాణాలు దక్కవు!" ఎవరో అన్న ఈ

మాటకు సుందరం శరీరం ఒక్కసారి పులకరించింది. అంధకారంలో ఆశారేఖలాగా వున్న యీ మాటను పూర్తిగా నమ్మగోరాడు.

"ఏం? ఏం?" అన్నాడు సుందరం.

"కనపడ్డంలా? యీ వచ్చినవాళ్ళంతా యీ వూరివాళ్ళా? వీళ్ళ మీటింగు కోసం వచ్చారు? వీళ్ళు ప్రక్క గ్రామంవాళ్ళు. హత్యలుచెయ్యటంలో ప్రసిద్ధులు. ఇవాళ రిజర్వు వస్తుందని ఎట్లా తెలుసుకున్నారో. తల్లి ముండమొయ్య!"

ఇది నిజంగానే కనపడింది. సుందరానికి. ఎందుచేతనంటే అనేక వందలమంది జనం మీటింగు ముఖమై కూర్చోవటానికిబదులు రోడ్డువారిని. ఉపన్యాసవేదికకు వీపు పెట్టి కూచున్నారు. వాళ్ళవన్నీ కొత్తమొహాలే. వాళ్ళు పోలీసులను కొట్టడానికి ఏ ఆయుధాలు తెచ్చిందీ సుందరానికి తెలియలేదు. ఎవరిచేతుల్లోనూ ఏమీ లేదు – ఎక్కడైనా ఒక చేతికర్ర తప్పిస్తే.

తాను విన్నది నిజమనుకోవటానికి వీలుగా ఆ పూట రిజర్వు పోలీసులు మీటింగు ఛాయలకు రానేలేదు. మరి మూడు లారీల రిజర్వుకోసం కబురు వెళ్ళిందని ఎవరో అన్నారు. రాత్రి ఏడు గంటలదాకా మీటింగుదగ్గిరే వుండి సుందరం ఇంటికి వచ్చేశాడు.

మర్నాడు ఉదయం సుందరం కాఫీ హోటల్‌లో తెలుసుకున్నాడు. గంట కిందట రిజర్వుపోలీసులు మీటింగుజరిగే స్థలానికివచ్చి జెండా పీక్కుపోయినారుట. ఎవర్నీ ఎరెస్టు చెయ్యలేదు. పోలీసులకెవరూ అడ్డు పోనూలేదు.

❀ ❀ ❀ ❀

ఊళ్ళో ఊరేగింపులు సాగాయి. రోజూ పోలీసులు లాఠీఛార్జీ వార్త చెవిని పడినప్పుడల్లా సుందరానికి రక్తం ఉడికిపోయేది. ఇటు ఉద్యమంమీదా. అటు పోలీసులమీదా భరించరాని ఆగ్రహం వచ్చేది.

ఈ వెధవ ఉద్యమంలో తెల్లవాడెక్కడున్నాడు? ఉద్యమం నడిపేది మన వాళ్ళు. దాన్ని చెడగొట్టేది మనవాళ్ళు. తెల్లవాడి మేలుకోసం మన పోలీసులు మన వాళ్ళని, నిరాయుధులను కొట్టటమా! పోలీసులకు అక్కర్లేని స్వరాజ్యం ఈ కాంగ్రెసువాళ్ళకు లేకపోతేనేం? "మీరుకూడా స్వరాజ్యం కావలసినవాళ్ళే"నని పోలీసులకూ, పోలీసధికార్లకూ, ప్రభుత్వోద్యోగులకూ నచ్చచెప్పినమీదటనే ఉద్యమం సాగించరాదూ?" పోలీసుల్ని కూడగట్టక పోవటమేగాక, స్వాతంత్ర్యోద్యమానికి వాళ్ళను విరోధులుగా ప్రవర్తించనివ్వటం కాంగ్రెసు తప్పని సుందరం బలంగా

పోలీసుల్ని చూసినా వాడికి అసహ్యం వేసింది. వెధవ జీతండబ్బులకాసించి, వాళ్ళు దేశద్రోహ పాత్రను ఎందుకు నిర్వర్తించాలి? ఇది తమ ఉద్యమమేనన్న జ్ఞానం వాళ్ళకుండరాదా?

జ్ఞానంలో సుందరానికి చాలా విశ్వాసం. జీవితంలో రాదగిన మార్పులు

రావటానికి అజ్ఞానం తప్ప ఇంకేం అడ్డూ లేదని వాడు నమ్మేవాడు. అయితే పోలీసులపట్ల వాడికున్న ఆగ్రహం తగ్గటానికి అనుకూలంగా ఒక సంఘటన జరిగింది. ఒక రోజు ఉదయం సుందరం బజారులో దుకాణంముందు నిలబడివుండగా ఒకపక్క నుంచి ఊరేగింపు వచ్చింది. "మహాత్మాగాంధీకీ జై? ఇంక్విలాబ్ జిందాబాద్" అన్న కేకలు వినబడుతున్నాయి. మరో పక్కనుండి వందగేదెలు పరుగెత్తుకుంటూ వచ్చే చప్పుడయింది.

"పోలీసులు! లాఠీఛార్జీ!" అన్న మాటలుచుట్టూ ప్రతిధ్వనించాయి. పోలీసులే పరుగెత్తుకుంటూ వస్తున్నారు. ఈ దృశ్యం సుందరానికి అసహ్యంగా కనబడింది. వాళ్ళు పరిగెత్తుకుంటూ రావలసిన అవసరంలేదు. వాళ్ళను ఎవరూ తరుముకు రావటంలేదు. వాళ్ళు ఎవర్నీ తరుముకు రావటంలేదు. సర్కసులో గుర్రాలనాడించే వాడు కొరడా అదిలిస్తే గుర్రాలు పరిగెత్తినట్టు అధికారి ఆజ్ఞకు లోబడి ఈ పోలీసులు పరిగెత్తుకుంటూ వచ్చారు. అదికూడా ఒక క్రమాన్ని అనుసరించి కాకుండా, బెదిరిన గొడ్లలాగా!

పోలీసులు లాఠీలు గాలిలో ఆడిస్తూ వీధిలో జనాన్ని "పొండి, పొండి!" అని అదిలిస్తున్నారు. జనం బిత్తరబోయి చూస్తున్నారు.

సుందరం సమీపంలో ఒక పోలీసువాడు "పక్కకిపొండి నాయనా! మీకు దణ్ణం పెడతాను! నిలబడకండి బాబూ!" అని జనానికి దణ్ణాలు పెడుతున్నాడు. సుందరానికింకా ఆశ్చర్యం కలిగించిందేమిటంటే ఆ పోలీసువాడు ఇంకోక్షణంలో

బావురుమని ఏడవటానికి సిద్ధంగా వున్నట్టు కనపడ్డాడు.

"లాఠీఛార్జీ చెయ్యటం ఈ పోలీసులకే ఇష్టంలేదు. తప్పనిసరై చేస్తున్నారు." అనుకున్నాడు సుందరం ఆశ్చర్యపడుతూ.

తరవాత సుందరం యీ మాట ఎవరితోనో అంటే, "యీ పోలీసులకి బాగా పోయిస్తార్రా! లేకపోతే వాళ్ళువచ్చి ఈ లాఠీఛార్జీలు అవీ చేస్తారనుకున్నావేం? అది ఒకటేనా, ఒకఊరి పోలీసుల్ని ఇంకోఊరు తీసుకుపోతారు. ఏవూరి పోలీసులావూర్లో రాక్షసత్వం చెయ్యలేరని!" అని సమాధానం వచ్చింది.

ఇటువంటి నీచత్వంమీద ఆధారపడివున్న బ్రిటీషు పరిపాలనను అంతం చెయ్యటానికి ఇంత ఉద్యమమా? ఆలోచిస్తున్నకొద్దీ, పోలీసుల్ని కూడగట్టుకోకపోవటం చాలా పొరపాటేననిపించింది సుందరానికి. కాని ఆ పని చెయ్యటానికి ఎంత ప్రయత్నంకావాలో సుందరానికి తెలీదు.

ఒకనాడు సుందరం చొరవచేసి ఒక పోలీసుతో, "మీ పోలీసులకు జీతం ఎంత ఇస్తారు నాయనా?" అని అడిగాడు.

"జీతమేంటి బాబూ, పదమూడునుంచి పదిహేడు దాకా ఇస్తారు" అన్నాడు పోలీసు.

"ఈ భాగ్యానికేనా ఈ వెధవ నౌఖరీ చెయ్యటం?" అన్నాడు సుందరం నిర్ఘాంతపోయి.

"ఏం చెయ్యాలి నాయనా? మా పెళ్ళాం పిల్లలు బతికేదెట్లా? ఏదో పైఏడుపులు ఏడిచి ఎట్లాగో పొట్ట గడుపుకుంటాం" అన్నాడు పోలీసు "మా గొడవ నీకందుకులే" అనకుండా. సుందరానికి పోలీసులమీద విశ్వాసం ఏర్పడటానికి యీ పోలీసు చాలా తోడ్పడ్డాడు.

❀ ❀ ❀ ❀

కాశీనుంచి ఉత్తరం వచ్చింది. కాలేజీలు తెరుస్తున్నారనీ, ఫలానా తేదికల్లా వచ్చి చేరితే అటెండన్స్ వస్తుందనీనూ.

సుందరం మేనమామగారి ఊరు వెళ్ళాడు. తల్లితో చెప్పాడు.

"మరి డబ్బెట్లాగురా?" అన్నది సీతమ్మగారు.

"ఎట్లాగైనా రెండువందలు పుట్టించాలి. లేకపోతే ఇంతచదువూ చెడిపోదూ?" అన్నాడు సుందరం.

"రెండువందలే?" అన్నదావిడ నిర్ఘాంతపోయి. సుందరం రెండు టరముల జీతం కట్టవలసివున్నాడని ఆవిడకు తెలీదు.

"అవునమ్మా! పరీక్షలకుకూడా కట్టాలిగా రెండు వందలకన్నా ఎక్కువే కావాలి. ముందు అదన్నా ఉంటే" –

"రెండువందలుకాదు. రెండు రూపాయలెక్కడ తెచ్చేదీ? మీ మామేమో జైల్లోపోయి కూర్చునె. నాకెవరు పలుకుతారు. నాయనా! ఇంకానయం, నరుసుకూడా జైలుకు వెళ్ళినట్టయితే అందరం పస్తులు పడుకునేవాళ్ళమే."

తల్లి కావాలని సత్యాగ్రహం చేస్తున్నదనిపించింది సుందరానికి. తన రెండు డిగ్రీలు ఏ గంగలో కలిపినా ఆవిడకు చీమకుట్టినట్టయినా ఉండేట్టు కనపడలేదు.

"రెండు వందలంటే ఎంతమ్మా? నరుసు రెండు నాటకాలువేస్తే వచ్చే భాగ్యానికి."

"అంత సులభమైతే యీ కర్మమేం నాయనా! ఈ పాటికి వేలకు వేలు నిలవచెయ్యకపోయినాడూ?"

తను తిరిగి కాశీకివెళ్ళే యోగ్యతలేదన్నది చాలా క్రమంగాగాని సుందరానికి తెలిసిరాలేదు.

ఈ దెబ్బకు సుందరం బాగా కుంగిపోయినాడు. అందరూ చేరి తన చదువు చెడగొట్టినట్టు వాడికి తోచింది. తాను ప్రయాణం చూసుకున్న నెలరోజులకు నరుసు జానకికి యాభైరూపాయలుపెట్టి బంగారుగొలుసు చెయించాడని తెలిసి సుందరం నరుసును చూసి చాలా అసహ్యపడ్డాడు. తన స్వార్థం తనలో నీచభావాలను రేకెత్తిస్తున్నదన్న ఆలోచన సుందరానికి కలగలేదు.

# 28

1935 డిప్రెషన్.[63] సుందరం ఆస్తియావత్తూ అప్పులవాళ్ళపాలయింది. సుందరానికి ఉద్యోగంలేదు ఇంట్లో మిగిలిన వస్తువులు ఒక్కొక్కటే అమ్మి తింటున్నాడు. తన సంసారానికి నెలకు 20 రూపాయలు చాలు. కాని అవేలేవు. మూడు రూపాయలు అద్దె ఇచ్చి తనూ, లక్ష్మి, పిల్లాడు ఎవరింటోనో అద్దెకుంటున్నారు.

సుందరం ఎప్పుడన్నా డబ్బు కళ్ళచూడాలంటే ఎవరన్నా ఇవ్వాలి లేదా వాడు రాసే కథలు వేసుకున్న పత్రిక తృణమో పణమో ముట్టచెప్పాలి. ఇంకో మార్గం లేదు.

"ఇదే అడుగు అట్టడుగు ఇంతకన్నా కుంగిపోవటానికి వీల్లేదు" అనుకునేవాడు సుందరం.

కాని సుందరానికి చింతలేదు. ఏదైనా చేసేటందుకుండి చెయ్యలేకపోతే చింత. సుందరానికి చేసేటందుకేమీలేదు. అందుకనే చింతలేదు. రోజూ పార్కుకువెళ్ళేవాడు. తనవంటి వాళ్ళనే కొందర్ని కలుసుకునేవాడు.

---

63. డిప్రెషన్ (1929-1935) కుటుంబరావు కథలు, నవలలు కొన్నిటిలో తరచుగా యీ ఆర్థిక సంక్షోభం ప్రస్తావన వస్తుంది. వుదాహరణకు రక్తస్పర్శ అన్న కథలో చూ: 1930 నడిమిమధ్య ప్రపంచ ఆర్థిక పరిస్థితులు తలకిందైనప్పుడు ధనాభావం వల్ల శివం తన ఇంటరుచదువు కట్టబెట్టి కొంపచేరుకున్నాడు. అరుణోదయం, వారసత్వం, అనుభవం నవలల్లో కూడా డిప్రెషన్ వాతావరణ చిత్రణ కన్పిస్తుంది. వాస్తవానికి ఈ ప్రపంచ ఆర్థిక మాంద్యం పలుమార్లు పెట్టుబడిదారీ ప్రపంచాల్లో వచ్చింది. 1929-1934 మధ్య ప్రపంచ వ్యాప్తంగా వచ్చిన ఆర్థిక కాటకం మన వ్యవసాయిక ఆర్థిక జీవితాన్ని పెద్దగా దెబ్బతీసింది. దీని ప్రభావానికి ఒక నిదర్శన: రాజమండ్రి కళాశాల స్థల సంకోచము అన్న విషయంపై ఆంధ్రభూమి సంపాదకీయ సమాలోచనలో ఇలావుంది: "ఆర్థిక మాంద్యము వలన ఇతర దేశములందు వలెనె ఆంధ్రదేశము నందును కళాశాల విద్యార్థుల సంఖ్య తగ్గుముఖము పట్టెను. (ఆంధ్రభూమి 1937, ఏప్రిల్, పు. 425) అలాగే ఆంధ్రలో ఈ దశలో భూములధరలు విపరీతంగా పడిపోయాయి, నిరుద్యోగసైన్యం పెరిగింది. అనుభవం నవలలో కుటుంబరావు చిత్రించినట్లు "రూపాయి విలువ అపారంగా పెరిగిపోతున్నది. ఎకరం రెండున్నరవేలు చేసి అమ్మిన మాగాణి భూములను వెయ్యి రూపాయలకు కొనేవాళ్లులేరు. బాకీలు చేసిన వాళ్ళు బేజారెత్తి పోతున్నారు. బాకీదార్లు కంగారెత్తి పోతున్నారు." (పు. 130). డిప్రెషన్ కారణంగా ఆస్థిపోయిన కుటుంబాలలో కుటుంబరావుది కూడా ఒకటి. బెనారస్‌లో ఎం.యస్.సి. మధ్యలో ఆయన ఆపవలసి వచ్చింది. సంసారం దెబ్బతిన్నందు వల్లనే, ఆర్థిక మాంద్యానికి కొన్ని బైరాగి చిట్కాలు కూడా ఆ రోజులలో కొందరు చెప్పినట్లుంది. రావు సాహెబు డా॥ గారపాటి ఆంజనేయవాదం ఆరోజులలో ఆర్థిక మాంద్యం చేత పీడింపబడే రైతులోకానికి వ్యవసాయంలో నూతన మార్గాలు చూపి అనుసరించే నిమిత్తం బ్రతుకు తెరువులు అనే గ్రంథాన్ని రాస్తున్నట్లు ఆంధ్రభూమి మే 1934 సంచికను బట్టి తెలుస్తుంది.

లోకాభిరామాయణం మాట్లాడుకునేవాడు. సాయంత్రం ఇంటికి తిరిగి వచ్చేవాడు. మనస్సెప్పుడూ చీదరగానె ఉండేది. పెళ్ళాంమీదా, కొడుకుమీదా ఎగిరిపడేవాడు అప్పుడప్పుడూ వాళ్ళమీద అపారమైన ప్రేమ కలిగేది. కాని అది ఎంతోసేపు ఉండేదికాదు. ఏదో జరుగుతుందని నిరీక్షిస్తున్నట్టుగా ఉండేది సుందరానికి.

చేసేటందుకేమీ లేకపోయినా సుందరం మునసిపల్ లైబ్రరీనుంచి పుస్తకాలు తెచ్చుకుని ఇంట్లో వున్నంతసేపూ తీరకుండా చదివేవాడు. లక్ష్మితో మాట్లాడటానికీ పుస్తకాలు అడ్డంగా వున్నట్టుండేది.

ఒకరోజు మధ్యాహ్నం సుందరం ఇంటికి వచ్చేసరికి లక్ష్మి తన నాలుగేళ్ళ కొడుకును కూచోబెట్టి వాడికి పుస్తకంలో అక్షరాలు గుర్తుపట్టటం నేర్పుతున్నది.

"అమ్మా ఇదుగో 'తా', ఇదుగో ఇంకో 'తా'" అంటూన్నాడు కుర్రాడు ఉత్సాహంగా.

సుందరానికి చెప్పరాని ఆనందం కలిగింది. ఎన్నడో ఇరవైఏళ్ళ క్రితం తన తల్లి తనకు అక్షరాలు దిద్దబెట్టటం సుందరానికి జ్ఞాపకం వచ్చింది. ఆవిడ ఆనాడు తనకు చదువుమీద పెట్టిన ఆసక్తి ఈనాడు తనచేత ఇంకా పుస్తకాలు చదివిస్తున్నది. సుందరం తన చంకలోవున్న బెర్నార్డుషా[64] నాటకాల సంపుటి రెండో చంకలోకి మార్చుకుంటూ, "వీడు అక్షరాలు గుర్తుపడతాట్టే?" అన్నాడు.

"చాలా అక్షరాలు గుర్తుపడతాడు" అన్నది లక్ష్మి తలఎత్తి చూసి గర్వంగా. "ఏది, నానా? ఈ అక్షరమేమిటి?"

కుర్రాడు సుందరానికేసి అనుమానంగా చూసి, "ల" అన్నాడు. వాడి చూపులో "నా చదువుజోలి నీకెందుకు పోదూ" అన్నది స్ఫురిస్తున్నది.

సుందరం ఆ యిద్దరిపక్కనా చతికిలబడి కుర్రాడు చూస్తుండగానే లక్ష్మిని ముద్దు పెట్టుకున్నాడు.

"ఏమిటండీ మరీనూ!" అన్నదేగాని, తన భర్త తనను ఎందుకు ముద్దుపెట్టుకున్నదీ లక్ష్మికి తెలీదు.

*ముద్రణ: ఆంధ్రజ్యోతి మాసపత్రిక,*
*సెప్టెంబరు 1950 నుండి నవంబరు 51 వరకు.*

64. బెర్నార్డు షా (1856–1950): ప్రపంచ విఖ్యాతిపొందిన ఆంగ్లనాటకకర్త. ఫేబియన్ సోషలిస్టు. ఆయన రాసిన ప్రఖ్యాత నాటకాలు కొన్ని: ఆర్మ్స్ అండ్ ది మాన్, మిసెస్ వారెన్స్ ప్రొఫెషన్, సీజర్ అండ్ క్లియోపాత్రా, మేజర్ బార్బరా (1907), పిగ్మాలియన్ (1912).